శ్రీ ర స్తు.

తరిగొండ వేంకమాంబ ప్రణీతమైన

# శ్రీ వేంకటాచల మాహాత్మ్యము





నెల్లూరు:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు వారిచే

ప్రకటితము.

1937

శ్రీ ర స్తు.

తరిగొండ వేంకమాంబ ప్రణీతమైన

# శ్రీ వేంకటాచల మాహాత్మ్యము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1937



# పీఠిక.

---

తఱికుండ యనుగ్రామంబునకుఁ గొందఱు తఱికుండ యనియు, మఱి కొందఱు తఱిగొండ యనియుఁ జెప్పుచున్నారు. ఈవిషయముగూర్చి నేనా గ్రామంబునకుఁ బోయియుండినపుడు, "వైద్యజ్యోతిషాంధ్రసంగీతవిద్యావిశారదు"లగు రాయదుర్గము నరహరిశాస్త్రులువారి నడుగుటంజేసి ఆయన నాకిట్లు వచించె.

పూర్వము రాయదుర్గమనుగ్రామనివాసులు క్షామచోరబాధలకు నాగ్రామంబున నుండనోపక నిజగృహంబులు వదలి పశువులం దోలుకొని తమ కుటుంబములతో నెందేని జలసస్యసమృద్ధిగల ప్రదేశంబున కేగుదమని వచ్చుచు మార్గమధ్యంబున నొక్కయెడ నందఱు మార్గాయాసంబునకుఁ గొన్నాళ్లుండి వోఁదలంచియుండిరనియు, వారునిల్చియుండిన ప్రదేశంబునకుఁ, "బ్రత్తిమిట్ట" అని పేరుండినదనియు, నొకదిన మందఱుం దమకష్టంబులకుఁ దమగ్రామమునం గల శ్రీనృసింహస్వామిని, "హా! ప్రహ్లాదరక్షకా! దీనబంధూ! మమ్మీ దుర్భిక్ష కాలంబున దగ్గఱనుండి రక్షింపుమా!" అని యనేకవిధంబుల భజనచేయుచుండి రనియు,మఱునాఁ డుదయంబున నొకబ్రాహ్మణస్త్రీ తనవాడుకచొప్పున మజ్జిగఁ దఱుచుచునుండ నామజ్జిగకుండలో నొకఱాయి యుండి కవ్వమునకుఁ బలు మాఱుఁ దాఁకుచుండ నది యేమని తలంచి యావిప్రాంగనయగు లక్ష్మీనరసమ్మ తనకరంబున నాకుండను దడవి చూడ నేమియుం దొరకకుండెననియు, మఱల నానారీమణి తఱుచుచుండఁగా ముందువలె నొకఱాయి తగులుచుండెననియుఁ, మఱలఁ బరిశోధింప నాకుండలో నొకఱాయిగాని లేకుండెననియు, నివ్విధము రెండు మూఁడుమాఱులు చూచి విస్మయపరీతచిత్తయై కొంతవడి యూరకుండి

క్రమ్మఱఁ జిలుకుచుండఁ దొల్లింటివలె జాయితగులుటం జేసి వెఱగంది భర్తకడ కుం బోయి మజ్జిగకుండలో నివ్వటువున నున్నదని చెప్ప నతండు వచ్చి చూచు నప్పటికి నాకుండ నుండుజాయి నృసింహాకారంబుతో నుండినదనియు, నాయూపము చూచి విస్మయభయపరీతచేతస్కుండై భార్యంజూచి, తరుణీ! నీవిప్పుడీవిషయ మెల్లవారికిం జెప్పి దోడ్కొని రావలయు ననఁగ, నామె పోయి యెల్లవారికిం జెప్పి పిలుచుకొని వచ్చినదనియు, నావల నందఱు స్వామిని యనేక విధంబులం బ్రార్థించిరనియు, అత్తఱి నశరీరవాక్కుల నాస్వామి, భక్తాగ్రేసరులారా! మీపురంతకష్టంబులఁ బాపి మీయిష్టంబు లిచ్చుటకు నీతఱికుండ నుదయించితిననియు, నిఁక మీరెందేని పోఁజనదనియు, మీరు నాకియ్యెడ నాలయంబు నిర్మించి నన్నారాధించుచుండుఁడనియు, మీరు నన్నీదినమునుండి "తఱికుండ నృసింహుఁడు" అని నామంబిడి భజించుచుండుఁడనియుఁ జెప్పుటం జేసి, పట్లుచేసిరనియు, నక్కారణంబున నీయూరికి నిపుడు తఱికుండ యని చెప్పుచున్నారనియు, (తఱికుండ=మజ్జిగ చిలుకుకుండ) తఱికుండ యని చెప్ప వలయుంగాని, తరిగొండ యని చెప్పనొప్పదనియు, మా పెద్ద లాకాలంబున రాయదుర్గగ్రామంబుననుండి వచ్చి యిచ్చట నిల్చియుండుటం జేసి మమ్మిపుడు రాయదుర్గమువారని పిలుచుచున్నారనియుఁ జెప్పె.

కాఁబట్టి యీతఱికుండ యను గ్రామము కడపమండలము వాయిల్పాడునకు నాల్గుమైళ్లదూరంబున నున్నది. ఈగ్రంథకర్త్రియగు వేంకమాంబా గ్రామంబుననుండిన దగుటం జేసి తఱికుండ వేంకమాంబ యని చెప్పుచున్నారు. ఈమె రచించిన గ్రంథములలో, రాజయోగసారము ద్విపదకావ్యమును, వేంకటాచలమాహాత్మ్యంబను నొకపద్యకావ్యంబును, ముక్తికాంతావిలాసంబను నొకయక్షగానగ్రంథమును ముద్రింపఁబడియున్నవి. ఈమె తాను భాగవతము ద్వాదశస్కంధంబులను ద్విపదకావ్యముగ రచించినట్లు వేంకటాచలమాహాత్మ్యమునఁ జెప్పుకొనియున్నది గాని ఆపుస్తక మెచ్చటం గానరాదు. వేంకటాచలమాహాత్మ్యమునఁ బ్రథమాశ్వాసములో నేడవపద్యమునందు:—

క. "అలకాశినుండి వెలువడి
వలనుగ మాకొఱకు నందవరపురమందే
నెలకొని కులదైవతమై
యలరించు మహిమలు చౌడమాంబను గొలుతున్."

అని వ్రాసియుండుపద్యంబునుబట్టి చూడఁగ నీమె నందవరీక బ్రాహ్మణస్త్రీ యని తెలియఁబడుచున్నది. ఈపె తనభర్తయొక్క నామగోత్రసూత్రంబులు చెప్పక "వసిష్ఠగోత్రపవిత్ర కృష్ణయామాత్యతనూభవ" అని తాను గృష్ణయామాత్యునికూఁతురైనట్టు చెప్పుకొనుటచేత నీమె బాలవితంతువయి తన కాలమంతయుఁ దత్త్వగ్రంథపఠనాదులయందుఁ గడపినట్లున్నది. ౧౭౮౦ సంవత్సరమునందు జీవించియుండినట్లు తఱికుండ గ్రామంబునఁ గొందఱు వృద్ధులు చెప్పుచున్నారు. ఈవేంకమాంబగారు మదనపల్లెలోనుండిన, బ్రహ్మశ్రీ రూపావతారం సుబ్రహ్మణ్యశాస్త్రులువారి నాశ్రయించి తత్త్వముపదేశింపఁబడి నాలుగైదువత్సరంబులు తఱికుండ శ్రీనృసింహస్వామిదేవాలయంబునంగల,ఆంజనేయస్వామివిగ్రహంబునకు వెనుకప్రక్కగనుండు నొకరహస్యస్థలంబున యోగంబున నుండినట్లును, అర్చకుఁ డొకదినంబునఁ గని, అదివఱకు కాయూర నీవేంకమాంబపై నేదియో యొకదోషము కల్పించియుండుటకును, నాలుగైదేండ్లు వేంకమాంబ కన్పట్టకుండుటకును కల్పించినదోషము సత్యంబని తలంచి యా యర్చకుఁడామెను బిలిచి, "ఓసీ రండా! దుష్కర్మంబులు చేయుటగాక యీ దేవాలయంబునకు వచ్చి యీలాగు వేషము పూని స్వామివారి వస్త్రభూషణంబుల నపహరింప సమకట్టితివా" యని దూషించి ఆమె చేయుయోగంబును భంగపఱచి యీవల కీడ్చి కొట్టి పంపుటంజేసి ఆమె యందుండక శ్రీతిరుపతి వేంకటాచలంబునకు వచ్చి తుంబురుకోనయం దొక్కెడ నైదాఱువత్సరంబులు తపంబొనర్చి పిదప శ్రీస్వామిపుష్కరిణికి నుత్తరభాగంబున నొకచిన్నమంటపంబునఁ జేరియుండినదనియు, అట్టికాలంబున ముందెఱింగించినగ్రంథంబులు వ్రాసినదనియుఁ దెలియఁబడుచున్నది. మఱి యీమె స్త్రీలకు ననేకములగు

పాటలు వ్రాసియిచ్చియుండిన దగుటంజేసి యాపాటలెల్లఁ దత్త్వమునే బోధించుచున్నవి. ఈమె కవిత్వకల్పనాశక్తి వేంకటాచలమాహాత్మ్యమునందు వసంత ఋతువర్ణనంబును, ఎఱుకచెప్పు పట్టునందును, మఱి యందందు మృదుమధుర శైలితోఁ దత్త్వార్థంబులు సందర్భోచితముగ నెలకొల్పి కవన మతికఠినముగాక పదలాలిత్య మొప్పార వ్రాసినది. కవిత్వమునం దక్కడక్కడ నల్పదోషంబులు గానవచ్చుచున్నవిగాని స్త్రీ యిట్లు రచించియుండుటకు నెంతయు సంతసింప వలయును గదా!

ఇదియునుంగాక నాచేత నొక గుజిలీయంగడిలోని వేంకటాచలమాహాత్మ్యపుస్తకమునిచ్చి పరిశోధించి వ్రాయుమని, శ్రీవావిళ్ల వేంకటేశ్వరులు గారుచెప్పినందున నేనయ్యకొని నాశక్తికొలఁది, పద్యములలో నందందు విడిచిన పదంబులను గూడినంతవఱకుఁ గూర్చి వ్రాసితిని. గుణగ్రాహ్యులగు పండితులు సంతసింతురుగాత.

ఇట్లు,

ఆలూరు వాసుదేవయ్య.

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము.

| విషయము. | పుట. |
|---|---|
| కవిస్తుతి ... ... | 4 |
| శ్రీవేంకటాచలపురవర్ణనము ... | |
| షష్ఠ్యంతములు ... | 10 |
| నైమిశారణ్యవర్ణనము ... | 11 |
| గరుత్మంతుడు శేషాద్రికిఁ గ్రీడాచలంబు దెచ్చుట | 17 |
| హరి విటవేషధారి యగుట ... | 33 |
| కుమారధారమహిమ ... | 41 |
| శంఖణరాజుకు వేంకటాచలపతి ప్రత్యక్షం బగుట | 46 |
| ఆత్మారాముఁ డనువిప్రునిచరిత్రము ... | 48 |
| వేంకటాద్రి యుగభేదంబులం బ్రకాశించుట... | 58 |
| శ్రీరాములు వేంకటాద్రికి వచ్చుట ... | 60 |
| ఆశ్వాసాంతము ... | 70 |

## ద్వితీయాశ్వాసము.

| | |
|---|---|
| బ్రహ్మేంద్రాదులు వేంకటాద్రికి వచ్చుట ... | 80 |
| బ్రహ్మకు వేంకటేశ్వరుఁడు ప్రత్యక్ష మగుట ... | 88 |
| దశరథమహారాజు శ్రీస్వామిని స్తుతించుట. ... | 97 |
| బ్రహ్మోత్సవము ... | 102 |

## తృతీయాశ్వాసము.

| | |
|---|---|
| వైష్ణవధర్మము ... | 140 |
| జీవబ్రహ్మప్రశంస ... | 146 |

| విషయము. | | | పుట. |
|---|---|---|---|
| అష్టాంగయోగంబులు | ... | ... | 147 |
| మంత్రయోగము | ... | ... | 156 |
| లయయోగము | ... | ... | 158 |
| నైమిశారణ్యమునుండి మునులు వేంకటాద్రికి వచ్చుట | | ... | 183 |
| మునులు సూతుని నుతించుట | | ... | 191 |

## చతుర్థాశ్వాసము.

| | | | |
|---|---|---|---|
| భవిష్యోత్తరపురాణము | ... | ... | 197 |
| మాధవుండను విప్రునిచరిత్రము | ... | ... | 214 |
| పద్మావతితో నారదుండు సంభాషించుట | ... | ... | 266 |
| శ్రీనివాసుఁడు వేటాడుట | ... | ... | 269 |
| పద్మావతి హరిపై ఱాలను రువ్వించుట | ... | ... | 279 |
| హరి వకుళకు రాములకథ చెప్పుట | ... | ... | 289 |
| వకుళమాలిక నారాయణవనపురమున కేగుట | ... | ... | 297 |

## పంచమాశ్వాసము.

| | | |
|---|---|---|
| సూర్యాస్తమయ చంద్రోదయ సూర్యోదయములవర్ణనము | ... | 354 |

## షష్ఠాశ్వాసము.

| | | | |
|---|---|---|---|
| పద్మపురాణంబను వీరలక్ష్మీవిలాసము | ... | ... | 414 |

శ్రీ ర స్తు.

# శ్రీ వేంకటాచలమాహాత్మ్యము

## ప్రథమాశ్వాసము.



శ్రీకాంతాత్మసరోజచండకిరణం
శీతాంశుబింబాననం
శ్రీకంఠాబ్జజసన్నుతాంఘ్రికమలం
చిన్మాత్రమప్రాకృతం,
లోకాతీతమనేకగోపయువతీ
లోలం పరం సర్వగం
స్వాకారం తటికుండశేషకుధరా
ధ్యక్షం భజేహం సదా. 1

ఉ. క్షీరసముద్రమందు సువిశేషమతిఁ జనియించి కూర్మితో
వారిజనాభుదివ్యతరవక్షమునందు వసించి పూర్ణశృం
గారవిలాసలీలల సుఖస్థితి నొప్పుచు భక్తకోటికిఁ
గౌరవమొప్పఁగా నెపుడు గల్ములనిచ్చుసిరిన్భజించెదన్. 2

శా. శ్రీవిఘ్నేశుని క్షేత్రపాలకు నజుఁ శ్రీశంకరుఁ దుర్గనుఁ
దేవేంద్రాదుల నాశ్రయింపుదును జిత్తే సత్తగా నాత్మలో

భావింపన్ గుఱిఁ జూపినట్టిగురు సుబ్రహ్మణ్యపాదాబ్జముల్
సేవింతుం బరవస్తుతత్త్వము మదిం జింతింతు నశ్రాంతమున్.

శా. అక్షీణాక్షరపంక్తిరీతి మును మధ్యాహ్నంబునన్ నాకుఁ బ్ర
త్యక్షంబై గురు నాదిపూరుషుని బ్రత్యక్షంబుగావించి చి
త్సాక్షిబ్రహ్మమటంచుఁ జూపుచుఁ దదర్థంబుం గృపం జెప్పినన్
రక్షింపం బనిఁబూను భారతిని గీర్వాణిన్ సదా నెంచెదన్.

చ. అలఘునభంబునుండి విమలాక్షరపంక్తులరీతి వచ్చి నే
నలసత నొందియున్న తఱి నాననమందు వసించి జ్ఞానముం
గలుగఁగఁజేసి మానసవికారములం దొలఁగించి జిహ్వపై
నిల్చి నటించుశారదను నిత్యము సన్నుతిఁ జేయుచుండెదన్.

శా. పంకేజాసనుఁ డాలకింపన్నొగి సత్పాండిత్యముం దెల్పుచున్
శంకాతంకములేక తాళగతులన్ సద్వీణ వాయించి యే
ణాంకున్ హాస్యము సేయ నోపు ముఖమం దాహ్లాదముం
జూపుచు,వోంకారాకృతి యైనభారతిని నాయుల్లంబునం
గొల్చెదన్. 6

సీ. విప్రమాతృకలకు వెలిపట్టు తెల్లక
ల్వలు గంధమౌక్తికంబుల నొసంగి
రాజమాతృకలకు రహిని గావులుమృగ
మదసుమశోణాగ్రమణు లొసంగి
వైశ్యమాతృకలకుఁ బచ్చపట్టులు చంద్ర
మరకతంబులు బొండుమల్లె లొసఁగి
శూద్రమాతృకల కస్ఫుగ నల్లవల్వలు
నగరుమొల్లలు నయంబార నొసఁగి

తే. యానవాల్నేయితేనెయు *నాసవమును
బోసఁగనర్పించి కృతులుసెప్పుదురు కవులు
నేర నొక్కటి దఱికుండ నృహరికృపను
భక్తి మ్రొక్కెద మాతృకాశక్తులకును. 7

క. అలకాశినుండి వెలువడి
వలనుగ ఘూర్ణిలకు నందవరపురమునఁ దా
నెలకొని కులదేవతయై
యలరుచు మష్మేలుచౌడమాంబను గొలుతున్. 8

శా. నే విజ్ఞానము మోసవోవుతఱిఁ దానే వచ్చి సత్ప్రేమమై
ధావళ్యాకృతిఁ జూపి మించినయవిద్యాచ్ఛేదముం జేసి మ
ద్భావంబున్వసియించి యిచ్చు నొగి శబ్దశ్రేణి నెమ్మిన్ హయ
గ్రీవున్ సత్కరుణాపయోధిని సదా కీర్తింతు సద్భక్తితోన్.

శా. అంతర్యంబున నుంచి సంతత మనంతాఖ్యుం బ్రశంసించెదన్
స్వాంతంబు న్వినతాసుతుం బ్రవిమలస్వాంతుం దలంతున్సదా
సంతోషం బలరంగ భక్తి తగ విష్వక్సేను సేవించెదన్
భ్రాంతుల్దీరఁగఁ బూర్వదేశికుల సంభావింతునిష్టాప్తికై. 10

శా. ధాటిన్ దుష్టనిశాటులం దునిమి సద్ధర్మంబు రక్షించి శా
ర్యాటోపం బుపశాంతిచేసి ఫణిపర్యంకంబునన్ నిద్రితుం
డై టెక్కొప్పఁగఁ బవ్వళించియును సర్వాధారుఁ డౌఁ గావు
నం, గూటస్థుం డితఁ డంచు నెన్నుదు మదిన్ గోవిందరాజా
హ్వాయున్. 11

మ. అలఘుత్వంబున రావణాద్యఖిలదైత్యాళి న్విదారించి స
ల్లలితన్ సీతను గూడి యాత్మపుర ముల్లాసంబుతోఁ జేరి యు

*ఆసవము=కల్లు.

జ్వాలపట్టంబున కర్తృఁడై నిలచి విశ్వస్వామియై యొప్పెడుం
గొలుతుఁ గా సంతత మిష్టదైవమనుచుం గోదండదీక్షాగురున్.

శా. శృంగారాకృతితోడ వచ్చి పదముల్ శృంగారసారంబుతో
డం గూఢంబుగఁ జెప్పు నీవనఁగ నట్లే చెప్పలేనన్న నన్
ముం గోపంబునఁ జూచి నేచి యట నే మ్రొక్కంగ మన్నించి త
చ్ఛృంగారోక్తులు తానె పల్కికొను నా శ్రీకృష్ణు సేవించెదన్.

ఉ. కోరిన శ్రీనివాసునకుఁ గొంకక నైజనివాసమిచ్చి యా
వీరుఁ డొసంగినంత పదివేలని తృప్తిగ నారగించుచుం
గ్రూరత లేక యోగివలె గుప్తతనుండు వరాహదేవునిన్
సారపరాత్మతత్త్వమని సన్నుతి సేయుచునుందు భృత్యునై.

మ. తిరమై శ్రీయల మేలుమంగ యురమందే నిల్చి దీపింపఁగాఁ
బరమైశ్వర్యధురంధరుండగుచు నాపాలం గృపన్ నిల్చి సుం
దరదివ్యాకృతి నప్పటప్పటికి మోదం బొప్పఁగాఁ జూపి మ
ద్వరదుండై తగు వేంకటాచలపతి న్వర్ణింతు నశ్రాంతమున్.

ఉ. శ్రీరమణీహృదీశ్వరుని చిన్మయమూర్తిని విశ్వతోముఖున్
క్షీరసముద్రశాయిని వశీకృతమాయుని దివ్యకాయునిన్
సారతరార్థము ల్దెలిపి సత్కృపతో నను నేలు దేవునిం
గూరిమినై భజింతుఁ దఱికుండనృసింహుని దూరితాంహునిన్.

క. అలసూర్యాదినవగ్రహ
ములను బ్రజాపతుల యోగిముఖ్యులఁ ద్రిమతం
బుల నుద్ధరించుధన్యులఁ
దలఁతుఁ మోక్షాభిలాషఁ దద్దయు వేడ్కన్. 17

కవిస్తుతి.

సీ. ఆదికవీశ్వరుం డైనవాల్మీకికి
వ్యాసమానికిఁ గాళిదాసకవికి

నరయంగ వరలబ్ధ మన్న మాచార్యున
కాంధ్రభాషాకవిత్వాఢ్యు లగుచుఁ
దనరునన్నయను దిక్కనసోమయాజికిఁ
బోతరాజునకును నీతులయిన
కవులకుఁ బండితాగ్రణులకుఁ బౌరాణి
కులకు భక్తిని మ్రొక్కికొనుచు నేను

తే. వేంకటాచలమాహాత్మ్యవిభవములను
బద్యరీతిని రచియించి భక్తి మెఱయ
శ్రీనివాసునిపాదరాజీవములకుఁ
బొసఁగ నర్పింతు మోక్షంబుఁ బొందుకొఱకు. 18

సీ. పండితాగ్రణులార ప్రజలార యిపుడు నా
బాలభాష కసూయపడక వినుఁడు
తల్లిదండ్రులు చిన్నపిల్లలపల్కుల
కానంద మొందెడునట్లు యింపు
మీరు నాతప్పొప్పు లేరీతిగానైన
గేలిసేయక చిత్తగింపవలయు
నాంధ్రగీర్వాణమహాకృతు లుండఁగా
నిప్పు డీకృతి విననేల యనక

తే. భక్ష్యములు మెక్కి యావలఁ బచ్చడియును
నంజుకొనినవిధంబున నాప్రబంధ
మాలకింతురటంచుఁ బేరాసచేత
నేను రచియింతు దీని మన్నించి గనుఁడు. 19

శా. నారీతిం దగ విన్నవింతును గృపన్మాతండ్రులారా వినుం
డా రాజీవదళాక్షుసత్కరుణ నాయందుండు నైనన్మదిన్

సారార్థంబుల నేర్పఱించికొని భాస్వద్భక్తియోగక్రమ
శ్రీరమ్యంబుగ నాంధ్రరీతిని ప్రకాశింపం గృతిం జేసెదన్. 20

సీ. నాచిన్ననాఁట నోనామాలునైన నా
చార్యులచెంత నేఁ జదువలేదు
పరఁగుఛందస్సులోఁ బదిపద్యముల్నైన
నిక్కంబుగా నేను నేరలేదు
లలితకావ్యనాటకాలంకారశాస్త్రము
ల్వీనులనైనను వినఁగలేదు
పూర్వేతిహాసవిస్ఫురితాంధ్రసత్కృతు
లొక్కింటి వరుసఁగఁ జూడలేదు

తే. చేరి తఱికుండపురినారసింహదేవుఁ
డానతిచ్చినరీతిగ నే నిమిత్త
మాత్రమునఁబల్కుదును స్వసామర్థ్యమిప్పు
డరయ నించుకయేని నాయందు లేదు. 21

సీ. దారునిర్మితవీణ నారూఢిఁ బల్కించు
గాయకపుర్షనికరణిగాను
పురుషోత్తముఁడు దయాపూర్ణుఁడై నాజిహ్వ
యందుఁ దా వసియించి యరుదుగాను
బలికించుఁ గావున భాగవతపురాణ
మమర నేద్విపదకావ్యంబుగాను
ద్వాదశస్కంధము ల్తగఁ జెప్పి హరికి స
మర్పించి శ్రీవేంకటాద్రిమహిమ

తే. మతనిపై రమ్యపద్యకావ్యం బొనర్చి
శ్రీనివాసునికే సమర్పింపనుంటి

నీఁగ తోయధిఁ దాఁటఁబోయినవిధమున
నాస్వతంత్రత కిల బుధు ల్నవ్విపోరె. 22
తే. నవ్విననుసమ్మతంబని నన్ను బ్రోచు
చున్న శ్రీవేంకటేశ్వరుఁ డున్నతముగ
నిరవుకొని యున్న వేంకటగిరిపురంబు
నిపుడు వర్ణింతు నించుక యెట్టులనిన. 23

## శ్రీవేంకటాచలపురవర్ణనము.

సీ. ఘనగోపురములు ప్రాకారమంటపములు
తేరులు సత్పుణ్యతీర్థములును
కమలాప్తకిరణసంకలితంబులై ప్రకా
శించుచుండెడు హేమశిఖరములును
పావనపరివార దేవాలయంబులు
మహిమ నొప్పువిరక్తమఠవరములు
రంగత్తురంగమాతంగతురంగము
ల్గ్రామరారుబహుసాధుగోగణములు
తే. ముద్దుగాఁ బల్కుశుకపికములును నీల
కంఠములును మరాళసంఘములు మఱియు
ఫలవనంబులు తులసికాదళసుమములు
క్రిక్కిఱిసి యుండు వేంకటగిరిని యెపుడు. 24
సీ. వేదశాస్త్రపురాణవిద్యాప్రసంగవి
వేకభాస్వరులైనవిప్రవరులు
మహనీయసత్యధర్మపరాక్రమములచే
భుజబలోన్నతు లగుభూమిపతులు
రమణీయకృషియు గోరక్ష వాణిజ్యము

## షష్ఠ్యంతములు.

క. హేమాక్షాంతకునకు సం
గ్రామభయంకరుని కఖిలకారణునకు శ్రీ
భూమివరాహస్వామికిఁ
గామితఫలదాయకునకుఁ గరుణానిధికిన్ 32

క. అక్షీణశౌర్యధైర్యా
ధ్యక్షహిరణ్యాక్షరాక్షసాధిపవక్షో
ఖా
దక్షున కతికోపవిభవతామ్రాక్షునకున్. 33

క. హారహారహీరదరశర
పారదనారదవిభావిభవగాత్రునకుం
గూరిమిమైఁ బ్రహ్లాదుని
సారకృపఁ బ్రోచినట్టిశాంతాత్మునకున్. 34

క. చండతర శౌర్యగౌరవ
ఖండీభరదరికి భక్తకలుషజలరుహా
ఖండతరకరికి శ్రీతటి
కుండన్నృకేసరికి నాదుగుటికిఁ హరికిన్. 35

క. వేంకటగిరినాయకునకుఁ
బంకజభవజనకునకును బరమాత్మునకుఁ
శంకరవరమిత్రునకుఁ గ
లంకవిరహితునకు మోక్షలక్ష్మీపతికిన్. 36

వ. అంకితంబుగ నాయొనర్పంబూనిన వేంకటాచలమాహాత్మ్యం
బునకుఁ గథాక్రమం బెట్టిదనిన. 37

## నైమిశారణ్యవర్ణనము.

సీ. జంబీరమందారసహకారమాలూర
సాలరసాలహింతాలములును
వటబిల్వబదరికాశ్వత్థనందనకుంద
కురువకక్రముకతకోలములును
నారికేళార్జుననారంగబంధూక
పారిజాతాశోకపాటలులును
కాదంబకాంచనకరవీరపున్నాగ
కోవిదారమధూకకుటజములును

తే. మొదలుగాఁగలబహువృక్షములును లతలు
పూఁచి కాఁచి ఫలింప సంపూర్ణమగుచు
సర్వకాలంబులందు వసంతకాల
రమ్యమై యున్న నైమిశారణ్యమునను. 38

క. సెలయేఱులు కమలాకర
ములు బహుకాసారబృందములు పూర్ణములై
కలకాలము నొకవిధముగఁ
బొలుపుగఁ బ్రవహించు నచట బుధసేవ్యంబై. 39

వ. అట్టి నైమిశారణ్యంబునందు శౌనక కపిల గాలవ కౌశిక పిప్పల గార్గ్య శంఖవత్స శ్రీవత్స శమీక కణ్వ సుమేధ వాలఖిల్యాదిమహామునులు సూతునివలన సకలపురాణంబులు విని తదనంతరంబున నొక్కశుభదినంబునందు సూతుంజూచి, కథనకా భూలోకంబున నూటయెనిమిది తిరుపతులు గల వందు స్వయంవ్యక్తంబులు, శ్రీరంగంబును, శ్రీముష్ణంబును, తోతాద్రియును, సాలగ్రామంబును, నైమిశంబును, బదరి

కాశ్రమంబును, కాంచియును, వేంకటాచలంబును, నీ యెని
మిది స్వయంవ్యక్తంబు లగుం గావున నిందు విశేషించి సకలే
ష్టార్థసిద్ధిప్రదం బయినస్థలం బెయ్యది దెల్పుమనుచు వెండియు
నిట్లనిరి. 40

క. ఘనముగ నర్చారూపము
లను నారాయణుఁడు భూతలంబున భక్తా
వనుఁడై విఖ్యాతిని బొం
దినసత్కథ మాకు నీవు దెల్పుము సూతా. 41

మ. అనినన్ సూతుఁడు నవ్వి మేలు భళి మీ రాసక్తితోఁ బ్రశ్న
చేసిన దీలోకహితంబు దీన వరలక్ష్మీకాంతుఁ డుప్పొంగి మి
మ్మును నన్నుం గృపఁ గాచుఁ గావున మహాముఖ్యంబుగాఁ
జెప్పెదన్, వినుఁ డోతాపసులార నెమ్మదిగ మీవీను ల్వినో
దింపఁగన్. 42

క. శ్రీవేదవ్యాసులకృప
చే వరుసగఁ దోఁచినంత చెప్పెద వినుఁ డా
దేవునిచరితములన్నియు
నావశమే చెప్ప మౌనినాయకులారా. 43

వ. అయిన నాకుఁ దోఁచినంతకు వచించెద నెనిమిది స్వయంవ్యక్తం
బులయందు వేంకటాచలం బైహికాముష్మికఫలప్రదం బగుం
గావున నతిశయం బగుచుండు శ్వేతవరాహకల్పంబునందు
శ్రీహరి శేషాద్రియందుఁ బ్రవేశించినవృత్తాంతం బంతయు
సావధానులరై వినుండని సూతుం డిట్లనియె. 44

సీ. నారాయణస్వామినాభిసారసమున
మును చతురాస్యుండు జనన మొందె

సృష్టికాలమునంద శేషభూతప్రపం
చంబు నొప్పఁగ సృజనం బొనర్చి
నున్నతుఁడై చతుర్యుగసహస్రంబును
జాగరూకతను విశ్వంబుఁ గాచె
నప్పు డాదిత్యానలానిలాంబుదపంక్తు
లొప్పఁగా హద్దులు దప్పకుండె
తే. మహిమ మీఱఁ జతుర్దశమనువులందు
వెలుఁగుచును విష్ణుదేవుండు విశ్వమెల్లఁ
బాలనముసేయఁగా బ్రహ్మపగలు జరిగెఁ
బద్మజుఁడు రాత్రిరాగఁ దాఁ బవ్వళించె. 45

సీ. ఆబ్రహ్మ నిద్రించినట్టిరాతిరివేళ
భానుఁ డుగ్రకరాళిఁ బ్రబలఁజేసెఁ
గాలానలజ్వాలకణములఁ గ్రక్కఁగా
స్థావరజంగమచయము లడఁగెఁ
బ్రళయవాతూల మంబర మావరించుచు
విసవిస నమితమై విసరసాగె
సంవర్తకాదిదుస్తరమేఘబృందంబు
మిన్ను ఘూర్ణిల నార్చి మెఱపు లెసఁగె
తే. ద్విరదశుంభనిభంబులై దీర్ఘగతుల
వర్షధారలు గుఱిసె నివ్వసుధ నీటి
బరువు కోపంగలేక లోపలికిఁ గ్రుంకు
నపుడు హైరణ్యలోచనుఁ డార్భటించి. 46

వ. ధరణీతలంబును రసాతలంబునకుం గొనిపోయి యందు బహు
కాలంబు క్రీడించు చుండె నంత బ్రహ్మదేవుండు క్రమ్మఱ

క. మీ కనపాయినియై తగి
యాకమలాదేవి వక్షమందుండును మీ
సూకరరూపము చూపిన
నాకాంతకు వెఱపుఁ దోఁచదయ్య మహాత్మా 56

తే. మీరు సర్వజ్ఞమూర్తులు మీకుఁ దెలియ
కున్నదే నాకుఁ దోఁచ కీవిన్నపంబు
చేసినా నింక దేవరచిత్తమునకు
సమ్మతం బైన నది లోకసమ్మతంబ. 57

వ. అని పక్షీంద్రుం డురుతరభక్తిం బ్రణామంబులుం జేసినం
జూచి హరి కరుణించి యిట్లనియె. 58

సీ. అనఘ ఖగేంద్ర నే నచటికి రానిప్డు
ధరణిపై వసియించి దానవులను
బరిమార్చి సుజనులఁ బాలింతు నిఁక నీవు
పొల్పగు వైకుంఠపురము చేరి
వనధికన్యకకు నీవార్త లొప్పఁగఁ జెప్పి
క్రీడాచలముగొని * గెలివి మెఱయ
రమ్ము పొమ్మన ఖగరాజచ్యుతునినాజ్ఞఁ
గొని వేడ్క నరిగె వైకుంఠమునకు

తే. నపుడు కిటి యగువిష్ణు వియ్యవనిఁ దిరిగి
తాను వసియింపఁ దగినట్టితావుఁ గనుచు
వచ్చుచును నిల్వ కెందును వనజనేత్రుఁ
డొక్కయెడఁ జూచి యిదియ సర్వోత్తమంబు. 59

వ. అని మనంబున నిర్ణయించె, నయ్యది గౌతమీనదికి దక్షిణం

* గెలివి=సంతోషము.

బుగ నఱువది యోజనంబుల దూరంబును, దూర్పులవ
ణార్ణవంబునకుఁ బశ్చిమంబుగా నైదు యోజనంబులును దక్షి
ణంబుగ సువర్ణముఖరికి నుత్తరంబుగ నుండునంద నిలిచి
గరుడాగమనంబున కెదురుగనుంగొనుచు నుండె నంత. 60

సీ. గరుడుండు వైకుంఠపురిఁ జేరి శ్రీరమా
దేవికి మ్రొక్కి ప్రార్థించి పలికె
నోతల్లి హరి వరాహోగ్రరూపము దాల్చి
హైరణ్యనేత్రుని హతుని జేసి
యల రసాతలమునం దెలమిఁ గ్రుంకి ధరిత్రి
దంష్ట్రాగ్రమున యథాస్థానమునకుఁ
దెచ్చి చక్కఁగ నుంచి యచ్చట నిల్వ సం
కల్పించినాఁ డాప్రకారమటకుఁ

తే. దెమ్మటంచును జెప్పె నీదివ్యసౌఖ్య
దమగు క్రీడాచలంబును దనరవారి
యాజ్ఞ వచ్చితి ననవు డయ్యబ్ధికన్య
విస్మయంబంది గరుడుండు వినఁగ ననియె. 61

—గరుత్మంతుఁడు శేషాద్రికిఁ గ్రీడాచలంబు దెచ్చుట.—

చ. హరి కిటిరూపవైభవము నద్భుత మొప్పఁగ నేను జూచెదన్
సరగునఁ దోడితెమ్మనిన సాగిలి మ్రొక్కి ఖగేంద్రుఁ డిట్లనెం
గరుణను రమ్మటంచుఁ బదకంజములం బడి సన్నుతించినన్
హరి ధరవీడి రాననియె నాపయి వచ్చితి శ్రీహరిప్రియా.

ఆ. సూకరోగ్రమూర్తి మీకుఁ జూపిన మీరు
వెఱతు రంచుఁ బల్కె విష్ణు వంచు

విహగనాయకుండు విన్నవించిన నవ్వి
లక్ష్మి యిట్టు లనియె లలిత మెసఁగ. 63

ఆ. నేను దనకు నెపుడు నిత్యానపాయిని
నగుచు నుండు టెఱిఁగి యద్భుతముగఁ
గ్రొత్తమాట లన్న క్రోడవిగ్రహహేయ
వింత దోఁచె మదికి విహగనాథ. 64

క. తా నేరూపము దాల్చిన
నే నారూపము ధరించి నిశ్చలమతినై
పూని యురంబున నుండుదు
నానడవడి క్రొత్త యీదినమున ఖగేంద్రా. 65

క. తా నిచటికి రాకుండిన
నే నచ్చటికైన వచ్చి నిజముగఁ గిటినై
యానందించుమహాత్ముని
మానితవక్షమున నుందు మహి విహగేంద్రా. 66

సీ. పాఠీనమై తాను బ్రళయాబ్ధిపై నీదు
నప్పుడు తనవక్షమందు నుంటిఁ
గూర్మరూపము దాల్చికొని యబ్ధిలో మునిం
గినయప్డు తనయంద దనరుచుంటి
నంగుష్ఠమాత్రుఁడై యాకుపై శయనించి
నప్పుడు నేఁ దనయంద నుంటి
చంద్రచంద్రికల కెచ్చట వేఱులేకుండు
నట్టుల నేఁ దనయంద నుంటి

తే. నిప్పు డెడఁబాసి యుందునె యొప్పుకొంచు
నిచటిపరివారములతోడ నచటి కేను

వచ్చి యాక్రోడవిగ్రహుఁ వక్షమందు
నిలిచి యుండెద ఖగరాజ తలఁగ కెపుడు. 67

క. వేడు కలర భూదేవికిఁ
గ్రోడాకారంబు జూపి కులికెడుహరికిం
గ్రీడాచల మొప్పినచోఁ
గూడుందలయగాదె యటకుఁ గొనిపో మ్మింకన్. 68

సీ. అని పల్కి పరివారమును దాను నిజకళ
లోనర వైకుంఠమందుంచి యొక్క
కళతోడ గ్రీడానగంబుపై కెక్కి రం
దఱుతోడ సిరి యానదప్ప కపుడు
గరుడుఁ డాక్రీడాద్రి శిరమున నిడికొని
ధాత్రికి దిగి వచ్చుతఱిని వివిధ
పుష్పలతాదులు పొల్పుగ నుయ్యెల
వలె నూఁగ భృంగంబు లొలసి తిరుగ
తే. కనకగిరిమీఁద నీలాద్రి గ్రాలుచుండు
కరణి హేమాంగుఁ డనఁదగు నురగవైరి
శిరమునం గ్రీడనగమును జెలఁగుచుండ
గగనదిగ్భాగములు దివ్యకళల నెసఁగె. 69

సీ. చందన జంబీర చంపక వకుళాది
పాదపంబులతోడఁ బ్రబలుదాని
కనకరత్నాదులకాంతులచే మించి
కనిపించు నమితశృంగములదాని
కలకంఠశుకనీలకంఠమరాళాది
విహగకూజితముల వెలయుదాని

కమలనీలోత్పలప్రముఖపుష్పోజ్జ్వల
రమణీయపద్మాకరములదాని

తే. లలితవిస్తారసిద్ధస్థలములదాని
నమితముక్తికి నాటపట్టైనదాని
సిరిని నీళను భరియించి నెలఁగుదాని
గాంచి యాశ్వేతకిటి నవ్వి మించి మదిని. 70

క. అచ్చెరువుగ నాచెంతకు
వచ్చెను సిరి వచ్చె నీళ వచ్చెను గిరియుఁ
వచ్చెను బరివారము నా
కిచ్చట సంసార మింక హెచ్చె నటంచున్. 71

వ. అని తలంచుచుండుసమయంబున విహగేంద్రుండు వచ్చె నంత నా వరాహరూపుఁడు చూపిన దివ్యస్థలంబున నాక్రీడాచలంబును డించి దండప్రణామంబు లాచరించ నాఖగరాజు నకు సంతసించి యప్పర్వతం బెక్కి యందుంగల పుష్కరిణికిఁ బశ్చిమతటంబున నిలిచి యున్నసమయంబున బ్రహ్మ రుద్రేంద్రామరదిక్పాలకమునులును గంధర్వాదిసిద్ధులును విచ్చేసి శ్వేతవరాహస్వామిని వీక్షించి సకలనిగమార్థసం ప్రశ్నల బహుప్రకారంబుల నానందబాష్పాంచితధారా కలితనేత్రులై సాష్టాంగ దండప్రణామంబు లాచరించి జయజయశబ్దంబులు మిన్నుముట్టంజేసి ముకుళితకరకమల ములు గలవా రగుచు నిట్లు నుతించిరి. 72

దండకము. శ్రీమన్మహాశ్వేత సత్క్రోడరూపాయ నిర్లేపబోధ ప్రదీపా ప్రతాపోజ్జ్వలా శ్రీపభూపా హిరణ్యాక్షకాఠిన్య దేహాద్రిదంభోళిధారా సురాధార ధాత్రీతలోద్ధార

భర్మాద్రిధీరా జగత్పూర్ణచిత్సారభూతా భవాంభోధిపోతా
సుమోక్షప్రదాతాగుణాతీత వేదార్థనిర్ణేతపూతాత్మధాతా
మహాపంచభూత ప్రపంచాకరా శ్రీకరా సుప్రసన్నాత్మవై
మమ్ము రక్షించు మీశా రమాధీశ నీసత్ప్రభావంబు లెన్నన్
సహస్రాననుండైన నేఁ దానోపునే మాకు శక్యంబె నీయుగ్ర
దంష్ట్రాకరాళాస్యమున్ నీసటల్ వేడిచూడ్కుల్ మహా
భీకరాకారమున్ జూడ మాకే యసాధ్యంబుగాఁ దోఁచె
లోకంబున న్మానవవ్రాతము ల్బ్చాచి భీతిల్లరే దేవ మమ్ముద్ధ
రింపన్ సదాసౌమ్యరూపంబునుం దాల్చి శ్రీభూమినీళాసమే
తుండవై తండ్రి తిర్యఙ్మనుష్యాఖ్యజీవాళులన్ బ్రోచుచున్
సర్వనిత్యోత్సవంబు ల్మహాభక్తబృందంబు లర్పింపఁగా దివ్య
లీలాప్రభావంబులం జూపుచు న్నిరు క్రీడాచలంబందు
వేంచేసి యుండుండు శ్రీపూర్ణకామా గుణస్తోమ దేవో
త్తమా దేవతాసార్వభౌమా వరాహావతారా నమస్తే నమస్తే
నమస్తే నమః. 73

మ. అని వారెల్ల బహుప్రకారముల వేదాంతోక్తులం బ్రస్తుతిం
చిన మోదించి వరాహదేవుఁడు దయాసింధుండు బ్రహ్మాదులన్
గని రుద్రాబ్జజముఖ్యులార వికృతాకారంబు నేఁ దాల్చి దై
త్యునిఖండించితి భూమి నెత్తితిమహాతోయంబులందాఁచితిన్

క. మీమీస్థానములం
దామోదము మీరఁ జేరి యందఱు పూర్వం
బేమాడ్కి మెలఁగుచుండుదు
రామేరలు దప్పకుండుఁ డమలాత్మకులై. 75

శా. భూమ్యాదుల్ మదనుజ్ఞ దప్పక సదా పూర్వస్థితిన్నిల్చు నే
సౌమ్యత్వంబున సాగరాత్మజను వక్షఃస్థానమం దుంచెదన్
రమ్యాకారము నొంది భూజనములన్ రక్షించి యెల్లప్పుడున్
గామ్యార్థంబులు నిచ్చి వారిభయదుఃఖంబుల్ని వారించెదన్.

ఆ. అనుచు వారి కిట్టు లానతిచ్చి వరాహ
దేవుఁ డపుడు సౌమ్యదేహుఁ డగుచు
వరకృపారసంబు వారిపైఁ జిలికించి
శాంతచిత్తుఁడై ప్రశస్తముగను. 77

సీ. క్రీడాచలంబున శ్రీస్వామిపుష్కరి
ణికిఁ బశ్చిమంబుగాఁ బ్రకటితమగు
భవ్యపుష్కరిణికి వాయవ్యదిశసమీ
పంబునఁ జిత్రహర్మ్యంబు లెసఁగి
దివ్యనీలస్తంభ నవ్యహాటకకుంభ
మరకతోన్నతముఖమంటపములు
భానుకోటిప్రభాభాసమానసురత్న
గోపురప్రాకారకుడ్యములును

తే. కలిగి యప్రాకృతాదిత్యకాంతికలిత
మహితమాయానిగూఢవిమానమందు
మెఱయు శ్రీభూమినీళాసమేతుఁ డగుచు
శ్వేతకిటిరూపై జగములు వినుతిసేయ. 78

వ. అట్లు పరమవైభవంబున నుండువరాహస్వామిని బ్రహ్మరుద్రాదులు పొడగని యానందసముద్రమగ్నులై యనిమిషదృష్టులై వీక్షించుచున్న సమయంబున వరాహదేవుండు విమానంబుతో నంతర్ధానంబు నొందె నప్పుడు బ్రహ్మాదులు

జయజయశబ్దంబులుచేసి వరాహస్వామి తిరోహితుం డైన
దిక్కునకు మ్రొక్కులిడుచుఁ దత్ప్రభావంబులం బొగడుచుం
దమ నివాసంబులకుం జని రంత శ్రీభూనీళాదేవులును బరి
వారంబులును హరికి దండప్రణామంబు లాచరించినం జూచి
సంతసించి హరి సిరితో నిట్లనియె. 79

క. సిరి నీవు నన్నుఁ గన్గొని
వెఱచెద వని రమ్మనుటకు వెఱపించితి నీ
వరయఁగ నీళను దోడ్కొని
పరివారముతోడ రాఁగ బహుమే లయ్యెన్. 80

వ. అనిన విని సిరి నగుచు హరి కిట్లనియె. 81

తే. స్వామి నినుఁ బాసి నిముస మోర్వంగఁజాల
నని యెఱుంగవె గావునఁ జనినదానఁ
దప్పు సైరించి మమ్ము నందఱను బ్రోవు
మనుచు వేఁడఁగ హరి సిరి కనియె నిట్లు. 82

క. భూమిస్థలి వెదకఁగ నా
కీమహితస్థలము దొరికె నిచ్చట నిలువన్
నామది కిష్టం బయ్యెను
గోమలి మన కిప్పు డిది వికుంఠంబ గదా. 83

సీ. ఈఫలద్రుమములు నీప్రసూనలతాళు
లీపుణ్యతీర్థము లీప్రవిపు నుండు
మున్యాశ్రమంబుల మోక్షస్థలంబుల
ధన్యంబు లయినభూధరచయములఁ
జూడఁ జూడఁగ నాకు వేడుక పుట్టెను
గాన నిల్చితి నిందుఁ గమలనయన

భూలోకవాసుల బ్రోవంగవలయును
వరము లొసంగి సత్కరుణ మెఱసి
తే. నాకు నిష్టంబు గలరీతి నీకు నిష్ట
మైన నిల్తును లేకున్న నరయ నిందుఁ
నుండ నని వల్క నిందిర యుల్ల మలర
దరహసితవక్త్రయై యనె హరికి నిట్లు. 84
తే. మీరు సర్వజ్ఞులరు ప్రియంబార నేను
మీరు నిల్చినయెడ నాకు మేటి మీకుఁ
జింతయేటికి దేవ మీచిత్త మింక
ననిన లచ్చిని యురమునం దలరఁ జేర్చి. 85
చ. అపుడు వరాహవిగ్రహుఁ డనంతకళాపరిపూర్ణుఁడై మహా
నిపుణత మీఱఁగా సిరిని నీళను డగ్గఱ నాదరించుచున్
విపులపరాక్రమక్రమవివేకవిచక్షణులైనపార్షదుల్
కపటము లేక గొల్వఁగ నఖండసుఖస్థితి నొప్పె నయ్యెడన్. 86
తే. అనిన తాపసు లిట్లని రయ్య సూత
స్వామిపుష్కరిణీప్రభావంబు మాకుఁ
దెలుపవే యన విని నవ్వి దెలిపె దంచుఁ
బలికె నీరీతి మునిపుంగవులను గాంచి. 87
సీ. మునులార వైకుంఠమున నుండు క్రీడాన
గంబుపై స్వామిపుష్కరిణి యుండి
పరఁగ నప్రాకృతపరిమలోదకమై మ
హాపూర్ణమై యుండు నచట సిరిని
భూనీళలనుగూడి పురుషోత్తముఁడు జల
క్రీడ లాడుచు నుండు వేడు కలరఁ

క్రీడాచలముతోడ నీడకు దిగి వచ్చి
విరజాసమానమై ధరణి వెలసి
తే. హరికి సంతోష మగుచు గంగాదినదుల
కన్నిటకు మాతృదేవత యగుచు జనుల
పాపములఁ హరియింపుచుఁ దాప మడఁచి
యిష్టకామ్యార్థములను దా నిచ్చుచుండు. 88

వ. ఇట్టిస్వామిపుష్కరిణీతీర్థదర్శనపానంబులచేత స్త్రీశూద్రజనంబులం బావనులంజేయుఁ గావున విశేషించి స్నానసంధ్యాది నిత్యనైమిత్తిక సకలకర్మకలాపంబు లాచరించు బ్రాహ్మణుల పుణ్యం బెంతయని చెప్పనగు నిదియునుంగాక పుష్కరిణీస్నానంబును బరమంబగు నేకాదశీవ్రతంబును సద్గురుపాదసేవనంబును గల్గుట దుర్లభంబు. మఱియు సకలస్థావరజంగమంబులందు మనుజజన్మంబును బుష్కరిణీస్థానంబును, వేంకటాద్రియందు జీవించుచుండుటయు నత్యంతమోక్షదాయకంబు, గావున వేంకటాచలమాహాత్మ్యంబును బుష్కరిణీప్రభావంబును వచింప నాచతుర్ముఖునికైన నశక్యంబు తత్ప్రభావంబులు సంక్షేపంబుగఁ జెప్పితి నింక నొక్కయితిహాసంబు నెప్పెద నాలకింపుఁడని మునులకు సూతుం డిట్లనియె. 89

సీ. మును తారకాసురుం డనువాని సేనాని
యదిమి చంపిన బ్రహ్మహత్యవలనఁ
బీడితుఁడై నిజపితృవాక్య మంగీక
రించి గ్రక్కున నిర్గమించి మొనసి
యా వేంకటాద్రికి నభిముఖుఁడై వచ్చు
నప్పు డాతని బ్రహ్మహత్య గొంచి

యాకుమారస్వామియందుండ కతిదూర
మరిగె భయంపడి యంత గుహుఁడు

తే. వేంకటాద్రికి వచ్చి తా వేడ్క స్వామి
పుష్కరిణియందుఁ గ్రుంకి తెప్పున వరాహ
దేవు నీక్షించి భక్తిఁ బ్రార్థించి మ్రొక్కి
యపుడు కృతకృత్యుఁ డయ్యె షడాననుండు. 90

ఉ. కావున వేంకటాచలమఘంబుల కెల్ల భయంకరంబునై
పావనమై సువర్ణమణిభాస్వరమై ధరణీసురాలికిన్
జీవనమై తపోజనవశీకరమై యజరుద్రశక్రసం
సేవితమై సుభక్తులకు శ్రీకరమై నుతిపాత్రమై దగున్. 91

క. హరికల్యాణగుణమ్ముల
వరవేంకటగిరిని వెలయు వారక సత్యా
కరమై యవి వచియించిన
పరమార్థం బొకటె చూడఁ బండితులారా. 92

క. ఘనమై ప్రాకృతజనముల
కనులకుఁ బాషాణములుగఁ గన్పట్టును స
జ్జనములకుం గనకాచల
మునుబోలె వెలుంగు నిత్యమును మునులారా. 93

వ. ఆవేంకటాచలంబుననుండి వరాహస్వామి జనులకు దృశ్యా
దృశ్యుం డగుచు వర్తించు నప్పర్వతంబు భవతారకం బగు
చుండు ననిన శౌనకుండు సూతుం జూచి యిట్లనియె. 94

ఆ. ఆవరాహదేవుఁ డాపర్వతాగ్రాన
నుండి యేమి సేయుచుండె నెవరి

కేమి యొసఁగె వినుట ష్టంబు గల్గె మా
కావిధంబు దెల్పుమయ్య సూత. 95

క. అన విని సూతుం డిట్లనె
ననఘుండు వరాహదేవుఁ డాగిరిమీఁదన్
ఘనుఁడై నెమ్మి వసించుచుఁ
దనకాంతామణులతోడఁ దగు క్రీడలతోన్ 96

సీ. వనపుష్పలతలచేతను బ్రకాశించుచు
నిరవయి తగుపొదరిండ్లయందు
నీలకాంతులచేత నెఱి నొప్పుచుండెడు
సదమలసానుదేశంబులందుఁ
బరిమళపుష్పముల్ పై వ్రాలుచుండఁగఁ
జల్లనై తగుపర్ణశాలలందుఁ
గనకమందిరములకై వడి దీపించు
రమణీయగిరిగహ్వరములయందు

తే. మెప్పుగా వ్రాలుపుష్పాడికుప్పలందు
వన్నె కెక్కినసెలయేటిదిన్నెలందుఁ
గాంతలను గూడి చక్రి యేకాంతముగను
గ్రీడసల్పుచు నుండును వేడు కలర. 97

చ. పరఁగ నధర్మవాదు లగుపాటిఁ ద్రుణంబుగ నిగ్రహించుచున్
వరుసగ ధర్మచిత్తులను వారక బ్రోవుచు నుండు నెప్పు డా
హరి కివి నైజసద్గుణము లై తనరారును గాన నెప్పుడున్
ధర నవతారముల్తలచు దాల్చుచునుండు కృపాసముద్రుఁడై.

సీ. మాటిమాటికిని బ్రహ్మకు రాత్రి యైనప్పు
డతఁడు నిద్రింపఁగా నఖిలగురుఁడు

తా నందు మేల్కని తనకుక్షిలో విశ్వ
మును దాచికొనియుండి వనజభవుఁడు
నిద్ర మేల్కొనఁగానె నిఖిలకారణకార్య
యుక్తసృష్టిని వాని కొప్పగించు
రమణమై మీనవరాహాదిరూపంబు
లటువంటికాలంబులందుఁ దాల్చి

తే. దుష్టనిగ్రహ మొనరించి శిష్టజనుల
రక్షణము సేయు నొక్కవరాహకల్ప
మందుఁ జక్రికి మ్రొక్కి పద్మాసనుండు
వినయ ముప్పొంగ నిట్లని విన్నవించె. 99

ఉ. శ్వేతవరాహరూప ననుఁ జేకొని విన్నప మాలకించి యీ
భూతలమందు శేషగిరి పూజితమై తగు నందు మీరు వి
ఖ్యాతిగ నిల్చితేని మిము గాంచి తరింతురు మర్త్యులందఱో
తాత యటంచుఁ బల్కఁగ విధాతను జూచి ప్రసన్నచిత్తుఁడై.

ఆ. చక్రి యిట్టులనియె జలజసంభవ నీవు
కోరినట్ల యేను క్రోడరూప
ధరుఁడ నగుచు శేషధాత్రీధరమునందు
నిలిచియుందు ననియె నెమ్మిమీఱ. 101

తే. అనిన విని మ్రొక్కి సనియెఁ బద్మాసనుండు
శ్వేతకిటితన్నిమిత్తంబుచేత శేష
శిఖరియందు నివాసంబు చేసి జనుల
రక్షణము సేయుచుండు నిరంతరంబు. 102

ఆ. ఆవికుంఠమున సదాదిత్యమండల
మందు సర్వమందు హరి వసించు

నంతకంటె ముఖ్యమని వేంకటాద్రిపైఁ
జక్రధరుఁడు నిల్చె సంతసముగ. 103

అనినఁ దాపసు లిట్టు లనిరి శేషాద్రి శ్రీ
డాద్రి వేంకటగిరి యనఁగ మూఁడు
నామధేయంబు లేమేమి కారణమునఁ
గల్గెను వినిపింపు గరుణ ననఁగ
విని సూతుఁ డిట్లనె మునులార మూఁడభి
ధానంబులే కావు పూని చెప్ప
ధరణి నొక్కొకనిమిత్తమున నొక్కొకపేరు
చెలఁగుచుండును శేషశిఖరి కెపుడు
గాన నాయాయివృత్తాంతగౌరవములఁ
జూచి భావించి నామదిఁ దోఁచినంత
వఱకుఁ జెప్పెద మీరలు వరుస వినుఁడు
ప్రీతిమెఱయంగ ననుచును సూతుఁడనియె. 104

చింతించినయర్థము లిపు
డెంతయు లేదనక జనుల కిచ్చుచునుండున్
సంతోషంబున గిరిపైఁ
జింతామణి యనఁగఁ బేరు చెలఁగెను జగతిన్ 105

జ్ఞానం బించుక గల్గిన
మానవు లయ్యద్రి నుండ మహితజ్ఞానం
బానాట వృద్ధిచెందును
దానన్ జ్ఞానాద్రియంచు ధరపే రొప్పెన్. 106

అర్థముఖము లగుగోర్కులు
సార్థకములుచేసి జనుల సంరక్షింపం

దీర్ఘాదు లుండ నయ్యది
తీర్థాచల మనఁగఁ బేరు దీపితమయ్యెన్. 107

క. నిష్కామతపోధనులకుఁ
బుష్కలముగ స్నానపానపూజ లొనర్పం
బుష్కరిణులు గల్గుటచేఁ
బుష్కరశైలం బనంగఁ బొలుపొందు ధరన్. 108

క. మును వృషభాసురుఁ డనియెడి
యనిమిషవైరుండు దానియం దుండి తపం
బొనరించిన కారణమునఁ
దనరారె వృషాద్రి యనఁగ ధరణీస్థలిలోన్. 109

క. అనిమిషులు సమ్ముదంబునఁ
గనునప్పుడు స్వర్ణమయముగా నగ్గిరి యు
ర్విని వెలయ దానికిం దగెఁ
గనకాచల మనఁగ మౌనిఘనులార యొగిన్. 110

క. నారాయణుఁ డనువిప్రుం
డాయూఢిగఁ దప మొనర్చి హరి మెప్పించెన్
ధారుణిఁ దత్కారణమున
నారాయణశైల మనఁగ నామం బలరెన్. 111

క. ఆవైకుంఠపురంబునఁ
బావన మైయుండుదాని పక్షీంద్రుఁడు తేఁ
గా వచ్చినకారణమున
శ్రీవైకుంఠాద్రి యనఁగఁ జెలువారె మహిన్. 112

క. నరసింహాఖ్యుం డాదైత్యుని
నురుకోపముతోడఁ జంపి యొగిఁ బ్రహ్లాదుం

గరుణం జూచినకతమున
నరసింహాగిరీంద్ర మనఁగ నామం బలరెన్. 113

అంజనాదేవితపము మున్నచటఁ జేసి
వడసె హనుమంతుఁ డను మేటికొడుకు నెమ్మి
నపుడు దేవతులెల్ల సహాయు లగుచు
నామ మిడి రర్వియం దంజనాద్రి యనఁగ. 114

మునుపు వరాహాసమూహము
లనిశము వర్తింప నందు హరి క్రోడంబై
యనువుగ నిల్చినకతమున
మునులార వరాహశైల మర్విం దనరెన్. 115

మును నీలుం డను పేరం
దనరినవానరుఁడు తపము దగఁ జేసెను దా
నినిబట్టి నీలగిరి యని
తనరారెను పేరు జగతిఁ దాపసులారా. 116

శ్రీకి నివాసంబై భూ
లోకంబున ననఘ భక్తలోకంబులకుం
బ్రాకటముగ హరి గన్పడ
శ్రీకరముగ నామ మొందె శ్రీగిరి యనఁగన్. 117

శ్రీసతి హరివైభవము
ల్లాసంబుగఁ జూడ నెంచి లలి నుండుటచే
భాసిలె శ్రీసతి గిరి యని
శ్రీసన్మునివర్యులార క్షితి మహిమారన్. 118

వేడుకమైఁ గమలాలయ
తోడం జేడియలఁ గూడి తుష్టి యొసంగం

గ్రీడించుటచే దానికిఁ
గ్రీడాచల మనఁగ నొప్పెఁ బృథ్వీస్థలిలోన్. 119

క. సరగున శ్రీవైకుంఠము
ధరణీస్థలి నిడఁగఁ దెచ్చి దైత్యారికిఁ దాఁ
బరమానంద మొనర్పఁగ
గరుడాచల మనఁగ నట్టికతమున నలరెన్ 120

క. శేషాకృతితోఁ జక్రి వి
శేషత్వము నొంది సర్వశేషిని దనపై
భూషణముగ నిడికొనుటను
శేషాచల మనఁగ భూప్రసిద్ధం బయ్యెన్ 121

ఆ. అరయఁగా వకార మమృతబీజము కట
ములును సంపదర్థముల నొసంగు
నట్టిమూఁడు గూడి యమృతసంపద లిచ్చు
నందుచేత వేంకటాద్రి యయ్యె. 122

వ. ఇవ్విధంబున నప్పర్వతంబునకుఁ గల్పభేదంబులవలన ననేక నామంబులు గలుగుచుండు నప్పర్వతమాహాత్మ్యం బింత యని వచింప నమరగురుచతురాననగుహావాసవాదులకుఁ దరంబు గాదు గావున. 123

తే. వినుఁడు మునులార శ్రీహరి వేడ్క నందు
దేవితోఁ గూడి యుత్తరదిశ వనంబు
నందు విహరించుచుండఁగ నతివిచిత్ర
ముగ మునీంద్రులు గొందఱు మొనసి యచట. 124

సీ. భార్యామణులతోడఁ బరమముదంబున
నయ్యత్రివసతియు నరసి యెలమిఁ

గంధమూలఫలాదికంబుల బహుపుష్ప
ములు తీర్థములు చూచి నిలచి సరవి
నాకుటిండ్లను గట్టి యందుండి ప్రీతిమై
నమలమంత్రాదుల నధ్వరంబుఁ
జేయుచుండఁగఁ జూచి సిరిని విలోకించి
హరి యిట్టు లనియె నోయబ్ధికన్య
తే. జనులు గనరానియమ్మహాస్థలికి వచ్చి
యజ్ఞమును జేయుమౌనీంద్రు లలరువిధము
చూడు మిచ్చట నని దయఁ జూపి మఱల
నిట్టు లనియెను సంతోష మినుమడింప. 125

హరి విటవేషధారి యగుట.

సీ. సతి చూడు మవి యజ్ఞశాల సదశ్శాల
లవిగాక యిటు చూడు మగ్నిశాల
సరవి హవిర్భాగశాల పత్నీశాల
యజమానశాల నీ వదిగో చూడు
మది మహానసగృహం బవి యజ్ఞపాత్రము
ల్పశుసుయూపస్తంభపంక్తు లవియ
వారె ఋత్విక్కులు వీర లధ్వర్యులు
సోమయాజితఁ డది సోమిదమ్మ
తే. చక్కఁగాఁ జూడుమిమ్మహాశ్రౌతకర్మ
చయములెల్లను నాయంద జననమొందెఁ
గాన సవనస్వరూపుఁడ నైననాకుఁ
బ్రీతిగా యజ్ఞములు బుధుల్సేయుచుంద్రు. 126

ఆ. వీరికర్మనిష్ఠ వేడుకగాఁ జూడ
వలయు నిపుడు యజ్ఞవాటమునకుఁ
బోయి వారు సేయుపుణ్యవహాయాగ
సరణిఁ జూచుటొప్పు చంద్రవదన. 127

ఉ. కావున వేశ్యచందమును గైకొను మీవు హొయ లొల్లెలం
గఁగా, నే విటకానికైవడిని నిక్కుచు సొక్కుచు వచ్చి
యచ్చటం, బావకకుండమందు వప భక్తిని బ్రాహ్మణు లుంచి
నప్పుడే, నావప నారగించెద బుధావళి మెచ్చఁగ నీవు
చూడఁగన్. 128

సీ. అన విని సిరి మందహాసాస్యయై కామ
రూపిణియై కుల్కుచూపు లెసఁగఁ
బరఁగఁ జందురుకావిపావడపైఁ జల్వ
జిలుగుబంగరుపూలచీర మెఱయ
ముత్యము ల్మకురము ల్ముద్దుముద్దుగఁ గూర్చ
రంగుమించినపట్టురవికె వెలుఁగఁ
గుచభారమున వడంకుచు నుండుమధ్యంబు
నొగి మేఖలాబంధ మొప్పుచుండఁ
తే. గనులఁ గాటుకగంధలేపనము మేన
నుదుటఁ గస్తూరితిలకంబు కుదురనీల
కుటిలకుంతళములు ముద్దుగొలుపఁ బైఁడి
బొమ్మవలె నొప్పె లక్ష్మి సంపూర్ణకళల. 129

సీ. బటువుముత్యములపాపటబొట్టు రాకడి
జడబిళ్ళలును గుచ్చు లడరి వెలుఁగ

బంగరుకడియము ల్పచ్చలచేకట్లు
రత్నాలవంకీ ల్కరముల వెలయ
మగతాలకమ్మలు పగడాలవేరులు
చెవుల గళంబునఁ జెన్నుమీఱ
వ్రేళ్లనుంగరములు వివిధకాంతులమీఱ
మీఁజేత గొలుసులు మెఱయుచుండ

తే. నాసికాగ్రంబున న్జిగినత్తు వెలుఁగఁ
జిఱుతగజ్జెలమొలనూలు చిందుద్రొక్క
ఘల్లుఘల్లని పదహంసకములు మొరయ
శ్రీవనిత విశ్వమోహినిదేవి యయ్యె. 130

క. క్రొక్కాఱుమెఱుపు లన్నియు
నొక్కెడ గుమిఁగూడి నిల్చి యున్నవిధముగాఁ
గ్రిక్కిఱిసి యద్భుతంబుగ
మిక్కుటమై యుండె లచ్చిమేనిమెఱుంగుల్. 131

క. కరమునఁ గమలము చేకొని
సురుచిరమగు తళుకుబెళుకుఁ జూపులతో నా
హరినొగిఁ జూడఁగ నాహరి
సిరిమోముం జూచి నగుచుఁ జెలఁగుచు నంతన్ 132

సీ. ఆకామినీమణి కనురూపముగఁ జక్రి
చక్కని మనుజవేషంబు దాల్చె
నది యెట్టు లన్న నీలాంబుదవర్ణుండు
నాజానుబాహుఁ డాహ్లాదముఖుఁడు
నీలకుంతలయుక్తబాలేందుఫాలుండు
కంబుకంఠుండు మంగళకరుండు

నీరజాక్షుండు గంభీరవక్షుఁడు సింహ
మధ్యుండు మన్మథమన్మథుండు
తే. లలితసౌందర్యవిలసితోల్లాసకలిత
మందహాసితాననుండు నిర్మలప్రవర్త
నములుగలవాఁడు శృంగారనయప్రియోక్తు
లాడువాఁడుగ విటుఁడయ్యె హరిగనంగ.

సీ. కనకపుష్పముల నొప్పిన గుసుంబాపాగ
రాణింపఁ గల్కితురాయి మెఱయ
బొండుమల్లియపూలదండలు భుజముపై
నొఱపుగ మెఱయుచు నూగియాడఁ
జల్వచేసిన పైడిసరిగంచు దోవతి
చుంగు లొప్పుచు మేనిసొగసు చూపఁ
బరిమళగంధలేపనవక్షమున నాణి
ముత్యాలహారము ల్మచ్చటింప
తే. నవ్యమౌక్తికస్వర్ణరత్నాంచిత మగు
కర్ణభూషణములు దివ్యకాంతు లెసఁగ
పరమకౌశేయమధ్యము బాగుమీఱ
ముద్దుటుంగరములు వ్రేళ్ల మురియుచుండ. 13

సీ. విలసితభ్రూలతావిక్షేపణంబు లా
యనిమిషపతిధనస్సును జయింప
నుదుటిగందపుఁజుక్క కదసి నీలాభ్రము
నొఱయు పూర్ణశశాంకు నెఱి హసింప
దంతాళికాంతి వింతగ వజ్రములపంక్తి
దీధితులను మించి ధిక్కరింపఁ

గర్పూరతాంబూలకలితాధరప్రబింబ
ఫలరక్తిమం జూచి పరిహసింప
తే. మఱియు నాసాగ్రమునఁనొప్పు మౌక్తికమున
కిరుకెలంకులకాంతుల నెనసి సొగసుఁ
దనరఁగా మీసఁగట్టుసొందంబు చూపఁ
జెక్కుటద్దములొలుప్ప రంజిల్లుచుండ. 135

సీ. మేఘంబుపై వెల్గు మెఱుపుఁదీఁగలువలెఁ
దగిన బంగరుజన్నిదములు మెఱయ
నుంగరంబులకాంతు లొప్పెడు కుడిచేత
నొకలీలగాఁ గత్తియొఱపు నెగడ
శరణాగతత్రాణబిరుదంబు లనఁదగు
నందియ ల్పాదంబులందు మొరయ
వామహస్తంబున వరరత్నమయచాప
మొగిఁ దళుకొత్తంగ నుల్లమలర
తే. విటునివలె హరి సొగసుగ వేసమెసఁగఁ
దాల్చి విటకత్తెవలెనుండు తరుణిఁ గూడి
పాదుకల మెట్టికొంచు నా ప్రథిత యజ్ఞ
వాటిఁ జేరంగఁ జూచుచు వచ్చుచుండె. 136

సీ. ఆచక్రి నీక్షించి యాగార్ఘ్యులప్పు డితఁ
డెవ్వఁడో యని గని యిట్టు లనిరి
వనితామణిం గూడి వచ్చుచుండెడివాఁడు
మహిమ నొప్పు వసంతమాధవుండొ
నలుఁడొ జయంతుఁడొ నలకూబరుండొ సు
రేంద్రుఁడొ చంద్రుఁడొ యీశ్వరుండొ

యీమహాటవి కిప్పు డేల విచ్చేసిరో
వీరిదేహసుకాంతు లారయంగ
తే. దిక్కులెల్లను వ్యాపించెఁ దెలియఁ జూడ
విప్రుఁ డగుటకు యజ్ఞోపవీతచిహ్న
మమరియున్నది క్షత్రియుం డగుట కెడమ
చేత విల్లున్న దటుగాక చెల్వు చూడ. 137
వ. విటునికైవడి వేశ్యాంగనామణితోడం గూడి యున్నవాఁ
డనుకొను చుండుసమయంబున. 138
ఆ. వేడ్కమీఱఁగాను విప్రులు చూడంగ
వచ్చి చక్రి యజ్ఞవాటిలోనఁ
జేరి ద్విజుల నడుమ సిరితోడఁ గూర్చుండి
విడెము సేయుచుండె వేడబమున. 139
క. అప్పుడు వారల నొడలం
దొప్పెడు కస్తూరిగంధ మూర్వీసురులం
గప్పుకొనంగ నొగి న్వా
రప్పద్మదళాక్షుఁ జూచి యని రీరీతిన్. 140
సీ. ఓమహారాజ నీయూరేది పేరేమి
యెవరు నీతలిదండ్రు లిచటి కేల
వచ్చితి విప్పు డీవనమున సవనము
ల్సేయుచుండెదము నీచిత్తమునను
మామీఁద దయ యుంచి మామఖంబులకు స
హాయుఁడ వై యుండి యసురవేధ
చోరబాధయు మృగస్తోమంబుచే వేధ
దప్పించు మావంటిదాపసులకు

తే. వసుమతీశ్వరు లెప్డు కావలియు ననెడు
ధర్మపద్ధతి దప్ప కధ్వరము లిచట
నీవు సేయించు మాచేత నిర్మలాత్మ
యనినఁ జిఱు యిట్లనియెఁ జూచి. 141

సీ. రాజును గాను ధరాపురుండను గాను
కడకు వైశ్యుఁడను శూద్రుఁడను గాను
తల్లితండ్రులు లేరు ధరణి నాకొక్కని
వాసంబు లేదు సర్వస్థలముల
సర్వస్వరూపుఁడై చరియించు చుండుదు
నగుణుండ నామవర్ణాశ్రమములు
లేవని పల్కఁగా నావిప్రు లిట్లని
రయ్య మీవాక్కుల కర్థ మిపుడు

తే. మాకుఁ దోఁపదు నీచెంత మచ్చికలర
నిపుడు కూర్చున్న లలితాంగి యెవతె యనిన
మందహాసితాస్యుఁడగుచు నమ్మాధవుండు
పల్కె నిట్లని వారితోఁ బ్రౌఢి మెఱయ. 142

ఆ. నాకు నేన కాని నాకెవ్వరును లేరు
చూడ నొంటివాఁడఁ జూచి నన్ను
వనమునందుఁ బుట్టి వచ్చె మోహినివలెఁ
బట్టె నిది ప్రియంబు వఱల మునులు. 143

క. మచ్చికతో నిరువురు కడు
ముచ్చటగాఁ గలసియుండి మును లగుమీా రిం
దచ్చుగ నుండుటఁ గనుఁగొని
వచ్చితి మిటు మిమ్ముఁ జూడ వరమునులారా. 144

సీ. ఇచ్చోట మీఅంద తేమేమొ చేసి సం
గీతము ల్పాడెడురీతు లేమి
యౌదుంబరపుశాఖ లమరంగఁ జేఁబట్టి
వేత్త్వేర విప్రులఁ బిల్చు టేమి
యీయగ్నికుండ మే మీదారుపాత్రలే
మీపశుహింస యే మిన్ని మీరు
మాకుఁ జెప్పుఁ డటన్న నాకర్మనిష్ఠు లి
ట్లనిరి వపాయాగ మాచరింప
తే. సమయ మిదిగాన వేదోక్తశాస్త్రవిహిత
మగువపాయాగ మొనరించి యవల మీరు
మమ్ము నడిగినదెల్ల సమ్మదములీలఁ
జెప్పెదము వీను లాలింప నిప్పు డుండు. 145
తే. అనుచు వచియించి యాగాధ్వ్యులందు హరిని
నాత్మనెంచుచు నావపాయాగ మెలమిఁ
జేయుసమయాన శంఖచక్రాయుధములు
దాల్చి యందఱుచూడంగ దనుజహరుఁడు. 146
వ. సముల్లాసంబుగ నవ్వపను గ్రహించి తనచిహ్నము లెఱింగించి.
చ. హరి పరమాత్ముఁ డచ్యుతుఁ డనంతుఁడు నిర్జరులెల్లఁ జూ
డఁగాఁ, గరముల నంది యావపను గ్రక్కున మెక్కఁగ
సంయమిశ్వరుల్, వరుసఁగ నందుఁ జిత్తరువు వ్రాసినబొమ్మల
రీతి భక్తిచేఁ, బరవశు లై రమేశుఁ డగుపద్మదళాక్షుని
జూచుచుండఁగన్. 148
వ. నారాయణుండు శ్రీవత్సలాంఛనాంచిత విశాలవక్షుండును
సదమలరత్నాభరణభూషితుండును కౌశేయపరిధానుం

డును సహస్రమార్తాండప్రభాభాసితుండును వపాపరిమళ మిళితాధరుండును గరుణాకటాక్షవీక్షితుండును నగు హరి మునీంద్రులం జూచి మీ నేయుజన్నంబున నత్యంతతృప్తి నొందితి నని పల్కి మోహినీరూపిణి యగునిందిరాదేవిం గూడి తిరోధానంబునొందె. ననంతర మమ్మునిపుంగవులు పరమానందవిస్మితాంతరంగు లై హరివేడబంబునకుఁ గొం డొకతడవు హరిం బ్రార్థించి కృతార్థుల మైతి మనుచు జన్నంబు పరిపూర్తిచేసి యవభృథస్నానం బొనర్చి రని సూతుం డువెండియు మునుల కిట్లనియె. 149

మ. మును జాబాలిమునీంద్రుఁ డీకథను సమ్మోదంబుతో నాకుఁ
జెప్పెను నే నట్లుగ మీకుఁ జెప్పితిని సంప్రీతిగా రమేశుండు
చేసిన దిలొక్కటి చెప్పెదం గథ మహాచిత్రంబుగా మీరు
మున్వినినట్లే యని శౌనకాదులు విన న్వేడ్కం దగం
దత్కథన్. 150

వ. వినిపింపఁ దొడంగె, నంత శ్రీహరి తద్గిరి కుత్తరభాగ మందార వట వకుళ చందన పిచుమంద జంబు జంబీరాద్యనేక తరుబృందశోభితారణ్యాంతరంబున విహరించు చుండుసమ యంబున నొక్కదినంబున. 151

## కుమారధారమహిమ.

సీ. దేశాంతరాగతద్విజుఁడు వృద్ధవయస్కుఁ
డత్యంతబలహీనుఁ డతనిసుతుఁడు
కౌండిన్యుఁ డనువానిఁ గానక యందందుఁ
దడవుచు వచ్చి దా దారి దప్పి

ఘనవేంకటాద్రిమార్గంబునం జని మహా
 రణ్యంబునం గుమారా యటంచు
పిలుచుచు నేడ్చు చాకలి దప్పి మించుటం
 జేసి నేలం బడి చెవులు మూసి
తే. కొనియు నప్పుడు గూడ నోకొడుక యెందుఁ
బోతివి యటంచుఁ బలువిధంబులుగ దుఃఖ
పడుచుఁ బేర్కొనుచుండఁగ భవ్యమూర్తి
యిందిరేశుండు చని దయాహృదయుఁ డగుచు. 152
తే. వృద్ధవిప్రుఁడ యియ్యుగ్రవిపినభూమి
కేల వచ్చితి జగమున నింకఁ గొన్ని
దినము లుండెదవో లేక దేహ మిచట
విడిచెదో దెల్పు మేడ్వకు జడియ వలదు. 153
క. అన విని విప్రుం డిట్లనె
ననఘ శరీరంబుమీఁద నాసక్తియు లే
దనిమిషుల ఋణము దీర్పక
చనుటె ట్లనుసందియంబు జనియించె ననెన్ 154
క. ఆవార్తలు విని మాధవుఁ
డావిప్రునికరము వట్టి యచ్చట గల యా
పావనతీర్థమునందునఁ
గావించెను స్నాన మపుడు కరుణాత్ముండై. 155
వ. అట్లు స్నానం బొనరించుటంజేసి యావృద్ధవిప్రుండు పదియా
ఱేండ్లబాలకుమారుండై, షోడశకళాపరిపూర్ణుండై మ్రోల
నిలిచియుండు శ్రీహరిం జూచి వందనంబు లాచరించుటంజేసి
యద్దేవుండు సహస్రాక్షుండును, సహస్రపాదుండును,

సహస్రశీర్షుండును, సహస్రబాహుండును నై, నిజస్వరూపం బక్కుమారవిప్రునకుం జూపుటంజేసి గగనంబుననుండి దేవేంద్రాదులు దేవదుందుభులు మొరయించిరి శీర్షంబునఁ బుష్పవృష్టి గురియించిరి పలువిధంబుల నుతించి రప్పు డవ్విశ్వరూపుం డగుచక్రి యవ్విప్రుం జూచి యో భూసుర కుమారా! యిజ్జగంబున ధనధాన్యసమృద్ధితో నీక దేవ ఋణంబు దీర్చుటకు నాశ్రమంబునకుం జని యాగంబు నేయు మని యానతిచ్చి యతనికుమారుం డగుకౌండిన్యుని యున్కి నెఱింగించి యంతర్ధానంబు నొందె నంత నవ్విప్ర పుంగవుం డత్యంతానందసుధాంబుధి నోలలాడుచు హరిం గొనియాడుచుఁ దనయెడకుం జనియెఁ దత్కారణంబున నందుండు ధారాతీర్థంబునకుఁ గుమారధారాతీర్థం బనం బరగె. మఱియు నాకుమారధారాతీర్థంబునఁ ద్రికాల స్నానం బాచరించినవారికి నరోగదృఢకాయంబును, నవృద్ధత్వంబును, సకలసౌభాగ్యపుత్రావాప్తియు నగు నని యమరులు నిర్ణయించి నిజస్థానంబుల కేగిరంచు జాబాలి నాకిక్కథ వక్కాణించుటంజేసి చెప్పితినని వెండియు నిట్లనియె. 156

**సీసమాలిక.**

వాల్మీకి నాకుఁ బూర్వచరిత్ర మొక్కండు
చెప్పె దానిని వినుఁడొప్పుగాను
చంద్రవంశజుఁ డైన శంఖణుఁ డనురాజు
కాలవశంబున బేల యగుచుఁ
దనశత్రువుల కొగిఁ దనరాజ్యమును గోలు
పోయి రామేశ్వరంబునకుఁ జేరి

యట రామసేతువునందుఁ గ్రుంకి మఱింది
ముదమునఁ గొన్నాళ్లు వదలకుండి
వచ్చుచు మార్గాన వరశంఖమునిగిరి
పై నుండి వచ్చెడు బావన మగు
శ్రీసువర్ణముఖరిఁ జెలఁగి స్నానముఁ జేసి
దానికు త్తరముగఁ దరలి వచ్చి
దానవాంతకగిరి దరినుండు జంబుజం
బీరగాలవచిరిబిల్వవకుళ
పాదపచయముచేఁ బరిశోభితం బగు
భూమియం దొక్కెడఁ బొదలుచుండు
తే. కమలకల్హారపుండరీకాదిపుష్ప
శోభితం బగుసరసిలో సుఖముగాను
స్నానమును జేసి యాతీరసాలమూల
మునఁ దగంజేరి యివ్విధంబునఁ దలంచె. 157
చ. కటకట శాత్రవు ల్గినిసి కయ్య మొనర్చి మదీయమండలం
బటువలె నాక్రమించి రిపుడన్నము వస్త్రము గల్గు టెట్లు నే
నెటువలె నోర్తు కష్టమున కీశ్వరుఁ డీగతిచేసె నింక మీఁ
దటిగతి యేమటంచుఁ బరితాపముతో విపులార్తిఁబొందుచున్.
వ. దేవుని మనంబున నెంచుచు దేహంబు పరవశత్వంబు నొందుటం
జేసి యాసమయంబున నశరీరవాణి యిట్లనియె. 159
తే. నిర్మలాత్ముఁడ మదియందు నీవు ధైర్య
మొందు చింతింప కిచటికి ను త్తరముగఁ
గ్రోశదూరాన వేంకటవసుధరమున్న
దటకు నరుగుము భక్తితో నార్తి తొలఁగు. 160

వ. మఱియు నప్పావనపర్వతంబు మహాపన్నులకుఁ గామధేనువు చందంబున నత్యంత శోకార్తులకుఁ గల్పవృక్షంబునై వడిఁ జింతితార్థంబు లిచ్చుచుఁ జింతామణి నామంబునం బ్రకాశించు నందు నిర్హేతుకజాయమానకటాక్షవీక్షణుం సకలజనార్తి నివారకుండై మనోభీష్టదాయకుండై శ్రీహరి సంపూర్ణకళాన్వితుం డగుచు నిరంతరానందనిలయనివాసుఁడై యుండు నందు శ్రీస్వామిపుష్కరిణి సకలాఘనిచయ నివారిణియై యుండు తత్పశ్చిమతటంబున వాల్మీకిమునిభూధరంబుండు నందు నిల్చి మూడుకాలంబుల నాపుష్కరిణి శుభోదకంబునఁ గ్రుంకులిడి షణ్మాసంబులు విజితేంద్రియుండవై శ్రీమద్వేంకటనాథునివిధివిహితంబుగ షోడశోపచారపూజలు సమర్పించుచుండు మనంతర మాస్వామి కరుణార్ద్రహృదయుండై ప్రసన్నంబయి నీయభీష్టం బొసంగునని పల్కుచుండు నశరీర వాక్కులు విని సంతోషాయత్తచిత్తుండై యావేంకటాచలారోహణంబు చేయుచు వివిధఫలపుష్పతరులతాశోభితంబును నానావనచర చమరీ భల్లూక సారంగాది మృగావాసంబును శుక కలకంఠ మయూరవిహంగాదిమనోహరకూజితకలితంబును నవరత్నమయతపనీయప్రకాశితంబగు సానుప్రదేశంబులును నగు వేంకటాద్రి నెక్కి తన్మధ్యంబునఁ బావనపరిమళోదక పూర్ణంబును కమలకల్హారనీలోత్పలకైరవకుసుమోపేతంబును నిరంతరసంగీత సంకాశభృంగసందోహఝంకారమనోజ్ఞంబును కమఠమీనగ్రాహప్రముఖసంకులంబును నగు స్వామిపుష్కరిణి సందర్శనంబుచేసి తత్తీర్థంబున ననుపమభక్తి సంకల్పపూర్వకంబుగ స్నానంబొనర్చి యశరీరవాణిపల్కినయట్ల షణ్మాసం

బులు శ్రీమద్వేంకటాచలనివాసుని ధ్యానంబు చేయుచుండె ననంతరంబు. 161

శంఖణరాజుకు వేంకటాచలపతి ప్రత్యక్షంబగుట.

సీ. హారకుండలకిరీటాదిభూషణభర్మ
చేలకాంతులఁ బ్రకాశించువాఁడు
తులసీసుదళపరిమళపుష్పహారవి
రాజితసూత్రోదరంబువాఁడు
తిలకాంతనిటలప్రదేశమందు నటించు
కమనీయకుటిలాలకములవాఁడు
శ్రీవత్సకౌస్తుభచిహ్నము ల్గలవాఁడు
కరుణ నొప్పిన గొప్పకనులవాఁడు
తే. శంఖచక్రగదాబ్జహస్తములవాఁడు
సరవిలక్ష్మినిఁ జెలఁగు వక్షంబువాఁడు
భూమినీళలఁ గెలఁకులఁ బొల్చువాఁడు
దీనజనపాలుఁ డఖిలైకదేవుఁ డపుడు. 162

వ. రవికోటిప్రకాశ సదృశ దివ్యవిమాన మధ్యప్రదేశమునం దుండి స్వామిపుష్కరిణిమధ్యంబున నిలిచి శంఖణమహారాజుకుఁ బ్రత్యక్షంబుగాఁగ నయ్యెడ బ్రహ్మరుద్రేంద్రప్రముఖులు వచ్చి భేరిమృదంగాదిమంగళవాద్యంబులు మ్రోయ పుష్పవృష్టి గురియించి నృత్తగీతంబులు గావించి నిగమాంత సూక్తంబుల సన్నుతించుచుండె నంత శంఖణమహారాజు ప్రసన్నుం డైనశ్రీహరికి సాష్టాంగదండప్రణామంబు లాచరించి కరంబులు మోడ్చి సద్భక్తి మెఱయ నిట్లనియె. 163

సీ. దేవదేవమహాత్మ దీనరక్షక జగ
న్నాథ సత్కరుణతో నన్నుఁ జూడు
మునుపు మాపూర్వుల కొనర మీ రిచ్చిన
పృథ్వి శాత్రవుల కొప్పించి వచ్చి
యతిదీనదశ నొందినట్టి నా కిప్పుడు
ప్రత్యక్ష మైతివి పరమపురుష
నాశత్రువులఁ ద్రుంచి నారాజ్య మిప్పించు
మనిన శ్రీహరి శంఖునికి ననియెఁ

తే. జింత విడువుము రాజ నీసీమఁ జేరి
పట్టభద్రుఁడ వైయుండు భార్యతోడ
ననుచు నభయంబొసంగి చక్రాయుధుండు
తగ సురల్మెచ్చి గనఁ దిరోధానుఁడయ్యె. 164

తే. అప్పు డాబ్రహ్మముఖ్యులు హరి నుతించి
స్వామిపుష్కరిణీస్నానసత్ఫలంబు
పొగడ శక్యంబె యనుచు నాభూరమణుని
భక్తికి న్మెచ్చి చేరిరి భాగ్య మనుచు. 165

ఆ. శంఖుండు భక్తి స్వామిపుష్కరిణికి
మ్రొక్కి శైలమునకు మ్రొక్కి హరికి
మ్రొక్కి భార్యతోడ ముదమున గిరి డిగ్గి
పోవుచుండ నతని భూమియందు. 166

క. విమలుం డగుశంఖరిపు
లమితాశనురాజ్య మేల నన్యోన్యవిరో
ధము లెసఁగఁ బోరి మడిసిరి
క్రమముగ నమ్మహికి రాజు గావలె నంచున్ 167

వ. తద్దేశవాసులు రాజును వెదకుచు వచ్చుచుండ దారియందు శంఖణమహారా జగుపడుటంజేసి యాతనికి దండంబులిడి శత్రునాశనవృత్తాంతంబంతయు నెఱింగింప సంతసించి శ్రీవేంకటాద్రీశ్వరుం గొనియాడుచుఁ గొంతవడికి నవ్వారలకుఁ దాఁ జనినపుణ్యక్షేత్రమహిమాతిశయాదులు కర్ణామృతంబుగ నుడివి వారితో నిజదేశం బగుకాంభోజదేశంబున కరిగి తొల్లింటివలె రాజ్యపాలనంబు సేయుచుండె నిదియునుంగాక మఱియొకయితిహాసంబు చెప్పెద నాలకింపుఁ డని మునులకు సూతుండి ట్లనియె. 168

## ఆత్మారాముఁ డనువిప్రునిచరిత్రము.

సీ. మధ్యరాష్ట్రమున నాత్మారాముఁ డనెడుస
 ద్బ్రాహ్మణుం డనఘుండు వందితుండు
దేవ భూసురపూజ లేవేళఁ జేయుచు
 విహితధర్మజ్ఞుఁ డై వెలయుచుండు
నతఁడు పిత్రార్జితార్థాదు లించుకయేని
 లేకుండునట్లుగ లేమి గల్గఁ
గా దీనుఁ డై పెక్కుకష్టంబు లొదవుటం
 జేసి పల్విధముల చింతపడుచు
తే. నిల్లు విడనాడి శ్రీవేంకటేశుఁ డుండు
పర్వతశ్రేష్ఠమున కధోభాగమునను
దనరుచుండెడు కపిలతీర్థంబుచెంతఁ
జేరి స్నానంబు సేసి తత్తీరమునను. 169

క. కపిలేశుని సన్నిధిఁ దా
నపు డాన్హికనిష్ఠ నుండి యట లేచి మహా

విపినములోనికిఁ జొరఁబడి
చపలత నొకత్రోవఁ బోయి శైలం బెక్కెన్. 170

వ. తన్మార్గంబునఁ గపిలతీర్థప్రముఖ సప్తతీర్థంబులయందు స్నానం బొనర్చి నిర్మల చిత్తుం డై పర్వతారోహణంబు చేయుచుండి యొక్కెడ గుహాంతరంబున ననుపమాన ధ్యానయోగ నిష్ఠుఁడై యుండు సనత్కుమారు సన్నిధానంబు చేరి ప్రణమిల్లి నిలిచి ముకుళితకరయుగళుం డై యిట్లు నుతించె. 171

క. తాపసకులాబ్ధిచంద్రా
పాపాత్ముఁడ నైన నన్నుఁ బరమకృపాత్ముం
డై పరిభవిల్లఁ గావుము
నీపదములు గతియ నాకు నిర్మలహృదయా. 172

క. దారిద్ర్యముచేతను సం
సారంబును విడిచి వచ్చి సరవిగ నెట్లో
చేరితి నాకష్టంబు ని
వారించి సుఖం బొసంగు వరయోగీంద్రా! 173

మ. అనినం దాపసవర్యుఁ డిట్లనియె నీ కాయాస మింకేల చే
సినపాపంబు నశించుకాల మిదె వచ్చెం బాప మేదంటివా
విను జన్మాంతరమందు మాధవుని సేవింపం బ్రయత్నింప కుం
డినదేగాక బుధాళి దూఱుటయుఁ బాటిం జూపి గర్వంబు
నన్. 174

ఆ. దాన మిచ్చువారి దానంబుఁ గొనువారి
ననుసరించి యొకరియం దొకరికిఁ
గసరు పుట్టునట్లు గల్లమాటలు నీవు
చెప్పి దానహాని చేసినావు. 175

క. ఆచారవిహీనుఁడవై
యేచోటనఁ గాని గుడిచి యెచ్చుగుజనులం
జూచి హసించుచు నుంటివి
దాఁచితి వర్థంబు కరుణ దాన మొకరికిన్. 176

ఆ. ఈకయుంటఁ జేసి యెసఁగిన పాపంబు
కపిలతీర్థమునను గడుముదమున
మునిఁగినపుడ తొలఁగె మొనసి నీకిఁక లక్ష్మి
కరుణ నెవ్విధంబుఁ గల్గు ననఁగ. 177

క. వ్యూహమహాలక్ష్మి సదా
శ్రీహరివక్షస్స్థలమునఁ జిరభూషణ మై
మాహాత్మ్యముతో నెలకొని
బాహుళ్యము నెగడ సిరుల భక్తుల కిచ్చున్. 178

సీ. ఆ వ్యూహలక్ష్మివృత్తాంతంబు విను దయా
లోలతరంగాక్షి లోకమాత
పూర్ణచంద్రనిభాస్య పురుషోత్తమునిప్రియ
పద్మనివాసిని పద్మపాణి
వ్యూహభేదములచే నొనరి మహాలక్ష్మి
యనఁ గీర్తి యన జయ యనఁగఁ దనరుఁ
గారుణ్యసాగర కమనీయమంగళ
విగ్రహసజ్జనవినుతపాత్ర

తే. విను మనాయాసముగ భక్తవితతి సేయు
పాపనిచయం బడంచి సంపద లొసంగు
నమ్మహాదేవి మంత్రమే నాప్తముగను
జెప్పెదను నీవు సద్భక్తిచే జపించు. 179

వ. అని వచించి యంగన్యాసాదిపూర్వకంబుగ లక్ష్మీమంత్రం
బుపదేశించి ధ్యానంబు సాంగంబుగఁ జెప్పి శ్రీహరి భవదీయా
భీష్టం బొసంగు వేంకటాచలంబున కరుగు మని యానతిచ్చె,
నంత నాత్మారాముం డానందబాష్పకలిత నేత్రుం డై తద్గు
రుధ్యానంబు చేసి లక్ష్మీమంత్రంబు జపంబు సేయుచు నాకాశ
గంగ భూమికి దిగివచ్చు చందంబున విరజానదికై వడిఁ బరమ
పావనంబు లైన తీర్థంబులు శైలాగ్రంబుల నుండి ప్రవహిం
చుచు భూమికి దిగివచ్చుచుండుటం జూచి సంతసించుచుఁ
గృత స్నానుం డై పర్వతారోహణంబు చేసి స్వామిపుష్క
రిణియందు నఘచయంబు తలంగ స్నానం బొనర్చి హరిధ్యా
నంబు చేయుచున్న సమయంబున. 180

సీ. ప్రాకారపంక్తులు బహుమంటపంబులు
వివిధోరుకల్యాణవేదికలును
సదమలత ప్తకాంచననిర్మితంబు లై
కొమరారుచున్నట్టిగోపురములు
వరనీలముక్తికవ్రజచప్పరంబులు
రమణసౌధాట్టాలకములు బాల
భానుకోటిప్రభాభాసమానసురత్న
సహితంబు లగుసభాస్తంభములును
తే. గలిగి గంధర్వనగరసంకాశ మగుచు
విధిశివేంద్రాదిసిద్ధసేవితము నగుచు
గీతనర్తనవాద్యసంకీర్ణ మగుచు
నమరు నొకదివ్యధామమధ్యమున నుండి. 181

సీ. కుండలాంగదరత్నకోటీరకౌస్తుభ
ముఖభూషణము లంగముల వెలుంగ
నురమునం దరుదుగా వ్యూహలక్ష్మి యెసంగ
శతకోటిమన్మథసదృశుం డగుచు
రమణీయ కనకాంబరమ్ముల చెంగుల్లు జారం
బరిమళగంధ లేపనము మెఱయ
నీలకాంతుల నొప్పు నిటలాలకంబులు
బాలభృంగావళిపగిది వఱల
తే. నపుడు భూ నీళ లిరుగడలందుం జెలంగం
బుండరీకాక్షుం డందున్న భూసురునకు
దయను బ్రత్యక్షమయ్యె నత్తఱిని విప్రుం
డలర సాష్టాంగదండంబు లాచరించి. 182

వ. అనేకవిధంబులం బ్రస్తుతించి యేమియుం దోంచక గద్గదకంఠుం డయి యనిమిషదృష్టిం జూచు చున్న నాత్మారామునిం గని దయార్ద్రహృదయుం డై హరి యిట్లనియె. 183

తే. నీకు భయ మేల వ్యూహలక్ష్మీకటాక్ష
మిపుడు నీయందుం బొందిన దింకమీంద
నాయురారోగ్య మైశ్వర్య మమర నీకుం
గల్గు సుజ్ఞాననిష్ఠయుం గల్గు విప్ర. 184

సీ. అని పల్కి మాధవుం డాబ్రాహ్మణున కప్పు
డభయం బొసంగె బ్రహ్మాదిసురలు
తగ నుతింపంగం దిరోధానంబు నొందె న
య్యవనీసురుండు భయంబు వాసి

యిపు డానతిచ్చిన యీశ్వరుఁ డిందుండి
యెటువోయె మఱి యాతఁ డీశ్వరుండొ
కాఁడొ నేఁ జూచుట కల్లయో నిక్కమో
గలఁగంటినో యని కలవరమునఁ
తే. గొంతసే పుండి యవల సద్గురునికృపను
హరి వరము లిచ్చినది నిక్కమంచుఁ దలఁచి
నమ్మి గిరి డిగ్గి తనమందిరమ్ము సేరి
సిరుల నొప్పుచు దానము ల్సేయుచుండె. 185
క. ఈకథ పూర్వము శ్రీవా
ల్మీకిమునీంద్రుండు పోడిమిం జెప్పె నొగిన్
శ్రీకర మగు వినుమని నే
నాకైవడి మీకుఁ జెప్పితిని ముదమొప్పన్ 186
చ. అనిన వరాహపర్వతమహత్త్వము చక్కఁగ నీవు దెల్పఁగా
వినుటకు మాకు నెల్లరకు వేడుక పుట్టెనుగాన మానసం
బునవొకయింత కోపమును బొందక చెప్పుమటంచు మౌను ల
త్యనఘుని సూతుఁ జూచి యనిరందఱు ప్రీతియెసంగ వెండి
యున్. 187
వ. అనిరి సూతా! యమ్మహాగిరియందుఁ బదియేడు తీర్థంబు లున్న
వని చెప్పితి వయ్యవి వరుసగ విశదీకరింపవలయు ననిన
నమ్మునులం జూచి సూతుండు హరితేజోవిరాజమానుం డగు
కర్దమమునికి సుతుం డగుకపిలుండు తొల్లి. 188
శా. ఆపాతాళమునందు సాంఖ్యవరయోగాభ్యాసముం జేయు
చుం, జాపల్యంబు నడంచి నిర్మలమహోత్సాహంబుతో లింగ
ముఁ, శ్రీ పెంపొందఁగ నిల్పి యర్చనము తాఁ జేయంగ

నాలింగముఁ, వ్యాపించెం ద్రిజగంబులందు సుకృతవ్యా
మోహ మై శ్రేయమై. 189

వ. ఆలింగంబు నిర్జరప్రకరంబులచేతను సజ్జనంబులచేతం బూజ
గొనంబడిన కారణంబునఁ గపిలలింగంబని ప్రసిద్ధంబయ్యె.

ఆ. సగరనందనులకు సద్గతి నొసఁగి యిం
దున్న భోగవతి మహోన్నతముగ
వేగ లింగమూర్తి వెంటనె ధాత్రి భే
దించి వచ్చి కపిలతీర్థ మనఁగ. 191

క. ప్రవహించి సకలజనముల
భవతాప మడంచి లోకపావని యయ్యెన్
భువి నాఁటఁ గోలె భక్తిఁగ
నవగాహముసేయుచుందు రమరులు మనుజుల్. 192

సీ. కపిలతీర్థమునఁ జక్కఁగఁ జక్రతీర్థంబు
ప్రవహించు మును దేవపతి యహల్య
నెంచిన యఘము పీడించుటం జేసి యా
జలమున స్నానంబు సల్పె మఱియుఁ
దదుపరిభాగానఁ దనరు విష్వక్సేన
తీర్థంబు సుకృతవృద్ధియు నెసంగి
ప్రవహించుచుండు పూర్వము వరుణాత్మజుం
డైనవిష్వక్సేనుఁ డచటఁ దపము

తే. సలుపఁగా మెచ్చి హరి వచ్చి శంఖచక్ర
యుగళ మపుడిచ్చి పరివారయూథములకుఁ
గర్తగాఁ జేసినందున క్ష్మాతలమున
నతని పేరన నాతీర్థ మలరుచుండు. 193

క. పంచాయుధతీర్థములు స
మంచితముగ దానిపైని నలరారును దీ
పించు ఘనానలతీర్థము
మించి తదూర్ధ్వంబునందు మేలిడ నద్రిన్ 194

ఆ. పరఁగ దాని కుపరి బ్రహ్మతీర్థము మహా
పాతకము లడంచి ప్రజల కెల్లఁ
బుణ్యఫల మొసంగు బొసఁగ నద్దానిపై
మునుల తీర్థములును దనరు నేడు. 195

ఆ. ఒండుకంటె నొండు నిం డుత్తమఫలంబు
తీర్థములకు మహిమ తేజరిల్లు
నింత నొప్పుచుండు నెఱిఁగి బ్రహ్మాదులు
చెప్పలేరు నేను జెప్పఁ గలనె? 196

క. సరవిగ నింకొకచరితం
బరుదుగఁ జెప్పెదను దొల్లి యవనీసురుఁ డొ
క్కరుఁ డెలమిఁ దీర్థములఁ దా
వరుసఁగ జూడంగ నెంచి వచ్చుచు నుండన్. 197

సీ. మార్గాన నొకతియ్యమావిచెట్టండకుఁ
జేరి తచ్ఛాయను దారిశ్రమము
వాయంగ నిద్రింప స్వప్నములో హరి
వచ్చి యిట్లనె విప్రవర్య వినుము
అదె చూడు మీపుష్కరాద్రిసమీపము
నందు దా నభయప్రదాఘచయము
వానెడు తీర్థాలు పదియేడు గల వందు
స్నానం బొనర్చినచో నిజముగ

తే. సకలపాపహారం బయి సంతతార్థ
ములును బొందెదు మఱి చింత తొలఁగు నీకు
ననఁగ నావిప్రుఁ డాశ్చర్య మంది నిద్ర
మేలుకొని యిట్లు తలపోసె మెచ్చుకొనుచు. 198

తే. తలఁచె నిమ్మెయి శ్రీరమాధవుఁడు స్వప్న
మున వచించినగతి నిప్డు పుష్కరాద్రి
జేరి తీర్థంబులను గ్రుంకి కోరినట్టి
కోర్కె లెల్లను బొందెదఁ గుతలముననె. 199

వ. అని యెంచి కపిలతీర్థాది సప్తదశతీర్థంబులయందు విధిప్రకా
రంబుల స్నానంబు సేసి సకలాభీష్టంబు లొందె నని వెండియు
సూతుం డిట్లనియె 200

తే. మునివరేణ్యులు తీర్థాలు మూఁడుకోట్లు
తనరు నీవేంకటాద్రిపై ధరణి వేఱ
చోట లే దెందుఁ గావునఁ జూకు రడఁగు
తాతకైనను వర్ణింపఁ దరము గాదు. 201

వ. మఱియు నివ్వేంకటాద్రి నొకతూరి సద్భక్తిం బ్రదక్షిణంబు
సేసిన వారికి మాతృప్రదక్షిణతుల్యం బగుటం గాక భూ
ప్రదక్షిణంబు వలనం గల్గుఫలంబుకంటె ననంతఫలంబు సిద్ధించు
నిదియునుం గాక యొక విశేషంబు గల దదియెట్లన మున్నొక
సమయాన హలాయుధుండు వేంకటాద్రిశిఖరదర్శనంబు చేసి
సకల తీర్థాదులం దలంచి యనుపమసుకృతంబు గాంచె. నింతి
య గాక ధర్మరాజాదు లరణ్యవాసము చేయుచుండ నొక
నాఁడు శ్రీకృష్ణుండు వచ్చి పాండవుల కిట్లనియె. 202

సీ. పాండవాత్మజులార ప్రబలురయ్యెను మీరు
కర్మవశంబునఁ గాన నిట్లు
వసియించుకాలంబు వచ్చె గదా నైన
జయము శీఘ్రమ గల్గు భయము వలదు
శ్రీకరం బైనట్టి శ్రీవేంకటాద్రికి
భక్తితో నేగి గోప్యముగ నుండు
క్షేత్రపాలకునిచేఁ జెలఁగి పాలిత మయిన
పరమపావనతీర్థప్రాపుఁ జేరి

ఆ. స్నానపానజపము లూని సేయుఁడు శత్రు
ప్రకరహాని గల్గి ప్రాభవంబు
తనరునంచుఁ జెప్పఁ దద్దయుఁ బాండవుల్
వేంకటాద్రి కేగి వేడ్క నెగడ. 203

ఆ. క్షేత్రపాలుఁ డుండు సిద్ధస్థలంబున
నిలిచి స్నానపాననిష్ఠ లచట
సలుపుచుండ నొక్కసంవత్సరము చనె
నంత వేంకటేశుఁ డాదరమున. 204

సీ. స్వప్నమునం బాండవాగ్రజుం గని యిట్టు
లనె మహారాజ నీవరుల నెల్ల
సమయించి రాజ్యంబు చక్కఁగ నేలుము
సందియంపడకు పో సదయ యనఁగ
ధర్మజుం డటు లేచి తగ మ్రొక్కి యావల
భీమార్జునాదులం బిలిచి స్వప్న
సంగతిఁ దెల్పంగ సంతసం బందిరి
యంత నందఱతోడ నద్రి డిగ్గి

తే. శత్రువుల గెల్చి గజపురి శస్తముగను
జేరి రాజ్యంబు నేలుచు భూరికీర్తి
నొందె ద్రౌపది యిష్టంబు నొందెఁ గృష్ణు
నిష్ట మీడేరెఁ ద్రిజగంబులెల్లఁ బొగడ. 205

చ. గుఱుతుగఁ బాండునందనులు గొన్నిదినంబులు భక్తియుక్తు
లై, తఱమిడి నందు నిల్చినకతంబునఁ బాండవతీర్థ మంచు ని
త్తఱి నరు లెన్ను చుండుదురు దానిమహత్త్వము క్షేత్రపా
లకుం, డెఱుఁగును గాని యెంచ మఱి యెవ్వ రెఱుంగరు
ధారుణీస్థలిన్. 206

వ. మఱియు స్వామిపుష్కరిణికిఁ బూర్వభాగంబున జరాహరం
బును, పలిఘ్నంబును రసాయనంబును అనుమూఁడు తీర్థంబు
లును, హరి వసింపఁ దగిన వైకుంఠపర్వతగహ్వరంబును,
అష్టలోహఘాతంబులును గల్గియుండు నింతయు నాపుష్కరి
ణికి ద్వావింశతిశరపాతదూరంబున మాయాతిరోహితశక్తి
యన్నిట నావరించి యుండుం గావునఁ దత్తీర్థాదులు బుధుల
కైనఁ గాంచ నశక్యంబు లగుచుండు నట్టిమహిమ లొప్పు
చున్న వేంకటాచలంబున నంధులు మూకలు బధిరులు
గొడ్రాండ్రు ధనహీనులు శ్రద్ధా భక్తి హరిం గొనియాడుచు
నుండిరేని వారికి నభీష్టాదు లాపూర్తియగు నని యుగ
భేదంబువలన నొక్కవిశేషంబు కల్గుచుండు నయ్యది యెఱింగింతు
వినుండని సూతుం డిట్లనియె. 207

వేంకటాద్రి యుగభేదంబులం బ్రకాశించుట.

సీ. ఆవేంకటాద్రి మహాద్భుతంబుగ నొక్క
తఱి హరివిధమునం దనరుచుండు

నొకతఱి కనకాద్రి యొప్పునఁ జూపట్టు
నొకవేళ జ్ఞానసంయుతము నొందు
నొకసమయంబునఁ బ్రకటిత మరకత
మణిపోలె దీపించు మహిమమీఱ
నొకకాలమున మహిఁ నొప్పును గలికాల
పాషాణశైలరూపములుగాను
తే. గాన నా వేంకటాచలఘనత నుడువ
నాదిశేషునికైనఁ గా దరయ నింక
నేను జెప్పంగ నేర్తునే నెమ్మి మీకు
పరమమునులార విమలకృపాత్ములార. 208
క. అని యిటు సూతుఁడు వల్కఁగ
విని శౌనక ముఖ్యు లనిరి వేంకటశైలం
బున కెసఁగు మహిమ లెంతయు
వినినం బరితృప్తి లేదు వీనుల కనఘా. 209
క. కావునఁ బెద్దలు దెల్పిన
శ్రీవేంకటగిరి మహావిచిత్రమహిమలఁ
భావింపఁగ నీవే ముద
మావిర్భవముగ వచింపు మాకర్ణింపన్. 210
తే. అనిన జైమినిముని చెప్పినట్టిరామ
చరిత మిపు డేను వచియింతు సరవి మీరు
వినుఁ డటంచును మౌనులఁగని ముదమునఁ
జెప్పఁదొడఁగెను దత్కథఁ జిత్రమలర. 211
సీ. మునులార! దశరథతనయుఁడై జనియించి
గాధేయజన్నము గాచి వేడ్క

శంకరుచాపంబు ఖండించి జానకిఁ
జేఁబట్టి భార్గవుఁ జెలఁగి యతని
బల మాఱ్చి సాకేతపట్టణంబును జేరి
జనకునానతిఁ గొని చని యరణ్య
వాసంబు సేయ రావణుఁ డను దైత్యుండు
లలన సీతను దనలంక కెలమిఁ

తే. బట్టి కొనిపోవ రామభూపాలకుండు
రావణుని ద్రుంచుకొఱకు సుగ్రీవుఁ జేరి
యాంజనేయాదికపులతో నపుడు వేంక
టాద్రిచెంతను లంకకు నరుగుచుండ. 212

శ్రీరాములు వేంకటాద్రికి వచ్చుట.

తే. అంజనాదేవి శ్రీవేంకటాద్రిమీఁద
నుండి రాముఁడు కపిపుంగవులను గూడి
వచ్చుటం జూచి యెదురుగ వచ్చి యతని
పాదకమలంబులకు మ్రొక్కి భక్తిమెఱయ. 213

క. ఘనుఁ డగురాముఁడు విష్ణుం
డని మనమున నిశ్చయించి యానందముతో
వినుతులు సేయుచు మఱి యి
ట్లని రాముని కీర్తి యవనియం దలరంగన్. 214

ఉ. రామ సుకీర్తికామ ఘనరాక్షసబృందవిరామ సద్గుణ
స్తోమ దినాధినాథకులతోయధిచంద్రమ శౌర్యధామ నీ
శ్రీమహితప్రభావము ధరిత్రి నుతింపఁగ నాకు శక్యమే
కామఫలప్రదాత ననుఁ గావఁగదే జగదీశ రాఘవా. 215

సీ. ఈవేంకటాద్రిపై నెలమి వర్తించుదుఁ
గావున నాయందుఁ గరుణనుంచి
వేంకటాద్రికి మీరు విచ్చేయుఁడన విని
శ్రీరాముఁ డిట్లనె వీరకపులు
తోడ శీఘ్రముగాను దూర ప్రయాణంబు
కలిగియున్నది కార్యఘటనమైన
వెనుక నీయిష్టము వేంకటాద్రికి వత్తు
మనఁగ దేవరదర్శనార్థ మచటఁ
తే. గాచి యున్నారు మునివరు లాన వారిఁ
జూడ రావలె ననుచు నాచేడె పిలుచు
సమయమున నాంజనేయుఁ డచ్చటికి వచ్చి
వినయమున మ్రొక్కి యీరీతి విన్నవించె. 216

తే. దేవ మాతల్లి యంజనాదేవి మనవి
చేసినట్లుగఁ గరుణించి చిత్త మలర
వేంకటాద్రికి నేగుట వేడ్క మాకు
మఱియుఁ గపులెల్ల నలసిరి మార్గమునకు. 217

వ. ఇదియునుం గాక యాహారంబు గొనవలసియుండుటం జేసి యిప్పుడు. 218

సీ. శ్రీజయనాశ్రమసిద్ధస్థలమునందు
ఫలసుమవృక్షము లలరి యుండుఁ
గందమూలాదులు ఘనపుణ్యతీర్థంబు
లందుండుఁ గనుక నేఁ డచట నిలిచి
యావలఁ బోఁ దగు నంజనాద్రికి నేగి
మన ప్రయాణమునకు మార్గ మదియ.

శంకరుచాపంబు ఖండించి జానకిఁ
జేఁబట్టి భార్గవుఁ జెలఁగి యతని
బల మాఱ్చి సాకేతపట్టణంబును జేరి
జనకునానతిఁ గొని చని యరణ్య
వాసంబు సేయ రావణుఁ డను దైత్యుండు
లలన సీతను దనలంక కెలమిఁ

తే. బట్టి కొనిపోవ రామభూపాలకుండు
రావణుని ద్రుంచుకొఱకు సుగ్రీవుఁ జేరి
యాంజనేయాదికపులతో నపుడు వేంక
టాద్రి చెంతను లంకకు నరుగుచుండ. 212

శ్రీరాములు వేంకటాద్రికి వచ్చుట.

తే. అంజనాదేవి శ్రీవేంకటాద్రిమీఁద
నుండి రాముఁడు కపిపుంగవులను గూడి
వచ్చుటం జూచి యెదురుగ వచ్చి యతని
పాదకమలంబులకు మ్రొక్కి భక్తిమెఱయ. 213

క. ఘనుఁ డగురాముఁడు విష్ణుం
డని మనమున నిశ్చయించి యానందముతో
వినుతులు సేయుచు మఱి యి
ట్లని రాముని కీర్తి యవనియం దలరంగన్. 214

ఉ. రామ సుకీర్తికామ ఘనరాక్షసబృందవిరామ సద్గుణ
స్తోమ దినాధినాథకులతోయధిచంద్రమ శౌర్యధామ నీ
శ్రీమహితప్రభావము ధరిత్రి నుతింపఁగ నాకు శక్యమే
కామఫలప్రదాత ననుఁ గావఁగదే జగదీశ రాఘవా. 215

సీ. ఈవేంకటాద్రిపై నెలమి వర్తించుదుఁ
గావున నాయందుఁ గరుణనుంచి
వేంకటాద్రికి మీరు విచ్చేయుఁడన విని
శ్రీరాముఁ డిట్లనె వీరకపులు
తోడ శీఘ్రముగాను దూరప్రయాణంబు
కలిగియున్నది కార్యఘటనమైన
వెనుక నీయిష్టము వేంకటాద్రికి వత్తు
మనఁగ దేవరదర్శనార్థ మచటఁ
తే. గాచి యున్నారు మునివరు ల్గాన వారిఁ
జూడ రావలె ననుచు నాచేడె పిలుచు
సమయమున నాంజనేయుఁ డచ్చటికి వచ్చి
వినయమున మ్రొక్కి యారీతి విన్నవించె. 216

తే. దేవ మాతల్లి యంజనాదేవి మనవి
చేసినట్లుగఁ గరుణించి చిత్త మలర
వేంకటాద్రికి నేగుట వేడ్క మాకు
మఱియుఁ గపులెల్ల నలసిరి మార్గమునకు. 217

వ. ఇదియునుం గాక యాహారంబు గొనవలసియుండుటం జేసి
యిప్పుడు. 218

సీ. శ్రీజయనాశ్రమసిద్ధస్థలమునందు
ఫలసుమవృక్షము ల్గలిగి యుండుఁ
గందమూలాదులు ఘనపుణ్యతీర్థంబు
లందుండుఁ గనుక నేఁ డచట నిలిచి
యావలఁ బోఁ దగు నంజనాద్రికి నొగి
మనప్రయాణమునకు మార్గ మదియ

యటు గాన మాతల్లియందు సత్కృప నుంచి
యటకు రావలె నిపు డనఁగ రామ

తే. చంద్రుఁడబ్జాప్తసుతునిలక్ష్మణునిఁగాంచి
మందహసితాస్యుఁడై హనుమంతుఁడనుట
వింటిరే యన్న వారు భూవిభుని జూచి
దేవ మీయిష్ట మని రంతఁ దెలుఁగు నెంచి. 219

క. మనమున దశరథతనయుం
డనుమోదము నొంది వత్తునని చయ్యన న
య్యనిలతనూజుని గని యి
ట్లనియె న్గౌరవ మెసంగ నందఱు వినఁగన్. 220

ఉ. మారుతపుత్త్ర నీమనవి మామది కిష్ట మొసంగె నిప్పుడా
చారుతరాంజనాఖ్యవరశైలపథంబున వేడ్కఁ బోద మా
దారిని వానరావళికిఁ దప్పక చూపు మటంచుఁ బల్క న
వ్వీరుఁడు సంతసించి కపివీరులఁ బిల్చి ప్రియంబు మీఱఁగన్.

ఆ. వేంకటాద్రిమార్గ మంకం బెఱింగించి
హరిసమూహవిభునియనుమతమున
రామలక్ష్మణులను రహి మీఱ భుజములఁ
దుంచికొని బలంబుఁ బెంచి నడచి. 222

ఆ. నిక్క వేంకటాద్రి కెక్కుమార్గమునందు
వరమునీంద్రు లెదురు వచ్చి నిలిచి
బహువిధముల రామభద్రుని వినుతించి
యిట్టు లనిరి కీర్తి యినుమడింప. 223

ఉ. రామనృపాల ఘోరతరరావణశౌర్యవిఘాల భవ్యసు
త్రామ సురార్య యోగిజనతాపసపాల కృపాలవాల శ్రీ

భూమిసుతాత్మలోల పరిపూర్ణ యశోధనధామ వానర
స్తోమముతోడ వచ్చుమిముఁ జూచికృతార్థుల మైతి మెల్లరున్

సీ. చిరకాలమున నుండి శ్రీవేంకటాద్రిపైఁ
దప మొనర్పఁగ నావిధాత వచ్చి
రామసౌమిత్రు లీ రమ్యవేంకటశైల
మునకు వచ్చెదరు సమ్మోద మలర
వారు వచ్చెడుదాఁక వదల కిచ్చట నుండి
వచ్చినప్పుడు మీరు వారి నిచట
సంతోష మొదవించి సత్యలోకమునకు
రండు మీరనిన కారణముచేత

తే. నెదురుచూచుచు నుండి మేమిచట మిమ్ముఁ
గాంచితిమి మాతపంబు లిక్కడ ఫలించె
నింతయే చాలు సెలవు నిమ్మిపుడు బ్రహ్మ
లోకమున కేగెదము దుష్టలోకనాశ. 225

మ. అనినన్ రామనృపాలకుండు పరమాహ్లాదంబుతో వారలం
గని యోతాపసవర్యులార! మిము నీకాంతారమధ్యంబునం
దోనరం గంటిమి సంతసం బొదవె మీరుల్లంబుల న్వేడ్కమై
జనుఁడబ్జోద్భవుఁడున్న చోటికనుచున్ సంప్రీతితోఁబల్కఁగన్.

క. ఆమౌనులు ముద మొందుచు
రామునిచే సెలవునంది రయమున నపుడే
తామరసోద్భవులోకము
రాముని నెంచుచును జనిరి రహి నంద ఱొగిన్. 227

వ. అనంతరము రామచంద్రుండు తత్పర్వతోత్తరమార్గంబున
నొకపర్వతారోహణంబు సేయుచుండి తన్మధ్యంబున యొక

శాపమోక్షంబు చేసి వచ్చి కందమూలఫలభరితం బగు నంజనాశ్రమమునందు నాకాశగంగసమీపంబునం గపిసమూహముతో నిలిచి తత్తీర్థంబున స్నానసంధ్యాద్యనుష్ఠానంబులు నిర్వర్తించిరి. అంజనాదేవి పుష్పంబులఁ బూజించి పరమరుచ్యఫలంబు లొసంగి ముదమార్గ వేఁడుటంజేసి యారామలక్ష్మణులు సంతుష్టులై యంజనాదేవిని నాదరించి వీడ్కొని యందుండి సుగ్రీవాంగదకపిముఖపరివృతులై స్వామి పుష్కరిణికి వచ్చి జయప్రదసంకల్పపూర్వకంబుగ స్నానం బొనర్చి తత్తీరశృంగారవనంబునం దొక్కింతతడవు సుఖాసీనులై దర్శనార్థంబుగ వచ్చినమునుల కనేకఫలదానంబు లిచ్చి పుష్కరిణికి నిబుతిభాగంబున నొకపర్ణశాలం జేరి యున్నసమయంబున నాంజనేయుండు వివిధఫలకందమూలాదులును దేనెపెఱలును దెచ్చి సమర్పించెఁ బరివారముతోడ రామలక్ష్మణులారగించి పరిపూర్ణులై రట్టియెడ. 228

సీ. ఘనుఁడాంజనేయుండు కపిసమూహముఁ జూచి
పిలిచి యిట్లనియె సంప్రీతి మెఱయ
వానరులార యీవనపర్వతములందుఁ
జూతజంబూఫలవ్రాతములను
బనసపండ్లును ద్రాక్షపండ్లును బదరికా
ఫలము లనంటులు పాలపండ్లు
పరమముదంబున సరవి మెక్కుఁడు వనం
బున విహరింపుఁడు మనసులార
తే. ననిన విని కపిబృందంబు లపుడు చెలఁగి
ఫలమహీరుహములఁ బ్రాకి పండ్లఁ గోసి

కడుపులారంగఁ దిని యార్చు చూడలఁ గీలు
కొనుచుఁ గొండలపై కెక్కి తేనెలరసి. 229

వ. ఆమధుకోశంబులం జేకొని చించి యందుందు తేనెలతో మఱి
కొన్ని పండ్లనుగల్పి పంచుకొని యబ్బురపాటునఁ జప్పరించుచు
నొండొరులు ఱొప్పఁగను ముక్కులు చిట్లించుచు నొకరిచెవు
లొకరు గొఱుకుచు పండ్ల గీటించి కన్నులు బిక్కరించి వెక్కి
రించుచుం గొండకొండకు లంఘించుచు నుల్లాసం బొక్కింత
తడవుండి యంద ఱొకచోట గుంపుగూడి యిట్లనుకొనిరి.

క. రాములకృపచేనిచ్చటి
కామోదముతోడ వచ్చి యఖిలఫలములం
గామించి భుజించితి మిపు
డేమే లొనరింపవచ్చు నినకులపతికిన్ 231

సీ. శ్రీరామునకు నపకారం బొనర్చిన
రావణుం దెచ్చి శ్రీరామునెదుటఁ
బెట్టి కొట్టియు దయ పెట్టక తోఁకలం
జుట్టి భూమిం బడఁ బట్టు విడక
మఱి లంకఁ గొనివచ్చి మానవేశ్వరుఁడాత్మ
మెచ్చు ముందటఁ బెట్టి మేలుగొనెద
మనువారు కొందఱు ఘనరాక్షసుల నబ్ధిఁ
గలపి రావణశిరంబులను నఱికి

తే. గ్రద్దలకుఁ బెట్టుదము వేడ్కఁ గఱవు దీఱ
ననుచుఁ గొందఱు రావణుం డక్కిఁ డాఁగి
నప్పటికి వాని విడువక యందు నరిగి
పట్టుకొని త్త మధిపునిపట్టు కడకు. 232

వ. అనువాఁడు నంత నందఁడు స్వామిపుష్కరిణికి నీశాన్యభాగం
బునం దొక్క గిరిగహ్వరంబు నీక్షించి యయ్యంధకారబిలం
బునం జొచ్చి కిచకిచ లాడుచుం బోవుచు నందొకదివ్యజ్యోతి
నీక్షించి తత్సమీపంబున కరుగుచున్న సమయంబున. 233

సీ. ఆగుహాలో దివ్యహాటకనవరత్న
గోపురప్రాకారకుడ్యతతుఁ
వజ్రకవాటము లైవైదూర్యమాణిక్య
మరకతమౌక్తికమండపములు
ప్రాసాదము ల్చిత్రభవనపంక్తులు మేటి
పచ్చతోరణములు బాగు మీఱ
హేమరథంబులు సామజాశ్వంబులు
వివిధవింతలు దగువీథు లొప్ప

తే. విమలగానంబులును నృత్యవివిధవాద్య
ములును ఘోషింప యువతులు మెలఁగుచుండ
వరచతుర్భుజులును గదాధరులు శంఖ
చక్రపాణులు నచ్చట సంచరింప. 234

తే. అమరి యప్రాకృతంబై మహాప్రకాశ
మహిమచే నొప్పు నప్పురమధ్యమందుఁ
గాంచనాద్రినిభంబై ప్రకాశయుతము
భానుసంకాశ మైనవిమానమునను. 235

సీ. నీలాభ్రగాత్రుండు నీరజనేత్రుండు
నాజానుబాహుండు నచ్యుతుండు
కనకాంబరుండు సత్కంబుకంఠుండు స
ల్లలితసద్భూషణాలంకృతుండు

శంఖచక్రగదాబ్జసహితహస్తుండు మ
హాత్ముండు పూర్ణచంద్రాననుండు
సురుచిరసుందరసుకుమారదేహుండు
విమలసత్కారుణ్యవీక్షణుండు
తే. నగుచు ఘనభోగిభోగపర్యంకమునను
వాసి మీఱఁగఁ గూర్చుండి వామపదము
ముడిచికొని కుడిపాదంబు పుడమిమీఁద
నింపుగాఁ జూచుచుండు లక్ష్మీశ్వరుండు. 236

క. కరములు రెండా ఫణిపై
నిరవుగ నూనుకొని లక్ష్మి యెదపై వెలుఁగన్
ధరణియు నీళయు భక్తిని
నిరుగెడ వసియించి వేడ్క నెసలారంగన్. 237

వ. ఇవ్విధంబున సుఖాసీనుఁ డై యుండు పురుషోత్తమునకుం గరుడసుందరీమణులు చామరంబులు వీవ మఱి కొందఱు శ్వేతచ్ఛత్రంబులు పట్టఁ గోటిసూర్యప్రభాభాసితుం డై వెలుంగు శ్రీహరిని సంతోషమగ్నులై చూచుచున్నకపుల నీక్షించి యం దొకవేత్రహస్తుండు మార్గంబు చూప నక్కపులామార్గంబున నీవలకు వచ్చి యాశ్చర్యంబు నొంది తమలోఁ దా మిట్లు తలంచుకొనిరి. 238

సీ. శ్రీరామచంద్రుని చెలఁగి గెల్వఁగ లేక
రావణుండు గుహాంతరాళమునను
జేరి రాక్షసమాయ లీరీతిగాఁ జూపె
నని తోఁచు చున్నది యనెడువారు

నాదశేకంతుమాయలు గావు భావింప
హరిమాయ గావలె ననెడువారు
నీసంశయము దీర నీమాటు గుహాలోని
కరిగి క్రమ్మఱఁ జూత మనెడువారు
తే. మనము మాత్రము పోరాదు మర్కటముల,
నన్నిటిని గూడి పోవచ్చు ననెడువారు
నపుడు కలగంటి మిది దబ్బ రనెడువారు
నన్నృత మేలగు నిజ మిది యనెడువారు. 239

వ. ఇవ్విధంబున నందఱు సందేహములు పడుచు మరల నాగు
హను జూడంగఁ బోవ నది కన్పట్టకుండుటం జేసి యందందుం
గలగుహ లన్నియు వెదకి గానక రామచంద్రుని కడకు
వచ్చి గుహావృత్తాంతం బంతయు నెఱింగింప నక్కరుణాసము
ద్రుండు చిఱునగవు మోమున మొలకలెత్త నిట్లనియె. 240

సీ. దేవర్షి రాజనదీమూలములు పరీ
క్షించి నిర్ణయముగఁ జెప్పరాదు
మహిమాధ్యుఁ డైనరమామనోహరుఁ డిందు
నలరు రీతిని కల్ల యనఁగరాదు
హరిగిరిమహిమ లా హరి యెఱుంగును గాని
దేవతలకుఁ గూడఁ దెలియఁబడదు
యీయద్రిమహిమల నెంచ కేరితరంబు
మించి పరీక్షింప మీకుఁ దగదు
తే. మంచి దైనను గొడవేమి మాధవుండు
కరుణతో మీకు దర్శనం బరయ నిచ్చె.

ధన్యు లెం పాపము లలఁగె నంచు
నాడి శ్రీరాముఁ డాదినం బచటనుండె. 241

క. సరవిగ మఱునాఁ డద్రిని
హరిబలములతోడ డిగ్గి యారఘురాముం
డరి గెలుపం జని యంబుధి
గిరు లిడి బంధించి మించి కీర్తియెసంగన్. 242

చ. కపులును దమ్ముఁడుం గొలువఁగా నొగి లంకకుఁ బోయియచ్చ
టన్, విపులబలంబుతో నసురవీరుల నెల్ల వధించి ధీరతం
గుపితుని గుంభకర్ణు ధరఁ గూలిచి రావణుతోడఁ బోరి యా
రిపునివధించెదేవమునిబృందము మెచ్చఁగరాముఁడెంతయున్.

సీ. సీత నచ్చటఁ బరీక్షించి శ్రీరాముఁడు
గూడి విభీషణుఁ గూర్మి •కలరి
యాలంక కాతని నధిపునిగాఁ జేసి
జానకీలక్ష్మణసహితుఁ డగుచు
వానరచయముతో వరపుష్పకం బెక్కి
సాకేతపురి సంతసమునఁ జేరి
భరతశత్రుఘ్నులు భక్తిమెఁ గొలువంగఁ
బట్టాభిషిక్తుఁడై ప్రజలనెల్లఁ

తే. బ్రథిత దయఁబూని పాలింపఁ బృథివి తఱిని
పండుచుండెను సస్యంబు మెండుగాను
మౌనివర్యుల కీరీతిఁ బూని చెప్ప
విని ముదంబంది గుహాలోనఁ దనరినట్టి. 244

వ. పరమపురుషుం డెవం డాయద్రిమహిమ సహాకల్యాంబుగ
వచింపు మనిన మునులకు సూతుం డిట్లనియె. 245

శా. వైకుంఠం బెడఁబాసి శేషగిరిపై వర్తించునారాయణుం
డాకాలంబున నాగుహాంతరమునం దావానరశ్రేణికిం
జోకం జూప నిజస్వరూపము కపుల్లోచ్చిదృంబుగాఁ జూచి భూ
లోకంబందు వచింపఁగా నెఱిఁగి రీలోకంబులో మర్త్యులున్.

వ. ఇవ్విధంబున నాగుహాంతరమున నుండి శ్రీహరి వానరసమూహంబునకు వైకుంఠంబు చూపినందున నాగుహకు వైకుంఠగుహ యనంబరఁగె. నందు నిత్యముక్తులు సేవింప శ్రీభూనీళా సమేతుఁడై యుండునాగుహాంతరమును జూచిన వారికి ముక్తి శ్రీప్రదం బగు ననిన విని శౌనకాదులు ప్రమోదస్వాంతులై సూతపౌరాణికుం జూచి యిట్లనిరి. 247

ఆశ్వాసాంతము.

క. పంకజలోచన దనుజభ
యంకర సుగుణాభిరామ యవ్యయధామా
శంకరమిత్ర శుభాకర
వేంకటగిరినిలయ మౌనివినుతాంఘ్రియుగా. 248

మాలిని.—
కలశజలధిబాలాకాంతశృంగారలీలా
సలలితగుణజాలా సామగానాభిలోలా
కలుషనిచయశైలోగ్రాశనీ వేదమూలా
విలసితగుణశీలా వేంకటాఖ్యాద్రిపాలా. 249

గద్యము. ఇది శ్రీతరిగొండ శ్రీలక్ష్మీనృసింహకరుణాకటాక్షకలితకవితావిలాస వసిష్ఠగోత్రపవిత్ర కృష్ణయామాత్యతనూభవ వేంకమాంబాప్రణీతం బగు వేంకటాచలమాహాత్మ్యంబును,

వరాహపురాణంబునందు వేంకటగిరిపురవర్ణనంబును, నైమిశారణ్యవర్ణనంబును, శౌనకాది మహామునుల ప్రశ్నలును, బ్రహ్మ దినప్రళయ ప్రకారంబును, హరి శ్వేతవరాహంబై హిరణ్యాక్షుని సంహరించి రసాలగతయగుభూమిని యథాస్థానంబునం దుంచుటయు, వరాహస్వామి యనుమతంబున శ్రీభూనీళల తోడ వైకుంఠమునం దున్న క్రీడాద్రిని గరుత్మంతుండు గొనివచ్చి భూలోకమునందు నిల్పుటయు, బ్రహ్మేంద్రాదులు వచ్చి స్వామికి మ్రొక్కి వినుతించుటయును, వరాహస్వామి శేషాద్రియందు విహరించుటయును, పుష్కరిణీ మాహాత్మ్యంబును, వేంకటాద్రి నొక్కొక్కనిమిత్తంబున నొక్కొక్కనామంబు గల్గుటయు, వరాహస్వామి క్రీడానగంబునకు నుత్తరదిగ్భాగంబున విహరించు చుండి విటవేషధరుండై మానుల యజ్ఞశాలయందుఁ బ్రవేశించి వపాగ్రహణంబు సేయుటయు, దేశాంతరగతుం డైన వృద్ధబ్రాహ్మణుని హరి కటాక్షించి కుమారధారాఖ్య తీర్థంబున స్నానంబు సేయించి బాలకుమారునిగాఁ జేసి పంపుటయు, శంఖణమహారాజునకుఁ బుష్కరిణియందుఁ బ్రత్యక్షంబయి రక్షించుటయు, నాత్మారాముఁ డను బ్రాహ్మణునకు హరి ప్రసన్నుండై సమస్తైశ్వర్యంబుల నిచ్చుటయు, కపిలలింగ కపిలతీర్థ సంభవంబులును, దత్కపిల తీర్థాది సప్తదశ తీర్థప్రభావంబులును, తీర్థయాత్రపోవు విప్రునకు స్వప్నమునందు హరి ప్రసన్నుండై పుష్కరాద్రియందుఁ గల తీర్థంబులఁ జూపుటయు, ధర్మరాజాదు లొక్కసంవత్సరము వేంకటాద్రియం

దొకపుణ్యతీర్థంబు నాశ్రయించి యుండుటయు, యుగభేదం
బులచేత వేంకటాద్రి ప్రకాశించు లాంఛనంబులును, రావణ
సంహారార్థంబుగ నరుగునప్పుడు రామచంద్రుం డొకదినము
వేంకటాద్రియందు వసియించి గుహా ప్రభావంబు కపులకుఁ
జెప్పుటయు, గుహాంతర రహస్యంబు మునులు సూతుని
నడుగుటయుఁ గల ప్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# శ్రీ వేంకటాచలమాహాత్మ్యము

## ద్వితీయాశ్వాసము.

---

క. వ్యాసమునీశ్వరహృదయని
వాస చిదుల్లాస దుగ్ధవారిధిశయనా
వాసవవందితపదయుగ
భాసుర తటికుండనృహరి భవదురితారీ. 1

ఆ. విశ్వచర్య లెల్ల విశదంబుగా నీవు
తెలిసినావు మాకుఁ దెలుపఁ గలవు
గాన విష్ణుకథలు క్రమముగ ముదమునఁ
దెలుపు సూత విమలధీసమేత. 2

క. మాయావి యగుచు విష్ణుం
డాయాస్థలముల వసించి యతివర్యులకుణ్
బాయక దాఁ గనిపించుచు
నాయెడఁ గనుపింప కుండు నంటివి సూతా. 3

సీ. అంజనాద్రిసమానుఁ డైన శ్రీస్వామినం
దెవ్వరు నిల్పినా రిరవు చేసి
యెవ్వరు ప్రార్థింప నీశ్వరుఁ డచ్చోట
నిలుకడగా నిల్చె నిత్యుఁ డగుచు

నారీతిఁ దెల్పు నీవని ముని లడుగఁగా
నాసూతుఁ డనియె నావ్యాసమౌని
చెప్పినకథ మీకుఁ జెప్పెద నెట్లన్న
సనకాదియోగుల శాప మంటి
తే. జయుఁడు విజయుండు దితియందు జనన మొంది
కనకలోచనుఁడును హేమకశిపుఁ డనఁగ
ధరణిపైఁ బుట్టి సాధు బాధల నొనర్ప
సరగఁ గిటియై హిరణ్యలోచనుని ద్రుంచి. 4

ఆ. అపుడు స్వర్ణకశిపుఁ డాగ్రహంబును మించి
సాధు భక్తులకును బాధ చేసె
నందుచే నృసింహుఁడై చక్రి యాదైత్యుఁ
గడుపుఁ జించి చంపెఁ బుడమిఁ బడఁగ. 5

సీ. పరమభక్తుం డైన ప్రహ్లాదు రక్షించె
నటు లేగి కనకాక్షుఁ డాహిరణ్య
కశిపుఁడు మఱి కొంతకాలంబునకుఁ గుంభ
కర్ణ రావణు లనఁగా జనించి
రామచంద్రునిచేత భూమిపైఁ బడుదాఁక
బాధించుచుండిరి సాధువులను
గావున శక్రుఁడు దేవర్షు లెల్లరు
నారావణునిదుర్గుణాళి హరి
తే. మనవి చేసెదమని వోయి ఘనసుధాబ్ధి
తీరమును జేరి పలికి రో దేవదేవ
రావణునిబాధ తప్పించి నీవు మమ్ముఁ
బాలనము సేయు నోమహాపరమపురుష. 6

వ. అని యనేకవిధంబుల నాక్షీరాబ్ధికి సుత్తరభాగంబున నిలిచి
వేదాంతరహస్యోక్తుల వినుతించి యిట్లనిరి. 7

ఉ. దేవ సుధాబ్ధివాస హరి దీనదయాపర చిత్తగింపుమా
రావణనామధేయుఁ డగురాక్షసుఁ డెప్పుడు క్రూరచిత్తుఁడై
భూవలయంబునందుఁ గృతపుణ్యుల నేచుచునుండు వాని నీ
వేవిధిఁగాని ద్రుంచుము మఱెద్దియుపాయము లేదుమాధవా.

వ. అని వేఁడుటంజేసి విష్ణుదూత యొకండు మరుత్పథంబున. 9

ఆ. వచ్చి యిట్టులనియె వనజాక్షుఁ డిందు లేఁ
డవనిమీఁదఁ బర్వతాగ్రమునను
మెలఁగుచుండు నటకు నెలమిగఁ జనుఁ డిందుఁ
గలకలంబు సేయవలదు పొండు. 10

క. అని వాఁడు పలికి పోయిన
విని మౌనులు సురలు దేవవిభుఁ డాశ్చర్యం
బును బొందుచు నందుండక
చని చని శోధించి రిలను శైలము లెల్లన్. 11

వ. అనంతర మెందుం గానక వైకుంఠమార్గంబున నిర్గమించి పోవు
చున్న సమయంబున. 12

సీ. శరదభ్రశుభ్రభాస్వరశరీరమునందు
శ్వేతప్రకాశవిభూతి మెఱయ
ధవళసంపూర్ణచంద్రకకళంక మనంగ
నైల్యవత్కృష్ణాజినంబు వెలుఁగ
సురుచిరారుణజటాజూటంబు శిరమునఁ
దపనబింబంబుచందమునఁ దోఁప

ననిశంబు నారాయణాష్టాక్షరిం దగఁ
బలికించు వీణియఁ బట్టి భుజము
తే. మీఁద హత్తించి శ్రీహరి మెచ్చునట్టి
గానమై పుణ్యమును జూపు మూని నడచు
నారదులు రాఁగఁ జూచి యానందమొంది
యిట్లు వినయంబునడిగె నం దింద్రుఁడపుడు. 13

క. ఓ నారద త్రిభువనముల
మానక చరియింతు వీవు మర్మంబులు నీ
ధ్యానమునకుఁ గన్పట్టును
గాన మహాత్ముఁడవు నీవు ఘనమునిచంద్రా. 14

సీ. శ్రీశైలభూములఁ జేరి రావణుఁ డతి
క్రూరుఁడై సాధులఁ గొట్టువాఁడు
గావున వాని నేగతినైన శ్రీరమా
పతియ దండింపఁ గా వలయు నడఁగ
విష్ణుదేవుని మేము వెదకుచు క్షీరాబ్ధిఁ
జేరి యెంతయు నుతిసేయ మాకుఁ
బ్రత్యక్షమును లేక పల్కక యుండఁ గా
హరి దూత యొక్కరుం డంతరిక్ష
తే. మునకు వచ్చి మముంజూచి ఘనుఁడు చక్రి
భూతలంబున నొకపెద్దభూధరమున
నున్న వాఁ డట కేగుఁ డం చొరిమఁ జెప్పి
పోయినాఁడంత మే మెల్లఁ బాయకుండ. 15

వ. ఈభూలోకంబున గాఢారణ్యంబులును భూరిభూధరశృంగం

బులను వెదకి వేసటనొందితి మింత కా హరి యుండు నెడ
నెఱుంగక యీమార్గంబున. 16

క. చను దెంచితి మా దేవుం
డనుపమ వైకుంఠపురమునందుండును గా
వున రావణివృత్తాంతము
వినిపించెద మచట హరి విస్మయపడఁగన్. 17

చ. అన విని నారదుం డనియె నయ్య వికుంఠమునందు విష్ణుదే
వుని గని రాను నేను బహుళోత్కలికం జను నొక్కపార్ష
దుం, డనియె వికుంఠము న్విడచి యాహరి భూతలమందు
లక్ష్మితో, నొనరఁగ నొక్కకొండపయి నుండును పొమ్మనె
వింటి నంతయున్. 18

క. కావున నచటికి మీ రిఁకఁ
బోవలసిన దేల చక్రిపుత్రునికడకుం
బోవుద మా జలజాసనుఁ
డే వివరము దెల్పు ననుచు నెలమిగఁ గనుచున్. 19

ఆ. దేవమౌని వల్కె దేవేంద్రసురముని
ముఖులు సత్యలోకమునకుఁ బోయి
ఘనచతుర్ముఖములు కరచతుష్టయములు
గలిగి యొప్పుచున్న కమలభవుని. 20

సీ. కాంచి రచ్చటఁ దప్తకనకాభదేహుండు
లోకవందితుఁ డష్టలోచనుండు
మహనీయ దండకమండలహస్తుండు
బాలభానుప్రభాభాసితుండు

నతిశయ దివ్యపద్మాసనాసీనుండుఁ
బ్రథితతాపసజనపరివృతుండు
నిర్మలసత్కర్మనిష్ఠాగరిష్ఠుండు
పరమాత్మ్యధ్యానపరవశుండు
తే. నగుచు నామ్నాయగోప్యశాస్త్రాదులందు
వింతవింతగ మూర్తీభవించి మెలఁగఁ
జేరి సావిత్రి గాయత్రి భారతియును
గొలువఁగాఁ గొల్వునం దున్న జలజభవుఁడు. 21

ఆ. దేవతలను మునులఁ దిలకించి వేడ్కమైఁ
జెంత కుం డటంచుఁ జేర్చి వారి
కార్యములను దెలియఁగా నడ్గ వారెల్ల
నుడివి రిట్లు మ్రొక్కి నుతు లొనర్చి. 22

వ. పితామహుఁడా! రావణాసురునివలన మేము పడు బాధ లెంతని చెప్పఁగలము తద్రావణుండు నశింపక యుండిన సాధుజనబృందంబులకు బాధలు మాన వడియునుం గాక. 23

సీ. వసుధాంబుధియందు వైకుంఠపురియందుఁ
ద్రిభువనంబుల మేము దిరిగి వెదకి
వచ్చితి మం దెందు వాసుదేవుఁడు లేఁడు
కావున మేము మీకడకు వచ్చి
శరణు వేఁడితిమి శ్రీహరియుండు తా వెందుఁ
గలదో యెఱింగింపవలయు మీరు
చక్రి సంచారంబు సర్వం బెఱింగిన
వారు గావున వేఁడువారు మేము

తే. చెలఁగి తపముల విఘ్నము ల్సేసి మాకు
నమిత బాధలు గల్గించునట్టి దనుజు
నడఁపఁదగుశ_క్తి యాహరి కలరియుండుఁ
గానఁ గరుణింపవే యని పూని యడుగ. 24

క. విని యావిరించి హరి
గని యిట్లనె రావణుండు కాలము రా కె
వ్వనిచేతఁ దెగఁడు వాఁ డొక
మనుజునిచేఁ జచ్చుఁ దుదకు మహిపై మఱియున్. 25

క. దేవతలుచేత నితరుల
చే వధ్యుఁడు గాఁడు తాను జీవించుటకై
చేవం గొనె వరమును దగఁ
గావించి తపంబుఁ గెల్వఁగా దెవ్వరికిన్. 26

సీ. దాని కుపాయంబు దగఁ జెప్పెదను మీకు
శ్రీ.వేంకటాద్రిపైఁ జేరియున్న
హరిపాదములఁ బడి శరణు వేఁడుఁడు ప్రేమ
నా_ర్తి నివారించి యతఁడు జగతి
మానవరూపంబుఁ బూని యా దశకంఠుఁ
దునిమి రక్షించు మిమ్మును ముదమునఁ
జింతింప నేటికి శ్రీ వేంకటాద్రికి
నేగుఁడు మీతోడ నేను వత్తు
తే. ననుచు నిట్లనె యాతండు మనసు హాయిఁ
జెంద శ్రీదేవితోఁ గూడి చెట్ల పొదల
బరఁగు మృగములఁ బక్షులఁ బట్టు చెట్టి
క్రీడ నున్నాఁడొ దెలియదా శ్రీకి నెఱుక. 27

వ. అయిన నొక్క విశేషంబు గల దది యెట్లన్న నయోధ్యాధి
పతియగు దశరథుండు పుత్రార్థి యై స్వామిపుష్కరిణీ
తటంబునఁ దపంబు సేయువాఁడు ఆరాజేంద్రునకు హరి
ప్రత్యక్షం బగు వాఁడు. మన మెల్ల రచ్చట నిలిచి యుండి
ప్రత్యక్ష మగు హరికి మ్రొక్కులిడి ప్రార్థింత మని యా
యజుండు దేవతలం దోడ్కొని వేంకటాద్రికి నుత్తరభాగం
బునఁ దిరుగుచుండ నద్భుతంబగు నొకపర్వతంబు నందు. 28

సీ. సంతానమందారచంపకవకుళవి
ఖ్యాతద్రుపరివృత మైనదాని
దిక్కులను స్వాదు పిక్కటిల్లఁగఁ జేయు
ఫలపుష్పవితతిచేఁ బ్రబలుదాని
శుకపికప్రముఖపక్షులు వినోదంబుగా
సుస్వరంగి పల్కఁగా నొప్పుదాని
ఘనగండభేరుండకంఠీరవాది మ
హామృగధ్వనులు మిన్నందుదాని
తే. గరుడ గంధర్వ యక్ష కిన్నరగణంబు
లెలమిఁ దిరిగెడు సానువు లలరుదాని
నదులు కమలాకరములు నానాముఖముల
నతిశయింపఁగ విస్తీర్ణ మైన గిరిని. 29

బ్రహ్మేంద్రాదులు వేంకటాద్రికి వచ్చుట.

చ. కనుఁగొని బ్రహ్మముఖ్యులతికౌతుక మొప్పఁగ నాగిరీంద్రమం
దనువుగఁ జేరి భక్తి యెసలారఁగఁ దీర్థములందుఁ గ్రుంకుచున్
వనఫలపుష్పముల్గొనుచు వారిజనాభుని పూజ సేయుచున్
వినమితభక్తి నచ్యుతుని వేచిరి యాతనిరాకకందఱున్. 30

వ. ఇవ్విధం బుండఁ గొన్నాళ్లకు నయోధ్యాపురీశుండు. 31

సీ. దశరథుం డర్థిమైఁ దనకుఁ బుత్త్రులు లేమి
పరితాపపడి నిజగురుని జేరి
మ్రొక్కి యిట్లనియె నో మునినాథ తమవంటి
గురువుండఁగాఁ బుత్త్రవరము నాకు
నేల యీఁగూడదు మేలొంద ననఁగ న
మ్ముని యిట్లులనియె నో మనుజనాథ
తొలికర్మ మొక్కింత గలది దానం జేసి
సుతులు లేరైరి యప్పతితమడఁగ

తే. వేంకటాద్రికి నేఁగి సద్వృత్తి మెఱయఁ
బుష్కరిణియందుఁ గ్రుంకి యాభూమియందుఁ
దానవారిని నిరతంబుఁ దప మొనర్తు
వేని పాపంబు తలఁగి నీ యిష్టము గను. 32

క. ఇనవంశోద్ధారకు లగు
తనయులు పుట్టెదరు నీకు దైత్యారిదయం
జను మిప్పుడ వేంకటగిరి
కని ముదమున ననఁగ మౌని కారాజనియెన్. 33

క. ఆవేంకటగిరి యెక్కడ
పావనమునివర్య! యటకుఁ బయనపులగ్నం
బేవాసరమున్నది నా
కావారము దెల్పు పోయెదని యడుగంగన్. 34

సీ. అపు డావసిష్ఠుఁ డిట్లనియె గంగానది
కటు దక్షిణంబుగ నా సువర్ణ

ముఖరికి నుత్తరంబుగ నొక్క క్రోశదూ
రముగ గంగకు దక్షిణముగ ద్విశత
యోజనంబుల దవ్వ నుండు వేంకటగిరి
యందు గంగానది కతిశయంబు
లగు పుణ్యతీర్థంబు లలరియుండును మఱి
స్వామిపుష్కరిణియు వరలుచుండు
తే. నందుఁ బరిమళ పుష్పచయాది లతలు
మధురఫలవృక్షములచేత మహిత శక్ర
వనమునకు మించి ఫల పుష్పవార మవ్వ
సంతకాలంబు వోలె నజస్ర మొప్పు. 35

వ. మఱియును. 36

సీ. మేరుసమానము తేరు శృంగారించి
నట్టుల శ్రీవేంకటాద్రి యొప్పు
రమణీయ మగు చైత్రరథముచందంబుగఁ
గన్నుల పండువై గానవచ్చుఁ
గిన్నర గంధర్వ గీర్వాణ వనితల
గాననృత్తములందుఁ గలిగియుండు
ఘనకులాచలముల ఘనతఁ జూడని హేమ
శిఖరాళిచేఁ బ్రకాశించుచుండుఁ
తే. ప్రాకృతులు చూడ పాషాణపర్వతంబు
కరణిఁ గన్పట్టు నాగిరిగౌరవంబుఁ
జెప్ప నొప్పునె యేరికి శేషుఁ డైనఁ
బొగడఁ జాలఁడు వింటివె భూపతీంద్ర. 37

మఱియు నీ కీదినంబున నభిజిల్లగ్నంబునందుఁ బ్రయాణంబు
నకు శుభంబుగ నున్నయది యనిన నవ్వసిష్ఠుని నాశీర్వచ
నంబునొంది ప్రయాణంబై, గోదావరీకృష్ణాఘహారీ ప్రముఖ
నదులందుం గ్రుంకుచు వచ్చుచు ముందట శ్రీవేంకటా
చలంబుం గని మ్రొక్కి యారోహించి తద్గిరిగహ్వర సాను
దేశప్రముఖ సిద్ధస్థలంబుల నీక్షించుచు వచ్చి యనంతరంబు.

పద్మనీలోత్పలప్రముఖాంబుజశ్రేణు
లందుఁ దుమ్మెద లింపుఁ జెంది పాడ
వనజనాళంబులు ఘనమరాళంబుల
తుండంబు లం దంటి తూలి యాడ
మత్స్య కచ్ఛప తతి మసల కాహారార్థ
ముగ నీట నీఁదెడు వగలు మెఱయఁ
దఱులు తరంగము ల్దగి పైని మారుతం
బల్లన వీవంగ నలరునట్టి
స్వామిపుష్కరిణిం గని సంతసించి
దశరథుం డప్పు డాతీర్థతటము సేరి
యచ్చ టచ్చట యోగంబులందునుండు
మునులఁ గన్గొని వారికి మ్రొక్కి నిలిచి. 39

మఱియు న త్తీరంబున ననేక జటాధారులును, సిద్ధాసన భద్రా
సన గోముఖాసన స్వస్తికాసన పద్మాసన దర్భకాసన కుక్కు
టాసన అర్భకాసన ప్రముఖాసనాసీనులై రేచక పూరక
కుంభక యుక్తప్రాణాయామంబులు సేయువారును, ఆధార
స్వాధిష్ఠానమణిపూర కానాహత విశుద్ధాజ్ఞాచక్రంబులయం

దున్న పంచాశద్వర్ణంబుల నవలోకించుచుం ద త్తదధిష్ఠాన దేవ
తల నజపవిధానంబున నర్చించుచు నాడీ శోధనం బొనర్చి
క్రమంబుగ షడాధారంబులు భేదించి సుషుమ్నా నాడీమార్గం
బున నూర్ధ్వముఖంబుగ గమనించి సహస్రార కమలాంతర్గత
సుధా బిందుపానానుభవంబునఁ బరవశులై చొక్కుచుండు
వారును, హృదయకమలకర్ణికామధ్యంబున నంగుష్ఠమాత్రుం
డై ప్రకాశించుచున్న పరమపురుషుని ధ్యానించి తదనుభవం
బున నానందించువారును, సాంఖ్యతారకామనస్కయోగా
భ్యాస పరవశులై యంతర్లక్ష్య మధ్యలక్ష్యావలోకనంబులు
సేయువారును, శ్రోత్ర నేత్ర నాసాపుట నిరోధం బొనర్చి
యాత్మ ప్రత్యయ ప్రకారంబు నీక్షించుచు దశవిధనాదంబు
లాలకించు వారును, మఱియు నంతర్లక్ష్యంబున నుండి యఱ
గంటి చూడ్కిని స్వరూప ధ్యానంబు సేయువారును,
కన్నులు మూసి శిరంబు వంచి యూర్ధ్వదృష్టిఁ గళా
మాత్రంబు నిల్పువారును, ఇద మిత్థ మనుట మఱచి
యెఱుకమాత్రంబై శేషించి కేవ లాత్మానుభావంబు సేయు
వారును, స్థూల జిహ్వాగ్రంబును దదుపరి సూక్ష్మ జిహ్వా
గ్రంబుఁ దాకునట్టుగాఁ జొన్పుచుం దదేక నిష్ఠచే లంబికా
యోగం బొనర్పువారును, ఇవ్విధంబున ధ్యాన షణ్ముఖీ
శాంభవీ రాధాయంత్ర ఖేచరీ ముద్రాభ్యాస పరులై యనేక
పాదస్థులై సవితృ మండల మధ్యవర్తియైన నారాయణ
విగ్రహంబును జూచువారును, పంచాగ్ని మధ్యంబునందుఁ
గూర్చుండి మహాఘోర తపంబు సేయువారును, నృసిం
హానుష్టుభంబును, రామతారకంబును, గోపాలమంత్రం

బును, వరాహమంత్రంబును, వాసుదేవ ద్వాదశాక్షరం
బును, నారాయణాష్టాక్షరంబును, శుద్ధప్రణవ మంత్రం
బును, ప్రశస్తసప్తకోటి మహామంత్రంబుల న్యాస ధ్యాన
పూర్వకంబులుగ నేకాగ్రచిత్తంబున జపంబులు సేయు
వారును, శ్రీమన్నారాయణ విగ్రహంబును బూజించుచుం
దన్మంత్రపారాయణులై యుండువారును, వ్యాఘ్రకృష్ణా
జినవల్కలాంబరులై వాతాంబు పర్ణకందమూల ఫలా
హారులై కర్మ జ్ఞాన భక్తి వైరాగ్య జప తప హోమాది
సకల సత్కర్మ నిష్ఠల నుండు మహామునిజన సమూహ
మధ్యంబున. 40

సీ. అలఘు చతుర్బాహువులు చతుర్ముఖములు
నెనిమిది కన్నులు నసల సదృశ
తనువు దీపింపఁగ ధ్యాన యోగ సునిష్ఠ
నూని పద్మాసనాసీనుఁ డగుచు
ననుపమ నారాయణాష్టాక్షరీ జప
కలితుఁడై నాసికాగ్రమున దృష్టి
హత్తించి స్ఫటిక సదక్షమాలికఁ జేతఁ
బట్టి చిత్తము బిగఁబట్టి చక్ర
తే. పాణిపదములయం దుంచి పరమభక్తి
చే భరన్యాస యోగసంసిద్ధుఁ డగుచు
వనజసంభవుఁ డుండఁగాఁ గని వసిష్ఠ
సంయమీంద్రుఁడు విస్మయంబంది యపుడు. 41

తే. దశరథేశ్వర యిమ్మహా తాపసులను
గూడి పద్మజుఁ డిచట నెక్కువ తపంబు

సేయుచున్నాఁడు గావున శ్రీశుఁ డింక
నమరవరునకుఁ బ్రత్యక్ష మగుట నిజము. 42

వ. మఱి యేను భవదీయ పురోహితుండ నగుటం జేసి యిచ్చటి
కేతెంచితిఁ గావున. 43

తే. ధన్యుఁ డగు సర్వలోకపితామహుండు
భక్తి మెఱయనివాతదీపంబు వోలెఁ
దాఁ జలింపక యున్నాఁడు దనర నజుని
మెచ్చి ప్రత్యక్ష మగును లక్ష్మీవిభుండు. 44

ఉ. కావున దివ్యపుష్కరిణి కామఫలప్రదయంచు నమ్మి యో
భూవర నీవతి త్వరగఁ బుష్కరిణీ జలమందుఁ గ్రుంకి స
ద్భావన భక్తి మీఱఁగ జపం బొనరించుమటన్న నప్డు ధా
త్రీవిభుఁ డిట్లనెం బరమదేశిక తజ్జపమీవు చెప్పవే. 45

సీ. అనిన శ్రీ వేంకటేశాష్టాక్షరీమంత్ర
మా వసిష్ఠుండు పుత్రార్థియైన
దశరథేశ్వరునకు దయ నుపదేశంబు
సేయఁగా నృపతి వసిష్ఠమునిని
బూజించి కూర్చుండి పుత్రార్థియై మహా
శిష్టుఁ డై జపమును జేయుచుండె
నపుడు వసిష్ఠుఁ డత్యంత నిర్మలచిత్తుఁ
డగుచు నొక్కెడఁ దపం బాచరించు

తే. చుండె నంత నభంబున నుఱిమినట్లు
కడు భయంకర నినదంబు గల్గె నాస్య
నంబునకు బ్రహ్మ తనశరీరంబుఁ దెలిసి
కనుల నలువంకలం గనుంగొనుచు నుండ. 46

తే. దశరథుఁడు లేచి వెఱగంది ధాతృముఖ్య
దేవతాళికి మునులకు భావ మలర
మ్రొక్కె నప్పుడు వారెల్ల మొనసి నీకు
వంశ మభివృద్ధి యగునని వర మొసంగి. 47

వ. దశరథుని దీవించిరి యనంతరంబు. 48

క. ఆకాశంబునఁ బొడమిన
భీకరశబ్దంబు చెవుల భేదించిన దిం
దీకాల మభ్రఘోషం
బీకరణిం బుట్టఁ దగిన హేతువదేమో. 49

క. అని యందఱు గగన దిశం
గనుచుండ ననేకు లయిన కమలాప్తులు గూ
డిన యట్టులఁ దేజంబుగఁ
గనుపించెం దానిఁ జూడఁగాఁ జిత్రముగన్. 50

క. జ్వాలన గ్రహ నక్షత్రము
లలఘు తటిల్లత లనేకు లగు చంద్రులతోఁ
గలసిన గతి నమిత ద్యుతి
విలసితముగ నభము నిండె విస్మయ మారన్ 51

క. ఎక్కడఁ జూచిన కాంతులు
క్రిక్కిఱిసినఁ జూడలేక గీర్వాణముఖుల్
చొక్కుచుఁ గన్నులు మూసిరి
నిక్కము దెలియంగ రాక నెఱి నామీఁదన్. 52

సీ. అప్పుడు కోటిసహస్రమార్తాండప్ర
భానిభంబైన విమాన మొందు

పొల్పుగ వివిధ గోపురము లనేకంబు
లైన ప్రాకారము ల్హర్మ్యములును
లలితంబు లైన నీల స్తంభములు బహు
పటువజ్రసద్వారబంధనములు
భర్మ కవాటము ల్భాసురవిద్రుమ
మంటపంబులు దీర్ఘమందిరములు
తే. కాంచ నోన్నత గోపురకలశములును
భూరి మరకతముల నొప్పు తోరణములు
ఘనతరధ్వజములు పతాకములు మెఱయ
పంచవర్ణద్యుతుల నొప్పు పట్టణమున. 53

తే. పుష్ప మౌక్తిక హారము ల్భూరి కలశ
జాలముల నంటి గాలికిఁ దూలి యాడఁ
గలికి చిల్కలు శిఖి కలకంఠములును
దేనె లొల్కెడు పల్కులఁ బూని వల్క. 54

బ్రహ్మకు వేంకటేశ్వరుఁడు ప్రత్యక్ష మగుట.

వ. న ట్లొప్పు విమానపట్టణమధ్యంబునం దనరు సభా మంటపంబును దన్మధ్యంబున సహస్రమణిస్తంభయుక్తంబైన క్రీడా మంటపంబును దన్మధ్య నవరత్నస్థగిత మంటపచతుర్ద్వారంబులయందు ద్వారపాలకులు నిలిచి యుండ, నామంటప పరివృతరాజవీధుల నవయౌవనాలంకృత సుందరీజన సమూహంబులును మెలంగ,విచిత్ర కలితంబగు న ద్దివ్య విమానంబు వీక్షించి డగ్గఱ నుండు వసిష్ఠాది మునులం జూచి య వ్విరించి యిట్లనియె. 55

చ. మునివరులార ! మజ్జనకు ముఖ్యవిమానలస త్ప్రకాశ మా
దినకర చంద్ర పావకుల దీధితులన్ హసియించుచు న్నభిన్
ఘనతరమై నభోదిశను గన్పడుచున్న ది చూతమంచు న
య్యనిమిష తాప సోత్తముల నందఱఁ బిల్చి ప్రమోద చిత్తుఁడై.

సీ. అంబరమార్గాన నరిగి విమాన పూ
ర్వద్వారమునఁ జొచ్చి వనజభవుఁడు
పోవుచుండఁగఁ జూచి పురుహూతముఖసుర
సంయము ల్దశరథ చక్రవర్తి
యజుఁడు పోయిన త్రోవ నావిమానమునందుఁ
జేరి యచ్చట విష్ణుసేవ నెంచి
యంతరాంతరములం దరుదుగా వెదకుచు
భయభక్తు లెసఁగ నా బ్రహ్మముఖులు
తే. వాసుదేవుని వీక్షించి వాంఛ మీఱ
మనము లుప్పొంగ నాస్థానమంటపముల
లోఁ బ్రవేశించి రప్పుడా లోకకర్త
యైన నారాయణుండు దయార్ద్రుఁ డగుచు. 57

వ. క్రీడా మంటప మధ్యంబున నవరత్నస్థగిత పద్మ పీఠంబునందుఁ
బ్రాకృత ప్రకాశుండై మఱియును. 58

సీ. మకుట కౌస్తుభ రత్న మకర కుండలములు
ఘన మేఖ లాంగద కంకణాలు
వర వనమాలికా వైజయంతుల దీప్తి
నలరు గ్రైవేయక హారములును
కనకాంబరం బొగిఁ గాంతుల నీను దే
హమునందు వెలుఁగఁగా నభయదాన

కలిత దక్షిణ కర కమలంబు పావన
చరణంబు లర్చింప సరవిఁ జూప
తే. వామ హస్తాంబుజము కటిసీమ నొప్పఁ
దక్కిన కరంబులను శుభద మగు శంఖ
చక్రములకాంతు లెసలార శస్త్రకాంతి
సర్వతోముఖుఁడై దయాస్వాంతుఁడగుచు. 59
క. హరి ముద మొందుచు నుండఁగ
వరవక్షమునందు సత్య వరభూషణ మై
సిరి దనరఁగ నిరుగడలను
ధరణియు నీళయు వసించి తద్దయు మెఱయన్. 60
సీ. నీలమేఘమునందు నిలచిన క్రొక్కాఱు
మెఱపు రీతిగ సిరి యురమునందుఁ
గుడిభాగమున నీళ యెడమ భాగంబున
భూదేవి బహురత్న భూషణములు
బంగ రంచులు కుసుంబావస్త్రములు దాల్చి
కుటిలాలకంబులు నిటలములను
లీలగఁ జాల మిళింద పఙ్క్తులవలెఁ
జలియింపఁ గస్తూరితిలకములును
తే. గనులఁ గాటుక గంధలేపనము లమర
వరకిరీటంబులను విరిసరులు గదలఁ
జంద్రబింబనిభాస్య లాచక్రధరుని
గొలిచి మెలఁగుచు సంతోషకలిత లయిరి. 61
వ. ఇవ్విధంబున నతి కోమల తులసీదళచ్ఛాయ దేహకాంతి నొప్పుచు దక్షిణహస్తంబున నీలోత్పలంబుఁ బూనిన

భూదేవియు విద్యుల్లతాసంకాశ యై ప్రకాశించి కరంబునం
గరంబు మెఱయు శ్వేతకమలంబు ధరించిన శ్రీదేవియుఁ
గమలకర్ణికాసన్నిభయై దీపించు వామకరంబున శోణాంబు
జంబుఁ దాల్చిననీళాదేవియు హరిం జేరి ఛత్త్రచామరం
బులు పట్టిన సుందరీమణులు గొలుచుచుండుసమయం
బున శ్రీనివాసుండు కరుణాకటాక్షవీక్షణుండై బ్రహ్మేంద్రా
దులకుఁ బ్రత్యక్షంబయ్యె నప్పుడు కమలగర్భాద్యగ
స్త్య వసిష్ఠ మహామునులును సనకసనందనాదిమహాయోగు
లును బురుహూతాది గీర్వాణులును శ్రీహరికిం బునః పునః
ప్రణామంబు లొనర్చి పులకాంకితశరీరులై సంపూర్ణానందం
బున గద్గదకంఠులై బాష్పపూరితాక్షులై కరంబులు
మొగిడ్చి యిట్లు నుతించిరి. 62.

దండకము.—శ్రీమత్పరాకాశ శేషాచలాధీశ మంగాముఖోల్లాస
మౌనీంద్రహృద్గేహ శృంగారసద్భక్తమందార మాధుర్య
వాగ్వ్రిత మాయాగుణాతీత సర్వార్థనిర్ణేత సన్మోక్ష
సంధాత శ్రీభూమి నీళా సమేతాంబుజాతాక్ష పాఠీన
కూర్మామితక్రోడరూపా నృకంఠీరవా వామనా రామ
రామా మహాసీరహస్తా యశోదార్భకా బుద్ధకల్కిప్రభావో
జ్వలాకార కాలానురూప ప్రకారాద్భుతానంత లీలావతారా
నిరాకార వేదాంత సారాబ్ధిగంభీర హేమాద్రిధీరా పకా
రాకరా పాదసంసారదూరా చిదాకార కారుణ్యపూరాగ
మాగణ్యపుణ్యానుగుణ్యా సదాక్షిణ్య హైరణ్య నేత్రాది
దైత్యేశ్వరారణ్య దావానల జ్వాల దేవేంద్ర ముఖ్యామర
శ్రేణి పాలా సుశీలా సువర్ణాభచేలా రమాలోల విశ్వాది-



మూలా మహాయోగి జాలాత్మ కంజాత రోలంబ బింబాధరా
కంబుకంఠా నిరాలంబ గోవింద నందాత్మజా గోప బృందా
వనా దివ్యబృందాటవీవాస కందర్పసౌందర్య మందస్మితాబ్జో
పమూనా సదానంద చిత్తా ముకుందా గదా శంఖ చక్రా
ద్యనేకాయుధా ఘోరనక్రాంతకా దీనమాతంగసంరక్షకా
ఖండచండప్రతాపా, లసత్కుండలాలంకృతాజాండభాండో
దరా నంతశాంతస్వరూపాఘనిర్లేప నిర్వాణమార్గప్రదీపా
రణోద్దామలోకాభిరామా ఘనశ్యామ సంపూర్ణకామా
మహాశత్రుభీమా జితశ్శౌర్యభౌమా మునిస్తోమ దేవో
త్తమా దేవతాసార్వభౌమా సదా మిమ్ము సేవించు మమ్మెల్ల
రక్షించు మీశా సుఖావాస శ్రీమ న్నృసింహా నమస్తే
నమస్తే నమః. 63

వ. అని యివ్విధంబున నుతించి మ్రొక్కి లిడుచున్న బ్రహ్మేం
ద్రాదులం గరుణించి శ్రీహరి యిట్లనియె. 64

ఆ. వనజగర్భ నీవు వచ్చిన పని యేమి
దెలుపు మనిన బ్రహ్మదేవుఁ డెలమి
మది నెసంగఁ గనుల మధుసూదనుని జూచి
యిట్టు లనియె మోద మినుమడింప. 65

సీ. దేవదేవ పరాత్మ దీనరక్షక విన్న
వించెద మనవి యాలించి వినవె
వసుధ నిప్పుడు దశవదనుండు తప మాచ
రించి గర్వోన్నతి మించినాఁడు
సుర యక్ష కిన్నర గరుడ గంధర్వప్ర
ముఖులచే మడియని ముఖ్యవరము

లడిగె లేదన కూర కా వరంబులు వాని
కిచ్చితి నందున హెచ్చి వాఁడు
తే. లంకలో నుండి సుంతైన శంక లేక
భటులఁ బురికొల్పి శ్రీగిరి ప్రాంతదేశ
ములఁ జరించుచు ఋషిసాధువులకు హింస
చేయుచున్నాఁడు వాఁడు నశించిపోఁడు. 66

ఆ. వరము లడుగువేళ వాఁడు మానవునిచే
మడియ కుండువరము నడుగ లేదు
గానవాని కంతకాలంబు వచ్చిన
తఱిని ద్రుంచు నరుఁడ తథ్యమనుచు. 67

క. సరసిజగర్భుఁడు వల్కిన
హరి దరహసితాస్యుఁ డగుచు నప్పు డగస్త్యుం
గరుణం గనుఁగొని మౌనీ
శ్వర నీ విపు డిచటి కేల వచ్చితి వనఁగన్. 68

ఉ. అప్పు డగస్త్యమౌని గమలాక్షుని సన్నుతి చేసి యిట్లనెం
ముప్పిరిఁగొన్న గర్వమున మూర్ఖ దశాస్యుఁడుమర్త్యకోటులం
దెప్పునఁ ద్రుంచుఁగాన జనదీనదశం గన లేక తత్క్రిమం
బిప్పుడు మీకుఁ జెప్పఁ దగు హేతువు గల్గఁగ వచ్చితీశ్వరా.

ఆ. రావణాఖ్యుఁ ద్రుంచి ప్రజలను రక్షించి
మమ్ముఁ గావుమంచు మౌనివరుఁడు
విన్నవింప నగుచు విని యప్పు సనకాది
యోగివరులఁ జూచి శ్రీగురుండు. 70

ఆ. ఆదియోగు లగుచు నానందమున నుండు
వారు మీరు కోరి వచ్చినట్టి

హేతువేమొ తెల్పుఁ డిపుడన్న సనకాది
యోగు లిట్టులనిరి యో మహాత్మ. 71

క. అంతర్యజ్ఞానాఢ్యుల
సంతతమును జూచుచున్న సద్విగ్రహముల్
వింతగఁ గర్మాఢ్యులఁ గను
భ్రాంతిని వచ్చితిమి మేము ప్రవిమలహృదయా. 72

చ. అని సనకాదియోగివరు లాత్మరహస్యవిచారలక్షణం
బెనసిన యోగమార్గరతి హెచ్చిన సూక్తుల విన్నవింపఁగా
విని ముదమొంది నవ్వుచును విష్ణుని జిష్ణుని జూచి నీవు వ
చ్చిన పనియేమి మాకిపుడ చెప్పుమటన్న సురేంద్రుఁ డిట్లనెన్

సీ. యజ్ఞేశ యజ్ఞాంగ యజ్ఞభావనయజ్ఞ
కర్మఫలప్రద నిర్మలాత్మ
మాధవ మాపితామహుఁడు నగస్త్యుండు
మనవిచేసినరీతి ననిశ మవని
యందు రావణుఁడు దురాత్మకుఁ డై మమ్ము
బాధించు శ్రీనగప్రాంతములను
ముని మనుష్యాదుల మూర్ఖుఁడై వేధించు
వాని మర్దింప నెవ్వాఁడు లేఁడు

తే. దేవ రయమున వాని మర్దించి సకల
జనుల మౌనుల మమ్ము రక్షణము సేయ
శక్తి యుక్తులు మీయందుఁ జాల గలవు
గాన మే మెల్ల దుగ్ధసాగరమునందు. 74

ఆ. మిమ్ము వెదకి చూచి మీ రందు లేమికి
విపిన గిరులయందు వెదకి మాఁడు

లోకములను మఱియు వైకుంఠముఁ జూచి
కట్టకడకు నిటకుఁ బట్టువట్టి. 75

క. మీపాదములను బడిలిమి
తాపము నెడ వచ్చితిమి ముదంబున ధర నా
బాపాత్ముఁ డైన రావణు
నేపగిదిం జంపి మమ్ము నేలు ముకుందా. 76

వ. అని యనేక విధంబుల నుతింప నక్కమలాక్షుండు బ్రహ్మాది
దేవతలం జూచి నగుచు నిట్లనియె. 77

చ. జలజజముఖ్యులార మిము సత్కృప మీఱఁగ నేన గాచెదఁ
ఖలుఁడగు రావణాసురని ఖడ్గముపాలును జేయుదేను మీ
రలరఁగ నబ్ధి దాఁటి భయమందకుఁడింక సుఖంబునుండుఁడం
చెలమిని బల్కుచుండ శివుఁడేగి నుతించి నయోక్తులారఁగన్.

సీ. మర్త్యలోకమునకు మనుజాశనులవేధ
దప్పింప శేషభూధరమునందు
నిలిచి మానవులకు నీవు ప్రత్యక్షమై
యుండ రాక్షసులు రాకుండు రిటకు
నవల నెప్పుడు నిన్ను నందఱు సేవించు
చుందురు నిర్భయ మొంది యిచటఁ
బొసఁగ నీ కీ గిరి భూలోక వైకుంఠ
మగుచుండు నేను బాయక వసింతుఁ

ఆ. గాన నాకుఁ దగిన తానకం బొండిందుఁ
జూపు మిర్వరమును సురగణంబు
పొగడ నుంద మంచు నగజేశుఁ డనఁగ నా
చక్రి నగుచు ననియె శంకరునకు. 79

ఉ. ఓపరమేశ నీ విచట నుండుట నిష్ట మెసంగె నాకు నీ
వీ పరమాద్రిక్రింద వసియింపుము తీర్థము డగ్గఱం దగం
బ్రాపునఁ జేరి మానవులు భక్తి నినుం గొనియాడు చుండ్రునీ
వీ పని సేయు మెంతయు మహీతలమందు నెసంగుఁ గీర్తియున్.

వ. అని పల్కుటంజేసి యా యుమాకాంతుండు సంతసించిన
వాఁడయ్యె నంత. 81

క. హరిహరు లీభూతలమున
నిరవుగ నుండుటకు నజసురేంద్రాదిమునుల్
పరమానందము నొందిరి
హరి యంతట దశరథేంద్రు నటు గని యనియెన్. 82

ఆ. దశరథేశ నీవు తాపసులం గూడి
యిటకు వచ్చినట్టి హేతు వేమి
దెలుపు మనిన భక్తి దీపింపఁగాఁ గోస
లేశ్వరుండు శ్రీరమేశుఁ జూచి. 83

వ. కరకమలంబులు ముకుళించి యిట్లు వినుతించె. 84

తే. విశ్వకారణ విశ్వాత్మ విశ్వరూప
సంతతానంద విగ్రహ చక్రపాణి
మిమ్ము జూడంగ మదినెంచి మీకటాక్ష
మిపుడు గామించి వచ్చితి మిందిరేశ. 85

ఆ. ఎవరికొఱకుఁ బద్మజేంద్రప్రముఖ్యులు
తప మొనర్తు రెవరి ధన్యసూక్తు
లెపుడు వినఁ దలంతు రెవరి ప్రత్యక్షంబుఁ
గోరుచుందు రట్టి గురుఁడ వీవ. 86

ఆ. నాశరహితమై యనాదిప్రకాశమై
బట్టబయలనుండు పరమపదము
మానివాసమయ్యెఁ గానమీసరోజ్వస్న
మెఱుఁగి వొగడఁ దరమె దేవ. 87

దశరథమహారాజు శ్రీస్వామిని స్తుతించుట.

సీ. దేవదేవ పరాత్మ దీనుఁడనై యొక్క
మనవి చేసెదను నెమ్మదిగ వినుఁడు
మీరిచ్చినటువంటి భూరిభాగ్యంబులు
గలిగి యున్నవి వంశగౌరవంబు
నిలుపఁగాఁ దగుపుత్త్రకులు లేరుగావునఁ
జింత పుట్టినది నాచిత్తమునను
బుత్త్రహీనులకు సత్పుణ్యలోకములు లే
వని వేదపూరుషుం డవనిఁ బల్కెఁ

తే. దాపమొందుచు వచ్చి నే మీపదములు
నమ్మి సేవించితిని గాన నెమ్మిమీఱ
సత్యధర్మపరాక్రమశక్తిమతులు
గలుగు పుత్త్రుల నాకిమ్ము కమలనాభ. 88

క. అని దశరథుఁ డిమ్మెయి నన
విని మనమున సంతసించి విష్ణుం డపుడి
ట్లనియెను జన్మాంతరమున
ఘనపాప మొనర్చినావు కావున నీకున్. 89

తే. పుత్త్రకులు గల్గరైరి యోభూప యనిన
విని మనంబున లజ్జించి వేగ ధైర్య

కలితుండై శ్రీరమేశుని నెలమిఁ జూచి
యివ్విధంబున ననియె నరేంద్రుఁ డపుడు. 90

సీ. నలినాయతేక్షణా నాపూర్వజన్మానఁ
జేసినదురితంబు సేరియున్న
నర్కోదయంబుచే నంధకారము వాయు
నట్లు మత్కలుషచయంబు సరగ
మిముఁ జూచినప్పుడ సమసె నిఁకేమి ధ
న్యుఁడ నైతి నాతప్పు లెడఁద నిడక
పుత్త్రుల నొసఁగి సంపూర్ణసంతోషాత్ముఁ
జేయుము సత్కృప శ్రీనివాస

తే. యనుచు నానావిధంబుల వినుతిసేసి
పావనాంఘ్రియుగంబులఁ బడిన నృపునిఁ
జూచి శ్రీచక్రి కృపనిట్లు శుభదవచన
ములను బల్కెను మునులెల్ల ముదమునొంద. 91

సీ. దశరథేశ్వర నీకు భృశకలుషంబెల్లఁ
బోలఁగెఁ జింతింపకు నెలమినుండు
బాహుబలాఢ్యులుఁ బరిపంథిగజయూథ
కంఠీరవంబులుఁ గమలమిత్ర
తేజులు నగుచు ధాత్రీభారము వహించి
వెలయుదు రాత్మజాతులు యశమునఁ
బొమ్ము నీపురిఁ జేరి పుత్త్రకామేష్టి గా
వింపు శీఘ్రంబుగ వేడ్కఁ దనర

తే. నినకులేశ్వర నీనుతి కేను సంత
సించినాఁడను విప్రులఁ జేరి యచల

చిత్తుఁ డై యొగి నప్పని జేయు మంచుఁ
బలుక నారాజవర్యుఁడు పరమభక్తి. 92

వ. దండప్రణామంబు లాచరించి బ్రహ్మాదులకు మ్రొక్కి వారి దీవన లంది నిజగురు వసిష్ఠసహితుఁ డై పురంబు సేరి పుత్రకామేష్టి సేయుచుండె. 93

ఆ. అంత బ్రహ్మదేవుఁ డాహరికిని మ్రొక్కి
చక్రి! యేను మిమ్ము సరవి నొక్క
విషయ మడుగఁ దలఁతు వేడ్క నానతియిందు
నేమనంగ వినుఁడు శ్రీమణీశ. 94

వ. ఈ కల్పాంతంబు వఱకు నే నిందుండి మనుజులు సేయుదురా చారంబులకు యముండు దండించుటం జేసి వారి జనన మర ణాదులకుఁ దగిన యేర్పాటు లొనర్పవలయు నందులకుఁ దాము దోడ్పడి రక్షింపవలయు మఱియును. 95

సీ. కలియుగంబున నింకఁ గల్గు మానవులు దు
రాగ్రహుల్ దుష్కర్మకాదిరతులు
మలినాత్ము లల్పాయువులు లోభు లన్యాయ
పరులు మూర్ఖులు నయవంచకులొగిఁ
బరధనకాంక్షులు పరభార్యగమనలీ
లావినోదులు గర్వభావయుతులు
బ్రాహ్మణదూషణపరులు స్తోత్రప్రియు
లాత్మపుత్రద్రోహు లాత్మహత్య
తే. రతులు నిర్దయహృదయులు రాజభక్తి
విరహితులు ధర్మశాస్త్రసద్వేదనింద

కులు కులద్రోహు లెంచఁగ గురులద్రోహు
వారు మాత్సర్యకలితులు వసుధ మఱియు. 96

వ. జారచోరప్రవర్తకులు, స్వకన్యకా విక్రయాసక్తులు, దేవతారాధనాదులకు నయిష్టులు, సాధుజనుల బాధించువారలు కావున వారివారి కర్మవిధులం బేరికించి రక్షింపవలయు ననిన నాహరి విని కుమారుం జూచి నీయిష్టం బొక్కింత గొఱంత నేయక యీశేషగిరీంద్రంబునందు వసియింతు వైకుంఠపురంబున నుండి సకలతీర్థంబులకు స్వామినియై వెలయు పుష్కరిణి యీశైలమునందుండ నట్టిపాతకు లీ పుష్కరిణియందు నత్యంత భక్తి గ్రుంకు లిడిరేని వారి పురార్జిత కలుష చయంబెల్ల నశింపదె. వారి యభీష్టంబులు పరిపూర్ణంబు లగుచుండు ననినఁ జక్రిం జూచి యజుం డిట్లనియె. 97

క. దనుజులు భూలోకంబున
ననుపమ గర్వంబు మించి యటవుల గిరులం
దున నిల్చి బాధ పెట్టెద
రనఘా తద్బాధ మాన్పు మలజనములకున్. 98

తే. అనిన నాచక్రపాణి నయంబు మెఱయఁ
జక్రమును జూచి యిట్లనెఁ జక్రరాజ
వివిధసాధనములతోడ వేగ ధాత్రి
కేగి రాక్షసులను ద్రుంచు మిపుడ కడఁగి. 99

సీ. అన విని యాచక్ర మబ్జాక్షునకు మ్రొక్కి
కుముదాది వీరులఁ గూడి వెడలి
ప్రళయకాలాభీల భానుబింబమురీతి
సరభసంబునఁ బోయి సకలదుర్గ

దిగ్దేశములనుండు దేవకంటకులపైఁ
గవిసి పోరాడి యాగ్రహము పెంచి
చంపి దేశములకు శస్తము గావించి
శీఘ్రమ కంజాక్షుఁ జెంతఁ జేరి
తే. మ్రొక్కి యోస్వామి దశకంఠుఁ ద్రుంచి వాని
బలము నేల్పాలు గావించి వచ్చితనినఁ
జక్రముం జేతఁ బూని యా జలజభవుని
జూచి యిట్లనె సంతోషచూడ్కి నపుడు. 100

ఆ. అజుఁడ నీవు చెప్పినట్లు చక్రం బేగి
యమరరిపుల నెల్ల నవని ద్రుళ్ళ
నేసి వచ్చె నీవు పో సుఖంబుగ మనం
బుననొకింత వింతఁ బొంద కనఁగ. 101

వ. విరించి యూరక నిలచియుండుటం జూచి చక్రి యిట్లనియె.

క. వనజాసన నేఁ బొమ్మన
విని యూరక యుండ నేల వివరింపుము నీ
మనమునఁ గల వాంఛను వే
యనినం బంకజభవుండు హరి కిట్లనియెన్. 103

సీ. దేవ మీరును రమాదేవి నావిన్నప
మాలకింపఁగవలె నదియు వినుఁడు
వేంకటగిరిమీఁద విఖ్యాతినుండు మీ
కున్నత మైన రథోత్సవంబు
సేయింపవలె నవి చిత్తగింపుఁ డటంచు
విన్నవించంగ నా వెన్నుఁడలరి

యట్టుల సేయుమటంచుఁ జెప్పఁగ నజుం
డంత మానుల నమరాది దేవ
తే. బృందములఁ గూడి యప్డు గిరీంద్రమందు
విశ్వకర్మను రావించి వివిధ చిత్ర
వీథులం దేజరిల్లఁగ వేడ్కఁ బురము
నరవి నిర్మింపు మనఁగ నాశ్చర్యమొంది. 104

చ. అనఘుఁడు విశ్వకర్మ విపులాద్భుతచిత్రవిచిత్రరీతులన్
బెనుపుగఁ దప్తహేమపుటభేదనముల్ రచియించి పిమ్మటన్
ఘనతర మేరుతుల్యముగఁ గాంచనరత్నరథంబు దీర్చి యి
చ్చినఁగని పద్మజుండు నిజచిత్తమునందు ముదంబునొందుచున్.

క. ఘనుఁడగు విఖనసుఁ డనుమునిఁ
గనుఁగొని వైఖానసప్రకారససూత్రం
బును విడక తగిన లగ్నం
బును గనుమని సంతసంబు పొంపిరివోవన్. 106

బ్రహ్మోత్సవము.

సీ. అజుఁ డప్డు వల్కె నాయనఘుఁడౌ విఖనస
ముని యిట్టు లనియె నో వనజభవుఁడ
వినుము కన్యారాశి నినుఁ డుండు మాసానఁ
జిత్రతారాన నుచితముగాను
శాస్త్రసమ్మతముగ శస్తముగాన నా
రోహణాదులు చేసి రూఢి మెఱయ
నుత్తరాషాఢ రథోత్సవం బొనరించి
రహిఁ దీర్థవారి నా శ్రవణమందుఁ

తే. జేయు టుచితంబనఁగ సురజ్యేష్ఠుఁ డంత
సకలదేశాధిపతులను సంతసముగ
నుత్సవముఁ జూడ రావించి యుత్కటమగు
వేడుకలు మించఁ జేయించువేళ నటకు. 107

వ. ద్రవిడ కర్ణాట కురు కుకుర కేరళ కేకయ కోసల మగధ మాళవ శూరసేన చోళ నేపాళ మళయాళ బంగాళ పాండ్య పాంచాల కొంకణ టెంకణ విదర్భ సౌరాష్ట్ర శక సౌవీర యుగంధ రాంధ్ర విదేహ మత్స్య పుళింద చేది త్రిగర్త సింధు సింహాల లాట కాంభోజ కాశ్మీర మహారాష్ట్ర దేశాధీశ్వరులు పరిజనంబులతోడను, బంధుమిత్రకళత్రపుత్రసహితహితంబుగ గోవిందేతినామంబులు స్మరించుచు నవ్వేంకటాచలారోహణంబుచేసి శ్రీపుష్కరిణియందు సభక్తిస్వాంతులై స్నానం బొనర్చి శుచివస్త్రధారులై, శ్రీవరాహస్వామి నీక్షించి పరమానంద మొదవ వినుతించి నమస్కరించి కానుకలర్పించి శ్రీనివాసుని మందిరంబున కేతెంచి యనేకవిధంబులం బొగడుచు దండప్రణామంబు లాచరించి వివిధవస్త్ర భూషణ ఫలపుష్ప తాంబూలము లర్పించి ధన్యులమైతి మని సంతసించు నెడ నజుండు విష్వక్సేనుం బిలిచి యిట్లనియె. 108

క. విను సేనాధిప మజ్జన
కునకు మహోత్సవము లిచటఁ గొనియాడఁగ నె
మ్మనమున సమకూర్పఁగ వే
జను మందల మెక్కి యనఁగ సంతసమారన్. 109

సీ. అపుడు సేనాపతి హరి కజునకు మ్రొక్కి
యందలం బెక్కి సానందుఁ డగుచుఁ

దనపరివారంబులను గూడి వీథుల
యందుఁ జరించుచు నందఱకును
దగుపను ల్నియమించి ధాతచెంతకు వచ్చి
యంజలి గావించి యచటఁ జేయఁ
దగు పను ల్సేయింపఁ దా నాద్యుఁడై యుండె
నా విఖనసుఁడు దా నంత వేడ్క
తే. ననఘ మంత్రాలచేతఁ బుణ్యాహవాచ
నంబు గావించి వరశరావంబులందుఁ
బాలికెలనిడి ధాన్యాదు లోలి వైచి
యొప్పు నాగమవిహితమంత్రోక్తముగను. 110

వ. హస్తయందు నంకురార్పణంబును, నైవేద్యాదికృత్యంబులు నెఱవేర్చి, యమ్మఱునాఁ డుదయంబునఁ బుణ్యాహవాచన వాస్తుహోమ గరుడప్రతిష్ఠా గరుడహోమ భేరీ తాళ తాడన కంకణ ధారణార్చక బహుమానాది కృత్యంబు లొనరించి మఱియును. 111

సీ. హరికి భూమికి నీళకభ్ధికన్యకు నూత
నాంబరాభరణంబు లర్పణములు
చేసి శృంగారము ల్సేసి హాటకరత్న
దీధితు లొప్పిన తిరుచయందు
వేంచేపు సేయించి వివిధమంగళవాద్య
ములు భూనభోంతరంబుల నెసంగ
మ్రోయుచు నుండఁగ ముందఱ దిగ్బలి
తగఁ జల్లుచుండఁగ ధ్వజపటంబు

తే. ప్రబల చక్రము సేనాధిపతియు నడువ
మునులు సనకాదియోగులు మొనసి వొగడ
ఛత్ర చామరములఁ బూని సకల దేవ
గణములు న్గొల్వ వీథులఁ గడు ముదమున. 112

సీ. అఖిలవైభవములు నానందనిలయంబు
నకుఁ బ్రదక్షిణముగ నలినభవుఁడు
శ్రీహరి వేంచేపుఁ జేయించికొనిరాఁగ
విఖనసుఁడటు శాస్త్రవిహితముగను
వారక వేడ్క ధ్వజారోహణము చిత్త
యందొనరిచి రాత్రియందుఁ బరఁగ
నావాహన మొనర్చి యానాఁటఁ గోలె దీ
క్షను దగి యగ్నిని దనరఁ నునిచి
తే. సకలదైవత్య సార మాత్మికము లనఁగఁ
దగిన హోమము లొనరించి తక్క కపుడు
నిత్యహోమంబులం జేసి నెమ్మిమీఁఱఁ
జక్రమును వాద్యములతోన వక్ర మలర. 113

వ. దిగ్బలులతో వేంచేపు చేయించి రథము వెంట శేషవాహ
నంబు మీఁద శ్రీనివాసుని నాసీనుం జేసి విమానంబునకుఁ
బ్రదక్షిణంబుగ ననేకసేవకులతో నుత్సవం బొనరించి
యజుండు హరిని స్వస్థానంబునకుఁ జేర్చి యనంతరంబు నవకల
శపాలకారాధన నైవేద్య హోమచక్ర బలి ప్రముఖ
నిత్యకృత్యంబులు నిర్వర్తించి యలఘు శేషవాహనోత్స
వంబు గావించిన మఱునాఁ డుదయంబున లఘు శేషవాహ
నోత్సవంబును, దద్రాత్రి హంస వాహనోత్సవంబును,

మూఁడవ దినం బుదయంబున సర్వభూపాలకోత్సవంబును, దద్రాత్రి కల్పవృక్షోత్సవంబును, దన్మఱునాఁడు మోహినీ వేషధరుం డైనవారికి నాందోళికోత్సవంబు నాఱవదినం బుదయమున హనుమద్వాహనసంచారోత్సవంబును, తత్సాయం కాలము వసంతోత్సవానంతరము సప్తమదినోదయంబున సూర్యప్రభోత్సవంబును, దద్రాత్రి చంద్రప్రభోత్సవంబును, నెనిమిదవదినంబున షోడశమహాదానాది విహితకృత్యంబులు నడపి మఱియును. 114

సీ. ఘనతరోన్నతముగఁ గనకాద్రితుల్యమై
రంగునిగ్గులనొప్పు రథమునందు
నెలవుగ శ్రీభూమి నీళలతోఁ గూడ
వారి నుంచి బ్రహ్మాదు లలఘురథము
సాగించుచుండఁగ సకలదిక్పాలకుల్
గరుడ గంధర్వ కిన్నరగణములు
సిద్ధవిద్యాధరుల్ సేవింప వేదదుం
దుభులు మ్రోయఁగ మహాద్భుతము దనరఁ
తే. బారిజాతసుమంబు లా బ్రహ్మరథము
పైన రంభాదులటఁ జల్లి పాడియాడి
కనులఁబండువఁగాఁ జూడఁగా ధరిత్రి
యందుఁగల మానవులు వేంకటాద్రిమీఁద. 115

సీ. ధీరయుతుల్ వాసుదేవుని విజ్ఞాన
సురుచిరభక్తులఁ జూడఁగాను
నుపనిషత్తులు చెప్పు చొగి స్మార్తు లాహారిం
జిత్స్వరూపమును లక్షింపఁగాను

మొనసి వైష్ణవకోటి గని భక్తిఁ బాడుచుఁ
బరవశత్వము మీరఁ బరగఁగాను
వాదులును వేదశ్రుతిసార మీ
దేవతోత్తముఁడని తెలియఁగాను
తే. జెలఁగి హరికీర్తనలు కొవు జెప్పఁగాను
పండితులు విని శ్లాఘించుచుండఁగాను
బ్రాహ్మణస్త్రీలు పాటలు పాడి హరికి
నెయ్యమున మంగళారతు లియ్యఁగాను. 116

సీ. పరమభాగవతులు భక్తిమైఁ బాడుచు
నుప్పొంగి యాడుచు నుండఁగాను
గరములు ద్రిప్పి భోగస్త్రీలు ముందఱ
జతలుగ నృత్యము ల్సలుపఁగాను
గ్రమముగ వంది మాగధ సూతబృందము
ల్పురుషోత్తమునికీర్తిఁ బొగడఁగాను
శిరములఁ గలశము ల్జేర్చి కొందఱు భక్తు
లొక్కెడఁ బ్రేంఖణ ల్ద్రొక్కఁగాను
తే. మొనసి కొందఱు గోవింద యనుచు భక్తి
పరవశత్వముచే మించి పలుకఁగాను
రథముపై నక్షతల ననురాగయుక్తి
సతులు మేడలపై నుండి చల్లఁగాను. 117

వ. ఇట్లనేకు లనేకవిధంబులుగ వినోదించుచు వినుతించుచు భక్తి మెఱయింపుచుండఁగఁ గనక కమల సుగంధ పుష్ప మౌక్తిక హారంబులం దులదూగుచు మేరు సమానంబగు తేరానంద నిలయంబునకుఁ బ్రదక్షిణంబుగ వచ్చి యథా

స్థానమునందు నిలిచె నంత శ్రీ వేంకటాద్రీశుండు భూ నీళా సమేతంబుగ రథంబు డిగ్గి బ్రహ్మ రుద్రాదులతోడఁ గల్యాణ మంటపంబునందుఁ బ్రవేశించి నిత్యహోమాది కృత్యంబు లొనర్చి సకల దేవగణంబులచేతఁ బూజితుం డై ధ్వజారోహ ణంబు మొదలుకొని యారగించినరీతి నానావిధ భక్ష్య భోజ్యంబులం బరితృప్తి నొందినవాఁ డయ్యె. అంత బ్రహ్మా దులు నారగించి పరితృప్తి నొంది హరిని యుచ్చైశ్శ్రవంబున నుంచి విమానప్రదక్షిణంబు సేయించి కల్యాణమంటపంబున నునిచి వేడ్కల నలరించి యథాస్థానంబున నుంచి మూర్ధాభి షేకంబు సేయించి క్రమ్మఱఁ జక్రత్తాళ్వారును హరిని శ్రీ భూమి నీళలను దిరుచయందు విమానప్రదక్షిణంబుగ స్వామిపుష్కరిణీతీరంబున వేంచేపు సేయించి వరాహస్వామి ముందట మంటపంబున నునిచి పంచామృతస్నానాది తిరు మంజనంబును జక్రస్థాన నైవేద్య క్రమంబుల నాచరించి బ్రహ్మాదు లవభృథస్నానంబులు సేసి రప్పుడు హరి వారలం జూచి కరం బెత్తి యిట్లనియె. 118

సీ. బ్రహ్మ రుద్రాది దిక్పాలకు లందఱు
నామాట వినుఁడు నిర్ణయముగాను
శ్రవణోడునందుఁ జక్రంబుతోఁ గూడ నా
స్వామిపుష్కరిణిలో స్నానములను
సల్పువారలు పూర్వజన్మంబులను జేయు
పాపంబులను బాసి భాగ్యవంతు
లై యిహ పరములయందు సుఖింతురు
నామాట నిజముగ నమ్ముఁ డనిన

తే. శంకరుం డజుఁ డియ్యది సత్యమంచుఁ
బల్కి రటుమీఁద సకలవైభవము లెసఁగ
శ్రీనివాసుఁడు కోవెలఁ జెంది యచటఁ
బొసఁగఁ గల్యాణమంటపంబున వసించె. 119

వ. మఱియు విఖనసప్రముఖులు ప్రసూనయాగ నిత్యకృత్యంబు లొనరించి పత్నీ సమేతంబుగ శ్రీపతిని విమాన ప్రదక్షిణంబు సేయించి క్రమ్మఱ నిజస్థానంబునం దుంచి బ్రహ్మాది దిగ్దేవతా బలియు నుద్వాసనంబును ధ్వజారోహణంబు నంకురాక్షతారోపణంబును సంపూర్ణహోమంబును గలశోద్వాసనంబును శ్రీస్వామియందుఁ బ్రధానకలశావాహనంబును గావించి రప్పుడు, శ్రీనివాసుండు విఖనసునకు బహుమానం బొసంగి కనకరత్న మయం బగు సభామంటపంబునందు శ్రీభూ నీళా సమేతంబుగ సకల దివ్యభూషణ కనకాంబర గంధోపేత కుసుమదామాలంకృతుఁడై బ్రహ్మ రుద్రేంద్ర ముని యోగీశ్వరప్రముఖులును సకలదేశాధీశ్వరు లైన రాజులును పరివేష్టించి కొలువ సకల వైభవంబు లంగీకరించుచుఁ గర దీపికా సహస్రంబులు ప్రకాశింప హేమసింహాసనాసీనుం డై కొలువుండి బ్రహ్మను జూచి సంతసంబున నిట్లనియె. 120

క. కమలజ నీసంకల్పము
క్రమముగ ఫలియించె మోదకలితుఁడ నైతిఁ
సుమహితముగ నీయుత్సవ
మమరఁగ బ్రహ్మోత్సవాఖ్య మవని న్వెలయున్. 121

చ. స్థిరమతితోడ నీవిచటఁ జేసినయట్టి రథోత్సవంబు భా
స్వరమగు భక్తి నిచ్చటికి వచ్చుచుఁ జూచుచు నుండువారు దు

స్తరభవఘోరవారినిధి దాఁటి సుఖింతురు వారినెల్ల నేఁ
గరుణను బ్రోచుచుండుదును గంజభవా యిది నమ్ము నీమదిన్.
శా. నారూపంబు మనంబునం దలఁచుచు న్నానామము ల్బాడు
చున్, వేరే చింతలు లేక నాయెడఁ గడు న్విశ్వాసము
న్నిల్పుచున్, శ్రీరమ్యం బగుభ క్తిఁ జేసి నను నర్చింపంగ
శాస్త్రోక్తిచే, నారూఢిం దగు పూజ సేయుజనులం దాస క్తి నే
నుండెదన్. 123
సీ. వారి యాపదలెల్ల వారించి ప్రియముగ
వారు కోరినయట్లు వరము లిత్తు
ధనవస్తుసంతాన ధాన్యరత్నాదుల
ననుపమభోగభాగ్యముల నిత్తు
నాయందు ననిశంబుఁ బాయని భక్తులౌ
జనులకుఁ దోడ్పడి గనుచు నుందు
నెంతనమ్మినవారి కంతఫలం బిత్తు
నమ్మనివారికి నెమ్మి నొసఁగ
తే. ననిశమును నన్ను మది నిల్పి యాడుజనుల
కిత్తు మోక్షంబు మఱి యెవరేని యిందు
నఖిలదానంబు లతిభ క్తి నరసి వేద
వాంద్ర కిచ్చినచో వారి వఱలఁ గాతు. 124
వ. అని పల్కి రుద్రేంద్రాదులం జూచి యిట్లనియె. 125
సీ. అరయఁ గన్యారాశి కర్కుండు వచ్చిన
యదను శ్రీయుత్సవం బాచరింప
వలయు మీరెల్లరు వచ్చి వేడుకమీఱఁ
బ్రతివత్సరంబును బాగు మెఱయ

నని రాజులంజూచి యవనీశులార! మీ
రేఁడాదికొకసారి యిచటఁ జేరి
బంధుమిత్రులతోడ వైభవంబులతోడ
సేవల నొనరించి చిత్తవృత్తి
తే. దార్ఢ్యముగ మీకుఁ గల్గిన ధనమునందు
నాలుగవపాలు గొనితెచ్చి నాకు నొసఁగి
వేడుకలు సేయుచుండుఁడు విభవమొంద
నిరతమును మీరటంచును నెమ్మిఁ బల్కె. 126

వ. అని యిట్లు చాతుర్వర్ణ్యములవారికిం దగిన ధర్మంబు లుపదే
శించి వస్త్రభూషణాదులు సన్నిధానంబున నుండి పారితోషి
కంబు లిప్పించి స్వస్థలంబులకుఁ బోనియమించిన వారంద
ఱాహరిచరణారవిందంబులకుఁ బ్రణమిల్లి యవ్వేంకటా
చలంబు డిగ్గి తమ నెలవులకుం జనిరి. అనంతరం బాబ్రహ్మాది
దేవతలం జూచి శ్రీహరి వెండియు నిట్లనియె. 127

సీ. బ్రహ్మాదులార! నా పల్కులు మఱికొన్ని
యాలకింపుఁడు వేంకటాద్రియందు
ధరణీసురులకన్న దానంబుచేసిన
నేఁ దృప్తిఁ బొంది మన్నింతు వారి
నదిగాక సకలవిద్యాదానములు చేయు
వారును మఱి వారివంశజులును
వారివంశజులును వారివంశజులును
బుణ్యలోకంబును బొందుచుండు.
తే. తులసివనములు నిర్మించి తొడరి తద్ద
శముల నాకర్పణముసేయ లలితసౌఖ్య

పదవి నిచ్చెద మఱియు సద్భక్తిఁ దులసి
నెలమి బృందావనమునందు నిడినజనుల. 128

వ. కరుణంజూచి స్వర్గసామ్రాజ్య మిత్తు నిదియునుంగాక ప్రతి
దినంబున భక్తిమై షడ్రసోపేతాన్నంబు యథోచితంబుగ
నాకు సమర్పించినవారికి శాశ్వతైశ్వర్యంబు నొసంగుదు నని
యనేకప్రకారంబులఁ గర్మజ్ఞానభక్తిధర్మసూక్ష్మంబులు బ్రహ్మా
దుల కానతిచ్చి బ్రహ్మకు వేఱుగ నిట్లనియె. 129

సీ. జలజసంభవ! నీవు సత్యలోకము వాసి
నాకొఱ కిచట నిన్నాళ్లు నిలిచి
బ్రహ్మోత్సవాఖ్యచేఁ బ్రబలు మహోత్సవం
బిచటఁ జేయించితి విందువలన
వనధిజాభూనీళలును నేను సంతోష
భరితుల మైతిమి ఫణినగమున
నిలిచియుండెద మింక నీకు వరంబు లే
మిత్తు నన్నను భారతీశుఁ డనియె
తే. జనక నను మున్న మన్నించి సద్వరంబు
లిచ్చియున్నారు నా కిపు డేమిగోదువ
యిఁకఁ దిరోధాన మొందక యిచట నెపుడు
నిలిచి యుండుఁడు నెలమిగ జలజనయన. 130

క. నరకములం బడనీయక
నరులను మీచరణరక్షణము చేసినదే
వర మింతకన్న వేఱొక
వర మేలా నాకుఁ దండ్రి వరద ముకుందా. 131

సీ. అన విని హరి యిట్టు లనియె నీమాట స
మ్మతమ నా కింకొకమతము గలదు
విను మది నాయందు విశ్వసించుచు భక్తి
సల్పుచు నున్నట్టి సాధువులను
బాధించువారు మద్బాహ్యసమానులై
యెసఁగిన వారికి నెగ్గుచేతు
నన్నెవ రేమి యన్నను నే సహింతును
భక్తుల నన్న నోపను జగాన
తే. జయుఁడు విజయుండు సనకాదిసంయములకు
మించి చేసిన యపకృతి కొంచెమేని
గొప్ప యై వారలను నేలఁ గూల్చినట్టి
సరణి నే నన్నమాటకు సాక్షి గాదె. 132

ఉ. భాగవతాపచార మతిపాపము గావున నట్టిద్రోహముల్
లోఁగక చేయువాని యమలోకమునం బడఁద్రోతు వాని నే
నేగతి బ్రోతు నింక మఱి యెన్నియఘంబులఁ జేసివచ్చి నీ
వేగతి యంచు నన్నిచట వేఁడినదీనుని గాతుఁ బద్మజా. 133

క. వరభక్తుల నిందించిన
నరులను గురుదూషకులను నమ్మినవారిం
బరమాపదలకుఁ ద్రోసిన
నరకంబులఁ ద్రోతుఁ గాని నయపద మియ్యన్ 134

సీ. అతిశయదంభ దర్పాద్యభిమాన దు
రాచార ఘోరదురాగ్రహముల
నలరుచుండెడు మర్త్యు లాసురాంశజులు గా
వున సురాంశజులైన జనుల నెల్ల

బాధింతు రట్టిపాపాత్ముల శిక్షింతు
దుష్టుల మర్దింతు శిష్టజనుల
రక్షించుకొఱకు క్ష్మాధరాధరమున నుందు
నిఁక నీవు పోయి యింపెసఁగ సత్య
తే. లోకమున కేగు నిన్నెప్డు శ్రీకరముగ
బ్రోచుచుండెద సకలముఁ బొందుగాను
సృష్టి సేయుచు నుండుము దృష్టివిడక
యనుచుఁ బల్కుచు శక్రుని కనియె నిట్లు. 135

ఉ. పాకవిరోధి! నీవు సురవర్యులఁ గూర్మిగఁ గూడి వేడ్కతో
నాకముచేరి యచ్చట ఘనం బగుబాహుబలంబు పెంచి ము
ల్లోకము లేలు దైత్యులకు లోఁగి చరింపకు మింక ధీరుఁడై
యేకలుషంబు లేక జయమేర్పడ నొందుచునుండు మెప్పుడున్.

ఆ. అనుచు శ్రీనివాసుఁ డనిమిషపతి కిట్టు
లానతిచ్చి నెయ్యమలర శివుని
గాంచి మందహాసకలితాస్యుఁడై చూచి
యిట్టు లనియెఁ బ్రీతి యెసఁగ నపుడు. 137

శా. గౌరీనాయక నామహోత్సవములం గల్పించి సానందులై
యారూఢంబుగఁ జేరి చూచితిరి నే నానందముం బొందితిన్
శ్రీరమ్యంబగు వెండికొండపయి సంప్రీతిం దగన్ భక్తులన్
గారుణ్యంబున బ్రోచుచుండు మిఁకఁ బోకందర్పవైరీ తగన్. 138

సీ. వైకుంఠమునకంటె వరసుధాంబుధికంటె
లలి దివాకరమండలమునకంటె
ధన్యమైనట్టి శ్వేతద్వీపమునకంటె
శేషాచలంబు విశేషమగుచు

పఱలును భూలోకవైకుంఠమన నేను
నిలిచితి గావున నెలమి నిటకుఁ
దూర్పున నలరెడు దురితఘ్నయౌ సువ
ర్ణముఖరీతీరంబు రహిఁ జెలంగఁ
తే. బ్రబల భూలోకకైలాసరాజ మనఁగ
నలరు పుణ్యస్థలంబునం దెలమి నుండు
మని వచించి యగస్త్యుని గని ముదంబు
దనర నిట్లనియె దైత్యారి యపుడు. 139

తే. పరమపావన కుంభసంభవమునీంద్ర!
నీకుఁ దగినట్టి యెడఁ జేరి నిష్ఠ మెఱయఁ
జిరతరంబుగఁ దప మొప్పఁ జేయుమనుచుఁ
జెప్పి సనకాదిమునుల వీక్షించి పల్కె. 140

తే. యోగివరులార మీరు విరాగమహిమ
నరసి జ్ఞానామృతము గ్రోలి పరమతృప్తి
నొంది యిష్టవిహారులై యుండుఁ డంచు
సంతసంబందఁ బల్కె నాచక్రధరుఁడు. 141

వ. అనంతర మాబ్రహ్మరుద్రేంద్రాది కుంభసంభవ సనకాదుల
కివ్విధంబున నానతిచ్చి శ్రీభూనీళా సమేతంబుగ నంతర్విమా
నంబునందుఁ బ్రవేశించె. నావల బ్రహ్మ మరాళ వాహనం
బెక్కి సత్యలోకంబున కేగె. నింద్రుఁ డైరావతంబు నెక్కి
దివంబునకుం బోయె. నందిని గూర్చుండి రుద్రుండు కైలా
సంబున కరిగె. నగస్త్యప్రముఖులైన మునులును సనకాదు
లును స్వామిపుష్కరిణికిఁ నుత్తరభాగంబున నుండుపాపవినాశ

తీర్థోత్తరభాగంబునందుఁ గొందఱు మునులు తపంబు లొన
రింప నేగిరి యియ్యుత్పవక్రమం బెవరేని చదివిన వీనుల
వినిన నాయురారోగ్య భాగ్యంబులు చేకూడునని చెప్పిన
సూతుంజూచి శౌనకాదిమునీంద్రు లిట్లనిరి. 142

క. సుందరవిగ్రహ ఘనతర
మందరగిరిధర సమస్తమౌనిహృదబ్జా
నందకర వేంకటాచల
మందిర సురరాజవినుత మాయాతీతా. 143

మాలిని.—

సురుచిరగుణహారా శుభ్రకీర్తిప్రచారా
వరజలధిగభీరా వాసవార్తిప్రహారా
దురితచయవిదారా దుఃఖసంసారదూరా
గురుతరగిరిధీరా క్రూరగర్వాపహారా. 144

గద్యము. ఇది శ్రీతఱికుండ నృసింహ కరుణాకటాక్షకలిత కవితా
విచిత్ర కృష్ణయామాత్యతనూభవ వేంకమాంబా ప్రణీతం
బైన శ్రీవేంకటాచలమాహాత్మ్యంబునందు వరాహపురా
ణంబున దేవేంద్రాదులు క్షీరాబ్ధిప్రముఖస్థలంబులయందు
హరిని వెదకుటయు, నారదప్రేరితులయి బ్రహ్మలోకంబున
కరుగుటయు బ్రహ్మతోడ దేవేంద్రాదులు హరిని వెదకుటకు
వేంకటాచలారోహణంబు సేయుటయు, దశరథుండు వసిష్ఠ
యుక్తుం డై వేంకటాద్రికి వచ్చుటయుఁ, బుష్కరిణీతీరంబున
బ్రహ్మాదులు తపంబు సేయుటయు, శ్రీవేంకటేశ్వరుండు విమా

నంబుతోడ బ్రహ్మాదులకు ప్రసన్నుం డగుటయు, స్వామిని బ్రహ్మాదులు వినుతించుటయు, బ్రహ్మాదులకు హరి ప్రసన్నుండై భాషించుటయు, దశరథుఁడు హరిని స్తోత్రంబు సేయుటయు, శ్రీనివాసుండు దశరథునకు వరమిచ్చి యయోధ్యకుఁ బంపుటయు, బ్రహ్మోత్సవ ప్రకారంబును నను కథలంగల ద్వితీయాశ్వాసము.

శ్రీ ర స్తు.

# శ్రీ వేంకటాచలమాహాత్మ్యము

## తృతీయాశ్వాసము.

---

క. శ్రీకర! నిర్జరమానివ
శీకర! సద్భక్తహృదయశృంఖల యభవా!
రాకేందువదన! శుభకర!
ప్రాకటతటికుండనృహరి! పాపవిదారీ! 1

సీ. ఓసూత మేము బ్రహ్మోత్సవక్రమము న
త్యాశ్చర్యముగ వింటి మపుడు విష్ణు
చక్రంబు బహుచోరసంఘంబులను నిగ్ర
హించె నంటివి వారి నెట్లు ద్రుంచె
నారీతి విన వేడుకైనది దెల్పు నీ
వనిన సూతుండు సంయములఁ జూచి
మునులార వినుఁ డక్కథను వివరించెద
నాచక్రమహిమ విఖ్యాతిఁగాను
తే. చక్రరాజంబు మాధవాజ్ఞను వహించి
సంతసముమీఱ రాజవేషంబు దాల్చి
యరిగి జగములు భయమంద నమితశౌర్య
మును గడంగి దిశల్కీర్తి దనర నపుడు. 2

సీ. పటిమమీఱ సహస్రబాహుండై మకుటాది
రక్తభూషణములు రక్తవర్ణ
చేలంబులను దాల్చి కాలాగ్నిసదృశుండై
దంష్ట్రాకరాళవక్త్రంబు మెఱయ
వేడ్క రథంబెక్కి వివిధసాధనముల
ధరియించి వెడలి గంధర్వగణము
లలఘుముద్గరపట్టిసాద్యాయుధంబులు
గొని తనవెంబడి జనుచునుండఁ
తే. గుముదుఁడనువాఁడు జ్వాలాముఖుండు సకల
సైన్యములనెల్ల నడపింప సామజాశ్వ
వారములతోడ ఘనరణభేరి మొరయ
నిఖిలవాద్యరవంబులు నింగి కెగయ. 3

వ. ఇవ్విధంబున సంగరోన్ముఖుండై చక్రరాజశేఖరుండు శేషా
చలంబు మొదలు పూర్వసముద్రపర్వతంబున నాక్రమించి
కొని సాధుజనులను బాధించు చోరసమూహంబుల వెదకి
వారి కుటుంబములతోడ నశేషంబుగ సంహరించి దేశబాధ
నివారించిన, చక్రరాజు సాన్నిధ్యంబునకు వచ్చి తద్దేశవాసు
లగు సాధుజనులు వినుతించి యిట్లనిరి. 4

తే. ఓమహారాజ యీభూమి కొక్కప్రభువు
లేనికతమున నయ్యయో మానవులను
జాల వేధించుచోరులఁ జంపితీవు
బ్రోచితివి మమ్ము సుఖముగఁ బుణ్యపురుష. 5

క. యెక్కడనుండియొ యిచటికి
మక్కువతో వచ్చి నీవు మాజీవనముల్

దక్కించినపుణ్యాత్ముఁడ
విక్కడ సంతసము నెగడ నెపుడుంపుమయా. 6

సీ. అని పల్కుసుజనుల నాదరించుచుఁ జక్ర
రాజు తద్భూమికి రాజునొకని
వెదకి పట్టముఁగట్టి విప్రాదిజనులను
మించిన నెమ్మి రక్షించుమంచు
వానికి నియమించి శ్రీనివాసాద్రిఁ
మనుజులు రాఁదగు మార్గములను
దనర నేర్పఱచి యాదారులయందు ధ
ర్మాత్ముల నుంచి మహాద్భుతముగ
తే. నచట జయభేరి వేయించి యపుడు వెడలి
కరులు హయములు రథములు కాల్బలములు
మొనసి గొల్వఁగ వాద్యము ల్మొరయుచుండ
శౌర్యకార్యధురీణుఁడై చక్రరాజు. 7

సీ. సంతోషభరితుఁడై సరవిగ నందందు
వివిధదుర్మార్గుల వెదకికొనుచుఁ
బరఁగ నాగ్నేయదిగ్భాగంబునకు వచ్చి
చోరులు విన రణభేరి నచట
మొరయించుచును మున్ను మొఱకులై పాఱుల
బాధించుచున్నట్టి పాపమతుల
పై దాడివెడలి యార్భటము నేయఁగ వారు
దైత్యాంశజులు గాన ధైర్యమెసఁగ
తే. నాయుధంబులు పూని ఘోరాట్టహాస
కలితులై నిల్చి మార్కొని కయ్యమెసఁగఁ

జేయఁగా వారిపైఁబడి వాయకుండఁ
బోరుచును రెండుబలములు ఘోరముగను. 8

వ. కలసికొని కడునబ్బురంబుగఁ గొంతవడిఁ బోరాడి. 9

క. జ్వాలాముఖకుముదాదులు
నాలో నెడఁ దాఁకి నట్టహాసముతోడన్
గాలాంతకుసన్నిభులై
యాలం బొనరించి త్రుంచి రసురాంశజులన్. 10

క. తక్కినయాదనుజాంశజు
లక్కడఁ బడియున్నశవము లటుద్రొక్కుచుఁ బో
నిక్కుచుఁ జని గంధర్వులఁ
గ్రక్కసపడి గొట్టి రమితగదలం దలలన్. 11

క. అప్పుడు గంధర్వులు గురిఁ
దప్పక శస్త్రాస్త్రములను ధరియించి యిదో
దప్పించుకొనుఁ డటంచుం
జెప్పుచు రిపులడఁగునట్లు చేసిరి కడిమిన్. 12

వ. అప్పుడు హతశేషులైనచోరులు తమవారలకుఁ దమబలంబులుపడిన నికారక్రమంబు నుడువఁ జోరప్రభువులు స్థల దుర్గ వనదుర్గంబులయందుండి త్రిపురంబులందున్న రాక్షస బలంబులకై వడి వివిధమాయోపాయంబులు సేయుచు విడి వడి యార్చుచుఁ గరవాల శూల ముద్గర భిండివాల పరశు పట్టిస శరచాప పరిఘాద్యనేక సాధనంబులఁ గొని గంధర్వబలంబులపైఁబడి యాలం బొనరించుచుండి రప్పుడు భేరీ ప్రముఖ భయంకర వాద్యఘోషంబులును, గంధేభఘీంకారంబులును, దురంగహేషారవంబులును, రథనేమిభీషణ

శబ్దంబులును దిక్కులు పిక్కటిల్ల భూతలంబున రక్తంబు వెల్లువలై పాఱె. తత్సమయంబున జ్వాలాముఖుండు చక్రరాజేంద్రునకు జరుగుచుండు కయ్యం బెఱింగింప నాతఁడత్యంతకోపావేశుఁడై త్రిపురాంతకుండైన కాలరుద్రుం బోలె నేనూఱుకరంబుల నేనూఱుకార్ముకంబులు ధరించి తక్కిన యేనూఱుకరంబులఁ జండకాండకాండంబులంగొని ప్రత్యాలీఢపాదుఁడై నిలిచి ధనుర్జ్యాఘోషం బొనరించి శాత్రవనికరంబునందుఁ బ్రయోగింపఁ గడుపులు చీలియు నడుగులు తెగియుఁ దలలు పగిలియుఁ, జేతులు తునిఁగియు నిట్లు చిందఱవందఱ యగుటంజేసి చోరనాయకులు జడిసి పఱతెంచి తమదుర్గంబుల డాఁగి రంత. 13

ఆ. చలము విడక యపుడు చక్రరాజేంద్రుఁ డా
గ్నేయనామ మొప్పు సాయకంబు
వింటఁ గూర్చి వైవ విపినంబులం గాల్చి
చరిగి చోరచయము నవనిఁ బడఁగ. 14

వ. కూల్చి భస్మంబుసేయం బుడమి నవ్వేఁడికిఁ బొగలుచుండె నంత నమితవృష్టి గురియించి యాభూతలంబును శీతలంబును గావించి ధర్మాధ్యక్షుండనువాని నమ్మహీస్థలికి రాజుగఁ జేసి ధర్మమార్గంబున నెల్లజనులను బరిపాలించుమని యానతి యిచ్చి యనంతరంబున. 15

సీ. చతురంగబలములు మితిమీఱఁ గొల్వఁగ
ధీరుఁడై దక్షిణదిక్కు కరిగి
వనదుర్గములయందు వారక వెదకుచుఁ
జిక్కినచోరులఁ జక్కఁబఱచి

వచ్చుచునుండఁగ నచ్చటచ్చటఁ గల
సజ్జను లెల్లరు చక్రరాజు
నీక్షించి మాపాలి యీశ్వరుఁడై వచ్చి
రక్షింపఁ బూనెనో కాంక్షఁజేసి
తే. యనుచు ముదమందుచుండఁగ నపుడు మొనసి
చాలకుం డనువాఁడు బిడాలకుండు
ననెడువాఁడు పులిందులు తనరఁ జూచి
యాయుధంబులఁ బూని చక్రాధిపతిని. 16

వ. మార్కొన వచ్చి తమకుఁదా మిట్లనుకొనిరి. 17

సీ. ఈరీతి మన నెదిరించిన శత్రుల
నదలించి నేఁ ద్రుంతుననియె నొకఁడు
గంధేభములఁ దురంగంబుల నెల్లను
మొనసి ధాత్రిని గూల్తుననియె నొకఁడు
కాల్బలంబులఁ గూల్తు గములుగ వచ్చిన
నవనిపైఁ బడిపోవ ననియె నొకఁడు
రథముపైఁ గడుగొప్ప రాజుగ వచ్చెడు
ఘనుని ద్రుంచెద నెంచ కనియె నొకఁడు
తే. కరుల హయముల మితిలేని కాల్బలముల
రథముపై వచ్చుమగవానిఁ బృథుబలాన
నేను సమయింతు నొక్కఁడ పూని లావు
మెఱయఁజేయంగవచ్చినఁ గఱకుఁ జూపి. 18

వ. ఇట్లు పంచమహాపాతకులై నయంగవంగ పులింద బిడాలచాల
కులు ప్రచండబలంబునఁ జక్రరాజబలంబున కెదురేగి హుంక
రించి స్ఫులింగాక్షుండును, బలాద్యక్షుండును, జ్వాలాకేశుం

డుసు, కాలాంతకుండును, రణఘ్నుండును, చక్రరాజేంద్రు
నానతిరీతిఁ గరవాలాద్యాయుధంబులం బూని శత్రుబలం
బులపైఁబడి యప్పాతకులం జూచి యిట్లనిరి. 19

సీ. పాపాత్ములార సద్బ్రాహ్మణోత్తములను
జెఱచి యాచారము ల్జెలఁగ నడఁచి
బాధింపుచును ధర్మపథమును విడనాడి
జీవనంబులు లేక చెఱచినట్టి
క్రూరాత్ములార మీకుం గడుమేల్కాల
మిదివఱకుండె నింకెందు డాఁగె
దరు రండు యమలోకదారిఁ జూతురు మిమ్ము
ఖండించి కాకులు గ్రద్ధలకును
తే. విందుపెట్టెద మావల విప్రకోటి
కమితసౌఖ్యంబు గల్గింతు మాశ విడుఁడు
సారెసారెకు మాకంటె శౌర్యవంతు
లెందు లేరని వల్కంగ నేల యంచు. 20

వ. అతిభీషణాకారులై యస్త్రశస్త్రంబుల నద్దురాత్ముల నొప్పిం
చినఁ దలంగివోక యంగవంగాదిరాక్షసులు స్ఫులింగాక్షుల
మీఁదఁ బడి ఘోరయుద్ధంబు సలుప నాస్ఫులింగాక్షుండు
మార్కొని యంగుఁడనివానిం బరిమార్చె, బలాధ్యక్షుండు
వంగుండనువాని ద్రుంచె, జ్వాలాకేశుండు పుళిందుం డను
వాని జక్కాడె, కాలాంతకుండు బిడాలుం డనువాని నేలం
గూల్చె, రణఘ్నుం డనువాఁడు చాలకుం డనుదుష్టుని
వధించె, నంత వారిభటు లాహాకారంబులు నేయుచుఁ జక్ర
రాజబలంబునంబడినఁ దచ్చక్రరాజాజ్ఞచేత హయశిరుండను

వాఁడు తద్దుష్టులపై నర్ధచంద్రబాణప్రయోగంబు చేసి యందఱ రెండేసి ఖండంబులు గావించె నంత హతశేషులైన వారు కొందఱు వెఱచి పఱచి గుహారణ్యంబుల డాఁగినంజూచి చక్రరాజేంద్రుఁడు చిత్రబాణప్రయోగంబు సేయ డాఁగిన శాత్రవులఁ జక్కాడి వచ్చె నంత దక్షిణభూమి నిష్కంటకం బయ్యె నంత దేవతలు చక్రరాజశీర్షంబునఁ బుష్పవర్షంబు గురి యించి యనేకప్రకారంబుల వినుతించి యిట్లనిరి. 21.

సీ. చక్రరాజోత్తమ సకలపాపాత్ముల
సమయించి యిచ్చట సాధువులను
రక్షించితివి నీపరాక్రమం బెంతయు
శేషునికైనను జెప్పఁదరమె
పరఁగ శేషాద్రికిఁ బశ్చిమోత్తరములఁ
జోరులు క్రూరులున్నారు నీవు
వారల సమయించి వసుధామరాదిస
జ్జనులను రక్షించు చక్రరాజ
తే. యనుచుఁ బ్రార్థించి దేవత లరిగి రట్లు
చక్ర మచ్చోట శత్రుశేషంబు లేక
యంత మొందింపఁగాఁ జూచి సంతసించి
బ్రాహ్మణులు వచ్చి యాచక్రరాజుఁ గాంచి. 22.

సీ. వినుతించి పల్కిరి విమలాత్మ! యీదేశ
మందు ధర్మాత్ముఁడై నట్టిరాజు
గలుగనికతన దుష్కర్ములై చోరులు
బాధించుచుండిరి బ్రాహ్మణులను

నీవు మాపాలిటిదేవుఁడవై వచ్చి
సకలక్రూరాత్ముల సమయఁజేసి
మమ్ముఁ గాపాడితి విమ్మహిఁ బాలింపఁ
దగినట్టిరాజును దనర నిలుపు
తే. మనుచు వారెల్లఁ బ్రార్థింప నపుడు చక్ర
రాజు తద్ధాత్రికిని తగురాజు నొకని
నిలిపి ధర్మంబు దప్పక నీవు జనులఁ
బాలనము సేయుమని చెప్పి బ్రాహ్మణులను. 23

తే. కాంచి యిట్లనె మీరు సత్కర్మనిష్ఠు
లగుచు జన్మములొనరింపుఁడంచుఁ బ్రియముఁ
జెలఁగ నందఱు నప్పు డాశీర్వదించి
వీడుకొల్పఁగ నారాజవీడుఁ డపుడు. 24

వ. దక్షిణప్రాంతగహనంబులయందు వేంకటాద్రికి జనులు వచ్చు టకుఁ ద్రోవలేర్పఱచి యాత్రోవలయందు సజ్జనాగ్రేసరులం బాలింపుమని యచటిసజ్జనునొకని రాజుంజేసి యనంతరంబు.

సీ. అందుండి సకలసైన్యావళులను గూడి
జయభేరి వేయించి సంతసించి
పైనమై నిబురుతిప్రాంతదేశములందుఁ
గదలిపోవుచును దుర్గస్థలముల
శోధించి శోధించి చోరులనెల్లను
బరుగిడకయ చంపి పశ్చిమమున
కరిగి మహోన్నతుఁడై నిజగంధర్వ
బలములతో నందు నిలిచి కదన

తే. భేరి వేయించి యప్పు డభేద్యవిపుల
విపినదుర్గస్థలంబుల వెదకి వెదకి
చోరులను ద్రుంపఁగాఁ జోరచారు లదిరి
చెదరి తమదొరయగువాని చెంతఁ జేరి. 26

క. మ్రొక్కుచు నిట్లని రధిపా
యెక్కడనుండియొ దళంబు లీప్రాంతములం
గ్రిక్కిరిసి చోరవీరులఁ
జక్కాడుచు నున్నవారు శౌర్యోన్నతులై. 27

వ. అనిన విని సమధికకోపావేశంబున. 28

సీ. శివునిగూర్చి తపంబుచేసి తానెవరిచేఁ
గూలనివరము గైకొనిన్నవాఁడు
బహుచోరులంగూడి పర్వతాగ్రములందుఁ
జేరి సాధులను హింసించువాఁడు
పటుశక్తితోఁగూడి పాంథుల నెసఁగొట్టి
యమితవిత్తము గూర్చినట్టివాఁడు
కాలకింకరులనఁగాఁ దగినకిరాతు
లను గూడి గర్వంబు దనరువాఁడు
తే. వనములందు రిపుఘ్నుఁడన్వాఁడు గన్న
కొడుకు వనకర్తయనువాఁడు క్రోధమెసఁగ
నిక్క పొంగుచు నక్షౌహిణీబలములఁ
గూడి విడి వడివచ్చి దుర్గణము మెఱయ. 29

క. కలకలు కొమ్ములు తుడుములు
బలముగ వాయించికొంచుఁ బ్రతివీరులపై

నులుకక పడి పోరుండని
సెలవియ్యఁగఁ దద్బలములు చెదఱక కడిమిన్. 30

వ. చక్రరాజబలంబులపైఁ గదిసి యనేకసాధనంబుల ధరించి యత్యంతభయంకర యుద్ధంబుచేసి రాచక్రరాజభటోత్తము లాకిరాతబలంబుల నొకక్షణంబునఁ జంపి రంత రక్తంబు వెల్లువలై పాఱుచున్నంజూచి వనకర్త క్రోధరక్తాక్షుండై నిజ సేనాధిపతియైన జ్వాలాపాతుం డనువానింజూచి యిట్లనియె.

సీ. అసహాయశూరు లైనట్టియక్షౌహిణి
భటులను జంపిరి పరునిభటులు
కావున నీవేగి కరవాలశూలాది
సాధనంబుల వారిఁ జంపుమంచుఁ
దనదొరయైన కాననకర్త చెప్పఁగ
నపుడు జ్వాలాపాతుఁ డాయుధములఁ
గైకొని యుష్ట్రాళిఁ గట్టినరథమెక్కి
సక్రోధుఁడై వచ్చి చక్రరాజు
తే. బలముపయిఁ బడఁగా బడబాముఖాఖ్యుఁ
జూచి యోచక్రరాజ! యో శూరవర్య!
రయమునం బోయి నీవు కిరాతవిభుని
దళపతిని గొట్టి గూల్పు మిద్ధరణియందు. 32

క. సరిగానినీచజనముల
సరిగానెంచుకొని పోరఁజను నే యిపుడీ
వరిగి జవంబునఁ గడిమిని
బరగింపుము పాపమతులపై సుచరిత్రా. 33

క. అని చక్రరాజు వల్కఁగ
వినియె న్నడబాముఖుండు వే సాధనముల్
గొని యాజ్వాలాపాతా
ఖ్యనిరథమును గొట్టి వానిఁ గూల్చెను ధాత్రిన్. 34

ఆ. తనరె విష్ణుచక్రమని యప్డు పేరొందె
గానఁ జక్ర మెత్తి గహనకర్త
యనెడువానిమీఁద ననుపఁగ నాచక్ర
మతనిశిరము పుడమి నడఁగఁ గొట్టె. 35

వ. ఇవ్విధంబు బడబానలంబు సముద్రోదకంబు నింకఁజేసినచందం
బున వనకర్త సైన్యంబును జక్రరాజశస్త్రాస్త్రంబుల సంహరించెఁ
దద్భూమి నిష్కంటకంబై ప్రకాశించె నప్పుడు చక్రరా
జేంద్రుఁ డరణ్యకంటకవృక్షంబుల నఱికించి సర్వభక్తజనం
బులు శేషాద్రికి వచ్చుటకుఁ దగినమార్గంబుల నేర్పఱచి
తన్మార్గప్రాంతంబులఁ బుణ్యాత్ములైన జనంబుల నునిచి తజ్జనం
బులఁ బాలింపఁదగినరాజునకుఁ బట్టంబు గట్టి ధర్మపరిపాలనంబు
సేయుమని నియమించి యనంతరంబున. 36

సీ. చక్రరాజేంద్రుఁడు జయభేరి వేయించి
చతురంగబలములు సరవిఁ గొల్వ
ధీరుఁడై వాయవ్యదిశనుండుచోరుల
సమయించుచును వచ్చి శౌర్యమెసఁగఁ
గంకణరాక్షసగాఢాంధకారంబు
దట్టమైనట్టి యుత్తరపుదిశకు
నప్పుడ మరలి సహస్రార్కకరముల
కరణి దీర్ఘసహస్రకరము లమరు

తే. చుండె రెండవచండమార్తాండుఁ డనఁగ
నొప్పుచును వేంకటాద్రికి నుత్తరముగ
నుండుకొండలనడుమ మహోగ్రుఁడగుచు
సరభసంబున నిలిచె నాచక్రరాజు. 37

వ. అపు డాచక్రరాజు నీక్షించి భీతినొంది కొందఱు రాక్షసులు
తమదొరయగు భేరుండుని చెంతఁ జేరి యిట్లనిరి. 38

సీ. చండప్రతాపభేరుండ ! మహాస్వామి!
విను మద్భుతంబుగ వీరుఁ డొకఁడు
చతురంగబలముల జతఁ గూడి యున్నాఁడు
కాలాగ్నిరుద్రులఁ బోలినాఁడు
ఖ్యాతిగ నొకవేయిచేతులు గలవాఁడు
ఘనరక్తచేలము ల్గట్టినాఁడు
హారకిరీటకేయూరము ల్ధరియించి
యెక్కువతేరుపై నెక్కినాఁడు

తే. మించుభానునిగతి వాఁడు మించినాఁడు
వాఁడు భయదాంగుఁడగుచు నున్నాఁడు చూడ
నంచుఁ జెప్పంగ భేరుండుఁ డప్పుడటకు
రక్కసులతోడఁ జని కడురౌద్ర మెసఁగ. 39

క. ఆచక్రరాజుఁ గనుఁగొని
యాచోటికిఁ దాన రాజు ననుచుఁ భేరుం
డేచినకింకను జూచి ని
శాచరుల న్మించి పల్కె శౌర్యోద్ధతుఁడై. 40

శా. ఓరక్షోవరులార చూచితిరె ? వీఁ డుత్సాహము న్మించి న
న్నారూఢాహవమందుఁ గెల్చుటకు నేఁ డాసన్నుఁడైవచ్చినాఁ

డీరాజుం బరిమార్చి రావణునకే నిష్టంబు గావించి నా
భేరుండాఖ్యమహీతలంబునఁ గడుం బేర్మిం దగం జేసెదన్.

వ. అని యనేకవిధంబులఁ బ్రతాపోక్తులాడి తనబలంబులఁ జక్ర రాజబలంబులపైఁ బురికొల్పె నప్పుడు చక్రరాజబలంబులు రణభేరి మొరయించి యట్టహాసంబున నవార్యరల నట్టిట్టు గదలనీక మిట్టిపడుచుఁ గొట్టవచ్చు భేరుండబలంబుపైఁ గవిసి కరవాలాదిసాధనపాణులై నఱకుచుఁ బొడుచుచు హుంకరించుచు బింకంబులు వల్కుచు మీసలు వడద్రిప్పుచుఁ బండ్లు గొఱకుచు నార్భటించుచుం గిలారించుచు దక్షిణోత్తరసముద్రంబు లుప్పొంగి ఘోషించుచు వచ్చుభంగి పోరుచుండఁ దొడలు మెడలు గరంబులు శిరంబులు నడుములు దెగినవారును, భయంకరంబుగ నేడ్చువారును, మొరలిడువారును, నేలంబడి పొరలువారును, ప్రాణంబులు పోలేక మిట్టిమిట్టిపడు మొండెంబులును గల్గి మోగచెట్ల గుంపు పూఁచినతెఱంగుఁ దోఁచుచుండె. అప్పుడు రక్త ప్రవాహంబు లేపాఱం బాఱె. నందుఁ దెగిపడిన కరంబులు మీలును బదంబులు కర్కటంబులు పగిలిపడిన తలపుర్రెలు కమఠంబులు చెదరిపడిన చర్మఖండంబులు భేకంబులు కూలిన గజతురంగంబులు దీవులు భగ్నంబులై పడిన చామరంబులు జలపక్షులు శ్వేతఛత్రంబులు డిండీరఖండంబులు తునిఁగిపడి రక్తంబునం దేలుచున్న శిరోజంబులు శైవాలంబులుగాఁగ నొప్పుచున్న రక్తప్రవాహంబును కాక గృధ్ర ఖగాదు లావరించి యున్నం జూచి యనేక భూత బేతాళ పిశాచంబులు చక్రరాజుచేసిన సంతర్పణంబునకు రండు రండని యొండొరు

లను బిలుచుచుఁ బోయి తద్రణభూమి నీక్షించి సంతసించి
తమలోఁ దా మిట్లు చెప్పుకొనిరి. 42

సీ. చక్రరాజేంద్రుఁ డిండిక్ర్కమంబున సమా
రాధన మొనరించె రండటంచుఁ
బిల్చుచుఁ గండలుం ద్రేపులు బాగుగ
భుజియించుచుండెడు భూతములును
బలుమాఱు రక్తంబుఁ దలపుఱ్ఱెలను ముంచి
పూని పానముసేయు భూతములును
గడుపులు నిపురుచు గఱ్ఱునం ద్రేపుచుం
బొరలుచు లేచెడు భూతములును
తే. గలిగి రణభూమి యద్భుతం బలరుచుండ
నప్పు డావిష్ణుచక్రరా జనఘుఁ డెలమి
నొందె ఖేరుండు దురిఖించి యొప్పమికిని
మఱల హతశేషులను గూడి మారుకొనఁగ. 43

వ. చక్రరాజేంద్రుండు కనుబొమలు ముళ్లువడం గినిసి ఖేరుండుని
జూచి హుంకరించి యుద్ధంబునకు సమకట్టు మనఁగ నాఖేరుం
డుఁడు వేయిపిడుగులు వడినట్లు బాహాస్ఫాలనం బొనర్చి
మించుటం జేసి తత్సమయంబున. 44

సీ. ఆకాశ మగలె దిగంతముల్ గ్రుంగెను
ఘనశైలములు గడగడ వడంకెఁ
దపనచంద్రులగతు ల్దప్పె ఘోరాకారు
లైనదైత్యులగుండె లదరసాగె
బ్రహ్మాండభాండంబు పగిలినగతి నుండె
విపరీతవాయువు ల్వీసరసాగె

నప్పుడు చక్రమహారాజు పావకుఁ
డనువానిఁ బుట్టించి యరులపైకిఁ
తే. బంపెఁ దత్పావకుఁడు శత్రుబలముమీఁద
నతిరయంబున సమ్మోహనాస్త్రమేసె
నపుడు మేనులు మఱచుచు నసురవరులు
తాము దమలోనఁ బోరాడి ధరణిఁ బడిరి. 45
తే. చక్రరా జావిధము చూచి జాలినొంది
యిది యధర్మము గనుక నీ వీశరమును
మించనీయక యుపసంహరించుమనిన
పావకుఁడు దాని మరలించి పటిమ మెఱయ. 46
క. దనుజులపైఁ గ్లాంచాంబక
మును విడువఁగ నదియు వారిముక్కులు చెవులన్
గొని తఱిగినఁ గోపము పెం
పెనుఁగొన భేరుం డపుడు విభీకరవృత్తిన్. 47
సీ. పావకుం డనువానిపైఁ బడవచ్చిన
నప్పావకుఁడు మారుతాస్త్రమేసె
మూఁడుయోజనముల మొనయుదేహముతోడ
నా భేరునిం గొని యద్భుతపడ
వేంకటాద్రికిఁ జుట్టి వేడ్కమై మూఁడుమా
రులఁ ద్రిప్పి కడభూమితలమునందుఁ
బడవేసెఁ బెద్దగుమ్మడికాయ పడినట్లు
రాక్షసుఁ డరిగెఁ జక్రంబు మించి
తే. యరుల నందఱఁ ద్రుంచె నయ్యవసరమున
సురవరేణ్యులు మిక్కిలి సొంపుమీరఁ

జక్రరాజుశిరంబుపై సంతసమునఁ
బుష్పవృష్టియుఁ గురిసిరి పొగడి యనిరి. 48

తే. చక్రరాజేంద్ర నీ విప్డు సకలరిపుల
సమయఁ జేసితి వవని సజ్జనుల నెల్లఁ
గాచితివి కృపచిత్తుఁడై గానఁ జక్రి
సంతసించెను జయుఁడని శాంతిఁబొంది. 49

వ. శ్రీ వేంకటేశ్వర సన్నిధానంబున కరుగుమని చెప్పి యమరులు
చనిరంతఁ జక్రరాజు యుద్ధంబున మడిసిన చతురంగబలంబుల
నిజప్రభావంబునం గ్రమ్మఱ సజీవితులంజేసి కరుణాకటాక్ష
వీక్షణామృత బిందు సందోహంబుల వారియందు నొలుక
చేసిన, వారును శాంతింబొంది పూర్వప్రకారంబునఁ జక్ర
రాజు ననువర్తించి కొలిచియుండి రప్పు డుత్తరదిగ్భాగంబు
నందు శ్రీ వేంకటాద్రికి వచ్చుభక్తులకు మార్గంబు లేర్పరించి
తన్మార్గంబులయందుఁ బుణ్యాత్ములైనజనుల నిల్పి వారలం
గాపాడుటకు నం దొక్కని రాజుగఁజేసి యీశాన్యదిగ్భాగం
బునఁ జెదరియున్న చోరుల నిర్జించి యష్టదిక్కులయందు
నిష్కంటకంబులఁ జేసి దేశంబుల శాంతిం బొందించి క్రమ్మఱ
సకలబలంబులతో వేంకటాద్రికి వచ్చి స్వస్వరూపంబున నంత
ర్విమానంబునం బ్రవేశించి శ్రీహరి దక్షిణకరంబున నిలిచి
యుండె నిట్లు దేశంబులు సురక్షితంబులైన వెన్నడి శ్రీస్వా
మికి మహోత్సవంబులు జరుగుచుండెనని చెప్పిన సూతుం
జూచి క్రమ్మఱ శౌనకాదు లిట్లనిరి. 50

సీ. శ్రీనివాసస్వామి చిత్రచారిత్రముల్
సలలితకర్ణరసాయనములు

గనుక మే మెంత విన్నను దృప్తిలేదు శ్రీ
వేంకటేశ్వరుఁ డిట్లు వెలసి శేష
గిరిమీఁదనుండి యేక్రియలందు పంచ
నెవ్వ రెవ్వరికి నేమేమి యొసఁగెఁ
దెలియఁగ, కృతయుగత్రేతాయుగద్వాప
రములయం దంతట క్రమముగాను
తే. జెలఁగి వర్తించుచుండును గలియుగముల
నేవిధంబులనుండు నా యీశ్వరుండు
సల్పుచుండినచరితము ల్సమ్మతముగఁ
దెలుపవే సూతసత్పూత ధీసమేత. 51

తరళవృత్తము.—

అని ముదంబున శౌనకాదిమహామునీశ్వరు లందఱున్
వనజనేత్రుచరిత్రము ల్వినువాంఛతోడను బ్రశ్నచే
సిన ముదంబున సూతుఁ డిట్లనె శ్రీరమేశుఁ దలంచుచున్
వినుఁడు సంయములార చెప్పెద వేంకటేశువినోదముల్. 52

పంచచామరము.—

పరాపరస్వరూపుఁడైన పద్మనేత్రుఁ డాఢ్యుఁడై
యరాతివీరుల న్వధించి యద్భుతక్రమంబుగన్
సురేంద్రమౌనిముఖ్యులెల్లఁ జోద్యమంది చూడఁగన్
ధరామరాదిభక్తులన్ ముదంబుమీఱఁ గాచుచున్. 53

ఉ. భూతలమందు నిల్చి పరిపూర్ణుఁడు తానగుచుండియున్ జన
వ్రాతము చూడ, శేషగిరివాసుఁ డనంగ జగంబులందు వి
ఖ్యాతిని బొంది భక్తజను లందఱు గొల్వఁగ వారికెల్ల సం
ప్రీతి వరంబు లిచ్చి కడు పేర్మిగ నుండె రమాసమేతుఁడై.

సీ. ఆవేంకటేశ్వరుఁ డరుదుగఁ గలియుగం
బున ఘనమౌనముద్రను ధరించి
యచట నర్చావిగ్రహంబుకై వడిగాను
గర్మనేత్రములకుఁ గానవచ్చు
భక్తులతోనైనఁ బ్రత్యక్షమున మాట
లాడఁడు స్వప్నములందుఁ దగిన
మాటలొప్పఁగఁ జెప్పు మఱి యదేమను వేళ
కవ్వలఁ జూఁగు మాయావి యగుచు
తే. మానవుల కెల్లఁ దనయందు మరులుగలుగఁ
జేసి వారలవిత్త మార్జించుకొఱకు
వారి కొకభీతిఁ బుట్టించి వారిచేత
రూక లొప్పించికొని వారి బ్రోచు నవల. 55

క. మోక్షము గోరుచు దేహా
పేక్షను మది రోసి విడిచిపెట్టుచుఁ దనునే
వీక్షించుభక్తజనులకు
సాక్షాత్కారముగఁ జూపు సద్విగ్రహమున్. 56

సీ. వైకుంఠముననుండి వచ్చియున్న విమాన
మెక్కువగా వారి కొక్క వేళ
దగఁ జూపు నప్పు డంతర్ధాన మొందించు
నానందనిలయంబునందు నిలిచి
మొనసి యున్నటువలె జనులకుఁ గనుపించు
నంతర్విమానంబునంద యుండు
నావిమానము దేవతావళులకుఁ జూపు
దీపించునరులకుఁ జూపకుండు

తే. పాసఁగ మనుజులచే బాహ్యపూజలందు
గుప్తముగ దేవపూజఁ గైకొనుచునుండు
పరులు తను జేరి కోరినవరము లిచ్చి
మహిమఁ దనరారఁ జూపును మాధవుండు. 57

ఆ. అల్పదానమైన నధికంబుగను జూచి
స్వల్పపూజకైన సంతసంచి
పుణ్యమోక్షములను బొందించు దాసుల
నెన్న వశమె వేంకటేశుమహిమ. 58

క. ఘనవేంకటగిరిమహిమక్
మనసారఁ దలంచునట్టి మానవులకు నె
మ్మనమునఁ గనిపించుచు దా
నెనసినదయతోడ వరము లిచ్చుచునుండున్. 59

సీ. అప్రాకృతుండు దానై ప్రాకృతునిరీతి
దేశప్రజలవెంటఁ దిరిగి తిరిగి
తనమీఁదమోహంబు జనియింపఁగాఁజేసి
ప్రేమఁ జూపుచు వారిఁ బిలిచి పిలిచి
నయభయంబులతోడ నాకొండ కిపుడు మీ
సొమ్ములు ముడుపులు దెమ్మటంచుఁ
బలుకుచు వారివెంబడి నంటి మ్రొక్కులు
దెప్పించుకొంచును ధీరుఁ డగుచు
తే. వారపుడు వచ్చి సకలోత్సవములు వేంక
టాద్రిమీఁదను జేయింతు రాధ్యులగుచు
నపుడు వారిని మెచ్చి భాగ్యంబు లిచ్చి
మఱలఁ బంచుచునుండు సమ్ముదము నెపుడు. 60

తే. అట్టియుత్సవకాలంబులందు సకల
నిర్జరులు వచ్చి పుష్కరిణీజలమున
స్నానమును జేసి వేంకటేశ్వరుని నఖిల
పుష్పములఁ బూజనేతు రద్భుతము మీఱ. 61

ఆ. సొరిది భక్ష్యభోజ్యచోష్యలేహ్యజలంబు
లర్పణంబు సేయ ననువు దాన
నారగించు నెవరి కైనను గనుపింప
నియ్యఁ డాక్రమంబు నీశ్వరుండు. 62

తే. మానితం బగుమాయావిమానమందుఁ
దాను నిజరూపమున నుండి ధరను గృతక
కాంచనానందనిలయమం దంచితముగ
ఘనశిలావిగ్రహామురీతిఁ గానుపించు. 63

సీ. స్వల్పదానమునకు సంతుష్టుఁడై వారి
కాయురారోగ్యభాగ్యాదివివిధ
వరముల నిచ్చుచు వారల రక్షించు
నతినీచజాతివారైనఁ గాని
భక్తితో శరణని పర్వతంబును జూచి
నిలిచి మ్రొక్కినను మన్నించి బ్రోచు
కర్మాధికారులు గాని యోషిజ్జన
శూద్రులకును భక్తి సుస్థిరముగ

తే. వేంకటేశునిచరణారవిందయుగళ
మందు విస్తారముగఁ బట్టు నందువలన
మూఢభక్తులు గలియుగమున విశేష
కరుణ నేలుచునుండు వేంకటవిభుండు. 64

వ. కృతత్రేతాద్వాపరంబులయందుఁ బెక్కువేలయేండ్లు తపంబులు చేసిన హరి ప్రసన్నుం డగుట దుర్లభంబు. కలియుగంబున ముహూర్తమాత్రంబు నిశ్చలుండై ధ్యానించినం బ్రసన్నుం డగుచుండు. కాఁబట్టి కలియుగంబున శ్రీవేంకటేశుని సేవించు టుత్తమం బని ద్వీపాంతరముల నుండు వారును, సకలదేశవాసులును, వేంకటేశుని తుల్యుం డగు దేవుండు లేఁడనియుఁ బుష్కరిణీనిభం బగుతీర్థంబును లేదనియు నిది సత్యం బనియు మఱియుఁ గృతయుగాది మూఁడుయుగంబులయందు వేంకటాద్రి కనకమయంబుగ నుండి కలియుగంబున శిలామయంబుగ జనులకుఁ గన్పట్టుచుండు. తద్గిరియందు వసించియున్న శ్రీనివాసస్వామి లీలావినోదవిహారంబు లనంతంబులై యుండుం గావున మీకు సంక్షేపంబుగ నుడివితి నట్టి వేంకటాద్రియందు నిల్చి యాచార్యసమాశ్రయణంబుగల్గి విష్ణుభక్తులగు వైష్ణవులం జూచి వైమానికులు సంతసించుచుండుదు రన్యమతావలంబజను లైనను వేంకటేశునియందు భక్తిసల్పుచు నుండుదు రందు వారును గృతార్థు లగుదురు. కలియుగమునందు జనులతిశయవిత్తార్జనపరులై యనేకదుర్గుణంబుల నాశ్రయింతురు గాని హరిని సుస్థిరచిత్తులై ధ్యానింపఁజాలరు. ధ్యానించి రేని యయ్యీశ్వరుండు ముక్తిధనం బిచ్చువాఁడు. సకలపావనస్థానంబులకు మించినస్థానంబు వేంకటాద్రి యనిన సూతుంజూచి శౌనకాదు లత్యద్భుతంబంది యిట్లనిరి. 65

## వైష్ణవధర్మము.

ఉ. ఖ్యాతిగ శ్రీనివాసుఁ డతిగౌరవ మొప్పఁగ వేంకటాద్రిపై
భూతలవాసులం గృపను బ్రోచినసత్కథ వింటి మిందుచే
మాతపము ల్ఫలించినవి మంచిది వైష్ణవధర్మ మెట్టిదో
సూత తదీయధర్మములఁ జొప్పడఁ జెప్పు మొకింత యింపుగన్.

మ. అనినన్ సూతుఁడు సంతసించి మునివర్యాళిన్విలోకించి యి
ట్లనియెన్ ధాత్రిని శుభ్రఘోణిఘనదంష్ట్రాగ్రంబుతో నెత్తితె
చ్చినమీఁదన్ ధరణీసమేతుఁడగుచున్ శేషాద్రియం దుండఁ
గా, నొనరం దత్కటి చూచి భూమి యపు డత్యుత్సాహ
ముప్పొంగఁగన్. 67

తే. ఇట్టులనియెను గిటిరూప యీశ్వరేశ
నిర్మలము లైనవైష్ణవధర్మములను
జెప్పుమని వేడ భూమి నీక్షించి యజ్ఞ
పోత్రి యిట్లని పల్కె సంపూర్ణదయను. 68

సీ. వైష్ణవధర్మము ల్వరుసగ నన్నియుఁ
జెప్పవే యిపుడు సంక్షేపముగను
దయ ననఁగాఁ జెప్పెదను సంతసంబుగ
వైష్ణవాచారము ల్వసుధయందు
విశ్వాసహృదయులై వినినవారికిఁ బర
గతులు సిద్ధించు నిక్కంబుగాను
గురుఁడె ధర్మంబు సద్గురువే పరమగతి
గురుఁ డాత్మ యని నమ్మికొనినవారి

తే. భూరిదురితము నశియించి పోవు గనుక
యేవిధంబున గురుమర్మ మెఱిఁగి భక్తి

సలుపఁగాఁ దగువారు వైష్ణవులటంచుఁ
జెప్పఁ దగియుండు లోకప్రసిద్ధిగాను. 69

తే. ఎన్ని పాపము లొనరించి యున్నఁగాని
సద్గురుని జేరి శరణన్న సమయమునన
భూరిదురితము నశియించి పోవు గురుని
శిష్యుఁడై పాప మావలఁ జేయరాదు. 70

వ. అదెట్లనిన గురుకటాక్షంబు లేనియప్పుడు తెలియక చేసిన పాపపుంజంబును గురువరేణ్యుండు సమయింప నేర్చు నాచార్యానుగ్రహంబు గల్గినవెనుక తెలిసి చేసినపాపంబు గురుండు శమింపలేఁడు గావునఁ దత్పాపంబు గురుని బొందునని తెలిసి బుద్ధిమంతు లైనవారు పాపభీతి గలవారై యుండవలయు నవ్విష్ణుండ గురుండనినిర్ణయించుకొనవలయు, మనుజమాత్రుం డని గురుని నెంచిరేని యుత్తమగతి సిద్ధింపనేరదు, సంసార సముద్రంబునంబడి మునింగి పోవుచున్న సమయంబున నుత్తమ శాస్త్రధర్మం బను హస్తంబునఁ బట్టి వారి లేవనెత్తి మోక్ష తీరంబున నిలిపి యుపకారం బొనర్చినగురువర్యునకుఁ దాను బాపంబు నేయకుండుటయుఁ బ్రత్యుపకారం బగుచుండు నాచార్యులెట్టివా రనినఁ జెప్పెద విను మని వరాహస్వామి భూదేవి నీక్షించి యిట్లనియె. 71

సీ. న్యాయమార్గమునంద నడుపడి గలవార
లెలమి ధర్మ మధర్మ మెఱుఁగువారు
పుణ్యసత్కర్మతపోనిష్ఠు లగువార
లతిశాంతహృదయు లైనట్టివారు

మదియం దహంకార మమకార దంభద
ర్పాదిదుర్గుణముల నడఁచువారు
ప్రారబ్ధకలితాఘఘోరసంసారదా
వానలకీలల కలుకువారు
తే. అవని నిందాస్తుతులకు మానావమాన
ములకుఁ దగ్గక హెచ్చక భూతదయయు
ముఖ్యగుణము సుహృద్భావమును బరోప
కారమును గల్గు గురువుల ఘనులటంద్రు. 72

సీ. అట్టియాచార్యుల కనుగుణు లగుశిష్యు
లెట్టివా రనిన నీ వింక వినుము
విశ్వాసమును భక్తి వినయంబు శాంతియుఁ
గమనీయగుణములు గలుగువారు
సకలమంత్రాంతరసాధనాంతరముల
యందుఁ బరాఙ్ముఖు లైనవారు
సకలభారంబు లాచార్యులపాదంబు
లం దుంచి నిశ్చలు లైనవారు
తే. అనిశమును బాపభీతు లైనట్టివారు
గురువరేణ్యుని హరి యనుకొనినవారు
మాయ విడనాడి సేవను జేయువారు
ధాత్రి సచ్ఛిష్యులని చెప్పఁదగినవారు. 73

వ. ఎవ్వారేని ముముక్షువు లైనవారికి జ్ఞానం బనుసంసారబీజంబు నశింపవలె నయ్యది నశించినను నహంకార మమకారంబులు విడువవు. విడిచినను దేహాభిమానంబు వదలదు. వదలినను స్వస్వరూపజ్ఞానంబు పుట్టదు. పుట్టిన నైశ్వర్యభోగాపేక్ష

మానదు. మానిన నర్థకామ్యాదిరాగద్వేషాదులు వీడవు. వీడినను బారతంత్ర్య ప్రకారంబు గలుగనేరదు. కలిగినను శ్రీవైష్ణవత్వంబు చేకూఱదు. చేకూఱినను సాత్త్వికపరిగ్రహుండు కాఁడు. అయినను భాగవతపరిగ్రహుండు కానేరఁడు. అట్లయిన ననన్యార్హప్రయోజకుఁడు కాఁడు. అయిన ననన్యార్హశేషభూతుఁడు గానేరఁడు. అయిన ననన్యార్హశరణుండు కాఁజాలఁడు. అయిన నధికారపుర్షుండు గాఁడు. అయిన నష్టాక్షరి కధికారి యగును. 74

సీ. అట్టి సచ్ఛిష్యుల కాచార్యు లుపదేశ
మిచ్చి రక్షించుట యెట్టు లనిన
శ్రీవైష్ణవాచారచిహ్నానుసరణంబు
గా నుపదేశించి కరుణఁ బెంచి
యష్టాక్షరీమంత్ర మతిశయం బంతక
న్నను మంత్ర మెందు లేదనుచుఁ జెప్పి
నారాయణుఁడె మహోన్నతుఁ డతనికి మించి
నట్టిదేవుండు లేఁ డంచుఁ బలికి
తే. పట్టుగా ద్వయచరమప్రవృత్తి భక్తి
నిష్ఠలను జెప్పి హరిని ధ్యానించువిధము
చెప్పి యొప్పుభరన్యాసచిత్సుఖంబు
నందుఁ బొందింతు రాచార్యులైనవారు. 75

సీ. చక్కఁగ నాచార్యసంశ్రయణం బైన
వెనుక గామాదుల విడిచిపెట్టి
తలఁపున నెపు డహంతామమతలు లేక
విజనస్థలములందు విమలు లగుచు

మితభోజనంబును మితసుషుప్తియు మిత
సంభాషణంబు లాచార్యభక్త
యతిశాంతము పరిగ్రహంబు నారాయణ
విగ్రహధ్యానవివేకగుణము
తే. లభ్యసింపంగ మానసం బమల మగుచు
నిలుచు హరియంద మది యిట్లు నిలిచెనేని
యున్నతం బగువిష్ణుసాయుజ్యపదవి
నొందుదురు వైష్ణవశ్రేష్ఠు లుర్వియందు. 76
తే. వేంకటేశుఁడ నగునాకు వేడ్కమీఱ
వివిధపరిచర్య లొనరించి విశ్వసించి
చెలఁగి యాచార్యశుశ్రూష చేయునట్టి
నిర్మలశ్రద్ధ వైష్ణవధర్మ మవని. 77
సీ. పరగురువులఁ గన్న వస్త్రభూషణములఁ
బ్రీతి రెట్టింప నర్చించువారు
ఆసక్తితోఁ దదీయారాధనంబులు
నంచితంబుగ నడిపించువారు
దేశికశ్రీపాదతీర్థప్రసాదముల్
భక్తి గ్రహించి మేల్బడయువారు
పట్టైన శేషత్వపారతంత్ర్యంబు జీ
వాత్మధర్మము లని యలరువారు
తే. తగనితామసరాజసద్వయము నడఁచి
యొనర సాత్వికనిష్ఠలై యుండువారు
శాంతియును భూతదయయును సత్యవాక్య
ములను గలవారు వైష్ణవు లొానసి చూడ. 78

వ. అనిన విని భూదేవి వైష్ణవధర్మంబునకు సంతసించి జ్ఞానభక్తి
వైరాగ్యంబులు గలవారు కర్మంబులం గ్రమంబున నాచరింప
వలయు ననిన వరాహస్వామి యిట్లనియె. 79

సీ. భాసురవిజ్ఞాన భక్తి వైరాగ్యము
లల్లిగినవారును గర్మములను
విడువంగాఁ దగ దది వేదోక్తమార్గంబు
గాన సల్పం దగు కర్మములను
స్నానసంధ్యాదులు సవనము ల్నిజశక్తిఁ
గొలఁది సల్పం దగు గోర్కె విడచి
హరి కర్పితం బని యాచరించినయప్డు
సంతుష్టుఁ డగునది సత్ఫలంబు
తే. గనుక విప్రులు వేదమార్గక్రమమున
జన్నములు చేసిరేని యీశ్వరుఁడు మెచ్చి
యిష్టఫలముల నవ్వారి కిచ్చుచుండు
నందు జన్నాలు సేయుదు రార్యులెల్ల. 80

వ. ఇవ్విధంబున నిష్కామసత్కర్మంబు నాచరింపవలయు మదాజ్ఞో
ల్లంఘనంబు సేసినవారు దోషయుక్తు లగుదురు గావున
సద్బ్రాహ్మణులు యజనాదిషట్కర్మంబు నాచరింపుదు రందుఁ
గొందఱు బ్రహ్మచర్యా[illegible]శ్రమంబు లాచరించి [illegible]లై
సన్యసించి కర్మముక్తులై ప్రణవోచ్చారణంబు సేయుచు
సన్యాసవిధిఁ గొన్నియబ్దంబు లాచరించి పూర్ణజ్ఞానోదయం
బైనపిదప విధియుతంబుగ దండకమండలువులు విడిచి యవ
ధూతాశ్రమంబు నంగీకరించి శీతోష్ణసుఖదుఃఖాది ద్వంద్వా
తీతుఁడై సచ్చిదానంద నిత్యపరిపూర్ణబ్రహ్మానుసంధానంబు

నేయుచుండవలయు నట్లు చేసినవారు బ్రహ్మసాయుజ్యంబు నొందుదురని చెప్పి వరాహస్వామి వెండియు నిట్లనియె. 81

జీవబ్రహ్మప్రశంస.

సీ. వెలఁది బ్రహ్మము రెండువిధములై యుండుఁ బ
రాపరము లనంగఁ బ్రబలునందుఁ
బర మక్షరంబును బరమేశ్వరం బీక్ష
రంబు జీవుం డక్షరంబు విమల
కూటస్థుఁ డనఁబడు పాటింపఁ బరమాత్ముఁ
డాతఁడ పరమేశుఁ డతఁడ గురువు
పురుషోత్తముఁడు సర్వపూర్ణుఁ డా బ్రహ్మాంశ
జుం డనఁదగిన జీవుండవిద్య
తే. అట్టిపరిమితి లేనిదేహంబునందుఁ
జొచ్చి వెడలుచుఁ గడుమోహశోకవార్ధు
లందు మునుఁగుచుఁ దేలుచు నహము పెంచి
భూరికర్మంబు లొనరించి పుట్టు గిట్టు. 82

వ. కావున నట్టి యట్టిజీవుం డవిద్యోపాధిచేత భిన్నుండగు ననేక దేహంబు లెత్తుచుండు నందుఁ గొన్ని దేహంబులయందుండి యెక్కుడు పాపకర్మంబులు చేసి యధోగతి నొందుచు నిష్కామపుణ్యకర్మంబులు చేసి యూర్ధ్వగతిఁ బొందుచుఁ బుణ్యపాపమిశ్రకర్మంబులు చేసి సుఖదుఃఖంబు లనుభవించుచు మర్త్యలోకంబునఁ బుట్టుచు గిట్టుచు నుండు నందుఁ గొందఱు కామభోగసక్తులై యుందురు మఱియును. 83

ఉ. కామముచేఁ గ్రతుప్రముఖకర్మము లొప్పఁగ నాచరించి సు
త్రామపురాదిలోకములఁ దక్కఁగఁ జేరి సుఖంబులొంది యం

దేమతి యున్న పుణ్యతతు లెప్పుడు నాశము నొందునప్పుడే
భూమినిబుట్టి క్రమ్మఱను బోవుచు వచ్చుచునుందు రెప్పుడున్.

వ. అందుఁ గొందఱు యోగాభ్యాసనిష్ఠులై సత్పదంబు నొందు
దురు గావున. 85

తే. ఘనతరము లైన యోగ ప్రకారములను
దేవ ! సత్కృపతో నాకుఁ దెల్పవలయు
ననుచుఁ బ్రార్థింప ముదమంది యవ్వరాహ
దేవుఁ డిట్లనె నాభూమి దేవి కపుడు. 86

వ. యోగమార్గక్రమం బెట్లనిన గురూపదేశక్రమంబుగా యమ
నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణ
సమాధులనియెడి యష్టాంగ యోగంబు లభ్యసింపవలయు
నందు యమం బెట్టిదనిన. 87

అష్టాంగ యోగంబులు.

సీ. జగతి నహింసయు సత్య మస్తేయంబు
బ్రహ్మచర్యం బార్జవంబు క్షమయు
నతిశయధృతిమితాహారముల్ శౌచంబు
నీపది యమముల నెట్టులనిన
సకలజీవులకుఁ గ్లేశంబు పుట్టింపకు
న్నట్టిచంద మహింస యనఁగఁ బరఁగు
నవని నందఱ కిష్టుఁడై దబ్బరాడకు
న్న ంందము సత్యమన్న ధనము
తే. కోరి మాయలఁ బన్ని గైకొనఁదలంప
కుండు టస్తేయ మనఁబడు నొరులసతుల

మాతృభావంబుగాఁ జూచుమతము బ్రహ్మ
చర్యమన నొప్పుచుండు నోసరసిజాక్షి. 88

తే. సారదయభూతమైత్రి యార్జవ మనంగ
నకుటిలత్వముగుఁ క్షమయనఁగ నోర్పు
ధృతియనఁగ ధైర్యమనఁదగు మితభుక్తి
యనఁగ మితభోజనము శౌచమనఁగశుద్ధి. 89

వ. యమం బిప్పుడివిధంబులం జెప్పందగు నింక నియమంబు లెవ్వి యనిన యోగశాస్త్రరతియు సత్పాత్రదానంబును సంతోషంబును లజ్జయు వ్రతంబును మతియు నాస్తిక్యంబును నీశ్వరార్చనంబును దపంబును జపంబు నననొప్పు నీదశవిధంబులైన నియమంబులయందు వాదాస్పదశాస్త్రంబు లుదర పోషణార్థంబని నిరసించి మోక్షప్రదశాస్త్రంబు లభ్యసించుట యోగశాస్త్రరతి యగుఁ దనకుఁ బ్రాప్తంబైన ధనంబు గురు ద్విజార్థులకు సమర్పించుట పాత్రదానం బగు. లాభాలాభ శుభాశుభ సంయోగవియోగ మానావమాన స్తుతినిందాదుల మోదఖేదంబులు లేకయుండుట సంతోషం బనందగు. సుజనసాంగత్యంబువలనఁ దనదుర్గుణంబులఁ దాఁ దలఁచి తన్నుఁ దా నిందించుకొని దుర్గుణంబుల మాని సుగుణంబు లభ్యసించుట లజ్జయగు. దానసంకల్పించి సేయు మోక్షసాధనంబు విడువక యాచరించుట వ్రతంబనఁదగు. తాఁ జేయు యోగంబునకు రోగదారిద్ర్యసంశయశాస్త్రవాద రసవాద దుష్టస్నేహాది విఘ్నంబులు వచ్చినను జలింపకుండుట బుద్ధి యగు. మతభేదపురాణేతిహాసాది సద్గ్రంథంబులను శ్రద్ధం గని సారార్థగ్రహణంబు సేయుట యాస్తిక్యంబగు. నతితేజో

మయంబైన యీశ్వరరూపంబును గురుముఖంబుగ నెఱిఁగి
హృత్కమలమునందు మనంబున ధ్యానించి పూజించుట
యీశ్వరార్చనంబగు. గురువాక్యంబు సత్యంబుగనమ్మి చెప్పిన
నియమంబు తప్పక కష్టంబున కోపినపుడ తపంబగు. జప్యా
జప్యంబులయందుఁ దనకు గురుండుపదేశించిన మంత్రంబు
నిశ్చలుండై విడువక జపించుట జపంబగు. నీపదియు నియ
మంబులగు నిట్టియమనియమంబు లిరువదియు నంతశ్శుద్ధి
ప్రదంబులగుం గావున వీనినభ్యసించి యంతశ్శుద్ధి నొంది
కీటాదిజంతువులు మొదలకుండునట్టి విజనస్థలంబునందుఁ
జేలాజిన కుశోత్తరంబుగ నాసనసుఖంబు నిర్మించి యందు
నాసనంబుల నభ్యాసంబు సేయవలయు నవ్విధం బెట్లనిన. 90

పద్మాక్షి విను మేను పదినాల్గులక్షలై
నట్టియాసనములం దతిశయములు
లీలమై నెనుబదినాలు గాసనములం
దధికంబు లష్టాదశాసనంబు
లటువంటి యష్టాదశాసనంబులలోన
నతిశయించినవి సిద్ధాసనంబు
భద్రాసనంబును బద్మాసనంబును
సింహాసనంబని చెప్పఁదగిన

తే. నాలుగాసనములయందుఁ జాలమేటి
యనఁగ నొప్పుచునుండు సిద్ధాసనంబు
పొలఁతి యష్టాదశాసనంబులవిధములు
వినుము వేర్వేఱఁ జెప్పెద విశదముగను. 91

వ. స్వస్తికాసన, గోముఖాసన, వీరాసన, కూర్మాసన, కుక్కుటాసన, నోత్తాన కూర్మాసన, ధనురాసన, మత్స్యేంద్రాసన, పశ్చిమస్థానాసన, మయూరాసన, సిద్ధాసన, మతాంతరసిద్ధాసన, భద్రాసన, పద్మాసన, మతాంతరపద్మాసన, బద్ధపద్మాసన, సింహాసన, శవాసనంబు లనునీయష్టాదశాసనంబులందు స్వస్తికాసనం బెట్లనఁగ. 92

తే. తరుణి విను జానుజంఘికాంతరములందుఁ
బదము లొడికిలిగా నుంచి పదిలపఱచి
యున్న నది స్వస్తికాసనం బొప్పు గోము
ఖాసనం బెటులన్న పద్మాక్షి వినుము. 93

వ. ఎడమకాలిమడమ కుడివీఁపుప్రక్క కుడికాలిమడమ నెడమ వీఁపుప్రక్కఁగ మోఁకాటిమీఁద మోఁకాలు కదియనుంచి కూర్చున్న గోముఖాసనం బనంబడు. నొకపాదము తొడఁ గ్రింద నొకపాదముతొడ మీఁద నునిచి కూర్చున్న నదివీరాసనం బనంబడు. నాధారమునకు నుభయపార్శ్వంబుల రెండు కాళ్లమడమలు కదియ హత్తించి చక్కఁగఁ గూర్చుండ నది కూర్మాసనంబగు. పద్మాసనంబుగ మోఁకాళ్లమెడలసందులఁ జేతులదూర్చి హస్తముల నేలనూని పద్మాసనంబు పైకెగసి నట్లుండుట కుక్కుటాసనంబగు. నిట్లు కుక్కుటాసనస్థుఁడై యుండి రెండుచేతులును మెడను పట్టుకొని కూర్మమువలె వెలికిలఁబడియున్న నది కూర్మాసనంబగు. పాదాంగుష్ఠంబుల రెంటిని రెండుచేతుల ధనురాకృతిగ వీఁపువెనుకగఁ జెవులకు సరిగఁ బెట్టియుండుట ధనురాసనంబగు. నెడమతొడ మొదటికుడిపాదము వట్టుకుని వెడమఱలఁబడియున్న, దీని

వలన జఠరాగ్ని ప్రకాశించి కుక్షిరోగము నశించును. అభ్యాసమువలనఁ గుండలిని మేలుకొల్పును బురుషునకు దండస్థిరత్వంబు కల్గు నిదియ మత్స్యేంద్రాసనం బనంబడును. భూమి నానునట్టుగ రెండుకాళ్లుఁ జక్కఁగ సాఁచి నడుము వంచి మోఁకాళ్లమీఁద లలాటముంచి రెండుచేతులుసాఁచి రెండు కాళ్లవేళ్లు రెండుచేతులం బట్టియున్న దీనివలన వాయువు పశ్చిమమార్గముగ నడుచును. జఠరాగ్నిపుట్టి కడుపులుచన్నై రోగములునశించును, ఇదియపశ్చిమతాణువాసనంబగు. హస్తములు రెండు నేలఁ బూని, మోచేతులు రెండు నాభికిరు ప్రక్కల నుంచి ముఖము పైకెత్తి రెండుకాళ్లు సాఁచి నెమలి తోఁక పైకెత్తికొనినట్లున్న దీనివలన గుల్మాదిరోగములు నశించి జఠరాగ్ని ప్రకాశించి విషమునైన జీర్ణము సేయునది. యిదియ మయూరాసనంబగు. నెడమకాలిమడమ మూలాధారమునందును, కుడికాలిమడమ లింగస్థానంబునందుంచి యేకాగ్రచిత్తముగ శీర్షగ్రీవభుజంబులఁ జక్కఁగ నునిచి నడుమునిక్కించి భ్రూమధ్యావలోకనంబు సేయుచున్న, దీని వలన మోక్షద్వారకవాటభేదనంబగు నిదియ సిద్ధాసనంబగు. లింగాసనోపరి యెడమమడమనునిచి దానిమీఁదఁ గుడిమడమ నునిచిన నిదియ మతాంతర సిద్ధాసనంబగు. నిదియ వజ్రాసనంబు, నిదియ ముక్తాసనంబు, నిదియ గుప్తాసనంబగు. మడమలు రెండు నండాధఃప్రదేశలింగపార్శ్వంబులనుండి రెండు పార్శ్వములు రెండుచేతులంబట్టి కదలకుండిన దీనివలన విషములు సకలరోగములు హరించును, నిదియభద్రాసనం బిదియ గోరక్షాసనంబునగు. నెడమతొడమీఁదనున్న కుడిపాదము

కుడితొడమీఁద నెడమపాదము నునిచి వీఁపుగుండ కుడిచేత నెడమతొడమీఁదనున్న కుడిపాదము బొటనవ్రేలింబట్టి యట్లన వీఁపుగుండ నెడమచేతఁ గుడితొడమీఁదనున్న నెడమపాదము బొటనవ్రేలంబట్టి హృదయమునందుఁ జుబుకంబు నునిచి నాసికాగ్రంబుచూచుచున్న దీనివలన వ్యాధులు నశించు నిదియ పద్మాసనంబగు. నెడమతొడనడుమ కుడిపాదము వెలికలనునిచి కుడితొడనడుమ నెడమపాదము వెలికల నునిచి హస్తములు రెండును రెండుతొడలమీఁద వెలికలగ నునిచి నాసాగ్రమునందు లక్ష్యంబుంచి దంతమూలమున నాలుక హత్తించి వక్షమునందుఁ జుబుకంబు నుంచి మెల్లన వాయువు నిల్పియున్న, దీనివలన సర్వరోగంబులు నశించు నిది మతాంతరపద్మాసనం, బిదియముక్తపద్మాసనంబగు. హస్తములు రెండు హత్తించి చిత్తమునందు ధ్యానంబు సేయుచు నపానవాయువు నూర్ధ్వముఖముగ నడుపఁగఁ గుండలిశక్తియుక్తమై నిల్పిన ప్రాణవాయువును విడువఁగ నతిశయంబగు జ్ఞానబోధకల్గును, దీనివలన నాడిద్వారములయందు వాయువు నిల్చును, ఈవిధమునన మరణమునొందిన ముక్తులగుదు రిది బద్ధపద్మాసనంబగు. లింగాండోభయపార్శ్వములయందు నెడమకాలిమడమ దక్షిణపార్శ్వము కుడికాలిమడమ నెడమపార్శ్వంబున నునిచి చేతులు రెండు మోఁకాళ్లమీఁదుగ సాఁచి వికసింపఁబడినవ్రేళ్లుగ నునిచియున్న, దీనివలన మూలోడ్యాణజాలంధరబంధత్రయానుసంధానంబుకలుగు నిది శ్రేష్ఠమైన సింహాసనంబగు. భూమియందు శవమువలె వెలికలుగఁ గాళ్లు రెండు బొటనవ్రేళ్లు సరిగఁగూర్చుండినయట్లుగ సాఁచు

కొని హస్తములు రెండు వక్షంబునందుఁ గదియ నుంచి పండుకొనియున్న, దీనివలన సమస్తాసనములు వేసియున్న బడలికలు తీఱు నిది చిత్తవిశ్రాంతి సాధనమైయుండు, నిది శవాసనంబగు. క్రమంబుగ నాసనాభ్యాసంబులు చేసిన నాడులు వశీకృతంబులై దేహంబునకు జవలఘుత్వంబులు గల్గి సర్వరోగహరంబగు. గావున దీనిసాధించిన యనంతరంబు ప్రాణాయామంబు సేయవలయు, నదెట్లన్న వినుము. "ప్రాణవాయువు నుద్దేశించి చంద్రనాడివలన హరించి యథాశక్తిగ నిల్పి తిరుగ సూర్యనాడిచేత మెల్లఁగ నుదరము పూరించి శాస్త్రప్రకారంబుగఁ గుంభకంబును ధరించి మఱలఁ జంద్రనాడిచేత విడువవలెను. బాగుగ నేమార్గంబున విడుచునో యామార్గంబునఁ బూరించి ధరింపవలెను. మొదటి మార్గముకంటె రెండవమార్గమున త్వరపడక మెల్లఁగ విడువవలయును. మఱియు నిడయందుఁ బూరించి కుంభించి పింగళ నాడిని విడచి మఱలఁ బింగళనాడిని బూరించి కుంభించి యిడయందు విడువవలయును. సూర్యచంద్రనాడులీక్రమంబుగఁ జేసి వాయువెంతయుక్తమో యంతనిలుపవలయు. నీక్రమంబునఁజేయు రేచకపూరక కుంభకత్రయంబు నొక్క ప్రాణాయామంబగు. నుదయమధ్యాహ్న సాయంకాలార్ధరాత్రంబులఁ గాలంబున కిరువైచొప్పునఁ గుంభకంబులు మెల్ల మెల్లఁగ నెనుబదిగ, నొకదిన మభ్యసింపవలెను. ప్రాణనిరోధమగుచుండఁ జెమటపుట్టినట్టయ్యనేని కనిష్ఠంబగు, వడఁకుఁ బుట్టినట్లాయెనేని మధ్యమంబగు, మాటిమాటికిఁ బద్మాసనం బెగసినట్లాయెనా యుత్తమంబగు, నిట్టియభ్యాసమునఁ బుట్టిన

చెమట మర్దనంబు సేయఁగఁ దనువునకు దృఢత్వలఘుత్వం
బులు పుట్టును. మఱి యీ ప్రాణాయామముచేత మూఁడు
నెలలు మీఁదట నాడిశుద్ధి గల్గును. నిదియ ప్రాణాయామం
బగు నింకఁ బ్రత్యాహారం బెట్లన్నను. 94

సీ. శ్రీగురుబోధ విశేషతగలబుద్ధి
చే మానసమును సుస్థిరముచేసి
యామదియం దింద్రియవ్యాప్తు లడఁగింప
నందొప్పుగానిల్చు ననిలగతులు
కమఠ మంగములను గదలనీయక కుక్షి
యందు డాఁచినరీతి నఖిలవిషయ
కరణానిలములఁ జక్కఁగఁబట్టి నిల్పఁగ
నదియ ప్రత్యాహార మనఁగఁబరగు

తే. దాన దేహంబు సుస్థిరత్త్వంబు నొందు
దీపితంబుగ నేకాగ్రదృష్టి నిలుచు
దీని సాధించి యటమీఁద ధ్యానయోగ
మెలమి సాధింపవలె నది యెట్టులనిన. 95

తే. రోష దుర్భావవైకల్య దోషములను
కపటవచనంబులను విడి గర్వమడఁచి
సద్గురూక్తులు వించును శాంతుఁ డగుచు
నెపుడు కరువలినూని సర్వేంద్రియముల. 96

చ. అపురుపుసంహరించి గురుఁడానతియిచ్చిన లక్ష్యముద్రలం
దుపముగ మానసంబునిడి యొండొకచింతను లేక చిత్తముం
జపలతఁ బొందనియ్యక సుషద్వసజంబులనూని లోనఁ దా
నెపుడు చలింపకున్న మదికింపొనరించెడి ధ్యానయోగియై.

వ. ఇది ధ్యానయోగంబు నిఁక ధారణాయోగంబులఁ జెప్పెద నెట్లనినఁ, జరణాదిజానుపర్యంతంబు పృథ్వీతత్వంబగు. తదధి దైవతం బైన బ్రహ్మను లకారయుక్తంబైన వాయుధారణా భ్యాసంబున ధ్యానింపఁ బృథ్వీజయంబు గల్గు, జాన్వాదినాభి పర్యంతంబు జలతత్వంబగు. తదధిదైవతంబైన విష్ణుని వకార యుక్తంబైన వాయుధారణాభ్యాసంబున ధ్యానింప సలిల జయంబుగల్గు, నాభ్యాదికంఠపర్యంతం బగ్నితత్వంబగు. తదధి దైవతం బైనరుద్రుని రవర్ణయుక్తంబైన వాయుధారణా భ్యాసంబునధ్యానింప నగ్నిజయంబుగల్గు, కంఠాదిభ్రూమధ్య పర్యంతంబు వాయుతత్వంబగుతదధిదైవతంబైన మాహేశ్వ రుని యకారయుక్తంబైన వాయుధారణాభ్యాసంబున ధ్యానింపఁ బవనజయంబు గల్గు, భ్రూమధ్యాది బ్రహ్మరంధ్ర పర్యంతం బాకాశతత్వంబగు. తదధిదైవతంబైన బిందుమయ గగనశరీరుండైన సదాశివుని యకారయుక్తంబైనఁ బ్రాణా నిలధారణాన్యాసంబున ధ్యానింపఁ దన్మయత్వంబును గగన జయంబును గలుగు నిట్లు ధారుణియు, వారుణియు, నాగ్నియు, మారుతవ్యోమంబులుపంచధారణాధ్యానాభ్యా సంబునఁ బంచభూతజయంబు గల్గు నివ్విధంబున. 98

తే. ధ్యానమభ్యాస మొనరింపఁ దలఁగకపుడు
మానసము నిల్చు మదినూని మతియు నిల్చు
బుద్ధి నిల్చిన నానందపూర్తి గలుగు
నదియధారుణయంద్రు యోగాఢ్యు లవని. 99

వ. ఇది ధారణయోగంబు నిఁక సమాధి యెట్లనిన, నాసనజయం బునం గుంభకసిద్ధిచేత నిర్మలంబైనజ్ఞానభాను ప్రకాశంబుచేత

మాయాంధకారంబు నడంచి ప్రకాశించుమానసంబు నాత్మా కాశంబునందుఁ గూర్చి తన్మయత్వంబునొంది శాంతవర్తనుం డైన సంయోగవియోగ సుఖదుఃఖంబుల మఱువ బ్రహ్మపద ప్రాప్తభావనిశ్చలానందభరితంబైన స్వానుభవబోధయ సమాధియగు నియ్యష్టాంగయోగాభ్యాసంబుచేయువారికి నీసమాధిఫలితార్థంబగునట్టివారు బ్రహ్మపదంబునొందుదురివి స్థూలాష్టాంగయోగంబు లగు నిఁక మంత్రలయహఠరాజయోగంబులు గలవనిన వరాహస్వామికి మ్రొక్కి భూదేవి యిట్లనియె.

తే. దేవ ! యష్టాంగయోగము దెలియ వింటి
రమ్యతర మంత్ర లయ హఠ రాజయోగ
ములను నామీఁద దయయుంచి తెలుపుమనిన
శ్వేతకిటి భూమిదేవి నీక్షించి పలికె. 101

వ. దేవి విను మిఁక మంత్రయోగవిధానంబు చెప్పెద నదియును.

### మంత్రయోగము.

సీ. పూని విసర్జనస్థానంబునందుండు
నాధారకమలంబునందు వ శ ష
స లు నాలుగైన తేఁకులయందు దీపించు
విఘ్నేశుఁ డచ్చట వెలుఁగుచుండు
దానికి నంగుళద్వయముపై నుత్పత్తి
కైన స్వాధిష్ఠానమందు బ భ మ
య ర ల కావలనుండు నదియాఱుదళములం
దజుఁడుండు నుత్పత్తికాధ్యుఁడగుచు
తే. మెఱసి యష్టాంగుళములకు మీఁద డాది
ఫాంతవర్ణావళిం గూడి పదిదళముల

నొప్పు మణిపూరకము నాభినుండు విష్ణుఁ
డచటఁ దా స్థితికర్తయై యలరుచుండు. 103

సీ. పదియంగుళములకుఁ బై హృదయస్థాన
మం దనాహతపద్మ మమరుచుండు
కాంతవర్ణకము లుండఁగ పదిరెండైన
దళములచే నొప్పు దానియందు
నధికుఁడై లయకర్త యైనరుద్రుఁడుండు
నావలఁ బదియు రెండంగుళముల
పై విశుద్ధంబుండు భావింప కంఠంబు
నందున నాల్గుపదాఱుదళము
తే. లందు వెలుఁగు సదాశివుం డచటనుండు
దానిమీఁదట నాజ్ఞాభిధానచక్ర
మున హకారక్షకారంబు లొనరునచట
నున్నతంబుగఁ బరమాత్మ యొప్పుచుండు. 104

సీ. అట దానిపైన సహస్రారకమలంబు
శీర్షంబునందు భాసిల్లుచుండు
నది యమృతస్థాన మగు దేహవృక్షంబు
నకు మూలమై గురునకు నివాస
మగు నిడాపింగళలం దేకవింశతి
సాహస్రములు మఱి షట్ఛతంబు
లైనశ్వాసములు ప్రాణాపానకలితంబు
లై హంసలై యజపాఖ్యనొందు.
తే. నట్టిశ్వాసలు గణపతి కాఱునూఱు
జలజసంభవ విష్ణురుద్రులకు సంఖ్య

దప్ప కాఁ జేసి వేలు సదాశివునకు
నొగిఁ బరాత్మకు గురున కొక్కొక్క వేయి. 105

వ. ఈప్రకారంబు సప్తకమలంబులయందు హంసలు ద్రొక్కు చున్నప్పుడు కాలఘటికాక్రమంబు నెఱుంగవలయు నదెట్లన.

లయయోగము.

సీ. ఆధారమున హంస లాఱునూ ఱర్పితం
బగువేళ కొకటి యాఱైనగడియ
పదివినాడులునగు పరఁగుస్వాధిష్ఠాన
మం దాఱువేలైన హంసలొనర
నర్పితంబగువేళ కగును షోడశఘటి
కలు నర్ధఘటిక విగడియలు పది
క్రమముగ మణిపూరకమున కాఱ్వేలైన
హంస లర్పిత మగునపుడు పదియు
తే. నాఱు నరగడియ విగడియలును బదియు
నగు ననాహతమున హంస లాఱువేలు
నర్పితం బగుతఱి పదియాఱు నరయ
గడియ లొకపదియైన విగడియ లగును. 107

సీ. ప్రకటవిశుద్ధంబునకు వేయిహంసలు
నర్పితం బగువేళ కగును రెండు
గడియలు సగమైన గడియ పదాఱు వి
గడియలు హంస లక్కడికి నాల్గు
నాఙ్ఞయందు సహస్రహంస లర్పితమగు
నపుడు రెం డఱగడియలు విగడియ

లును బదాఱును హంసలును నాలు గగు సహ
స్రారంబునందు సహస్రహంస
తే. లక్షణముగాఁగ రెండున్నరైనగడియ
లలవిగడియలుపదియాఱు హంసలొక్క
నాలు గగుచుండు నీరీతి ననుదినంబు
జరుగు నరువదిగడియలై జనులకెల్ల. 108

వ. ఇవ్విధంబున నుదయాద్యుదయపర్యంతము నడచుచున్న నిరు వదియొక్కవేయియు నాఱునూఱుహంసలు నజప యనందగు నట్టి యజపగాయత్రి మహామంత్రంబు గురుముఖంబుగ నెఱింగి యరుణోదయంబునఁ బరమశుచి యై పద్మాసనాసీనుఁ డై కూర్చుండి నాసాగ్రావలోకనుండై సప్తకమలాధిదేవతలకు న్యాసధ్యానపూర్వకంబుగ నర్పణంబు సేయుచుండుట మంత్ర యోగంబగు. నింక లయయోగంబెట్లన్న, విజనస్థలంబున భద్రాసనాసీనుఁడై కూరుచుండి దిగువ నాసికాగ్రంబునుజూచు చుం బైనున్నదిసాధించుచుఁ బై నాసికాగ్రంబును జూచుచు దిగువనున్నది సాధించుచు రెండుతర్జనులచేత రెండుకర్ణ ద్వారంబులును రెండనామికలతో రెండునాసికద్వారంబు లును బంధించి శిరంబు వంచి యేకాగ్రచిత్తుండై వివేకుఁడై యూర్ధ్వంబుగఁ జూడ నది రాధాయంత్రంబను ముద్రయగుఁ దన్ముద్రాభ్యాసంబుం జేయుచున్న బ్రహ్మరంధ్రంబునందుఁ బ్రణవనాదంబు దశవిధంబుగ మ్రోయుచుండు. నది యెట్లన్న మొదట శింజినీగతియు, రెండవది తరంగఘోషంబు, మూఁడ వది ఘంటారవంబు, నాల్గవది వేణునాదంబు, నైదవది వీణాస్వ నసంబు, నాఱవది భేరీధ్వనియు, నేడవది తాళధ్వని, యెనిమిద

వది శంఖారవంబును, దొమ్మిదవది మృదంగనాదంబును,పదియ
వది ప్రణవనినాదంబును మేఘనాదంబుకరణి వినంబడు నిట్లు
క్రమంబుగ నాదానుసంధానంబు సేయ నందు నవనాదంబులు
లయించి పదియవదైన మేఘనాదంబున శ్రవణసహితంబుగ
మనంబునునిచి నిర్వ్యాపారంబుగనిల్పి బాహ్యంబు మఱచి
యున్న నమ్మానసంబుతోఁ బవనంబందు లీనంబగు నిది నాద
లీలానందకరంబైన లయయోగంబగు. నింక హఠయోగం
బెట్టిదనిన, రాజపరిపాలితంబైన సుభిక్షరాజ్యంబునందు హఠ
యోగమండపంబు నిర్మించి యందుండి యభ్యాసంబు సేయ
వలయు నదెట్లన్న, సుగంధపుష్పఫలభరితంబునగు వన
మధ్యంబున గాలి చొరకుండ సూక్ష్మద్వారయుక్తంబైనమండ
పంబొండు నియమించుకొని దినదినంబును గోమయంబున
శుద్ధిసేయించుచు నందు వసియించి యతిశయించిన, నుప్పు,
పులుసు, కారము, చేఁదు, వగఱు వస్తువులను, పిదపఁ
దిలతైలంబును, అజాదిమాంసమద్యమీనంబులును, రేఁగుపం
డ్లును, మిక్కిలిపసరాకుకూరలును, దధి, తక్ర, కుళుత్థములును,
శర్కర మొదలైన సాత్వికాహారంబును గ్రహింపవలయుఁ,
దాభుజింపఁదగిన యన్నంబు నాల్గుపాళ్లుచేసి యొకపాలువిడచి
మూఁడవపా లీశ్వరప్రీతిగ భుజించుచుఁ ద్రిఫలంబు లౌషధం
బుగ గ్రహించుచుఁ బ్రాతస్స్నానోపవాస వ్రతస్త్రీసాంగ
త్యాదిదేహప్రయాసంబులు విడచి యనలార్కోదితంబు
లైన, కాఁకలంబడక శీతవాతంబులయందునుండక, యోగష
ట్కర్మంబు లాచరింపవలయు నదియెయ్యదియనిన, ధౌతికర్మ,

వస్తికర్మ, నీతికర్మ, త్రాటకకర్మ నుహాలీకర్మ, గఫాలభాతి కర్మంబు నాలుగల వందు ధౌతికర్మం బెట్లంటివేని. 109

తే. వినుము మృదువస్త్రమొకనాల్గువ్రేళ్ళ వెడలు
పుగఁ బదేనగుచేతుల పొడవుగల్గి
నట్టివస్త్రంబు తేట నీళ్లందుఁ దడిపి
మెల్ల మెల్లఁగ లోనికి మ్రింగవలయు. 110

సీ. అటుమ్రింగి యీవల నతివేగమునఁ దీసి
యటుమీఁద వింశతిహస్తసంఖ్య
గలవస్త్రమును మెల్లఁగా దిగమ్రింగుచుఁ
దీయుచునుండఁగ దీపనంబు
గలుగునపానంబు గంఠనాళముగుండ
వెడలింపఁ బైత్యంబు వెడలిపోవు
నది యభ్యసింపఁగ నక్షిరోగములు కా
సశ్వాస ముఖరోగచయము లడఁగు

తే. గురుముఖంబుగ నీమర్మ మరసి ధౌతి
గజకరణి యన నొప్పు నీకర్మ మొనర
నభ్యసింపఁగ వాయువు లన్ని తనకు
వశములై నిల్చుచుండు నోవారిజాక్షి. 111

వ. ఇక వస్తికర్మం బెట్లన్న నాభిపర్యంతముగ నీటియందుఁ జొచ్చి యధోద్వారమునందు క్రోలయుంచి కుక్కుటాసనస్థుండై గూర్చుండి యపానవాయువుచేత జలమును మీఁదికి నెగయంజేర్చి తిరుగ నధోద్వారంబున నాజలంబును విడువ, దీన నధికశూలలు గడ్డలు మహోదరాలు వాతపిత్తశ్లేష్మంబులచేఁ గల్గు సకలవ్యాధులును దొలంగు సప్తధాతు చతు

రాదింద్రియాంతర్గతకరణప్రసన్నతయు, శాంతియు, క్షుత్తు గలిగి సర్వతోష మొనరించి వివిధభయంబులఁ బోఁగొట్టు నిది వస్తికర్మంబగు. నిఁక నేతికర్మం బెట్లన్న జానెడుపొడవు సూత్రము మలినములేని నేతియందుఁ దడిపి నాసికమునం బీల్చి నోట వెడలఁదీయఁగఁ దివ్యదృష్టి గల్గు నిఁకఁ ద్రాటక కర్మంబు వచించెదఁ, గదలనిచూపువలన, సూక్ష్మంబైనగుడిని యేకాగ్రచిత్తంబునఁ గన్నీరొల్కఁ జూడఁగ నేత్రరోగా దులువోయి బంగరుపెట్టియవలె గోప్యముసేయం దగినది. ఇఁక నవూలికర్మంబును వక్కాణింతు వినుము, తీవ్రంబునం గడుపును గుడియెడమగఁ ద్రిప్పఁగఁ గడుపులోని మందాగ్ని విడచి దీపనంబు గల్గి పాచనాదులు గల్గుచు నానందమలరి సమస్తరోగదోషంబులను బోఁగొట్టును. హఠయోగంబునకు శ్రేష్ఠమైయుండు నిన్నవూలీకర్మం బిఁకఁ గపాలభాతికర్మం బెట్టిదంటివేని వినుము. లోహకారకుఁడు కొలిమితిత్తినూది నట్లు రేచకపూరకంబులు చేయం గఫాదిరోగంబులు తలంగును. దేహదార్ఢ్యము నాయురారోగ్యము గల్గుచుండు కాఁబట్టి యీషట్కర్మంబులు క్రమంబుగ నభ్యసించి రోగ విరహితులైన నాడులు వశవృత్తులగుచుండునప్పుడు సిద్ధాస నాసీనుఁడై రేచక పూరక కుంభకాన్వితంబైన ప్రాణాయామ పూర్వకంబుగ షణ్ముఖముద్రాభ్యాసంబు సేయుచుండు. నావల సుషుమ్నానాడికిం గారణంబైన మూలాధారాధిక బ్రహ్మరంధ్రంబు గలదు. ఆరంధ్రంబును దత్వమనియుఁ ద్రిబింగళ నాడులు ముఖంబనియుఁ జెప్పుదురు. తత్కారణంబున నమృతంబు స్రవించునట్లు స్రవించుటవలన మానవశరీరములకు

మృత్యువు గలుగును. తదమృతము నిల్పుటకై మడమచేత యోనిస్థానంబును లెస్సఁగ నొత్తిపట్టి గుదము నూర్ధ్వముఖముగ నెగయనెత్తి యపానవాయువును మీఁది కాకర్షించి బలవంతముగ నూర్ధ్వంబుగ నాకుంచనంబునేయ నది మూలబంధంబగు దానంజేసి ప్రాణాపానవాయువులును నాదబిందువులును గూడి యైక్యమై యోగసిద్ధప్రదంబగు నపానవాయువు మీఁది కెగసి యగ్నియందుఁ బొందుచుండ నపుడగ్నిజ్వాల వాయువుతోఁగూడి పొడవుగ వృద్ధియగు, నపుడగ్నిపురుషవాయువులు ప్రాణవాయువును బొందు నివ్విధంబున దేహమునందుఁ బుట్టినయగ్ని ప్రజ్వరిల్ల నందు నిద్రించిన కుండలీశక్తి తపింపఁబడి మేల్కని కట్టెచేఁ గొట్టఁబడిన భుజంగస్త్రీవలె నిశ్వాసంబు పుచ్చి చక్కఁగ సుషుమ్నద్వారానఁ బ్రవేశించి శాంతమై బ్రహ్మనాడినడుమఁ బొందు గనుక తదభ్యాసంబు నేయుచున్న మూలశక్తి యాకుంచితంబగుమధ్యశక్తి మేల్కను నూర్ధ్వశక్తి పాతంబునొదవుఁ బవనుండు మధ్యమార్గంబునఁ జననోపు నదియుంగాక మూలంబాకుంచితంబై నాభినొత్తిన నది యొడ్డాణబంధం బగు కంఠంబు సంకుచితంబై చుబుకంబు ఱొమ్మునొత్తిన నది జాలంధరబంధం బగు మూలం బాకుంచితం బైనపు డపానవాయువెగయనంతన హృదయంబునం బ్రాణంబుదిగి నాభియం దపానునిం గలయనప్పుడు కుంచితం బైననాభిని వెనుక నొత్తిన, ప్రాణాపానంబులు గలసి వెన్నంటిపోవునంతలోఁ గంఠనికుంచనం బడఁచిన నమ్మారుతమునం బద్ధంబైన కుండలిం బడనూకి మధ్యబిలంబునం జారఁబడి చిన్మయత్వంబు నొందునప్పు

డంతరాళనాళంబు నిశ్శబ్దంబగు కంఠము ద్రవనంబున నాఁగి నిల్వఁగ సర్వపరిపూర్ణ పరిభావన సిద్ధించు నీప్రకారంబుగ నాకుంచిత కంఠనిరోధం బొదవినప్పు డమృతం బగ్నియందుఁ బడక స్వానుభూతికి లోనువై ప్రాణిని నిశ్చలానందంబు నొందించు నదియునుంగాక. 112.

సీ. వరయోగి యగువాఁడు వజ్రాసనమునుండి
నయ మొప్పగను వామనాడివలన
నాలోనఁ గుంభించినట్టి మారుతమును
మెల్లఁగ విడచి యామీఁద మఱల
దక్షిణనాడిచేతను వెలుపలివాయు
వును మెల్లఁగను లోని కొనరఁదీసి
యప్పుడు కేశనఖాగ్రపర్యంతంబు
నరికట్టి కుంభకం బచటఁ జేసి
తే. వామనాడిని విడువ నవ్వేలఁ గపాల
శోధనం బగు శ్రమ వాతబాధ లడఁగు
గొమ్మ యిది సూర్యభేదనకుంభకంబు
కోరి వినుమింకఁ జెప్పెదఁ గుంభకంబు. 113.

సీ. తగ నోరు బంధించి తనముక్కుఁగ్రోవుల
నుంచి వాయువును బూరించి కంఠ
మున ధ్వని బుట్టించి మొనసి హృదబ్జంబు
దాఁక లోనికిఁ దీసి తనువునందుఁ
బ్రాణుని గుంభించి పరగ నిడానాడి
చేతను విడువఁగ శ్లేష్మహరము

నను జఠరాగ్ని మహావృద్ధియగు ధాతు
గతరోగములు సెడుఁ గ్రమముగాను

తే. నడచుచుండిన గూర్చుండి యనుదినంబు
గోప్యముగ నిట్టియజ్ఞాయి కుంభకంబు
క్రమముగనే జేయఁదగును సీత్కార మనెడి
కుంభకం బేను జెప్పెదఁ గొమ్మ వినుము. 114

తే. వనిత నాసాపుటములచేఁ దనరుచుండఁ
బడినసీత్కార మనెడుకుంభకము ముఖము
నందుఁ జేయఁగ నిద్రయు నాఁకలియును
దెలియకుండును స్వచ్ఛందదేహుఁడగుచు. 115

వ. అది యెట్లనిన నాడికచేతను జెక్కిళ్లచేతను వాయువును సదా
పానంబుసేయఁగ నతఁ డాఱునెలలకు రోగరహితుఁ డై
యోగినీచక్రసమానశక్తిగలవాఁడై రెండవ వామదేవుం
డనఁదగియుండు నిది సీత్కారకుంభకం బగు నింక సీతళి
యనుగుంభకంబు చెప్పెద వినుము. 116

తే. యోగి రసనంబుచేత వాయువును మెల్లఁ
గాను బూరించి పూర్వప్రకారముగను
కుంభకముచేసి నాసికగోళములను
విడువ బహురోగబాధలు విడచిపోవు. 117

వ. ఇఁక భస్త్రికాకుంభకంబు చెప్పెదను. పద్మాసనాసీనుఁడై యుదర
గ్రీవంబు చక్కఁగ నిలిపి నోరు లెస్సఁగమూసి ప్రాణవాయు
వును ముక్కుచేత వ్యాపింపఁజేసి వేగవిడిచి బ్రహ్మరంధ్ర
పర్యంతంబు వ్యాపించిన మేఘుధ్వనితోడఁ గూడి వాయువును
హృదయపద్మపర్యంతం బించుకించుక నిండించి విడిచి మఱలఁ

బూరించి విడచి మఱియుఁ బూరించి రేచించుచుఁ గ్రమఱఁ
గొలిమితిత్తు లూఁదినట్లు రేచించి పూరించుచు దేహమునం
దున్న వాయువును బుద్ధిచేతఁ జలింపఁజేయుచుండఁగ నెప్పు
డైన బడలికపుట్టిన గాలిచేతఁ గడుపునిండిన సూర్యనాడివలన
వాయువును విడువఁగ బడలికదీరును గడుపున్ను జులకనగు
నపు డంగుష్ఠానామికలుచేత నాసికము బిగఁబట్టి వాయువును
గుంభించి యిడానాడిని విడచిన వాతపిత్తశ్లేష్మాదులు నశిం
పఁగ జఠరాగ్ని ప్రకాశించుచు సకలనాడులు విమోచనం
బగును. బ్రహ్మ విష్ణు రుద్ర గ్రంథులను భేదింపఁబడు నిది
సుఖప్రదంబగు భస్త్రికాకుంభకం బిఁక భ్రమరికాకుంభకంబు
చెప్పెద వినుము. 118

క. ఝరుషమిళిందధ్వనివలె
నఱిముఱఁ బూరించి భృంగి యానందముతో
నరుదుగఁ జేసిననాదము
కరణిని రేచింపవలయుఁ గ్రమముగ నెపుడున్. 119

క. ఈరీతి నభ్యసించిన
వారల కానందమూర్ఛ వరచిత్తమునన్
దారూఢిగ జనియించును
గౌరవమగు నిదియ భ్రమరికాకుంభకమా. 120

వ. ఇంక మూర్ఛాకుంభకంబును వివరించెద వినుము. 121

తే. రహిని బూరించి జాలంధరంబు నొలయఁ
బెట్టియుండ రసద్భోధ పుట్టిలోన
నిలిచి జీవుని బొక్కించి నిండుచుండు
నది మనోమూర్ఛ యనుకుంభకాఖ్య వింటె. 122

ఇంకఁ గేవల కుంభకవివరంబు వివరింతు వినుము. రేచక పూరక కుంభకంబులు విడచి స్వభావంబుగ మారుతధారణం బొనర్చి నిజబోధానందమగ్నుఁడై చొక్కుటయ కేవల కుంభకంబగు. నిట్టి కుంభకం బభ్యసించుసిద్ధుఁ డైనవారికిఁ ద్రిలోకంబులయందు దుర్లభం బగుకార్యంబు లేదు. సర్వ స్వతంత్రుఁ డైయుండు, నిట్టి హఠయోగంబు యమనియ మాసనప్రాణాయామాద్యష్టాంగయోగ త్రిబంధాష్టకుంభక ముద్రాది సాధనంబులచేత నీయోగంబు ద్వాదశాబ్దంబు లభ్యసింప సిద్ధియగు నది యెట్లన, ప్రథమాబ్దంబునందు రోగ రహితుండగు, ద్వితీయాబ్దంబునఁ గవిత్వంబు సెప్పుఁ, దృతీ యాబ్దంబున విషజయుండగు, చతుర్థాబ్దంబున క్షుత్తృష్ణా నిద్రాలస్యంబుల జయించు, పంచమాబ్దంబున వాక్సిద్ధినొందు, షష్ఠాబ్దంబున ఖడ్గాభేద్యుండగు, సప్తమాబ్దంబున భూమి నంటకుండు, నష్టమాబ్దంబున నణిమాద్యష్టైశ్వర్యసంపన్నుం డగు, నవమాబ్దంబున నభోగమనుండగు, దశమాబ్దంబున మనోవేగమునొందువాఁడగు, నేకాదశాబ్దంబున విశ్వవశ త్వము గలవాఁడగు, ద్వాదశాబ్దమున సాక్షాదీశత్వంబు నొందు, నిక హఠయోగంబు సూక్ష్మాంగయోగపూర్వకం బుగ నభ్యసింపవలయు నదెట్లంటివేని వినుము. 123

ఆహార నిద్రాదు లాశేంద్రియవ్యాప్తు
లడఁచి శాంతతనొంద నది యమంబు
నిశ్చలగురుభక్తి నిస్సంశయము సుయో
గాస తృప్తి యేకాంతవాస

పరతయు వైరాగ్యభావంబు కరణ ని
గ్రహమును నియమంబు సహజసుఖము
నొసఁగు నాసనమందు నుండుట నిస్పృహా
త్వంబునొందుటయు నాత్మను మనంబు

తే. నదిమి కుదిరించి నిల్పుట యాసనంబు
ప్రకట రేచకపూరకకుంభకసమేత
మైనశ్వాసలలోనఁ బ్రయత్నముగను
గుదురఁ జేసిన యది శుద్ధకుంభకమగు. 124

వ. ప్రాణుని సుస్థిరంబుగ నిల్పి ప్రపంచం బనిత్యంబని తలంచుటయు ప్రాణాయామంబగు. నంతర్ముఖం బైన నిర్మలచిత్తంబునఁ జైతన్యజాలంబుల నడచుటయు బహుప్రకారంబులై జనియించు మనోవికారంబుల నేర్పరించి ద్వికారగ్రాసనంబు చేసి మనంబును నిర్వ్యాపారంబుగ నిల్పుటయు, ప్రత్యాహారం బగుస్వస్వరూపానుసంధానభావంబుచే, ద్వితీయతారహితాత్మానుభవంబున సర్వప్రపంచంబు నాత్మగ నెఱింగి సకలభూతదయాసమత్వంబున, నిత్యతృప్తిం జెందియుండుట ధ్యానంబగు. నంతర్బాహ్యప్రకారం బేకంబుగ స్వతేజోమయంబుగఁ బరత్వంబు నుద్దేశించి తదీయధారణంబుం జేయుచుఁ జిత్తంబును జునిఁగిపోనీక నిల్పుటయ ధారణంబగు. తద్ధారణాభ్యాసంబునఁ జిత్తంబేకాగ్రం బగునప్పుడు జీవాత్మపరమాత్మయందు జలశర్కరన్యాయంబుగఁ గలసి యఖండబోధ నొందుటయ సమాధియగు. నిట్టి సూక్ష్మాష్టాంగంబులం బ్రకాశించునారాజయోగంబునకు లక్షణంబు సంక్షేపంబుగఁ జెప్పెద నది హంసాక్షర సిద్ధాసనకేవల కుంభక

నాదములను నీనాల్గింటివలన రాజయోగం బొప్పునందు సాంఖ్యతారకామనస్కములనం ద్రివిధంబులు నందు సాంఖ్య యోగంబును వివరింతు. 125

సీ. పంచతన్మాత్రలు పంచభూతంబులు
పంచీకృతంబులై పరఁగుచుండు
సకలేంద్రియంబులు సర్వవిషయజాల
ములు గుణత్రయకామముఖవికార
ములుగాను దనువులు మూఁడునుగా నవ
స్థలుగాను దగనన్నుఁ దలఁచి యెఱుఁగు
నటువంటియెఱుక నేనని నిశ్చయించి వి
క్షేపావరణములఁ జిదిమివైచి
తే. తాను దనలోనఁ దనుదాను దఱచితఱచి
యన్నిటకు మీఁద శేషించి యచలవృత్తి
నుండుటది సాంఖ్యయోగమై యొప్పుచుండు
గురుముఖంబున నీయోగ మఱయవలయు. 126

వ. ఇఁకఁ దారకంబనునది యెఱింగింతు వినుము. 127

క. అఱగన్నులతో నైనను
మురువుగ నొగి రెండుకనులు మూసియు నైనన్
బరమాత్మను లోఁజూపున
గుఱిగా నీక్షింపవచ్చు గురుభక్తుం డై. 128

తే. చంద్రసూర్యాంతరములందు సహజముగను
వెలుఁగుతారకములయందు విమలబిందు
వమరఁ గూర్పఁగ నది తారకాఖ్యయోగ
మై ప్రకాశించు లక్ష్యత్రయంబు నగుచు. 129

వ. అది బాహ్య మధ్యాంతర్లక్ష్యంబు లననొప్పు నందు బాహ్య లక్ష్యం బెట్లన బహిర్నాసికాగ్రావలోకనంబు మనోమారు తంబులంగూడి స్థిరంబుగ నిల్పు నందుఁ జతురంగుళప్రమాణ మున నైల్యమును, షడంగుళప్రమాణమున ధూమ్రమును, నష్టాంగుళప్రమాణమున రక్తిమంబును, దశాంగుళప్రమాణ మునఁ దనరంగ ప్రభయును, ద్వాదశాంగుళప్రమాణమునఁ బీతప్రకాశంబు నగు నీరైదుఁ బంచభూతవర్ణంబులై యెదుటం దోఁచునప్పు డపాంగదృష్టుల వెనుకగూర్చి శీర్షము మీఁదఁ జొనుపుచు నిశ్చలచిత్తుఁడై చూడ నందుఁ జంద్ర ప్రభ గానవచ్చు నదియుంగాక. 130

తే. కర్ణనాసాపుటాక్షిమార్గముల వ్రేళ్ల
నమరఁ బీడించి చిత్తంబు నచట నిల్పఁ
బ్రణవనాదంబు వినవచ్చు ప్రకటదీప
కళలు నవరత్నకాంతులఁ గానవచ్చు. 131

వ. ఇది యాత్మప్రత్యయప్రకాశంబైన బహిర్లక్ష్యంబునగు నింక మధ్యలక్ష్యవిధం బెట్లన. 132

తే. కంటిపాపల రెంటిని గదలనీక
మానసముతోడ భ్రూయుగమధ్యమునను
జొన్పి తన్మధ్యముననుండు సూక్ష్మబిలము
లోఁ బ్రవేశించి చూడ నాలోన నపుడు. 133

క. మెఱుపులు నక్షత్రంబులు
తరణి శశిప్రభలు భూతతతి వర్ణములున్
గరువలి నెనయుచు లోపలఁ
బరిపరివిధములుగ మెఱయు భావములోనన్. 134

వ. మఱియు నిరవధికం బగునాకాశంబును గాఢాంధకారం బైనమహాకాశంబును కాలాగ్నినిభం బైన పరాకాశంబును నధికప్రకాశంబైన తత్త్వాకాశంబును గోటిభానుసంకాశం బైన సూర్యాకాశంబును నగు నియ్యాకాశపంచకంబు నవలోకించు నతండు తన్మయుండై నిరవకాశాకాశసదృశుం డగునిది మధ్యలక్ష్యంబగు నిఁక నంతర్లక్ష్యం బెట్లనిన. 135

క. ఆపావకచంద్రార్క
వ్యాపకమై పంచభూతవర్ణకలితమై
యాపోజ్యోతిరసం బిల
రూపాశ్రయ మగుచునుండు రూఢప్రజ్ఞన్. 136

క. చతుర్మధ్యంబునఁ బర
మాక్షరహైరణ్యసచ్చిదమృతకణంబుల్
సాక్షిగ బాహ్యాంతరముల
నీక్షించుచు నిత్యసుఖము నెనయుచునుండున్ 137

క. ఆయమృతాంకురయుగళము
నాయకమై స చుల నైల్యంబుగ సు
చ్ఛాయల మెఱయుచుఁ బవన
స్థాయిని నెలవగుచు జీవతారక మయ్యెన్. 138

వ. ఈరహస్యంబు సద్గురూపదేశక్రమంబుగ నెఱిఁగి బాహ్యాంతరంబులకు నడిమిశృంగాటకంబునం దాకారదీపితరగ్రనీవార శూకాణు వగు సగుణపంచకంబు నీక్షించుట తారకాంత ర్లక్ష్యంబగు నదియును గాక సరస్వతీనాడి చంద్రప్రభానిభం బై మూలకందంబునందుండి దీర్ఘాస్థిమధ్యంబున బిసతంతు కైవడి విద్యుత్కోటిసంకాశంబై బ్రహ్మరంధ్రపర్యంతంబు

వ్యాపించి యూర్ధ్వగామినియై సర్వసిద్ధిప్రదయగు తత్స్వ
రూపంబు నాత్మయందు భావించుచు ఫాలోర్ధ్వకోల్లాట
మండలంబున స్వస్వరూపమునందు లక్ష్యం బుంచి చూచుట,
పరమాంతర్లక్ష్యంబగు నివ్విధంబున. 139

మ. అనిశంబుఁ భవతారకాఖ్య వరయోగాభ్యాసముం జేయఁగా
మనము న్మారుత మంతరంగమున మర్మజ్ఞత్వముంబొందు నం
దనుకూలంబగు నంతరాత్మ పరమాత్మానందముం బొందు నిం
కొనరంగా నమనస్కయోగవిధమున్నుత్సాహియై చెప్పెదన్.

సీ. ఆత్మాశ్రయములగు నలహంసమార్గంబు
లకుఁ గుడియెడమల లలితనీల
కాంతులఁదగు నుదకద్యోతులందు భా
స్వరతర దర్పణచ్ఛాయ లమర
వెలుఁగఁగఁ దన్మధ్యములయందు సూక్ష్మత
సూక్ష్మంబు లైనట్టి సుషిరములను
మానసంబున నిల్ప మాని యంతర్లక్ష్య
మును బాహ్యదృష్టు లమ్ములఘటించు
తే. నదియ ఘనశాంభవీముద్ర యగుచునుండు
రెండుజాములదనుక కూర్చుండి దీని
నభ్యసింపంగ మానసం బనిలగతుల
నిలుచు నేకాగ్రభావము నిలుచునపుడు. 141

సీ. వినుకుల బలుకుల న్వివిధచిత్రములైన
తలఁపులు తనయంద నిలుపుకొంచు
నట పరమాత్మయం దంతరాత్మను గూర్చి
తా నంద లీనమై తనరి వాత

దీపంబుకై వడిఁ దేజరిల్లుచు నిస్త
రంగాబ్ధివలె నంతరంగమందుఁ
గనఁ డొకరూపంబు వినఁ డొకశబ్దంబు
మొనసిన ఖేచరిముద్ర నంటి
తే. యచలితానందరసమగ్నుఁ డగుచుఁ జొక్కి
పరమనోన్మణి యున్మధ్యవస్థ లొంది
చలనరహితామనస్కంబ జాడ్యనిద్ర
యోగనిద్రయు నారాజయోగి పొందు. 142.

వ. అట్టిరాజయోగికి జాగ్రత్స్వప్న సుషుప్తి తుర్యా తుర్యాతీతంబులను పంచావస్థలు గలవు. చతుర్వింశతితత్వాత్మకంబైన దేహంబు తాఁగానని పంచవింశకుండైనదేహి తానని తెలిసినది జాగ్రత్తయగు. మనంబు నింద్రియబృందంబుతో నాత్మయందుఁ బొందించి ధ్యానింప నమ్మనంబు సర్వవిషయవాసనాసంగరహితమై బాహ్యాంతరంబుల మెలఁగు కేవలబహిర్ముఖంబుగాక తన్నుఁ దాను దనరుచుండుట స్వప్నంబగు. నిదియభ్యసించుచున్న మనంబు బాహ్యమునందు విస్తరిల్లక సుస్థిరంబై మాయాజాలం బనిత్యం బని సత్యవస్తువందుఁ బొందుచున్నపుబహిర్దృష్టివచ్చినం దెప్పున నంతర్ముఖంబై జగంబనిత్యంబుగ నాత్మ సత్యంబుగ నెఱింగి నిత్యబోధనొంది యుండుట సుషుప్తి యగు. జీవేశ్వరభావంబుల నొందునాత్మయందు నిల్చినమనంబు బాహ్యభావనారహితంబై పరంబును భావించు నిట్లు పురుషపురుషోత్తమభావంబు లన, నుభయాత్మకంబైన చైతన్యంబునంబొంది యమ్మనంబు విషయవాసనావిముఖంబై సర్వేంద్రియ వ్యాప్తులతోడ దేహాభిమా

నంబు విడిచి ముక్తిమార్గంబున సంసారబంధ విముక్తమై యాత్మానుభవామృతపానంబునం జొక్కి తన్మయంబై స్వతంత్రతఁ బాసి యాత్మపరతంత్రం బగుచుండు నంత జీవుండస్వతంత్రుఁడై యీశ్వరాధీనుండగుచు నుండఁగ నీశ్వరభావంబు సత్యంబగునప్పుడు సర్వమయుండైనః పరమేశ్వరునియందు మనం బుపరతం బగుచుండునపు డాత్మ యెందాక మనోదృశ్యంబగు నందాక మనోన్మనియగునప్పుడు ద్రష్టృదృశ్యంబులు లేక తాను దానై ధ్యానవిరహితంబై చిన్మాత్రం బైన యెఱుక తాన సత్తామాత్రం బగుచుండు నప్పుడు మనంబు కలదు లేదనరాకుండు, నది యున్మన్యవస్థ యైనతుర్యంబగు నది స్వరా ట్టనుపరమపదంబు నగుచుండు, నందు సహజంబుగ మానసంబు సకలేంద్రియప్రాణానిలంబులతోడ లీనంబగు నది యమనస్కంబై నతుర్యాతీతం బగుచుండు కలదు లేదన రానిదై ఘటాకాశంబు మహాకాశంబునం బొందిన ట్లేకంబై దేశ కాల కార్య కర్తృ కారణ గురుత్వలఘుత్వాద్యవస్థలు తోఁపకుండునది సహజామనస్కం బగు. పట్టు విడుపు లేనిదై చెప్పఁజూపరాక సహజభావంబైయున్న యదియ జాడ్యనిద్ర యగు. కడఁ గనరాని నిస్తరంగసముద్రంబు తెఱంగున నాద్యంతరహితంబైన నభంబుకరణి నింతింతనరాక యంతయు నిండి మలయజగంధంబును వృక్షంబునం దనలంబును నిక్షుదండంబు నందు మాధుర్యంబును క్షీరంబునందు ఘృతంబును, తిలల యందుఁ దైలంబు నెట్లుండు నట్లు చరాచరప్రపంచంబునందుఁ బరమాత్మ పరిపూర్ణంబై, యిదమిత్థ మనరాకుండు నది యోగనిద్ర యగు నిది యెంతంత సాధనకు ననుభవంబుగ

ననుభవించినయోగికి ననుభవైకవేద్యం బగుంగాని వాక్కునం
జెప్పంగూడ దది యెట్లంటివేని. 143

శా. బ్రహ్మంబద్వయవస్తువౌ ననెడుశాస్త్రం బెప్పుడుం బల్కుచుణ్
బ్రహ్మోహమ్మనునంతమాత్రముననే బ్రహ్మంబుగానేర్చునే
బ్రహ్మంబైన గురుస్వరూపము మదిణ్ భావించి భావించి తా
బ్రహ్మంబైనటువంటికాలముననే బ్రహ్మం బనంగూడునే. 144

వ. ఇ ట్లవాఙ్మానసగోచరం బైనబ్రహ్మానుభవంబు రాజయోగం
బగు ముందుచెప్పిన మంత్రలయాదియోగంబుల యనుభవ
క్రమం బెట్లనిన. 145

సీ. మంత్రయోగంబుచే మారుతసంచార
దేహమర్మంబులం దెలియవచ్చు
లయముచేం దనలోని లలితప్రణవనాద
సూత్రంబు మది నూని చొక్కవచ్చు
హఠముచే జ్వరజరత్వాదిరోగంబులు
మృత్యువుం గెలిచి మెల్మించవచ్చు
సాంఖ్యయోగంబుచే సకలేంద్రియవ్యాప్తు
లరయుచుం దన్ను దా నరయవచ్చు
తే. తారకముచేతం దనువునం దాను వెలుంగు
చున్నరీతిని గనవచ్చు నుచితమైన
రాజయోగంబుచేం బరబ్రహ్మమందుం
బొంది యుండంగవచ్చు సంపూర్ణుండగుచుం. 146

సీ. విను మంత్రయోగికన్నను గొప్ప లయయోగి
లయయోగి కధికుం డుల్లాసియైన

హఠయోగి యగుచుండు హఠయోగికన్నను
సరసమానసుఁడైన సాంఖ్యయోగి
యధికుఁడ యగువానికన్నఁ దారకయోగి
యధికుండు నగువానికన్న నెంచ
సాంఖ్యతారకముల సంగ్రహించుకొని వై
రాగ్యభావన నొప్పు రాజయోగి
తే. యుత్తమోత్తముఁడని చెప్పనొప్పు నతని
కన్న గొప్పైనయోగి లేఁ డవనియందు
నతఁడు సంసారముననున్న నడవి నున్న
సకలనిర్లేపుఁడగుచుండు శాంతుఁ డగుచు 147

వ. ఆరాజయోగివరునిలక్షణంబు లెవ్వి యనిన. 148

సీ. తనుకాంతియును మృదుత్వంబు వాఙ్మాధుర్య
మును మితభాషణంబులును భూత
దయయు వివేకశాంతములు మితాహార
మును నిశ్చలమనంబు ముఖ్యమైత్రి
గలవాఁడు రాజయోగసునిష్ఠుఁ డంబర
మధ్యస్థకలశంబుమాడ్కి లోన
వెలి నెందు నంటక వెల్గు నంబుధిమధ్య
గత కలశమురీతిగాను లోను
తే. వెలిని బరిపూర్ణుఁడై నిండి వెలుఁగుచుండు
వాఁడు నొకవేళ సంసారివలె నటించు
నొనరు నొకవేళ వైరాగ్య మొందుచుండు
వానియనుభవమెఱుఁక రెవ్వారు ధరణి. 149

క. ధర్మార్థము లొల్లక
కర్మాసక్తుండు గాక కాదె ననర్హ
నిర్మలభావుం డగుచును
మర్త్యత నతఁడు మెలఁగు మనుజులలోనన్. 150

క. ప్రాజ్ఞుండై దేహముతో
నజ్ఞానులయందు మెలఁగు నందున నాయో
గజ్ఞుని మదిఁ దెలియకఁ గని
యజ్ఞానులు నిందఁ జేతు రాగతి నోలిన్. 151

తే. దూషణము సేయువారికిఁ దొల్లి యతఁడు
చేసియుండిన పాపము చెందుచుండు
భూషణము సేయువారికిఁ బుణ్యఫలము
నపుడు పొందఁగ నిర్లేపుఁడగుచునతఁడు. 152

సీ. పెద్దవన్న నహంబుఁ బెంచి వల్కఁడు చిన్న
వనినఁ దగ్గఁడు భాగ్యమతిశయముగఁ
గల్గిన నుప్పొంగి గర్వింపఁ డొకవేళ
దనకు లేవడియైనఁ దగ్గిపోఁడు
ప్రార మనుభవింపకతీరదని యస
హ్యముగ దుఃఖసుఖంబు లనుభవించు
నబ్జపత్రంబున నంటనిజలబిందు
వట్లు సంసారము నంటకుండు
తే. జగతిగల బంధమూలంబు దెగినదాని
వచ్చి కొన్నాళ్లు నిలిచినపగిది దేహ
మూలమగుగారణావిద్య మొదలు తెగిన
నాయువనుపచ్చియున్న నాళ్లంగముండు. 153

చ. అటువలెఁ గారణంబు తెగినప్పటికైనను గార్యజాలవి
స్ఫుటతనుయుగ్మముండు పరిపూర్ణచిదాత్మ వికారిగాక త
ద్ఘటములనాశ్రయించి గుణకర్మములం దెపుడంటియంటకఁ
సటలనిరోసి యెన్నటికి సాక్షిగనుండు సుఖస్వరూపమై. 154

సీ. అలబుద్ధియును జిత్త మాయహంకృతి మాన
సంబును ఋత్విగ్గణంబు గాఁగఁ
బ్రణవవర్ణంబు యూపస్తంభమును గాఁగ
బ్రాణదశేంద్రియపంక్తి యచట
పశుసమూహముగాగ భాసురానాహత
నాదంబు మంత్రముగాఁ దనరఁగఁ
బొసఁగఁ దత్పశువుల బోధాగ్నిలో వ్రేల్చి
జ్ఞానామృతము సోమపానముగను
తే. త్రావి చొక్కుచు మోక్షకాంతాసమేతుఁ
డగుచు వేదాంతసూత్రంబు లనెడుకర్ణ
కుండలంబులు వెలుఁగఁ ద్రికూటమూర్ధ
మందు శాంతప్రముఖమిత్రులలరి కొలువ. 155

సీ. ప్రకటితాచారము ల్బండికమ్ములుగాఁగ
శమదమాదులు సుచక్రములుగాఁగ
బ్రాణపంచకము నేర్పడ గాడిగాఁగ న
నూనహృద్వచనంబు నొగయుఁ గాఁగ
వరకర్ణనేత్రము ల్వాహనంబులుగాఁగఁ
రహి వివేకంబు సారథియుఁగాఁగఁ
దగు నిష్క్రియత్వమే త్యాగధ్వజముగాఁగఁ
బ్రబలయోగరథంబుపైన నెక్కి

తే. పోయి నడిమి సరస్వతింబొంది గంగ
యమునయునునిల్చు నాల్గుమార్గములనడుమ
నవబృథస్నానమొనరించి యాత్మసోమ
యాజియన నొప్పుచుండు నీయవనిమీఁద. 156

ఉ. ఇంతటి యోగపూరుషుఁడు హెచ్చుఁడు తగ్గఁడు సంతసంబునే
కాంతమున న్వసించుఁ దనయందుఁ బరాత్మను జూచుచుండువి
భ్రాంతులు దన్నుఁ దిట్టినను బక్కునఁ దిట్టఁడు వారి నెప్పుడీ
శాంతుఁడు రాజయోగి ఘనసద్గురుఁడంచు వచింపఁగాఁదగున్.

సీ. అటువంటి దేశికుం డిటువంటి యోగంబు
నింతింత శిష్యున కీయరాదు
శిక్షించి కాంతిఁ బరీక్షించి తనశిక్ష
కొప్పినవారికిఁ జెప్పవలయుఁ
దనశిక్షకొప్పని తామసాత్మునకుఁ ద
త్వంబు చెప్పినవాఁడు దంభుఁడగుచు
వేషభాషలచేత విజ్ఞుఁడగుటగాని
వాఁడు తత్వజ్ఞుఁడు గాఁడు గనుక
తే. తొలుత నే శిష్యుఁడగువానిదుర్గుణములఁ
జూచి తిట్టుచుఁగొట్టుచు సుగుణములను
జెప్పఁగావలెఁ దనశిక్ష కొప్పుకొన్న
నూరకయ శాంతిఁబొంది తా నుండవలెను. 158

తే. అంతియేకాని దుర్గుణుండైనవానిఁ
దాఁ బరీక్షింప శిక్షింపఁదలఁచెనేని
వానిదుర్మార్గములు తనమానసమున
నిలిచి కోపముపుట్టించి నిక్కముగను. 159

క. కోపం బెవ్వనికైనను
దాపము పుట్టించుఁగనుక దామసశిష్యుం
బ్రాపునకుఁ జేర్పఁదగ దొగిఁ
దాపత్రయహేతువగును దనశాంతి సెడున్. 160

క. దుర్గుణములు విడువక ష
డ్వర్గంబును గూడినట్టివాఁ డతిశయ దు
ర్మార్గుం డగు వైరాగ్యము
భర్గుఁడు సెప్పినను వాఁడు పట్టుగ వినునే. 161

వ. ఇంక సచ్ఛిష్యుఁ డెవ్వఁడనిన సాధనచతుష్టయసంపన్నుఁడై వంచన లేక జారచోరక్రూరగుణంబులు విడచి పరమశాంతి గలవాఁడై మోక్షాసక్తుఁడై గురుసేవఁజేసి తద్గురువను గ్రహంబునకుఁ బాత్రుఁడైనవాఁడు దేహాభిమానంబు విడచి ప్రణవపూర్వకంబుగ వేంకటేశానుస్మరణంబు సేయుచు నిజ యోగబలంబున సుషుమ్నద్వారంబు భేదించుకొని యర్చ్యాది మార్గంబునం జని పరంబును జెందునట్టి యోగాభ్యాసంబు సేయలేకున్న నత్యంతగురుభక్తి గలవాఁడై తత్కటాక్షం బున భక్తిజ్ఞానవైరాగ్యమున నభ్యసించి యుపశాంతిఁబొంది. జ్ఞానినని యహంకారంబునొందక యుండవలయు నదెట్లన.

క. జ్ఞానాహంకారం బే
మానవులను జెఱుచుఁగాన మతిమంతులు తత్
జ్ఞానాహంకారంబును
మానుచు నుపశాంతులగుట మంచిదికాదే. 163

క. ఉపశాంతి లేనిమనుజుల
జపతపములు యోగవిధులు సవనాదులొగిం

గపటములై! సెడుఁగావున
నుపశాంతియ పరమధర్మ ముర్వీస్థలిలోన. 164

వ. ఇట్టి జ్ఞానభక్తివైరాగ్యయోగంబులకు ననేకవిఘ్నంబులు గలుగుచుండు తద్విఘ్ననివారణంబగుట కొక్క యుపాయాంతరంబుగల దదెట్లనిన. "వేంకటాద్రియందు సనకసనందనతీర్థం బతిగోప్యంబు, నరులకుఁ దెలియరాకుండు, తత్సమీపంబునఁ బాపవినాశతీర్థ తీరంబు సిద్ధస్థలంబై యుండు, మార్గశీర్ష శుద్ధద్వాదశిదినం బరుణోదయకాలంబున స్వామి పుష్కరిణీస్నానంబుసేయుచుం ద్రయోదశిదినంబు మొదలుకొని సనకసనందనతీర్థంబునం గ్రుంకుచు శ్రీవేంకటేశ్వరుని దర్శనంబు సేయుచు శ్రీమదష్టాక్షరిమంత్రజపంబుఁ జేయుచు యోగాభ్యాసంబు సేయుచున్న నెట్టివిఘ్నంబులు రానోపవు, యోగంబులు సిద్ధించు, పాపవినాశతీర్థసమీపంబున నతిగుప్తంబైన కాయరసాయనం బనుపుణ్యతీర్థంబు గలదు. తత్తీర్థంబు పానంబుచేసిన దేహంబు దృఢత్వంబునొందు. శ్రీవేంకటేశ్వరుని కైంకర్యంబుసేయుట పురుషార్థంబగు నట్టి కైంకర్యంబు శక్తివంచకుండై సేయకుండిన స్వామిద్రోహి యనందగుం గావున ననిశంబు వేంకటేశుని నారాధింపవలయు నని వరాహస్వామి భూదేవికుపదేశించినక్రమంబు వ్యాసమునీంద్రుఁడు తెలిసి తదుపదేశక్రమంబు నానతిచ్చె నారీతి మీకుం జెప్పితి ననిన సూతుంజూచి శౌనకాదు లిట్లనిరి. 165

ఉ. సూత మహానుభావ పరిశుద్ధములై తగు యోగమర్మముల్
ఖ్యాతిగ భూమిదేవికి నఖండకృపం గిటి సెప్పఁగా నతి

ప్రీతిని బాదరాయణుఁడు పెంపువహించి గ్రహించినట్టి వా
గ్వ్రాతము నీకుఁజెప్పుటను వాసిగఁజెప్పితి వీవు మాకొగిన్.

సీ. సంతోషమయ్యె వేదాంత వేద్యుండైన
వేంకటేశార్చనవిభవములను
మాకుఁ దెల్పుమటన్న మది సంతసించి యా
సూతుఁ డిట్లనియె సంప్రీతి మెఱయ
ననఘాత్ములార మీ రడిగినవిధముగ
ఘనుఁడైన శేషుని కపిలగురుఁడు
ముదముమై నడుగ నిమ్ముగ శేషుఁడనె నిట్లు
మునినాథ వినుమది మోదమునను

తే. గురుతరంబు హరిప్రీతికరము పరమ
కోపదూరము పరితాప పాపహరము
రమ్య మష్టోత్తరశతంబు కామ్యఫలద
మగుచు దీపించు నది యెట్టులనిన వినుఁడు. 167

తే. స్వర్ణనదిఁ బుట్టినట్టి సువర్ణకమల
జాలమును దెచ్చి వేంకటేశ్వరుని బ్రహ్మ
దేవుఁ డష్టోత్తరశతంబు నై వెలుంగ
నామములఁ బూజచేసె సానందుఁ డగుచు. 168

తే. స్వామిచే సర్వలోకపితామహుండు
సకలకామ్యార్థముల నంది సంతసించె
నట్టి యష్టోత్తరశతంబు నైన నామ
ములఁ బఠించుట కెవ్వరైన ముందుగాను. 169

వ. ప్రణవపూర్వకంబుగ శ్రీవేంకటేశాష్టాక్షరీ మంత్రరాజంబు
న్యాసయుక్తంబుగ జపంబొనర్చి హరికి సమర్పించి తదనంత

రంబు ధ్యానావాహనార్ఘ్యపాద్యాచమనస్నానవస్త్రయజ్ఞోప
వీత గంధాక్షతపుష్పాదులు సమర్పించి, వేంకటేశాష్టాక్షరి
మంత్రంబు జపించి యష్టోత్తరశతనామంబుల నర్చించుచుఁ
బాదాదిశీర్షపర్యంతంబుగ సర్వాంగార్చనంబు నేసి ధూపదీప
నైవేద్యతాంబూలసువర్ణపుష్పకర్పూర నీరాజనమంత్రపుష్ప
ప్రదక్షిణనమస్కారంబులు సమర్పించుచుఁ దదైకధ్యాననిష్ఠుం
డైనభక్తునకు నావేంకటేశ్వరుండు ప్రసన్నుండై యైహికా
ముష్మికఫలంబుల నిచ్చు నీయష్టోత్తరశతం బత్యంతగోప్యంబు
నగు శ్రద్ధాభక్తులు గలవాఁడై గురువిశ్వాసంబు గల్గి తద్గురు
ముఖంబుగఁ దెలిసి పఠించినవాఁడు కృతార్థుం డగు నంచుఁ
జెప్పెనని సూతుండు శౌనకాదులతో వెండియు సంతోషా
యత్తచిత్తంబు మెఱయ నిట్లనియె. 170

చ. కపిలమునీశ్వరుం డడుగఁగా మును శేషుఁడు సమ్మతించి ని
ష్కపటముగాను దత్క్రమము కర్దమపుత్త్రున కొప్పఁ జెప్పె నా
కపరిమితప్రభావుఁ డగు నాకపిలుం డుపదేశమిచ్చె మీ
కిపు డెఱిఁగించితిన్ వరమునీశ్వరులార తదీయగోప్యమున్.

క. ఈయష్టోత్తరశతమును
బాయని సద్భక్తితోడఁ బారాయణముం
జేయు సుసాత్వికులకు వే
యాయ యహిగిరివాసుఁ డిచ్చు నవ్యయపదమున్. 172

—— నైమిశారణ్యమునుండి మునులు వేంకటాద్రికి వచ్చుట. ——

చ. అన విని శౌనకాదులు మహాద్భుతమందుచు వేంకటేశ్వరుం
గనుఁగొన నిశ్చయించుచు నఖండతరం బగుభక్తిచేత నే

మనుటకుఁదోఁపకున్న విధమప్పుడు సూతుఁడుచూచియిట్లనెన్
మునివరులార మీకిపుడు ముఖ్యముగా నిఁక నేమిచెప్పుదున్.
ఎ. మీరెల్ల రా వేంకటగిరికరిగి యందుండుట జన్మపావనంబు
లనిన నమ్మునులు. 174

క. విని మాశ్రవణంబులు తృ
ప్తినిబొందెను సూత నీవు ప్రియమున శేషా
ద్రినిగూర్చి చెప్పినందునఁ
గనుఁగొనఁ బోయెదము వేడ్కఁ గదలి దయాత్మా. 175

మ. అని యమ్మౌనులు వల్క సూతుఁడు మునీంద్రాళిన్విలోకించి
యిట్లనియెం దాపసులార! మీరిచట నింకాలస్యముం
జేయకన్, జని యా వేంకటశైలశృంగముల నాశ్చర్యంబుగాఁ
జూచి యం, దొనరన్ శేషగిరీశ్వరుంగనుఁడు పొం దుత్సాహ
ముప్పొంగఁగన్. 176

మ. అని యాసూతుఁడు వేంకటాద్రివిభవం బాశ్రీనివాసోన్నతం
బును స్వామిత్వము నొందుతీర్థమహిమంబున్ భూవరాహాఖ్య
నొం,దిన నారాయణచిహ్నము ల్మఱియుఁ దద్దివ్యప్రభావం
బులున్, వినిపింప న్వినిసంయము ల్చెలఁగి యవ్వేళం బ్రయా
ణం బొగిన్. 177

సీ. గౌతమజాబాలికశ్యపాంగీరస
శ్రీవత్సకౌత్సమైత్రేయపులహ
కణ్వగార్గేయమృకండుభరద్వాజ
కౌశికదేవలక్రతుపులస్త్య
ముఖ్యులైనట్టి సన్మునులంద ఱానైమి
శాటవి వదలి మేలైన గంగ

సాన్నిధ్యముం జేరి స్నానంబు లొనరించి
యటఁ జని గౌతమియందుఁ గృష్ణ
తే. వేణియందును గ్రుంకి యావిమలపథము
నందుఁ గల పుణ్యతీర్థములందుఁ గ్రుంకు
లిడుచు సద్భక్తితో వేంకటేశుఁ జూచు
వాంఛతో వచ్చి రమ్మునివర్యు లెల్ల. 178

వ. శ్రీమద్వేంకటగిరికి ప్రదక్షిణంబుగఁ గపిలతీర్థంబునకు వచ్చి తత్ప్రముఖంబులైన పుణ్యతీర్థంబులయందుస్నానాదులొనర్చి వేంకటాచలారోహణంబుచేసి మేరుగిరితుల్యంబులై సువర్ణ ప్రభలొప్పుచున్న శృంగసమూహంబులును, నవరత్న ప్రభా భాసితంబైన సానుదేశంబులును, ఫలపుష్పభరితంబులైన పావనవృక్షసందోహవిరాజితంబును, గంగానిభంబులైన నైర్మల్యతీర్థంబులును, శుకపికకలకంఠ మరాళమయూర ప్రముఖవిహంగ నికర కోలాహలంబును, కంఠీరవవ్యాఘ్ర వరాహామదేభభల్లూకమహిషోరగ ప్రముఖనానాసత్వసంతా నంబును గరుడగంధర్వకిన్నరాది దేవగణనివాసంబును గన్నులపండువుగంజూచుచు సామగానంబు లొనరించుచు వచ్చి యప్రాకృతజలపూరితంబును, కనకకమలకల్హార కైరవ నిచయ విరాజితం బగు స్వామిపుష్కరిణిని దర్శనంబొనర్చి సభామండపంబున నిచిలి శ్రీవేంకటేశ్వరు దర్శనంబుచేసి మ్రొక్కులిడి పులకాంకితశరీరులై యానందబాష్ప ధారాపరి పూరితనేత్రంబులు గలవారై గద్గదకంఠంబుల ననేకవిధంబు నుతించి యనంతరంబున. 179

సీ. శ్రీనివాసుని జూచి యానందపరవశు
లై జడ ల్జీరాడ నాడియాడి
యిదమిత్థ మన నేర కెన లేనిముదమున
నిందిరేశునిచెంత నెగిరియెగిరి
భ క్తియుక్తావేశభరితాత్ములై యప్డు
చక్కఁగఁ జిందులు త్రొక్కి త్రొక్కి
ఘనపదక్రమజటకలితస్వరంబుల
సకలవేదంబులఁ జదివిచదివి
తే. నిలిచి యానందదుగ్ధాబ్ధి నెమ్మి మునిఁగి
శ్రీనివాసునిరూపంబుఁ బ్రియము గదురఁ
గనులఁబండువుగఁ జూచి మనము లచట
మగ్నము లొనర్చి రెంతయు మౌనివరులు. 180

క. అష్టోత్తరశతనామము
లిష్టంబుల నుచ్చరించి హేమాబ్జములన్
సృష్టిస్థితికారణు నా
శిష్టులు పూజించి రమల చిత్తము లలరన్. 181

సీ. అప్పుడు కోటిసూర్యప్రకాశుండును
నాజానుబాహుండు నచ్యుతుండు
పరిపూర్ణచంద్రబింబసమానవదనుండు
మందస్మితాస్యుండు మాధవుండు
లలితమౌ మకరకుండలకర్ణయుగళుండు
మణికిరీటోజ్జ్వలమస్తకుండు
శ్రీవత్సలాంఛనాంచితభవ్యవక్షుండు
లలితపీతాంబరాలంకృతుండు

తే. శంఖచక్రధరుండు సజ్జలజపత్ర
లోచనుండు పరాత్ముండు లోకకర్త
యైననారాయణుండు దయాంతరంగుఁ
డగుచు నమ్మునులను జూచి యనియెనిట్లు. 182.

చ. మునివరులార! మీరిటకు మోదముతో నను జూడవచ్చి నం
దునఁ గడుభక్తిపూర్ణులని తోఁచిన దిష్టవరంబు లేమి యి
త్తును దగఁ దెల్పుఁ డర్థిమెయి దూరమువచ్చితి రంచుఁ
బల్కఁగా, విని మునిపుంగవు ల్గనుచు వేంకటనాథుని వేఁడు
చొప్పుచున్. 183.

సీ. పలికి రిట్లని పరబ్రహ్మస్వరూప వా
ఙ్మనసాతీతుఁడ వైననీవు
వైకుంఠముననుండి వచ్చి వేంకటగిరి
యందున్న నిన్ను మే మనిశ మాత్మ
లను జూచుచుందుము తనర నాదివ్యమం
గళవిగ్రహం బిప్డు గంటి మిందు
నలరు చర్మాక్షుల నంతియెఁ జాలు మా
కొక్కవరం బేల నిక్కముగను
తే. గరుణమై మోక్షమార్గంబు గాంచి యిమ్ము
వేయివరములు మాకేల వేంకటేశ
యనఁగ నాశ్రీనివాసుఁ డమ్మునులఁ జూచి
దహసితాననుఁడై పల్కె దయ యెసంగ. 184.

మ. మునులారా! పరిపూర్ణకాములు మహాముఖ్యు ల్జగత్పావనుల్
తనర న్మీరు వరంబు లొల్లమని నిత్యానందముం బొందినం
దున సంతోషము నొందితిం బరమశాంతు ల్మీకుఁ గామ్యార్థ,

ముల్, పనిలే దాత్మల మద్గుణానుభవమే పాటింపుఁ డశ్రాంత
మున్. 185

క. మీమనముల నేఁ దెలియుట
కై మేటివరంబు లడుగుఁ డంటిని మీాని
ష్కామత్వము గంటిని మీా
కీమీాఁదట మత్పదంబు నిచ్చెద ప్రీతిన్. 186

క. ఘనతర కామ్యార్థములను
మనుజుల కొసఁగుచును విపుల మహిమాఢ్యుఁడ నై
యనుపమఘన బ్రహ్మోత్సవ
మొనరఁగ నంగీకరించుచుండెద నిచటన్. 187

సీ. మొనసి కన్యామాసమున మహోత్సవ మందు
నాకజుఁ డొనరించినాఁడు గనుక
వానిసంకల్పంబుఁ బూనికతో వృద్ధి
బొందింపఁ దలఁచి యీభూప్రజలను
గొండకు రప్పించి కోరిక ల్వెస నిచ్చి
యఖిలవైభవము లిం దనుభవింతు
నిట్టినాలీలలఁ బట్టుగఁ దలఁచుచు
భజనసేయుచు నుండు భక్తజనులు
తే. దూరమున నున్న దగ్గఱఁజేరియున్న
వారి కిష్టార్థముల నిచ్చి వారివాఁడ
నగుచు రక్షించుచుండుదు నంతమునను
బుణ్యగతి నిత్తు నిశ్చయంబుగను వినుఁడు. 188

క. అని హరి పల్కినపల్కులు
విని ముదమును మీారి మానివీరులు చక్రి

వినుతించుచుఁ బంచాబ్దము
లొనరఁగ శేషాద్రియందు నుండిరి వేడ్కన్. 189

క. అటుపిమ్మట మౌనుల వేం
కటగిరినాథుండు చూచి కరుణను మీ రి
చ్చట నుండ నేల తడయక
పటుతర మగునాశ్రమములఁ బడయుఁడు చనుఁడీ. 190

సీ. అని యప్పు డానతిచ్చిన వేంకటేశ్వరు
నకు శ్రీకి భూనీళలకును మ్రొక్కి
వదలి పోవుటకును మదిరాక హరిమోము
లోచనోత్సవముగఁ జూచి చూచి
యానందబాష్పంబు లక్షులవెడలంగ
నిగమాంతసూక్తులఁ బొగడి పొగడి
తనియకాస్వామి సుందరరూపమును జిత్త
నీరజాతములను నిల్పి నిల్పి

తే. తన్మయత్వంబు నొంది యాతపసు లప్పు
డాయనంతుని విశ్వమోహనుని బాయఁ
జాల కందుండి యందఱు సనకయుండఁ
జూచి యిట్లనె యప్పద్మలోచనుండు. 191

తే. పరమమునులార నిర్గుణబ్రహ్మమైన
నేను సగుణవిలాసము జ్ఞానవులకుఁ
జూపి రక్షింపఁదలఁచి యిచ్చోట నిలిచి
యుండ నిట్లుండు నంతట నిండియుండు. 192

ఉ. కావున మద్వియోగ మొగిఁగల్గదు పూర్ణవివేకి కంతటన్
నావిమలస్వరూపమును నాటఁగఁజూపుచు నుందుఁగాన స.

ద్భావనచేత వాఁడు ననుబట్టుగనంతటఁ జూచుచుండు మీ
రావిధముల్ గ్రహించి చనుఁడక్కడనిక్కడనుందు నెంచఁగన్

తే. పుణ్యతమమైన నైమిశారణ్యభూమి
కరుగుఁడని మౌనివర్యులకానతిచ్చి
మౌనముద్ర ధరించి యా శ్రీనివాసుఁ
డప్పు డర్చాకృతిం దాల్చె నద్భుతముగ. 194

తే. అప్పు డందు శిలావిగ్రహంబుకరణి
నమరియుండిన శ్రీవేంకటాద్రివిభుని
చూచి మునిపుంగవులు కడుచోద్యమంది
పూర్ణభావనచే హరిం బొగడిరిట్లు. 195

శ్లో. సరోజపత్రలోచనం సుసాధులోకపావనం
చరాచరాత్మకప్రపంచసాక్షిభూతమవ్యయమ్,
పురారిపద్మజామరేంద్రపూజితాంఘ్రిపంకజం
స్మరామి వేంకటేశ్వరం చ సాగరాత్మజేశ్వరమ్.
పురాణపూరుషం సమస్త పుణ్యకర్మరక్షణం
మురాసురాదిదానవేంద్రమూర్ధదర్పభంజనమ్,
ధరాధరోద్ధరం ప్రశాంతతాపసాత్మవీక్షణం
స్మరామి వేంకటేశ్వరం చ సాగరాత్మజేశ్వరమ్.
శరాసనాదిశస్త్రబృందసాధనం శుభాకరం
ఖరాఖ్యరాక్షసేంద్రగర్వకాననోగ్రపావకమ్,
నరాధినాథవందితం నగాత్మజాత్మసన్నుతం
స్మరామి వేంకటేశ్వరం చ సాగరాత్మజేశ్వరమ్.
సురారిశౌర్యనిగ్రహం సుపర్వరాట్పరిగ్రహం
పరాత్పరం మునీంద్రచంద్రభావగమ్యవిగ్రహమ్,

ధరామరాఘశోషణం సుధాతరంగభూషణం
స్మరామి వేంకటేశ్వరం చ సాగరాత్మజేశ్వరమ్.

వ. అని యిట్టివిధంబున సంస్తుతించి పునఃపునఃప్రణామంబులు చేసి వేంటాచలంబును డిగి కపిల తీర్థమార్గంబున నిర్గమించి యగ్గిరికిం బ్రదక్షిణపూర్వకంబుగ నరుగుచుం దలకోనాఖ్యస్థానంబున ననేకవత్సరంబులు తపంబుననుండి యందుండి లేచి సురాఘట క్షేత్రంబునకరిగియందుఁగొన్ని మాసంబులుండి యందుండి గోదావరీతీరంబునం గొన్ని దినంబులుండి యందుండి నైమిశాటవి కరిగి యచ్చట దమయుచితస్థానంబులం జేరి సూతుంజూచి వెండియు నిట్లనిరి. 196

క. సూతా నీకరుణను వి
ఖ్యాతిం దగు వేంకటాద్రి కరిగితి మచటన్
బ్రీతిగ నీ వెఱిఁగించిన
రీతుల మేమెల్ల దద్గిరిం గంటి మొగిన్. 197

శా. ఆహా నీసకలజ్ఞవాక్కులకు మాకానందముం బుట్టె నీ
మాహాత్మ్యంబధికంబుచూడఁగనుసామాన్యుండవే సూతమా
తో హెచ్చె తగినట్టిచిత్రములు సంతోషంబుగాఁ జెప్పిన
ట్లా [illegible]రణ్యగిరీంద్రమందుఁ గల వీ వం దెట్లు గన్గొంటివో.

## ముసులు సూతుని నుతించుట.

సీ. భర్మాద్రికరణి నప్పర్వతం బున్నది
చైత్రరథమురీతి సద్వనంబు
గన్పట్టుచున్నది ఖగమృగాదులు జాతి
వైరము ల్విడిచి యవ్వనమునందుఁ

జరియించుచున్నవి స్వామిపుష్కరిణి సం
పూర్ణమై యున్నది భూవరాహ
దేవుఁ డాపడమట దీపించుచున్నాఁడు
తద్దక్షిణంబునఁ దప్తహేమ
తే. కుంభముల నొప్పుచుండెడు గోపురములు
మణులచే నొప్పు ప్రాకారమంటపములు
నమరియున్నవి తన్మధ్యమందు దివ్య
కాంతి నొప్పు విమానంబుఁ గంటిమయ్య. 199
శా. మే మాదివ్యవిమానమధ్యమున లక్ష్మీకాంతు నీక్షించి త
త్స్వామిప్యంబుననిల్చి మ్రొక్కఁతఱినాశ్చర్యంబుగా నంతలో
నేమో మేము శరీరము ల్మఱచి యందింతైన లజ్జింప కా
స్వామింజూచుచునాడుచుండితిమయాసంతోషముప్పొంగఁగన్.
క. అటువలె నాడితి మాపి
మ్మట హరి నర్చించితిమి సమాధానమునం
గుటిలత లేకయ శ్రీవేం
కటపతి మాటాడె జలధిగంభీరముగన్. 201
క ఆమధురోక్తులు వించును
మే మచ్చట నుండ మాకు మిత్రు నిరీక్షా
నై మిశమున కరుగుండని
యామాధవుఁ డానతిచ్చి యర్చాకృతిదైయె. 202
తే. మౌనముద్ర ధరించి తా మఱల మాట
లాడకుండిన చక్రమాహాత్మ్య మచటఁ
జూచి గిరిడిగ్గి యెలమి నిచ్చోటి కిపుడు
వచ్చితిమి మేము సద్గుణవ్రాత సూత. 203

క. నీ వెఱఁగించిన చిహ్నము
లా వేంకటగిరిని గంటి మహహా యవి నీ
భావమునకుఁ గన్పించెనొ
నీవే చూచితివొ సూత నిజవిఖ్యాతా 204

సీ. అని తాపసోత్తము లందఱు ప్రీతిగ
నడుగ నాసూతుఁ డిట్లనియె నపుడు
మునులార మావ్యాసమునికటాక్షము గల్గి
నది మొదలుగ సకలార్థములును
దోఁచునామదికి నాదొడ్డతనము గాదు
బాదరాయణునిప్రభావ మంత
గావున నను గొప్పగాఁ జూడఁ బని లేదు
మీరు ధన్యాత్ము లిమ్మెయిని నన్నుఁ
తే. గరుణ మీఱంగ నడిగినకతన నేను
చిత్తమున నిట్లు భావించి చెప్పినాఁడ
నంతియే కాని శ్రీవేంకటాద్రియందుఁ
జూచి చెప్పితినని మీకుఁ దోఁచవలదు. 205

తే. తారశీకరసికతావితానములను
గణుతి సేయఁగ వచ్చు వేంకటగిరీంద్ర
నాయకునిలీల లన్ని నిర్ణయముగాను
శేషుఁడైనను లెక్కించి చెప్పఁగలఁడె ? 206

క. శ్రీకర వేంకటనాథుని ప్రాకటచరితంబు లెల్ల భవహరములుగా
నాకుందోఁచెడిరీతిగ మీకుం జెప్పితిని సంయమీంద్రులు వినరే.

క. అని సూతుఁడు సద్భక్తిని
మన మలరఁగ వేంకటాద్రిమాహాత్మ్యంబుఁ

వినఁగోరిన శౌనకముఖ
మునివరులకుఁ జెప్పె మోదముం దనరంగన్ 208

క. శ్రీవిభ్రాజితచరిత మ
హావిభవోన్నత జగత్త్రయప్రఖ్యాతా
శ్రీవేంకటగిరినాయక
పావన తఱికుండనృహరి భద్రయశోధీ. 209

మాలినీవృత్తము.—
సరసిజదళనేత్రా సన్మునిస్తోత్రపాత్రా
సురవనపరచైత్రా శోకవల్లీలవిత్రా
సురుచిరఘనగాత్రా సూరిచిత్తాబ్జమిత్రా
దరహసితసువక్త్రా ధాత్రిసచ్ఛ్రీకళత్రా. 210

గద్యము. ఇది శ్రీతఱికుండనృసింహకరుణాకటాక్షకలిత కవితా విచిత్ర కృష్ణయామాత్యతనూభవ వేంకమాంబాప్రణీతం బైన శ్రీవేంకటాచలమాహాత్మ్యం బను వరాహపురాణంబు నందుఁ జక్రరాజదిగ్విజయంబును, శ్రీవైష్ణవధర్మప్రసక్తియు, విహితసత్కర్మప్రకారంబును,యమనియమాదియోగాభ్యాస క్రమంబును, శ్రీవేంకటేశాష్టోత్తరశతనామప్రభావంబును, నైమిశారణ్యనివాసు లగుమునులు వేంకటాద్రికివచ్చుటయు, వేంకటేశ్వరుం డామునులకు దర్శనం బిచ్చి సంభావించు టయు, నంత నమ్మునులు వేంకటేశ్వరు నానతిం బడసి నైమి శారణ్యంబున కేగుటయు, నందు సూతుంగనుంగొని మునులు వినుతించుటయు, మునిసహితంబుగ శ్రీవేంకటేశ్వరస్వామికి మంగళాశాసనంబు సేయుటయు ననుకథలం గల తృతీయా శ్వాసము.

శ్రీ ర స్తు.

# శ్రీ వేంకటాచల మాహాత్మ్యము

## చతుర్థాశ్వాసము.

---

శా. శ్రీనారాయణ మాత్మమూల మనఘుం శ్రీవత్సవక్షస్థలం
నానాస్థావరజంగమాత్మకజగన్నాథం ప్రధానాశ్రయం
ధ్యానధ్యేయ మచింత్యమవ్యయపదం ధర్మస్వరూపం సుప్ర
జ్ఞానందం తఱికుండ శేషకుధరాధ్యక్షుం భజేఽహం సదా. 1

ఉ. శ్రీరమణీమనోహరుని శేషశయానుని సర్వశత్రుసం
హారుని ధీరునిన్ నఖశిఖాహతరాక్షసదక్షునిన్ సహ
స్రారసరోజహంసుని సదానతదైత్యకుమారపాలకున్
గోరి భజింతు నేను తఱికుండనృసింహుని శుభ్రచిత్తునిన్. 2

చ. కలశపయోనిధిం బొడమి కల్మలపంటల కాటపట్టునై
జలరుహనాభువక్షమున సాంద్రవిలాసమున న్వసించి యు
జ్జ్వలతరశుభ్రతోయదనివాసతటిల్లతమాడ్కి నాసిరిన్
వెలయఁ దలంతు మోక్షపదవిం దనరారఁగ నెప్డు డాత్మలోన్.

చ. విలసితమౌక్తికప్రభల వెల్గుసితోత్పలమాలికాసము
జ్జ్వలతవహించు నాథు మెడ సత్కనకద్యుతు లీను మేనితో
సలలితవృత్తిమై వికచచంపకమాలికభాతి నుండు మే
ల్వోలదుక నాదిలక్ష్మి నొగి వేమఱుఁ గొల్చెద మోక్షసిద్ధికై.

శా. సర్వజ్ఞుం డగుమద్గురుం గొలిచి యశ్రాంతంబు సద్భక్తిచే
నిర్వాణప్రదుఁ డౌవినాయకుని వాణి న్వేడి తొల్లింటి స
ద్గీర్వాణాంధ్రకవీంద్రులం దలఁచి యక్షీణాత్మబోధోల్లస
త్పూర్వాచార్యులపాదపద్మయుగముల్ పూజింతు నిష్టాప్తికిన్

క. పంకజహితశశినేత్ర క
లంకరహిత మోక్షదక్ష లక్ష్మీరమణా
శంకరవిధినుతపద
పంకజ తఱికుండనృహరి పాపవిదారీ. 6

సీ. అని యిష్టదేవతాప్రార్థనం బొనరించి
వేడ్కఁ గొల్చెదు ఘనవేంకటాద్రి
మాహాత్మ్యమునను వరాహపురాణంబు
ముప్పదియధ్యాయములను దొలుత
మొనసి మూఁడాశ్వాసములు చేసియావరా
హస్వామి కర్పించి యవల నెడఁద
రహిని భవిష్యోత్తరపురాణమున శ్రీని
వాసువిలాసము ల్వసుధయందుఁ
తే. బ్రజకుఁ దెలియంగఁ దేటగఁ బద్యరీతి
ధృతి రచింతును దఱికుండ నృహరికృపను
దప్పులుండినఁ దగ దిద్ది యొప్పుగాను
చదువ నెంచెద బుధులార సదయులార. 7

వ. ఆకథాక్రమం బెట్లన్న వినుండు. 8

ఉ. శ్రీకరనైమిశాటవిని శిష్టమును ల్పరమాద్భుతంబుగం
బ్రాకటభక్తిమై నొగి వరాహపురాణము విన్నమీఁద సు

శ్లోకుని సూతునిం బ్రియముఁ జూచుచు వేంకటశైల మిద్ధరక్
జోకుగ నేయుగంబునను శోభితమై పొగడొందుఁ జెప్పవే.

వ. అనిన విని సూతుండు చూచి మీరు నన్నడిగినట్లు జనకుండు శతానందుని నడిగిన నతఁ డతనికిఁ జెప్పిన పూర్వేతిహాసంబు చెప్పెద వినుండని సంతసంబున నిట్లనియె. 10

సీ. వినరయ్య మునులార వేడ్కమైఁ గ్రమముగ
ధర్మకాలంబు త్రేతాయుగమున
జనకుండు నిర్మలస్వాంతుఁ డై శాంతుఁ డై
యెస మిథిలాపురి నేలుచుండి
తనతమ్ముఁ డగుకుశధ్వజుఁ డనువాని కూఁ
తులను దాఁగన్నకూఁతులను దగిన
పతులను దనలోన భావించి వెదకుచు
దొరుకునె తగినబంధుత్వ మనుచు

తే. నలువురగుకన్యలకు నరనాథసుతులు
నలుగు రొకయింటఁబుట్టియున్నను బ్రియంబు
వారి కీబాలికల నీయవచ్చు నంచుఁ
జిత్తమున నెంచుచుండఁగఁ జెలఁగియపుడు. 11

భవిష్యోత్తరపురాణము.

క. చనుదెంచె శతానందుం
డనుకులగురువర్యుఁ డెలమి నాజనకుఁడు గ
న్గొని లేచి యెదురుసని పద
వనజంబుల కెఱఁగి దెచ్చి వరభ ద్రగన్. 12

భద్రాసనంబునఁ గూర్చుండఁ జేయ నయ్యాచార్యవర్యుం డిట్లనియె. 13

తే. మానవాధీశ! సీతకు మాండవికిని
యూర్మిళకు శ్రుతకీర్తికి నొగి వివాహ
యత్నమును జేయు మింక నీ వప్రయత్న
ముగను నుండుటగాదు నెమ్మిగను ధాత్రి 1‹

వ. తగినపతుల నన్వేషింపు మూరకుండకు మనిన. 1ౖ

సీ. విని మిథిలాపురివిభుఁ డగుజనకుండు
గని శతానందుని వినయ మెసఁగ
ననియె నోగురువర్య! మును సవనానికి
భూమిదున్నంగ నద్భుతముగాను
ధరణి జనించెఁ గదా సీత లోకైక
మాత యటంచుఁ నామదికిఁ దోఁచి
యున్నది యిపు డట్టి యుర్వీతనూజను
నరున కీఁదగునె యెన్నాళ్ళకైన

తే. సీత చిహ్నము లన్ని లక్షించి చూడ
శ్రీరమాదేవియంశజ సిద్ధ మిట్టి
సతికి హర్యంశగలవాఁడె పతిగ నమరు
గాన నిర్ధర నెందేని బూని చూడ. 16

వ. అట్టి మహనీయుండును, పురుషోత్తముండును, గలఁడేని వచిం
పుము మఱియును. 17

క. హరి పూర్ణాంశుండై ధర
నరపతి జనియించియున్న నామందిరముఁ
బరఁగుచునుండెడు శ్రీశం
కరచాపముఁ ద్రుంచు ముజ్జగంబులు వొగడన్. 18

చ. హరి యతఁడంచు నెంచఁదగు నంచుఁ బరీక్షకునై ముదంబు నన్, సరవిని మీరలెల్లఁ గన శంకరకార్ముక మక్కజంబుగం గరమునఁ బట్టి ద్రుంచుబల గౌరవవంతుని కిత్తు సీత నే నపుడుగఁ బల్కితిం గనుక యట్టిమహాత్ముఁడు పుట్టియుండు నే.

సీ. అను డాశతానందుఁ డాజనకునిఁజూచి
పలికె నిమ్మెయి మహీపతివరేణ్య
భూమిజ కనుగుణ్య పురుషశార్దూలుండు
పుట్టినాఁ డీచింతఁ బెట్టవలదు
సరవిగ నీదు నల్వురకన్యలకుఁ దగి
యొకరాజుకొమరులీ యుర్వియందు
నలువురుగానె యున్నారు వారలు నీదు
బాలికామణులఁ జేఁబట్టుకొఱకు
తే. వేంకటాచలమహిమంబు వినుము కోర్కె
లన్ని సఫలంబు లగుఁగాన నంబుజాస
నాదులకునైన తరమె యయ్యద్రిమహిమఁ
జెప్ప విని మేలునొందిరి క్షితితలేశ. 20

వ. కావున నచంచలచిత్తవృత్తి నావేంకటాద్రిప్రభావంబును వినిన సకలాభీష్టంబు లొడఁగూడు నప్పర్వతంబు కృతయుగంబున వృషభాద్రియనం బ్రసిద్ధినొందుఁ ద్రేతాయుగంబున నంజనాచలం బనంబరఁగు ద్వాపరయుగంబున శేషశైలంబన నొప్పుఁ గలియుగంబున వేంకటాచలం బని విఖ్యాతిఁ గాంచు, ననఁగ నాజనకుండు విని శతానందుని జూచి, యాశైలంబునకు నీనామంబు లెట్లుగల్గె ననియడిగిన, శతానందుం డిట్లనియె. 21

సీ. వృషభాసురుం డనువీరుఁ డాకొండపైఁ
జేరి మౌనుల హింస చేయుచుండ
నట్టిబాధలు వరాహస్వామితోఁ జెప్ప
వలె నంచు వాకిళ్ల వచ్చి మ్రొక్కి
ప్రార్థించి పల్కిరి పరమాత్మ యీశైల
మున వృషభాసురుం డనెడువాఁడు
వచ్చి మ మ్మనయంబు బాధించుచున్నాఁడు
రయమున మించియా రాక్షసేంద్రుఁ
తే. ద్రుంచుఁ డనివేఁడ నాస్వామి గొంచి దయను
బల్కె మునులార మీరు నిర్భయముగాను
దపము లొనరించుకొనుఁడు నాదైత్యునింక
యమునిపాలికి నంపెద యశము మెఱయ. 22

వ. ఆకిటిరూపుం డవ్విధి నప్పుడు వీడ్కొనఁగ నమ్మునులు తమ
నెలవుల కేగి భయంబుమాని తపంబు లొనరించుకొనుచుండిరి.

తే. దేవరిపుఁడును దుంబురుతీర్థమునను
మూఁడుకాలంబులను స్నానములు నొనర్చి
చిత్త మలరఁ గరాళనృసింహమంత్ర
జపము సేయుచుఁ బూజలు సల్పుచుండి. 24

వ. తత్పూజానంతరంబు నిజశీర్షంబును దనఖడ్గంబున ఖండించి
హరి కర్పితంబుసేయుచుండ నాస్వామికరుణ నాశిరంబు
గ్రమ్మఱఁ గంఠంబున నిలుచుచుండు నవ్విధంబునఁ బంచ
సహస్రాబ్దంబులు చేసినపూజకు మెచ్చి వరాహస్వామి కరాళ
నృసింహరూపంబున వానికిఁ బ్రసన్నుం డైనంజూచి వృష

భాసురుండు నమస్కరించి యనేకవిధంబుల నుతించిన నయ్య
మరారిం జూచి నరహరి యిట్లనియె. 25

క. విను దానవ నీతపమును
గని మెచ్చితి వరము లెవ్వి గావలె ననఁగా
విని వృషభాసురుఁ డప్పుడి
ట్లనె నానరహరిని గాంచి యానందమునన్. 26

సీ. పరమాత్మ నాకంబు బ్రహ్మలోకముగాని
యేనొల్ల నాహవం బెందుగాని
తగఁజేయవలె నవతారము ల్పది తొల్లి
యెత్తినప్పుడు గల యెలమిబలము
నొక్కఁడవే పూని చక్కఁగ నాతోడ
సమరంబు సేయు మోస్వామి యనిన
విని వానియవివేకమునకు నవ్వుచు విష్ణు
వనె నిట్లు కదనంబు వలచితీవు
తే. గాన నిచ్చెద రమ్మన దానవుండు
గట్టుపైఁబడినట్టుగ నట్టహాస
ముఁ పతరంబుగఁజేయుచు నొరిమ విడచి
కదిసినం జూచి హరివాని నదును నెంచి. 27

వ. ఇవ్విధంబున నిర్వురు సింగంబులభంగి నింగి కెగసి నేలనిల్చి
యొండొరుల డాయుచుం బాయుచుం బలుతెఱంగులైన
నాయుధంబులచేతఁ గొట్టుచుఁ గరికరి హరిహరి గిరిగిరిపోరి
పోరినోరసి పోరుకరణి ననేకప్రకారంబుల విడివడినడువం
బుడమి గడగడ వడంక వడఁబెడగబడలక జలంబులానం
దడవక కడువడి పిడుగులుపడువడువునం దొడరి పెనునగవుల

నొండొరులు మెండొడ్డి వెఱ్ఱిచూపుల నిక్కి వెక్కిరించు కొంచు ధిక్కరించుచుఁ గక్కసంబడి నిక్కిహుంకారంబులు సేయుచు నహంకారంబులు పెంచుచుం గేకలువేయుచు లోకభీకరంబుగ మేఘంబులవలె నుఱుముచు గండసిలలు బెండువడి తండోపతండంబులై బెడబెడఁ బొఱలివచ్చి మెండు బండలపైఁబడి రెండేసిఖండంబు లగుచుండఁగఁ గొండ కొండకుం, జంగునఁనెగిరి లంఘించునట్లు బహువిధంబుల భండ నంబునేయుచుండి రంత, నవసానంబున మలఁగుదీపంబధికంబుగ వెలుఁగుఁజూపినచందంబున వృషభాసురాంగబలంబు ప్రచం డోద్దండంబై నిండిన నరకంఠీరవునిమించి కబళించుకై వడిం గానవచ్చినం గని వెఱఁగుపడి యమరులు నభోమార్గంబున నుండి నరహరివిజయంబుంగోరుచుండి రప్పు డప్పరమపురుషుం డుప్పొంగి రక్కసునిం గనుంగొని యొప్పుచుఁ దెప్పున గరుడ వాహనారూఢుండై సహస్రాయుధంబులు ధరించి దైత్యుని పైఁబడి పట్టి కొట్టవచ్చినంజూచి రాక్షసుండు మిట్టిపడి పట్టు వడక యట్టిట్టు జుణుఁగుచు నాఖండలాదినిర్జరభ్రాంతి కరంబైన తనమాయాబలంబున ఖగవాహనారూఢుండై సహస్ర భుజుండు సహస్రాయుధధరుండై కృత్రిమవిష్ణురూపధారిని నిర్మించి నారసింహునిపైఁ బురికొల్పెనప్పు డమ్మాయావిష్ణు రూపంబు మహావిష్ణు నెదిరించి పోరవచ్చినంగాంచి చక్రియది రాక్షసకృత్యంబని తలంచి నిజమాయం బెంచి యమ్మాయకృత్రి మవిష్ణురూపధారిని మాయంబుచేసి నగుచు నిట్లనియె. 28

సీ. చపలరాక్షస నిన్ను సరిచేసుకొని పోర
వలసి పోరితి నింతవట్టు కీవు

ననుఁ గూర్చి జపము మున్నొనరించుటం జేసి
యింతకుఁ జంపక యెంచితిట్లు
గడపితిఁ గాలంబు గావున నింక నో
పను నది యేలన వినుము విష్ణు
వును సృజించి యొనర్చు చున్న కార్యంబులు
దెలిసె వాఁడెందేగె బలమడంగి

తే. యింక నీవెందుడాఁగెదో యెఱుఁగఁజేయు
చూడు నాశక్తి నేఁడు పెచ్చుగను లేని
పోనిమాటలు వల్కకుఁ బూని శత్రు
భయదచక్రాగ్ని కోపుదుప్పృథరతుండ. 29

వ. మఱియు నీశీర్షంబు చక్రాగ్ని కాహుతి యీకున్న నేఁ
గరాళనృసింహుండను గానని. 30

తే. కరమునం గ్రాలుచుండు చక్రంబుఁ జూపఁ
జూచి వృషభాసురుఁడు పరిశుద్ధమైన
భక్తి నా నారసింహుని పాదయుగళ
మునను శరణాగతుం డయి వినుతిచేసి. 31

వ. క్రమ్మర నిట్లనియె. దేవా! భవదీయ చక్రప్రభావం బెంతని
వర్ణింప నాబ్రహ్మాదులచే నశక్యంబు కీర్తియు నంబరీషాది
రాజప్రముఖులకు విజయంబు లిచ్చినదఁట, యదియునుంగాక
భవచ్చక్రతప్తులైనవారలకుం బునర్జన్మంబులు రావఁట, కావున
నట్టియప్పరమచక్రంబులం దెగి ముక్తినొందెద మన్నామం
బీయద్రికిడినం జాలునని ప్రార్థింప నానృసింహుఁడారక్కసుని
నాలింగనంబుచేసి ముక్తినిచ్చి యప్పర్వతంబున కాయమర
వైరినామం బిడియె నక్కారణంబునం గృతయుగంబునందు

వృషభాద్రియని పేరొందు. నంత మునులు తమనెలవులనుండి వచ్చి స్వామిని సన్నుతించుటంజేసి యద్దేవుండు వారియభీష్టంబు లొసంగి తిరోధానంబునొంది, భూదేవీ సహితుండై యిచ్ఛావిహారుండై యుండెనని చెప్పిన శతానందుని జూచి జనకుం డిట్లనియె. 32

సీ. మునినాథ వృషభాద్రి యనుదాని కంజనా
చల మని పేరెట్లు గలిగెఁ జెపుమ
యాశతానందుఁ డిట్లనియెఁ గేసరియను
వనచరోత్తముభార్య తనకు సుతులు
గలుగకుండుటఁజేసి తలఁచి మతంగ ఋ
షీశుని జూచి తా నిట్టులనియెఁ
బుత్రహీనుల కెందుఁ బుణ్యగతు ల్మహి
లేదంచుఁ దొల్తను వేదములను
తే. జెప్పియుండుటచే నాకుఁ జిత్తమునను
భయము గదురుచు నున్నది దయను నాకుఁ
బుత్త్రుఁ డెట్లు లభించునో పుణ్యరూప
చెప్పుమని వేడ నమ్ముని యప్పుడనియె. 33

తే. పొలఁతి యిచ్చటికిం బూర్వపు వలనొప్పు
నుర్విఁ జనఁ జన నేఁబది యోజనాల
దవ్వునం దనరారును ధాత్రి శ్రీనృ
సింహనామాశ్రమంబు శ్వశ్రేయదంబు. 34

వ. తదాశ్రమంబునకు యామ్యభాగంబునం బ్రకాశించుచున్న నారాయణాద్రి ప్రదేశంబులం బరమపావనం బైయొప్పు స్వామిపుష్కరిణికి నుత్తరంబుగఁ గ్రోశమాత్రదూరంబునం

దాకాశగంగాప్రవాహం బున్నయది నీవందుఁ జేరి త్రికాల స్నానంబు లాచరించుచు ద్వాదశాబ్దంబులు తపంబొనర్పు చుండు మంత సుతుం డుదయించు ననిన మహాప్రసాదం బని మ్రొక్కి యమ్మునినాథు నానతిచొప్పుఁ దప్పక నారాయణాద్రిం జేరి స్వామిపుష్కరిణిం గ్రుంకులిడి తత్తీరాశ్వత్థవృక్షంబు నకుఁ బ్రదక్షిణంబు లొనర్చి వరాహస్వామికి మ్రొక్కి యందుండి యాకాశగంగకు నరిగి యందుండుమునివర్యులకు నమస్కరించి వారియాశీర్వచనపూర్వకంబుగ నత్తీర్థంబునం ద్రికాలస్నానంబులు సేయుచు నీరాహారంబున నొకసంవత్సరంబు తపంబు సేసిన నంత వాయుదేవుండు ప్రసన్నుండై ప్రతిదినంబు నొక్కొక్కమధురఫలం బొసంగుచుండ నది భక్షించుచు నత్తపస్విని ద్వాదశవర్షంబులు పూర్తిగఁ దప మాచరించె నంతనొక్కనాఁడు వాయుదేవుండు సద్వీర్యగర్భితంబైన ఫలంబియ్యఁగ దానిఁ భుజించి యత్తరుణి గర్భంబు ధరియించె ననంతరంబున. 35

తే. అంత నాదేవిగర్భమం దనిలదేవుఁ
డొక్కనాఁడు ప్రవేశించు చుండునటుల
సంయమీంద్రుల కచ్చోట స్వప్నమయ్యె
నందుచే వారు నిస్సంశయాత్ము లైరి. 36

తే. దశమమాసంబు నిండారెఁ దగధరిత్రి
నంజనాదేవిగర్భమం దనఘుఁడైన
పుత్త్రుఁ డుదయింపఁగాఁ జూచి పుష్పవృష్టి
సురలు గురియించి సంతోషభరితులైరి. 37

మ. ఘనవజ్రాంగము దీర్ఘవాలము లసత్కాంతు ల్బలస్థైర్యముల్
మునులెల్లంగని యాంజనేయుఁడు మహాముఖ్యుం డగుఁ
ధాత్రిపై, నని దీవించుచు మారుతాత్మజున కత్యాసక్తితో
నందఱుఁ, హనుమంతుం డని నామధేయమిడి రత్యాహ్లాద
ముప్పొంగఁగన్. 38

వ. త్రేతాయుగంబునం దంజనాదేవి తపంబు జేసి పుత్త్రుని వడసిన
కతన నంజనాద్రి యని ప్రసిద్ధంబయ్యె మఱియును. 39

తే. ఉరగపతి శేషుఁ డనిలున కోడి ధాత్రిఁ
గనకగిరినాథుఁ డైనవేంకటునితోడ
ద్వాపరమునందుఁ బడి శైలరూప మొందె
నందుచే నది శేషాద్రి యనఁగనొప్పె. 40

తే. అనిన విని జనకుం డిట్టులనియె శేషుఁ
డెంపు కాపవనుని కోడె నెఱుఁగఁ జెప్పుఁ
డన శతానందుఁ డిట్లనె హరిని జూడ
ననిలుఁ డొకనాఁడు వైకుంఠమునకుఁ బోవ. 41

సీ. హరిమందిరద్వారమందుఁ గావలియున్న
శేషుఁ డాపవను నీక్షించి పల్కెఁ
బవనుఁడా నీవు పోవలదు లోనికి నిందె
నిలువుమంచు వచింప నిష్ఠురముగ
ననిలుఁ డిట్లనియె నే నబ్జాక్షు నీక్షింపఁ
బోవుచుండఁగ నన్ను నీవు పిలిచి
పోవల దనిచెప్పఁగా వశమే నీకు
నీయెచ్చు నాయెచ్చు నెఱిఁ దలంప

తే. నెంతయంతర మహహా నే నిప్డు హరిని
జూడఁబోవలె నని లోనఁ జొచ్చుచుండ
బుసలువెట్టుచు ననిలుని బోకుమంచుఁ
ద్రోసె నీవలి కప్డు పెఱరోషమతిని. 42

చ. తనమెడఁ బట్టి ద్రోసినకతంబున దారుణరోషయుక్తుఁడై
యనిలుఁడు శేషునిం గని బలాధమ నీవొకధర్మసంధుఁడే?
నను మెడఁబట్టిత్రోసితివి నాగకులాధమ నేను నిన్నుఁ ద్రో
సిన నిలువంగఁజాలుదువె? ఛీ యవివేకుఁడ పొమ్ము పొమ్మనన్.

క. విని శేషుం డనిలుఁడ లోఁ
జను నే యన్యుండు నిన్నుఁ జయ్యనఁ బోనీ
యను నీరాకాచక్రికి
వినిపించెద నవల నన్ను వెన్నుఁడు దయతోన్ 44

సీ. తోడ్కొనిరమ్మనం దోడ్కొనిపోయెద
నంతియకాని ని న్నటకుఁబంప
ననఁగ నప్పవనుఁ డిట్లనియె నంతఃపుర
మున కేల పోవలె మూర్ఖ వినుము
మందిరంబున నెప్డు మార్జాలముండును
మదకరి వీధి నెమ్మదిగ నుండు
నందుచే నొకతక్కువగునె పిల్లికి గజ
ములయంతరంబును దలఁచుకొనుము
తే. లోనికరుగకు మంటివి గానరాను
నీవయందుండు నిచ్చట నేను నిలతు
నింతమాత్రన కొఱత నాకేమి లేదు
పోర భుజగాధమా నీవు పొంగుటేల? 45

మ. అనుచుం దన్నుఁ దిరస్కరింప విని రోషావేశ ముప్పొంగ ని
ట్లనియెన్ శేషుఁడు మారుతా యెపుడు నా కాహారమైనట్టి నీ
వనఁగా నెంతటివాఁడు నాయెదుట నీయార్భాటముం జెల్లునే
యనఁగా నప్పవనుండు పల్కె విని కోపాటోపముం బెంచుచున్

క. శేషా గర్వంబున దు
ర్భాషలు భాషించి నీవు పట్టుగ నాకున్
రోషము పుట్టించితి విఁక
భాషింపఁగ నేల పొమ్ము ఫలమం దె దొగిన్. 47

వ. అయినను నాబలంబునకు నీబలంబునకు గజమశకన్యాయంబై యుండు నేను సర్వజీవాంతర్యామియునై జగత్ప్రాణుండనై యుందుఁ గావున నీకంటె నేనధికుండ ననిన విని యురగేశ్వరుం డిట్లనియె. 48

సీ. విను మనిలుఁడ నేను విపులాద్రిగణముతో
మొనసి భూమిని శిరంబున భరింతు
బహువిధ బ్రహ్మాండభాండోదరుం డైన
నీరజాతాక్షుని నే భరింతుఁ
గాన నీకంటెను నేన గొప్పగుచుందుఁ
జులకఁదనంబుగఁ జూడవలదు
పొమ్మని వల్కఁగ భూరికోపంబు మైఁ
బవనుఁ డిట్లనియె నో పన్నగేంద్ర

తే. నేను నీలోన నుండఁగ నీకు బలము
గలిగియున్నది లేకున్న ఘనతరమగు
నీబలం బేడ నిలుచును నాబలంబు
ముందటను నీవు తక్కువ యెందుఁగాని. 49

సీ. అని యివ్విధంబున ననిలుండు వచియింపఁ
బన్నగేంద్రుఁడు విని పల్కె నిట్లు
పవనుఁడా విను వృథా వాగ్వ్యయం బేటికి
నీవునే నొకదిక్కు నిలిచి మించి
యెల్లువారఁగలు సూడ మల్లయుద్ధంబును
జేయుదమప్పు నీచేవ దెలియు
రారమ్మనఁగఁ బెద్ద రభసంబు నేయంగ
విని చక్రి యేతెంచి గనుచునుండ
తే. నపుడు శేషుండు పవనుండు హరికి మ్రొక్కి
తమవివాదంబు సెప్పి యోదైత్యనాశ
కదనమును జేయవలయు దీర్ఘాయువులుగ
దీవనలొసంగు దయచేసి దేవదేవ. 50

మ. అని వాతూలుఁడు శేషుఁడాహవము నేయంబూనువాక్యంబు
లక్కా, విని యోచించి వినోదముల్గనుట కావేళ రమేశుండు
వా,రిని వారింపక కారణంబొకటి వేరే యుండఁగా వీర లి
ట్లనుచున్నారిది మంచికార్యమని రోషావేశముం బెంచుచున్.

సీ. కార్యార్థియై రమాకాంతుఁడు నవ్వుచుఁ
బవనశేషులఁ జూచి పలికె నిట్లు
వినుఁడు మీరిద్దరు వీరాగ్రగణ్యులు
గావున నొక్క రొక్కరుని గెలువ
నూరక నేయుఁడు ధీరులై వేఱియు
ద్ధము నేయఁగాను లోకములు మనవు
గాన నీకొకయుక్తి నేను జెప్పెద శేష
వినుమది యెట్లనఁ గనకనగము

తే. నందుఁ బుట్టిన యావేంకటాద్రిఁ జుట్టుఁ
జుట్టుకొని ఫణముల బిగఁబట్టి యదుము
చుండు మవ్వాయువాపైఁడిగొండ నెగర
మీటఁగా దొడ్డవాఁడె సమీరుఁ డపుడు. 52

ఆ. పలికి పవన నీవు పన్నగేంద్రుఁడు చుట్టి
పట్టియున్నగిరిని పట్టి పైకి
నెగరమీటగానె హెచ్చి నీవటుమీఁద
లేకయున్న హెచ్చు లేదు నీకు. 53

వ. అని విష్ణుం డానతిచ్చిన విని మహాప్రసాదం బని మ్రొక్కులిడి యాదిశేష ప్రభంజను లిద్దఱు వేంకటాద్రిం జేరి రందుఁ బన్నగేంద్రుఁ డప్పర్వతంబును జుట్టుకొని సహస్రఫణంబులనడుమ బిగంబట్టి యుండె నంత వాయుదేవుండు నిజశక్తి పెంచి యగ్గిరిపై వీఁచుచుండె నివ్విధంబున. 54

క. తొడఁబడక మొఱయు చనిలుఁడు
విడివడి వీవంగ నచలవితతులు వడిగా
గడగడ వడఁకుచుఁ దిరుగుచు
బెడబెడఁ బొరలాడఁ జూచి భీతాత్మకులై. 55

క. అప్పుడు బ్రహ్మేంద్రాదులు
తప్పక గుమిఁగూడి మారుతా యని కడకుం
దప్పటడుగులిడుచుంజని
యొప్పుగ నిట్లనిరి భయము నొందుచు నపుడున్. 56

సీ. ఓవాయుదేవ యీయుత్పాతహేతువు
గా విసరుటవేళ గాదు వినుము

చాలించు కల్పాంతసమయమం దిటు సేయు
టుచితంబుగాని ధీయుతుఁడ మాను
మని వారు ప్రార్థింప ననిలుఁడారోషంబు
విడువక మఱిమఱి విసరుచుండె
పవనుని రోషస్వభావంబు గనుఁగొని
శేషాహిచెంగటం జేరి వినుతి
తే. చేసి యిట్లని వల్కిరి శేష వినుము
నీబలం బెక్కువైనది నీరజాక్షుఁ
డెఱుఁగు గౌరీమనోహరుం డెఱుఁగు మేము
నెఱుఁగుదుము నీప్రభావంబు నెన్నఁ దరమె. 57

వ. అని బహుభంగులఁ బ్రార్థించిన శేషుండు పట్టినపట్టు విడువ
కుండినంజూచి బ్రహ్మేంద్రాదులు మఱియు నిట్లనిరి. 58

క. వినుమో భుజగకులాధిప
కినిసి మహాశక్తి హేమగిరివరతనయుఁ
ఘనముగ బిగఁబట్టిన ని
న్ననిలుఁడు గదలింపనోపఁ డయ్యె మహాత్మా. 59

క. అనిలుఁడు నీకోడఁడు నీ
వనిలునకోడవు జగంబు లదరి నశింపం
బనివచ్చెను గావున నీ
ఘనరోషము నడఁచి జనుల కాపాడఁగదే. 60

చ. అనుజులు మూర్ఖులంచు విడనాడి సుసాత్త్వికమూర్తియైన వె
న్నుని పదమాశ్రయించితి వనూనమతుండవు నీకుఁగోప మే
లను నిజశుద్ధసాత్త్విక బలంబున నీవు చలంబడంచి నీ
ఘనఫణ మెత్తి మాకొఱకు గాడ్పుకు గెల్పునొసంగ మేలగున్.

వ. అని యనేకప్రకారంబులం బ్రార్థింప నాశేషుండు కరుణార్ద్రచిత్తుండై లోకరక్షణంబుసేయుటకై యొకఫణంబెత్తి నప్పాడప్పవనుం డుప్పొంగి లెప్పున నప్ఫణంబునందునఁ బ్రవేశించి నిజబలంబుకొలఁదిఁ వీఁచుచు నంగుష్ఠంబక్కొండపాతునం గ్రుచ్చియెత్తి పైకెగరమీటుటంజేసి యప్పుడు వేంకటాద్రి గాలిపటంబుచందంబున నెగిరి మొఱయుచు గంగానదికి దక్షిణంబుగ ద్విశతయోజనదూరంబునం దూర్పులవణాబ్ధికి నైదు యోజనంబుల దూరంబునను సువర్ణముఖరీనద్యుత్తరతీరంబునకు సార్ధక్రోశదూరంబున నొప్పుపుణ్యకాననమునందుఁ దననుజుట్టుకొనియున్న శేషునితోడంబడియె. నివ్విధంబున శేషుండోడెనని సంతసించుచుం బవనుండు నిజేచ్ఛ ంజనియె జగంబులు కుదిరియుండె నంత శేషాహి తానోడుటకుఁ జింతించుచుండఁగ బ్రహ్మేంద్రాదులు వచ్చి శేషునాదరించి రందు బ్రహ్మ యిట్లనియె. 62

సీ. విను శేష మారుతంబున నోడితి నటంచుఁ
జింతింపవలదు నీచిత్తమునను
వేంకటగిరిని నీవంకితంబుగఁ గూడి
యవనిపైనుండు నీయందుఁ జక్ర
పాణి వసించి నిన్పాలించునని పల్క
విని ఫణీంద్రుఁడు చాల విన్నఁనగుచుఁ
బలికె నిట్లని నేను పవనునితోఁ బంత
మాడి యోడుటను నాయందుఁ దప్పు

తే. గలిగె గర్వంబడంగె నాకర్మమింత
చేసె నిఁకనేల నాయందు శ్రీధరుండు

నిలుచునని పల్కి చాల కన్నీరు నింపఁ
జూచి శేషునితోఁ దక్షిచూలి పలికె. 63

క. విను ఫణివర నీయందా
వనజదళాక్షుండు గృపను వచ్చి వసింపం
బని నే వెద్కకెదనిఁక నీ
మనమునఁ జింతింపవలదు మఱి యురగేశా 64

మ. హరి నీయందు వసించియుండఁడని నీకాంచిత యేలా? యశో
ధరుఁడా చక్రధరుండు వచ్చుటకు సంధానంబు గావించెదన్
గిరిరూపంబుననుండు మోడితిని నాఖేదంబు వర్జింపు పం
కరుహాక్షుఁ డాయని నాత్మ నెంచుచును సౌఖ్యంబొందు నాగాధిపా

క. హరి నిచటికి రప్పించుట
కరయఁగ నేఁబూటకాపు నైతినటంచున్
సరసిజగర్భుఁడు శేషుని
శిరములపై నివిరి నమ్మఁ జెప్పెను గరుణన్. 66

వ. అపుడాయురగేంద్రున కభయంబిచ్చి బ్రహ్మేంద్రాదులు నిజ
నివాసనంబులకుంజనిరి. యంత నా శేషుం డప్పుండరీకాక్షునకుఁ
దండప్రణామంబు లాచరించి పర్వతాకారంబునొందె. నప్ప
ర్వతప్రమాణంబుం చెప్పెద వినుము దశయోజనవిస్తీర్ణం బై
ముప్పదియోజనంబులునిడివిగలిగియుండు నట్టి శేషాఖ్యనొందిన
మహాద్రిఫణప్రదేశంబు వేంకటాద్రియు, మధ్యప్రదేశం
బహోబలంబునుం, బుచ్ఛంబు శ్రీశైలంబును నగుచుండ, సర్వ
క్షేత్ర సర్వతీర్థమయంబగుచు సకలఫలద్రుమపుష్పలతాశోభి
తంబై నానావిచిత్రధాతుప్రకాశం బగుచుండు నయ్యద్రి
యందు సురబృందంబులు తరుబృందంబులై ఋషిసమూ

హంబులు మృగసమూహంబులై పితృగణంబులు ఖగగణంబులై యక్షకిన్నరులు పాషాణరూపులై యుండఁగ శేషునకు వరంబిచ్చి వోయిన పరమేష్ఠి శేషాద్రియందుఁ బ్రవేశించి యుండుఁడని వరాహస్వామిని బ్రార్థింప నద్దేవుండు వైకుంఠపురంబున నున్న క్రీడాద్రిని గరుడునిచేతనఁ దెప్పించి శేషాద్రియందుంచి తానందు వసియించియుండఁగ నాస్వామికిఁ బూర్వభాగముననున్న శ్రీస్వామిపుష్కరిణి గంగాదిపుణ్యతీర్థంబులకు జన్మస్థానంబై మకరమత్స్యకచ్ఛపాదిజలచరావాసంబై కమలకుముదాది పుష్పరాజివిలాసంబై సరస్వతీ సరోవరంబని చెప్ప నొప్పుచుండె నప్పుష్కరిణియందుఁ గ్రుంకులిడినజనులు పాపరహితులయ్యెద రదియునుంగాక ధనుర్మాసంబున శుద్ధద్వాదశీదినం బరుణోదయంబు మొదలుకొని యారుగడియలపర్యంతము గంగాదినదు లాపావనపుష్కరిణియందుం గలసియుండు, నట్టిపుణ్యకాలంబున నాతీర్థంబున స్నానంబుచేసినవారలు ముక్తినొందెద రదియునుంగాక, తత్తీర్థతీరంబున శ్రాద్ధంబులు చేసిన వారి పితృదేవత లమృతపానం బొనర్చి తృప్తినొంది స్వర్గంబునకేగి సుఖంబుండుదురు, మఱియు నారాయణాఖ్యుండను బ్రాహ్మణుం డాతీర్థంబునం గ్రుంకులిడుచుండి హరిదివ్యధామంబునం బొందె నిది శేషాద్రిప్రభావం బిఁక వేంకటాద్రిప్రభావంబు వచింతు. 67

—— మాధవుండను విప్రునిచరిత్రము. ——

సీ. చెప్పెద వినుమయ్య శ్రీకాళహస్తిలోఁ
జూడఁ బురందరసోమయాజి

తనయుఁ డై నట్టి మాధవనామధేయుండు
తనకర్మవశమునం దనకు భార్య
యగుచంద్రరేఖను బగలు రతికిఁ బిల్వ
నయ్యింతి భీతితో నకట పెద్ద
లింటనుండఁగఁ బగ లీరతి తగదంచు
బహువిధంబులఁ జెప్పి పట్టుపడక
తే. తలఁగిపోవుచు నుండఁగఁ దాళఁజాల
కతఁడు ప్రార్థింపఁగాఁ బతియాజ్ఞ మీఱఁ
దగదటంచును మదినెంచి ధవునిమోము
సదయమైఁ జూచి పల్కె నాచంద్రరేఖ. 68

వ. స్వామీ దేవతార్చనాగ్నిహోత్రాది సత్క్రియ లాచరించు సమయంబున నిట్లు దివాక్రీడాసక్తిఁ గడంగఁగూడు నే యని యనేకవిధంబులం జెప్పినను వినకుండు పతింజూచి, "యైన మీరు సమిత్కుశతులసీపుష్పార్థంబుగ సువర్ణనదీతీరవనంబు నకుం జని యందుండుఁడు. నేనచ్చటికి నుదకంబు గొనివచ్చు టకు ఘటంబుచేఁగొనివత్తు నచ్చట మఱుస్థానంబున భవ త్సంకల్పపూర్తిం జేసికొనుఁ డటంచుం బతికి ముదంబునొం దించి యాతని పంప నతండట్లుపోయి సువర్ణనదీతీరంబునం బుష్పవనాంతరంబుచేరె. అచ్చటికి నంతకుమున్న వచ్చి స్వర్ణ భూషణశ్వేతాంబరాలంకృతయై యొక్కకాలు ముడిచికొని యొకకాలిబొటనవ్రేలి ఁలఁ గ్రుతి యెత్తుచు మోఁకాలి మీఁదఁ జుబుకంబుంచుకొని దీర్ఘనీలకుంతలంబులు మెఱయఁ గూర్చునియున్న పద్మినీజాతి యగు చండాలస్త్రీనింజూచి యమ్మాధవాభిఖ్యవిప్రుండు మోహించియుండె నట్టిసమయం

బునం దనభార్య యుదకార్థంబుగ ఘటంబుం జేకొనివచ్చుటం
జూచి యవ్విప్రుండు భార్యా! నీగుణంబును బరీక్షింప దివా
క్రీడకుఁ బిలిచితింగాని మఱేమియు లేదుగావున నీవు స్నానం
బొనర్చి యుదకంబుగొని గృహంబున కేగు మేను నతిశీఘ్రం
బుగ వచ్చెదనని భార్యను బంపి యాచండాలస్త్రీకడకుంబోవు
చుండ నాబ్రాహ్మణునింజూచి యది లేచి మ్రొక్కి దూరంబరిగి
నిలిచి యేమో చెప్పఁబోవ నవ్విప్రుం డద్దానిచెంత కేగుచుం
డఁగ నాస్త్రీభయంపడి మాధవాభిఖ్యబ్రాహ్మణున కిట్లనియె. 69

సీ. ధరణీసురేంద్ర నేడవ్వనం జనుచున్న
నేల వెంబడివత్తు వేమినీతి
నన్నెవరని యెంచినావు నీవెఱుఁగుము
చండాలయువతిఁగఁ జనుము విప్ర
యనఁగ నాబ్రాహ్మణుం డనియె నీపేరేమి
చెప్పవే యనఁగ నాచేడె వానిఁ
గని నన్నుఁ గుంతల యని పిల్తురిట్లు నీ
వడుగుచు ననుఁజేర కవలఁ బొమ్ము
తే. నీవు నాడగ్గఱకు రాకు నీచజాతి
దాననని వోవుచుండఁగఁ దాను దాని
విడిచిపోలేక మఱిమఱి వెంబడించి
భ్రాంతితో నిట్టులనియె నాబ్రాహ్మణుండు. 70

తే. భామ నీవంటిసుందరి బ్రహ్మదేవుఁ
డంత్యజాతిని బుట్టించి యడవియందుఁ
గాచువెన్నెలవడువునఁ గనుటచేసె
నింతకావిధి దూఱంగ నేలమగువ. 71

క. లవణాబ్ధిలోనిమణులను
దివిజులు శిరమున ధరించు తెఱఁగున నే ని
న్నవని వరించి ధరింతని
వివరించి భయంబు విడచి విప్రుండనఁగన్. 72

చ. వినియది భీతినొందుచు వివేకమునన్ద్విజుమోముఁ జూచి యి
ట్లనియెను జారకాంతను మహావిషసర్పమువంటి యెవ్వరై
నను మనినారె? ప్రేమ నిను నమ్మినభార్యను వీడి నన్నుఁబొం
దిన నిహముంబరంబుఁ జెడు ధీరతతోఁ జనుబ్రాహ్మణోత్తమా!

వ. మహాత్మా స్త్రీపురుషులను జాతిద్వయంబును నిర్మాణంబుచేసి మఱల నందుఁ గులంబులు నాల్గింటిని యేర్పఱచి యేకులము వారి కాకులమునందు స్త్రీని వివాహం బాడంజేసి స్వభార్య యందు సత్సంతానంబు వడసి పరస్త్రీని యపేక్షింపక యుండ వలెనని ధర్మశాస్త్రాదులు బోధించుచుండ, నీవట్టిధర్మంబు లెఱింగియుఁ గేవలము చండాలస్త్రీనిం గోరుట యధర్మంబు గదా? మఱియు బ్రాహ్మణజన్మం బత్యుత్తమోత్తం బై యుండ నందుఁ బుట్టి గర్భాధానాది షోడశకర్మంబుల నాచరించి వేద పూతం బగునీదేహంబు వృథా యకృత్యంబునకుఁ జిక్కింప నేల, మఱియు నీశ్రోత్రనేత్రజిహ్వాఘ్రాణపాణిపాదంబు పుణ్యకథాశ్రవణభగవద్దర్శనహరిపాదార్చిత పుష్పాఘ్రాణవే దాధ్యయనదానతీర్థయాత్రాది సత్క్రియలచేతఁ బవిత్రంబు లైనవి మదీయశరీరంబు దుష్క్రియలచే నపవిత్రంబైనది కాఁబట్టి నన్నంటరాకుము, దూరంబున నిలువుమని కోకిల ధ్వనితోఁ జెప్పుకుంతలమాటలు విని యోపంజాలక యవ్వి ప్రుండు దానింగదియంబోవ నది పాపభీతిచే రోదనంబు

నేయుచు దిగ్దేవతాదులను దలంచి, "ఈ బ్రాహ్మణుండు పాప
జాతినైన నన్నుఁ బొంది కులహీనుండై నరకంబునంబడుటకుఁ
బ్రయత్నించి సముద్రముప్పొంగి వచ్చునట్లు నాపైఁ బడ
వచ్చుచున్నవాఁడు, నావలన నించుకేని దోషంబు లేదు మీ
రెల్లరు నాకు సాక్ష్యమిచ్చువా రగుదురుగాక యనుచుండ
నాభూసురుం డాయువతికడకుం జని యిట్లనియె. 74

తే. భామ నీవిప్డు చెప్పిన పరమధర్మ
వచనముల నేనెఱుంగుదు వసుధఁ గామ
మునను నావలె నెందఱో మున్ను ధర్మ
మును దలంపక స్త్రీలను గొనిర దేల? 75

తే. తరుణి నానోము ఫలియించెఁ బరఁగ నీదు
జవ్వనపుఁగారణంబునఁ జాలు వేయి
జన్మములు నేయఁ గల్గునే సౌఖ్య మిర్వుఁ
గాన నాయిష్ట మీడేర్చు కరుణహృదయ. 76

వ. అనిన నయ్యింతి భయభ్రాంతచిత్తయై యవ్విప్రుని కిట్లనియె

చ. కటకట! బ్రాహ్మణోత్తముఁడ కామసుఖంబును గోరి లేనిసం
కటపడనేల నీగృహముఁ గ్రక్కునఁ జేరి నిజాంగనామణిం
బటుముద మొప్పఁ గూడు ననుఁబట్టిన నేమిఫలంబు గాన న
న్నిటచనిపట్టరాకు మిది యేమి యపభ్రమ నీకు మానుమా.78

క. చండాలస్త్రీ నెనయుట
పండితుఁడా వినుము నీకుఁ బాపము రాదే
మెండొడ్డి విప్రకులమున
టుండుము నన్నంటరాకు మూర్ఖసురుఁడా. 79

క. అని యది వెనుకకుఁ జనఁగాఁ
గని విప్రుఁడు కులము మించి కామాంధత్వం
బును గదుర వడిగఁ జని దా
నిని బట్టంబోవ నదియు నిలువక చనుచున్. 80

వ. అప్పు డాకుంతల యతనిం జూచి, "బ్రాహ్మణోత్తమా! నీజననీ జనకులతోడె, గురుదైవంబులతోడె, నన్నంటకు మనుచుండఁగ వాఁడు వినక యాయువతిం బట్టికొనియె నంత నది చూచి నీవు నన్నంటినకతన నంటువడితివి సచేలస్నానం బొనర్చి యింటికరుగు మూరక దురాశచేత మేటికొలం జేల వమ్ము చేసుకొనెద వనుచుండ నవ్విప్రుం డది పాటించక యాయబల పైఁబడి కట్టుకుని యిష్టంబు పరిపూర్తి గావించుకొనియె. నననంతరం బాకుంతల యాభూసురునింగని, "కటకటా! నే నబల యగుటం జేసి నీపట్టుకు నెందేని దప్పనరుగ లేనైతి నవజలద జలప్రవాహంబు క్షారోదధిం బడినవిధంబు నీవు నాసంగమంబునఁ గులభ్రష్టుండవైతివి నీవింక యజ్ఞోపవీతపరిత్యాగంబు చేసి మదీయ చండాలజాత్యాహారాదులుచేసి, నాకుఁ బరిణయంబు లేనికతన నింకవేఱ నాకు వివాహంబు పనిలేదు గావున నాతోడ నుండుమనిన నావిప్రుం డందులకు నంగీకరించె. అంత నయ్యిద్దఱు గృష్ణానదీతీరంబునం జేరి ద్వాదశహాయనంబులు కామోపభోగంబు లనుభవించుచుండఁ గొంతకాలంబునకు నక్కుంతల మృతినొందుటం జేసి మాధవాభిఖ్యబ్రాహ్మణుండు దుఃఖాక్రాంతచిత్తుఁడై యొంటిందిరుగుచుఁ దనమనంబున నిట్లు చింతించె. 81

సీ. గురుతరం బగు బ్రహ్మకులమున జనియించి
కుంతలయనుదాని గూడి కులము
నమ్ము చేసుకుని హా యిమ్మెయిఁ గష్టంబు
గుడువఁగల్గెను భార్యఁ గూడనైతి
పాపంబుచేసితి పాపహరంబుగ
శ్రీహరి యింక రక్షింపవలయు
ననుచుఁ బశ్చాత్తాపమును బొంది గొందఱు
భక్తులౌరాజులు పరమవేంక
తే. టాద్రి కరుగుచునుండంగ నరసి తాను
వారివెంబడిఁ జని త్రోవ వారిభోజ
నాంతమున వారియెంగిలి యన్నమలరఁ
దినుచు హరి వేఁడుచును భక్తిఁ దనరుచంత. 82

వ. దేహాభిమానంబు వదలి కపిలతీర్థంబున కేతెంచి యాపావన తీర్థంబునకు మ్రొక్కి, తోడుగవచ్చి రాజు లాపుణ్యక్షేత్రం బున వపనంబులు చేసుకొని స్నానంబు లాచరించి పితృలకు శ్రాద్ధంబులు పెట్టి పిండప్రదానంబు సేయుచుండఁ దాను గనుం గొని బ్రాహ్మణకులోద్భవుండయ్యు నూరకేల యుండవలె నని తలంచి తనతలిదండ్రులు మృతినొందినవార్త యెఱింగినవాఁ డగుటంజేసి తానట్లు వపనంబు చేసుకొని తీర్థంబున మునింగి సంకల్పశ్రాద్ధంబుచేసి మృత్పిండంబులు మంత్రభక్తియుక్తంబు గఁబెట్టి తత్పిండంబు లెత్తి తత్తీర్థంబున విడుచుచుండఁగఁ బితృదేవత లాపిండంబులం బ్రియంబునఁ గరంబుల నందికొని రనిన విని జనకుండు శతానందుని గనుంగొని యిట్లనియె. 83

క. చండాలాంగన నొప్పుచు
నుండినకులహీనుఁ డూరకుండక నేవి
ప్రుండ నటంచుం బెట్టిన
పిండంబులఁ గొనరె వానిపిత లయ్యారె. 84

క. అనఁగ శతానందుం డి
ట్లనె జనకా కపిలతీర్థమందున మొదటన్
మునిఁగిన పుణ్యముచేఁ గై
కొని రాపిండములు వారు కొంకక వింటే. 85

సీ. ఆపుణ్య మటులుండె నటుగాక యాతని
మహిమఁ జెప్పెద విను మఱుదినంబు
పరమముదంబు నా గిరియెక్కుచుండఁ ద
చ్చేఁ బాపమెల్ల
నాతని విడి వాంతమయ్యె భయంపడి
యప్పాపగహనంబు నప్పుడద్రి
పావకంబు దహింపఁ గా వియద్వీధి మం
టలు మించెనప్పుడు జలజభవుఁడు
తే. వామదేవాదు లీక్షించి వచ్చి దివిజ
మార్గముననుండి యాశ్చర్యమగ్నులగుచు
నేమి యీవింత యని మర్త్యులెంతయునపు
డద్రినిం గనుచుండిరి యదలిపడుచు. 86

ఉ. అప్పుడు వేంకటాచలమహామహిమంబు దవాగ్నిరూపమై
తప్పక విప్రుపాపమును దగ్ధముచేసె నటంచు మాధవున్
గొప్పగ నెంచి శీర్షమునఁ గొల్లఁగఁ బువ్వులవాన నించి యం
దొప్పఁగఁ జూచుచుండి రజుఁ డుర్వికిఁ దా దిగివచ్చి నవ్వుచున్.

ఉ. వానిశిరంబు మూర్కొ నఁగ వాఁడు కృతార్థుఁడనైతినంచుఁదా
నానలినోద్భవుం బొగడి యంజలిచేసి భయంబు మీఱఁగా
దీనతనొంది యిట్లనియె దేవ వివేకము లేక పాపముం
బూని యొనర్చితిం బరమపూరుష నాగతి యెట్లు చెప్పుమా.

తే. అనుచు వాఁడార్తిఁబొందుచునడుగ నజుఁడు
వల్కె నిష్మెయి నోవిప్ర ! పాపమెల్ల
భస్మమైపోయె సంశయంపడకు మింక
వేంకటాద్రికి నీవు వేవేగ నరిగి. 89

సీ. స్వామిపుష్కరిణిలో స్నానంబుచేసి యా
భూవరాహస్వామి పూజసల్పి
మ్రొక్కుచు నీదేహమును విసర్జించుము
తదనంతరంబు భూతలమునందు
ధన్యత పాండవదౌహిత్రవంశజుఁ
డగుసువీరునిసుతుఁడై జనించి
నట్టిసుధర్ముని కాత్మసంభవుడవై
వసుధ నారాయణవనపురమున

తే. నిలిచి హరిభక్తి నెదనుంచి నిర్మలముగఁ
దొండమండలదేశ మఖండధర్మ
మార్గమున నేలుచుండు రమావిభుండు
పెండ్లియాడును నీపుత్త్రిఁ బ్రేమదనర. 90

తే. లక్ష్మియ కుమారిగా నీకు లక్షణాంగి
గల్గు శ్రీహరి కిచ్చి సౌఖ్యంబుగాను
బోయి వైకుంఠమును జేరు భూసురుండ
యనుచు మాధవునిం గని వనజభవుఁడు. 91

కారుణ్యార్ద్రచిత్తుండై వరంబు లొసంగుటంజేసి యప్పర్వతం
బునకు వేంకటాద్రి యనునామంబు సార్థకంబయ్యె వేంకటా
ఖ్యాక్షరత్రయార్థంబు చెప్పుమనిన జనకుంజూచి శతానందుం
డిట్లనియె. 92

క. విను వేమ్మనుపాపేంధన
మును గటయుగళాక్షరాగ్ని ముఖ్యంబై కా
ల్చెను గావున వేంకటగిరి
యనిపే రాయద్రి కొప్పె నవనీనాథా. 93

సీ. మొనసి ప్రాతఃకాలమున లేచి వేంకటా
ద్రిస్మరణము సేయుధీరు లవనిఁ
గ్రమముగ నూఱు గంగాస్నానములు మఱి
సేతుయాత్రలు వేయి చేసినంత
పుణ్యఫలంబులం బొంది సుఖింతు రీ
కథ మద్గురుం డగుగౌతముండు
నాకుఁ జెప్పినరీతి నీకుఁ జెప్పితి నిది
వినినవారికి శుభవితతు లొదవు
తే. వసుధ నిహపరసుఖములు వలసినట్టి
వార లీకథ వినవలె వాంఛమీఱ
నని శతానందముని చెప్పినందువలన
జనకుఁ డావేంకటాద్రికిం జనఁదలంచి. 94

వ. మంత్రిప్రముఖులం దోడ్కొని శతానందునితోడ వేంకటా
ద్రికి వచ్చి స్వామిపుష్కరిణియందు స్నానాదులుచేసి భూవ
రాహశ్రీనివాసులసాన్నిధ్యంబునఁ గొన్నిదినంబు లుండి
క్రమ్మఱ మిథిలాపురంబుచేరె నివ్విధంబు వేంకటాద్రిదర్శనంబు

చేసిన పుణ్యంబువలన రామచంద్రుండు శంకరధనుర్భగ్నంబు చేసి సీతను బరిగ్రహించె నంత సౌమిత్రి యూర్మిళను, భరతుఁడు మాండవిని, శత్రుఘ్నుండు శ్రుతకీర్తిని బరిగ్రహించిరి యనిన జనకుండు సంతసించె, ననిన విని శౌనకాదులు సూతుంగని యిట్లనిరి. 95

క. కమలాసనుఁడు రథోత్సవ
మమరఁగ శ్రీవేంకటాద్రియం దాహరిక్షి
విమలుండై చేసెఁ గదా
కమలాక్షుం డచట నెంతకాలం బుండెన్. 96

క. అన విని యాసూతుం డి
ట్లనియెఁ శ్రీవేంకటాద్రియం దాఢ్యుండై
వనజాక్షుఁడు కలియుగ మడఁ
గిన దనుక యహీంద్రనామగిరిపై వేడ్కన్. 97

సీ. ప్రాకృతజనులలోపల మెలంగుచు భూమి
యందుండి శ్రీవేంకటాద్రివిభుఁడు
పరఘనప్రాకృత ప్రభలచే దీపించు
మిహిరాబ్జకాంతులు మెచ్చకుండు
బహురత్నగోపురప్రాకారసౌధము
ల్తోనయఁ జతుర్ద్వారములును గలిగి
మహనీయమరకతమణితోరణంబులం
గొమరొందుచున్న వైకుంఠపురము
తే. దలఁచి యచ్చటి నిత్యముక్తులును దాను
జూడఁగోరుచు శేషాద్రి శుభ్రఘోణి

కొప్పుగా నేలుమని చెప్పి యొప్పగించి
మంచిమాయానిగూఢ విమానమెక్కి. 98

వ. శ్రీభూనీళాసమేతుండై హరివైకుంఠపురంబుం జేరి యందుండు నిత్యముక్తులంజూచి యాదరించి యప్రాకృతమణిమయాంతగ పురంబున శేషతల్పంబునందు వసియించియుండె నంత శేషాద్రి యందుండు వరాహస్వామి విశ్వకర్మనిర్మితపురంబును నంత ర్ధానంబొనరించి యిచ్ఛావిహారంబుగఁ బ్రవర్తించుచుండెఁ బిమ్మట వృషభాసురునితో యుద్ధంబు సేయంజనియె నివ్విధం బునం గొన్నియబ్దంబులు జరిగినవెనుక యొక్కనాఁడు నారదుండు వేంకటాద్రికి వచ్చి శ్రీనివాసుఁడు వైకుంఠంబుచేరిన వృత్తాంతంబు నెఱింగి సత్యలోకంబునకేగి బ్రహ్మదేవునకు నమస్కరించి యిట్లనియె. 99

తే. తండ్రి విను చక్రశేషభూధరము శుభ్ర
ఘోణి కొప్పించి తాను వైకుంఠమునకుఁ
జేరె ననఁగా నజుం డతిచింతనొంది
యేమియుందోప కతనితో నిట్టులనియె. 100

క. విను నారద భూలోకం
బున శేషాచలమునందుఁ బురుషోత్తముఁ డుం
డినకాలంబునఁ దద్భూ
జను లతిపుణ్యాత్ములైరి సాత్త్వికు లగుచున్. 101

సీ. ఆస్వామి వైకుంఠమందుఁ గ్రమ్మఱఁ జేరి
నందుచే శ్రీవేంకటాద్రిమీఁద
నేను సంకల్పించి నెనరునఁ గావించి
నట్టి రథోత్సవం బావరాహ

దేవుఁ డొక్కఁడు సమర్థింప లేఁ డాశ్రీని
వాసుఁ డందుండఁగ వలయుఁ గనుక
వసుదేవ దశరథ వరతేజములఁ దింత్రి
ణీవృక్షముగ దీర్చి నిలుపుదునట
తే. సరవి దేవకికళను గౌసల్యకళను
బుట్టఁగాఁ దీర్చియుంతు నాపుట్టలోన
శ్రీనివాసుండు వేగమ చేరుపాయ
మీవు గావింపు మెట్టైన దేవమౌని. 102

క. వనజాక్షుం డాగిరిఁ జే
రినపిమ్మట హరికి నాఁటిరీతిని నరదం
బున వేడ్కఁ జేయవలె మే
లొనరంగ జగద్ధితంబు నొందఁగ మఱలన్ 103

సీ. క్షితిమీఁద నెప్పుడు శ్రీనివాసుఁడు లేని
కతన మానవులు దుష్కర్మ లగుచుఁ
గలిమాయనొంది సత్కర్మముల్ శ్రద్ధతోఁ
జేయలే రికమీఁద శేషగిరికి
మఱల శ్రీహరివచ్చి మనుజులనెల్ల ర
క్షింప నుపాయంబు సేయకున్న
జనుల పాపంబును శమనుండు గని నార
కమునందుఁ ద్రోయించుఁ గాన భూత
తే. దయ మనంబున నుంచి మాధవుఁడు శేష
పర్వతము చేరునట్టియుపాయ మీవు
సేయుమన విని సురమునిశ్రేష్ఠుఁ డలరి
యజునిపాదంబులకు మ్రొక్కి యాదరమున. 104

సీ. శరదభ్రశుభ్రలసత్కాంతి నిజదేహ
మందు రప్పింపఁగా నరుణవర్ణ
కలితజటాజూట కళలుప్పతిల్లఁగ
లలిఁ బూర్ణచంద్రకళంక మనఁగ
నొఱపుఁగృష్ణాజిన మొప్పంగఁ గటియందు
మధ్యభాగమునందు మౌంజివెలయ
మెఱపుఁదీవెసుజాను మెచ్చుకయురమునఁ
దగినబంగరుజన్నిదము వెలుంగ
తే. నారదుఁడు లేచి యప్పుడా నలినభవుని
యనుమతిని హావీతీరమునను జేరి
క్రతువు లచ్చట నొనరించు కశ్యపాది
సంయమీంద్రుల నీక్షించి సవినయమున. 105

తే. వీణ మీటుచు గానధురీణుఁ డైన
వరమునీంద్రుఁడు సవనపువాటమునకు
రాఁగఁ గశ్యపముఖులు నారదుని జూచి
విహితరీతిని బూజించి వినుతిచేసి. 106

క. ఘనతం దగ మఱి మును లా
యనిమిషమునివరుని గాంచి యని రిమ్మెయి నో
మునినాథుఁడ భవదాగమ
మున మే మెల్లరును మోద మొందితిమి కడున్. 107

తే. అనఁగ విని మౌనులార మీఱంద ఱిచట
యజ్ఞమును సల్పి తత్ఫలం బలర నెవరి
కర్పితంబులు గావింతు రావిధంబు
దెలుపుఁడని పల్క మునులు సందియమునొంది. 108

వ. అప్పు డాభృగుమునీంద్రునితోడఁ దమలోఁ దాము వితర్కించుచు యజ్ఞఫలభోక్తయైన దేవుని నేర్పఱచి చెప్పుటకుఁ దోఁచక యూరకుండ నారదుండు చూచి యిట్లనియె.

సీ. మానితాష్టాక్షరీమంత్రార్థమును వీణె
నందుఁ బల్కించి సానందుఁ డగుచుఁ
బలికె నిట్టులు ప్రజాపతులార మీరు స
త్క్రతువులుచేసి లోకములయందు
విలసితముగఁ బ్రజావృద్ధిఁ జేసితిరి మే
లయ్యె మోక్షప్రదుఁ డైనదేవుఁ
డజుఁడో పద్మాక్షుఁడో హరుఁడో విచారించి
ముక్తిప్రదంబైన మూర్తియందు
తే. సవనఫల మొగి నర్పించి సంతసింపుఁ
డనుచు హితమొప్పఁ జెప్పి వీడ్కొనె విపంచి
తంత్రులను మీటుచును బరతత్త్వమాత్మ
యందుఁ జూచుచు స్వేచ్ఛావిహారియగుచు. 110

వ. అమ్మునీంద్రుండు త్రిలోకసంచారంబు సేయుచు నుండె నజుండు శేషాద్రియందు వల్మీక తింత్రిణీవృక్షంబుల నిర్మాణం బొనరించి యుంచె ననంతరంబున. 111

మ. ఘనుఁడై నారదుఁ డన్నవాక్యముల నాకర్ణించి భావించి యమ్మునులెల్లన్ గుమిఁగూడి తాము తమలో మూర్తి త్రయంబందు మిం,చినమోక్షప్రదుఁ డైనవేల్పును పరీక్షించు ప్రకారం బదెట్టని యోచించి భృగుండు నేర్పుఁగన నిం కామూర్తి చందంబులన్ 112

వ. అని నిశ్చయించి త్రిమూర్తులయందు ముక్తిప్రదుండైన
మూర్తిని విచారించుకొని రమ్మని భృగుమునీంద్రుని నంపఁగ
నమ్ముని సత్యలోకంబునకేగి తపోజనపరివృతుండై కొలువున్న
బ్రహ్మనీక్షించి మ్రొక్కి యాబ్రహ్మ కూర్చుండుమనక మున్న
కూర్చుండినం జూచి యజుని మనంబునఁ గోపంబు వొడమిన
నాకోపం బడంచుకొని విధాత మాటాడ కుండినం జూచి
యాబ్రహ్మ రజోగుణస్వరూపం బిట్టిదనియు నిట్టిరజోగుణ
ప్రధానుం డైనవాఁడు మోక్షప్రదుండు గాఁడు గావున
నతనికి భూలోకంబున నాలయం బొక్కెడం గాని లేకుండు
నని నిశ్చయించి యాభృగుమునీంద్రుండు దిగ్గున లేచి కైలా
సంబునకుం బోయి పార్వతీసమేతుండై క్రీడించుచున్న శివుని
ముందట నిలిచినంగని పార్వతి లజ్జించె, నప్పుడాశివుండు గాని
తఱి నిట్టిస్థానంబునకు నిమ్ము రాఁదగునే యని క్రోధోద్రేక
రక్తాక్షుండై చూచుచు మాటాడకుండుటం జూచి యా
రుద్రుని తమోగుణస్వరూపం బిట్టి దని యెఱింగి యిట్టి
తమోగుణుండు ముక్తిప్రదుండుగాఁ డీతనికి శరీరపూజ లేక
లింగపూజ యగుం గాక యని నిశ్చయించి యందుండి
వైకుంఠంబునకు నరిగి యమ్మునీంద్రుఁడు శేషతల్పంబునందు
రమాసమేతుండై శయనించియున్న యాశ్రీనివాసునివక్షంబు
నందు నిజపదం బెత్తి తన్నుటంజూచి యాహరి దిగ్గున లేచి
యమ్మునికిఁ బ్రణామంబు చేసి యర్ఘ్యపాద్యాది విధులం
బూజించి కూర్చుండి తన్నుం దన్నిన యమ్మునిపాదంబు తన
తొడపై నిడికొని యొత్తుచు మందస్మితవదనుండై యాభృగు
నీక్షించి యిట్లనియె.

సీ. పరమమునీశ మీ రా వచ్చుటఁ దెలియక
యూరక పవళించి యుంటిఁ గనుక
యపచారినైతి నా యందుఁ గృపాకటా
క్షం బుంచవలయు నోసంయమివర
నా యపచారంబునకుఁ దగుశిక్షకై
యెఱిఁగి తన్నితరి నాకిష్టమాయెఁ
గఠినమైనట్టి వక్షమునందుఁ దన్న మీ
పద మెంత నొచ్చెనో గద యటంచు
తే. నేమి సేయుదు మృదువైన దీపదంబు
చిగురుటాకులవంటిది నేవ్యమైన
దిట్టపాదము తాఁకిన నెదను నొప్పి
లేదు యోగీశ కోపము లేదు నాకు. 114

క. వనజముఁ దాఁకినచందం
బున మీపదఘాత మెదను భూషణ మయ్యెన్
ఘనకఠినతరోరస్థల
మెనయఁగఁ దాఁకినపదాబ్జ మెట్లుండెనొకో. 115

వ. అని పల్కి యమ్మునీంద్రుని పాదప్రక్షాళనంబుచేసి తత్తీర్థంబు
శిరంబునం జల్లికొని యిట్లనియె. 116

క. వరవిప్రునిపదరేణువు
లిరవుగ శిరమున ధరింతు నీనాఁటికి మీ
చరణం బురమున సోఁకఁగ
ధరణీసురవర్య నేఁడు ధన్యుఁడ నైతిన్. 117

ఉ. అని హరిపల్కఁగా భృగుమహాముని సంతసమంది మానసం
బున భయభక్తులంబొడమ పుండరికాక్షుని మోము చూచి ల

జ్జను దలవాంచి యిట్లనియె శాశ్వతసద్గుణమూర్తివీవు గా
వున ననుబ్రోచి తిందు నిఖిలోన్నత నిన్ను నుతింప శక్యమే.

వ. అని వినుతించి హరిని వీడ్కొని చని గంగానదీతటంబునఁ గ్రతువు లొనరించుచున్న కశ్యపాదిమునివర్యుల చెంతఁ జేరి, అజరుద్రుల రజస్తమోగుణస్వరూపంబులను హరిశుద్ధసత్వ గుణస్వరూపంబును దాఁ బరీక్షించి వచ్చినవృత్తాంతంబు లమ్మునివర్యులకు వినిపింప వారు సంతసించి నారాయణుం డొక్కఁడ ముక్తిప్రదుండని నిశ్చయించి సకలక్రతుపుణ్య ఫలంబు లాస్వామికి నర్పించి విష్ణుధ్యానంబు సేయుచుండి రంత. 119

సీ. వనజాక్షు నాభృగుముని దన్ని నప్పుడా
హరివక్షమున లక్ష్మి యలుగుచుండి
తననివాసమునందుఁ దన్నినభృగునిపై
నలుక రెట్టింపఁగ హరికి మ్రొక్కి
పలికె నిట్లని నిన్ను బ్రహ్మస్వరూపుఁడ
వనినమ్మి నీయురంబునను నిల్చి
యిరవుగనుంటి నేఁ డీ భృగువర్యుండు
నన్నెంచకుండఁ దాఁ దన్నెఁ గనుక
తే. యతఁడు తన్నుట సంతోషమయ్యె నీకు
నాకుఁ గోపము పుట్టియున్నది మునీంద్రు
నేమి సేయుట కిష్ట మొక్కింత లేదు
గానఁ దపమాచరించెదఁ గమలనాభ. 120

క. మానసమున మీపదములు
ధ్యానింపుదు నెచ్చటైనఁ దద్దయు నెపుడున్

జ్ఞానము నాకిపు డొసఁగుము
నేనీపదమందె నిలుతు నీరజనయనా. 121

క. అనుచు రమాకాంత మనం
బునఁ గోపముగదుర వల్కెఁ బురుషోత్తముఁ డా
వనజాలయతో నిట్లనెఁ
గనుఁగొని ప్రియమార నయముగా వినుమనుచున్. 122

క. సిరి నన్ను మౌని దన్నుట
కరమరగాఁ జూడవలవ దమ్మునిపాదం
బురమునఁ దాఁకినదే శుభ
కరమయ్యెను గోపగింపఁగాఁ దగ దింతీ. 123

చ. అన విని లక్ష్మి యిట్లనియె నాత్మలకాత్మవు విశ్వకారణుం
డనిని బూజసేయ కిపుడిక్కట యిక్కడ వచ్చి తన్నె న
మ్ముని కిఁక నేమిగల్గు నతిమూర్ఖుఁడు వానిఁ దలంప నింక నా
మనమున కింపుగాను బహుమానముచేసితివీవు కేశవా. 124

సీ. తనతండ్రి యైనవిధాత నీకు సుతుండు
తానావిధాతకుఁ దనయుఁ డయ్యెఁ
దనకుఁ బితామహుం డని యెంచి పిన్నపె
ద్దంతరమును జూడ కదరఁ దన్నె
నదియటులుండంగ నమ్ముని పరమాత్మ
వని నిన్నుఁ దెలియలే కజ్ఞుఁడయ్యె
నటువంటిమునిపాద మిటు నీయురంబున
సోఁకినంతటన యిచ్చోటు నిలువఁ
తే. దగదు నెందైన నేను జిత్తమున నిన్ను
నిల్పి పూజించుచుండుట నీతి నాకు

సెలవొసంగుము జగదీశ చిత్ప్రకాశ
యంచు సిరి పల్క హరి యిట్టులనియె నగుచు. 125

సీ. సుదతి విరించి నాసుతుఁ డాభృగుఁడు పౌత్త్రుఁ
డని యంటి బిడ్డబిడ్డైనవాఁడు
తన్నిన నెఱుఁగఁడు పిన్నవాఁడని నేను
గూర్మిఁ దలంపక కొట్టనగునె?
కడుపులోపలబిడ్డ కాలఁదన్నె నటంచుఁ
దల్లి క్రమ్మఱ వాని దన్నఁదగునె
జీవకోటులను గుక్షిని నుంచుకొనిన నే
నిట్టిదోషముల సహింపకున్న
తే. నెవరు సైరించి గాతురు భువిని ఘటియు
బ్రహ్మపుత్త్రుఁడతండు సద్బ్రాహ్మణుండు
తాపసోత్తముఁ డదిగాక తత్త్వవేది
నిజముగా భక్తి నాయంద నిలిపినాఁడు. 126

ఉ. భక్తుఁడు నా కతిప్రియుఁడు భక్తుని కేనుఁ బ్రియుండఁ గాన
నా, భక్తుఁడు నన్నుఁ దన్నుటకుఁ బాపియటంచును నింద
నేతురే, ముక్తుఁడతండు మానిజనముఖ్యుఁడు మూర్ఖుఁడు
గాఁడు గాని ఛేదోక్తులు మాని శాంతమతి నుండుము
నాయురమందు భామినీ. 127

క. అని విష్ణుం డనుటకు సిరి
కనుఁగవఁ గెంపెసఁగఁ గోపకలితాననయై
మనమున నసహ్యపడుచును
దనపతి కిట్లనియె వినుము దైత్యవినాశా. 128

క. పరపురుషపదస్పర్శం
బరుదుగ నురమందు సోఁక బాగగునే నం
దురుప్రేమ నుండఁదగునే
వరపాతివ్రత్యధర్మవర్తన సెడదే? 129

సీ. తన్నినవిప్రుని దండనసేయక
యంపితి భయపడె నంచుఁ జెప్పు
చులకఁదనంబుగఁ జూచి నిన్నెంత్వైన
గొల్లవాఁడైనను గొట్టఁగలఁడు
ధర నాఁడువారైన దట్టించి నీమీఁద
నవ్వుచు తాలతో రువ్వఁగలరు
నిను మ్లేచ్ఛులీరీతి విని సడ్డసేయరు
మించి నీగుణ మాక్రమించఁ గలరు
తే. తొలుతఁ బుట్టిన నీశాంతి తుదకు నన్ను
నిన్ను నెడఁబాపె నెంద్రైన నిన్నుఁ జిత్త
మందుఁ బూజించుచుండెద నంతెగాని
నీయురంబున నే నెట్లు నిల్తు నధిప. 130

సీ. అని పల్కి తిలకించి యనమితాననయొంచు
మఱిమఱిఁ జూచుచు మదిని లక్ష్మి
నిజపదాంగుష్ఠంబు నేల వ్రాయుచుఁ జింత
నెనయుచుండఁగఁ జూచి నెనరు దాఁచి
కారుణ్యమూహించి క్రమ్మఱ మాటాడ
కున్న వెన్నుని జూచి యుదధికన్య
హరి తన్ను మన్నింప కఱమఱఁజేసినాఁ
డీజాలిమాల నా కేలయింక

తే. నని తలంచుచు వైరాగ్య మగ్గలింపఁ
గమలనాభుని హృదయపంకజమునందుఁ
జక్కఁగానుంచికొని మ్రొక్కి చని రయమున
రమ్యతరమగు కొల్లాపురంబు చేరె. 131

క. ఆకొల్లాపురివాసులు
శ్రీకమలాదేవి నచట శ్రీకరభక్తిం
బ్రాకటముగఁ బూజింపఁగఁ
జేకొని యాచోటు నుండెఁ జిరకీర్తి దగన్. 132

వ. ఈక్రమంబుగ లక్ష్మీనారాయణులకుం బొడమినప్రేమ కలహ
వ్యాజంబున లక్ష్మి కొల్లాపురంబు చేరెననిన సూతుం జూచి
శౌనకాదిమహామును లాశ్చర్యంబంది యిట్లనిరి 133

శా. శ్రీనారాయణుఁ డీప్రకారముగ నాక్షీరాబ్ధిజన్ బాసి యా
భూనీళాంగనలందు మోహమును సంపూర్ణంబుగానుంచియుం
దానందించుచునుండెనో సిరిని నెయ్యంబొప్ప భావించుచున్
దీనత్వంబును బొందుచున్ వగచెనో ధీరాత్ముఁ డైయుండెనో

క. అని శౌనకుఁ డడుగఁగఁ దగ
విని సూతుం డిట్టు లనియె వెన్నుఁడు సిరిపై
నెనరు మనంబును బెనఁగొనఁ
దనలో నిటు తలఁచె విరహతాపము మీఱన్. 135

సీ. ఆదేవముని వేంకటాద్రిపైనే లేని
తప్పు విరించితోఁ జెప్ప నేల
యజుఁడు నారదునంప నతఁడు మానుల చెంతఁ
జేరి మూలప్రశ్న సేయ నేల

తత్పరీక్షకు భృగు తాపసేంద్రుఁడు వచ్చి
ధైర్యంబుతో నన్నుఁ దన్ను లేల
యదిచూచి నాకు నిత్యానపాయినియైన
భామ నన్నిపుడెడఁబాయు టేల
తే. కటకటా యేమి సేయుదు కర్మమునకుఁ
గాల మెంతటివారైనఁ గడపలేరు
శ్రీయువతి యిప్పు నన్నెడఁబాయుకొఱకుఁ
గలిగె నద్భుతముగ నెన్ని కారణములు. 136

తే. మంచి దిది యొకకొఱఁతగ నెంచు టేల
చంద్రబింబమునందుండు చంద్రికవలె
విమలయై లక్ష్మి నాయందు వెలయుఁగాని
పరఁగ ననువీడ దెందు సౌభాగ్యలక్ష్మి. 137

క. సిరి యెదలోనే యెప్పుడు
కరము ప్రియంబార నుండి గ్రక్కున నాహృ
త్సరసిజమున నివసింపఁగఁ
దిరముగఁ జేసుకుని బ్రోతుఁ ద్రిజగము లలరన్. 138

సీ. తోయధికన్యకాస్థూలదేహం బిప్పు
డెందున్నఁగాని నాయంద సూక్ష్మ
తనువొప్పుచున్నది దానిచేఁ జింత లే
దైనలోకవిడంబనార్థముగను
మొనయు సర్వజ్ఞత్వమును డాఁచి శ్రీరమా
వనితను వెదకఁగవలయు నిపుడు
నేనూరకుండినఁ బూని యోపిక లేని
కొంద ఱందురు లేని నింద లిడుచుఁ

తే. గొలువుఁ డని పార్షదులకు వైకుంఠపురముఁ
బాయ కుండుఁడు నిరతంబు పటిమ విడక
చెప్పి భూనీళలకు వారి నొప్పగించి
మఱల నిట్లని తలఁచె నప్మాధవుండు. 139

వ. కొంతకాలంబు బట్లుండిన నయ్యిందిరను మద్వక్షంబునం దుంచు కొందు నని నిశ్చయించి భూనీళలంజూచి బుజ్జగించి రమాదేవిని వెదకి గ్రమ్మఱఁ దోడ్కొనివత్తునని వారితోఁ జెప్పి వైకుంఠంబువిడిచి వేంకటాద్రికి వచ్చె ననఁగ శౌనకాదులిట్లనిరి.

క. శ్రీవనితామణి నరయుచు
శ్రీవైకుంఠంబు విడిచి క్షితిపై నుండెన్
శ్రీవేంకటగిరిఁ జేరిన
శ్రీవిష్ణుం డచట నేమి సేయుచు నుండెన్. 141

సీ. అని మును లడుగఁగ నాసూతుఁ డిట్లనె
వినుఁ డాదివిష్ణుండు వేంకటాద్రిఁ
జేరి యచ్చటనుండు శ్రీవరాహస్వామి
కిని పుష్కరిణికి దక్షిణము గాను
విలసిల్లు తింత్రిణీవృక్షమూలమునందు
మెఱయుచున్నట్టి వల్మీకవివరి
యందుఁ బ్రవేశించి యయుతవత్సరములం
దెవరికిం గన్పింప కెలమిగాను

తే. బుట్టలో వెల్గుచుండఁగ భూతలమునఁ
దప్ప కిరువదియెనిమిది ద్వాపరాంత
మందుఁగలియుగముదయించె నపుడు చోళ
రాజు భువినేలుచుండె ధర్మంబు దనర. 142

వ. అట్టికాలంబునఁ బర్జన్యుఁడు కాలవృష్టిఁ గురియించుచుండ భూమి సమృద్ధంబుగ సస్యాభివృద్ధి నొసంగుచు గోవులు బహు క్షీరంబు లిచ్చుచుండు, పతివ్రతాంగనామణులును సత్వ్రతు లగుపురుషులును, మాతా పితృ గురు దైవభక్తి గలపుత్త్రులును గల్గియుండుదు రట్టి యుగాదికాలంబునఁ గొల్లాపురిం జేరిన లక్ష్మి, శ్రీహరి వైకుంఠంబు విడిచి శేషాచలంబునందుఁ దింత్రిణీతరుమూలస్థలవల్మీకంబునందు వసించియుండుచందంబు భావించి తెలిసి తనమనంబున నిట్లు వితర్కించె. 143

క. నాకొఱకు కంబుజనాభుఁడు
వైకుంఠము విడిచి వచ్చి వల్మీకములో
నేకాకి యగుచు నం దిపు
డాకొనినాఁ డేమిసేయు ఁదకటా యంచున్. 144

క. చింతించుచు నే నాహరి
చెంతం జేరినను నన్నుఁ జేకొను నైనం
బంతము విడువం దగదని
స్వాంతంబున నిశ్చయించి సరవిగ నంతన్. 145

తే. వేగ కొల్లాపురంబును విడిచి గొల్ల
పొలఁతికై వడి నొంటిగఁ బోయి చోళ
రాజసతియున్న మణిమందిరంబుచెంతఁ
జేరి హరికిఁక నెటుతృప్తిఁ జేతునంచు. 146

వ. మనంబున దలంచుచున్న సమయంబున మహాలక్ష్మిభావం బజుం డెఱింగి రుద్రుం దోడ్కొనివచ్చి యచ్చట ధేనురూపంబు ధరించె నదెట్లనిన. 147

సీ. కపిలవర్ణంబుతోఁ గర మొప్పు దేహంబు
మంగళకరమైన శృంగములును
కాటుకకనులు సింగారంపుఁ జెవులును
నల్లనై మెఱసెడు నాసికయును
గురుతరకంఠంబు గోపురం బురంబు
తగుదీర్ఘవాలంబు తక్కుచూపు
ద్విరదతుండములట్లు దీపించుతొడలును
పూర్ణకుంభాభమై పొసఁగుపొదుగు
తే. బటువులైనట్టి కదళికాఫలములట్లు
నునుపుగా నొప్పు నాల్గుచన్నులును గల్గి
క్షీరవారిధిలోఁ బుట్టి చెలఁగినట్టి
కామధేనువువలె లక్ష్మికడకు వచ్చె. 148

తే. వత్సరూపంబుఁ దాల్చె నీశ్వరుఁడు నరవి
ధవళరూపంబు మెఱయంగఁ దల్లిచెంతఁ
బాలు ద్రావుచు నెగురుచు బాల్యలీల
లరుదుగాఁ జూపఁగాఁ జూచి యాడిలక్ష్మి. 149

చ. కమలజు శంభు లీక్రమముగా హరికిష్టము సేయుకోర్కెతో
నమలినధేనువత్సయుతులైనవిధంబు మనంబులోఁ బలఁ
క్రమముగ నందుఁ దా నెఱిఁగి గ్రక్కున రెంటిని దోలితెచ్చి
పెం,పమరఁగ దూఁడనావు నవు డమ్మెదనంచు వచించు
చుండఁగన్. 150

క. విని చోళనృపాలుని సతి
తనబిడ్డకుఁ బాలు దాను ద్రాగించుట కా

వనితకుఁ గోరినవిత్తం
బనుపమగతి నిచ్చి కొనియె నావుం దూడన్. 151

వ. అట్లు కొని మున్ను తమకుండిన ద్విసహస్ర ధేనుగణం బులలోఁ దోలి గోపకుని కొప్పించె నంత నమ్మహాలక్ష్మి యజ హరులు ధేనువత్సరూపంబులను ధరించి వల్మీకవాసి యగు వాసుదేవుని బోషింతు రింక నాకు నొకచింత లే దీస్వామి యెందైన సుఖించుచుండుట చాలునని తలంచి కొల్లాపురం బున కరిగె నంత బ్రహ్మస్వరూపంబైన ధేనువు దినదినమున.

క. గోవులలో మేయుచుఁ జని
శ్రీవేంకటశైల మెక్కి క్షీరంబును దా
నావల్మీకములోపలి
శ్రీవిష్ణుని కర్పణంబు సేయుచు నుండెన్. 153

క. హరి యాక్షీరము ద్రావుచుఁ
బరమానందంబునొంది బ్రహ్మను రుద్రుం
మురియుచు మెచ్చుచు నుండిన
తఱిఁ జోళనృపాలుభార్య తనబిడ్డకుగాన్. 154

తే. మున్ను తాఁగొన్న దూడతో మొదవునపుడు
సదనమున కొప్పఁ దెప్పించి సాధ్వి గోవు
దానిమేనెల్ల నివురుచుఁ దాను దాని
పిండఁబోవఁగఁ బాలు లే కుండఁగాను. 155

తే. తాను దనమదిలో నిట్లు దలఁచె నావు
పొదువు యోచించి చూచినఁ బూర్ణకలశ
మట్ల మెఱయుచు నుండియం దద్భుతముగఁ
బాలు లేకున్న దిదియేమి పాపమనుచు. 156

వ. కొండొకతడవు చింతించి యాధేనువందు లక్ష్యం బుంచి యుండి, మఱికొన్ని దినంబులు గడచిన యొకనాడు పాలు పిండఁగడంగినం బాలు లేకుండుటం జూచి గోపాలుని రావించి యిట్లనియె. 157

సీ. గోపాల యిపుడింత గొప్పావుపొదుగులోఁ
బాలు లేకుండెడి లీలయేమి
నీవరణ్యములోనఁ ద్రావినా వనవిని
గోపఁ డిట్లనియె నీగోవుపాలు
నేఁ ద్రావలేదమ్మ యెంచ దూడయ ద్రావి
యుండును నసఁగఁ జాలుండునదియు
మాయింట నున్నది పోయిపాలాను నె
దబ్బరలాడెదు దెబ్బలొదవు
తే. ననఁగ నవ్వాఁడు భయపడి యమ్మ నేను
గనుట లే దెట్టిదుష్కార్య మనుచు నావు
తనకుఁ దాఁ బొదువునుబడి త్రావ నేమొ
యనఁగ వానిని దన్నించి యపల నంపె. 158

తే. అపుడు వాఁడేడ్చుచును జని యాలమంద
వెంటఁ దాఁబోక యాగోవు వెంటనంటి
బోవఁగా నది ఫణిరాజభూధరంబు
మీఁది కెగనెక్కి పోయి వల్మీకమందు. 159

తే. పొదుగు దిగజారవిడచి పా ల్పొలుపుగాను
బుట్ట నిండింపఁగాఁ జూచి దిట్టఁడైన
గోపఁ డప్పుడు తనచేతిగొడ్డ లెత్తి
గోవునడినెత్తిపై మించి గొట్టఁబోవ. 160

ఉ. అప్పుడు విష్ణుదేవుఁ డహహా నిలు వావును గొట్టఁబోకుమా
దప్పక పా లొసంగినను దల్లి విధంబునఁ గాచె నిత్య మా
విప్పుడు గొల్లచే మడియు టెట్లు సహింపఁగవచ్చు నంచుఁ దాఁ
దెప్పున నైజమస్తకము ధేనుశీర్షముమీఁద నిల్పఁగన్. 161

సీ. గొల్లవాఁ డెత్తిన గొడ్డలి హరిమస్త
కంబులోఁ జొరఁగ రక్తంబు వెడలె
తక్క కప్పుడు సప్తతాళవృక్షప్రమా
ణంబున నూర్ధ్వముఖంబుగాను
బొంగుచు దిగజారి భూమిపైఁ బడఁజూచి
గోపకుం డదరుచుఁ గూలి మడిసె
నది చూచి గోవు శేషాద్రిఁ జెచ్చెర డిగ్గి
తనచోళభూపతిసభకుఁ బోయి

తే. నేలఁ బొఱలుచు నఱచి కన్నీరు నింప
ధేనువును గాంచి యారాజు దిగులుపడియె
నప్పు డాపశు వందుండ కొప్పుగాను
పఱచుటంజూచి దానితోఁ బంపెఁ జారు
లను గనుంగొని వచ్చుటకును విభుండు. 162

వ. అప్పు డాచారు లాగోవువెంట నంటిపోవ నాగోవు వేంక
టాద్రికి వచ్చి వల్మీకంబుడగ్గఱ నిల్చె నంతఁ జారు లాపుట్టలో
నుండి రక్తంబెగురుటయును, గోవందు నిలుచుటయును,
గోపఁ డందుఁ బడియుండుటయును జూచి భీతిల్లి యందుండి
రాజుకడకువచ్చి తద్వృత్తాంతం బంతయు నెఱింగింప నారాజు
విని దిగ్గున లేచి పల్యంకంబునఁ గూర్చుండి పరివారంబుతో
నగ్గిరికి వచ్చిచూచి వెఱఁగుపడి తనమంత్రిఁజూచి యీవల్మీకం

బునం దిట్టిర క్తంబు ప్రవహించుటకు హేతువేమనుచు
గోవు కన్నీరునించుటకును గోపఁడు పడియుండుటకు
యోచించి వితర్కించుచుండు సమయంబున. 163

సీ. వనజదళాక్షుఁ డావల్మీకమందుండి
యప్పు డతిరక్తసిక్తాంగుఁ డగుచుఁ
గన్నీరువెడల గద్గదకంఠుఁడై శంఖ
చక్రము ల్చేపట్టి సరగలేచి
యారాజునుంజూచి యనియె నోపాపాత్మ
యీపుట్టలోఁ జేరి యెసఁగుచుండ
నేఁడు నీగోపాలుఁ డీడకు వచ్చి కో
పంబున నాకెప్డు పాలనొసఁగు
తే. నావు నడినెత్తి గొడ్డఁట నవనిఁ బడఁగఁ
జంపెదని మించి పొంచి యాక్షణమ గొట్టఁ
బోయి నాశిరమునఁ గొట్టి భూమిమీఁదఁ
గూలినాఁ డతిపాపంబుఁ గూడినాఁడు. 164

సీ. విను రాజ దిక్కెక్కడను లేక తల్లిదం
డ్రులు లేక నాలుబిడ్డలను లేక
బాంధవులును లేక బహువేదవాఁడనై
పరదేశినై వచ్చి ఫణినగంబు
పైనుండు పుట్టలోపలఁ జేరి యుండఁగఁ
దల్లిచందమగు నీధర్మసురభి
క్షీరంబు లిచ్చి రక్షించుచుండంగ నీ
పశుపాలుఁ డేడ్తెఱఁ బశువుఁ జంప

తే. వచ్చి నను గొట్టి దావను వచ్చినట్టి
పాప మవ్వాఁడు మోయును వాఁడు నీకు
బంటుగావున నీవును వానివలెను
పాప మేర్తెఱఁ బొందుము ప్రాపు చెడఁగ. 165

తే. ఘోమ్ము ధాత్రిఁ బిశాచమై నెమ్మిలేక
శాపమిచ్చిన విని మదిఁ దాపమంది
తామహార్తంబు మూర్ఛిల్లి ధరణిఁ వ్రాలి
లేచి ఖేదంబునొందుచుఁ జూచి యపుడు. 166

వ. లీలామానుషవిగ్రహుం డై నిలిచియున్న హరికి సాష్టాంగ
దండప్రణామంబు లాచరించి ముకుళితకరకమలుండై గద్గద
స్వరంబునఁ గన్నీరువెట్టుకొని యిట్లనియె. 167

చ. కటకట దేవ నే నెఱిఁగి కష్టము నీ కొనరింపలేదు దు
ర్ఘట మగుశాప మిచ్చితివి కష్టమునం బడఁజేసి తీవు నే
నెటువలె నోర్చియుందు జగదీశ్వర నాయెడఁ బ్రేమనుంచి వి
స్ఫుటతర మైనశాప మిఁకఁ బోవు నుపాయము నేయు నెమ్మదిన్.

చ. అని నృపుఁ డార్తుఁ డై పలుక నంబుజనాభుఁడు వానిఁ
జూచి తా, నెనరున నిట్లనెఁ నృపతి నీయెడ నేరము లేనిరీతి
నే, నొనర నెఱుంగకుండ నిటు లూరక శాప మొసంగితిఁ
భువిం, దనరఁగ నాదువాక్య మిఁకఁ దప్పదు గావున నేమి
నేయుదున్. 169

చ. భుజగగిరీంద్రమం దొదిగి పుట్టమఱుంగున డాఁగియున్న నఁ
గజిబిజి చేసి కాలగతి గష్టము నా కొనరించె నందుచే
నిజము నెఱుంగలేక యతినీచుఁడనై సుజనుండవైన నిం
గుజనునిఁగాఁ దలంచి యతిఘోరపుశాపము నీ కొసంగితిన్.

సీ. వసుధ నీశాపంబు వారింపఁగా లేను
విపులవాత్సల్యంబు విడువలేను
గాన నీపైనుండుకరుణ మహాదుఃఖ
కరమయ్యెఁ బైశాచగతిని బొంద
లేక నావలేఁ దగ నీకు దుఃఖము గల్గె
నిరువురకును ఖేద మేకమాయెఁ
గలియుగ మున్నంతకాల మీశాపంబు
ననుభవించుచునుండు మనసుఁబట్టి
తే. సరవి నాకాశరాజను జనవిభుండు
తనకు సుతయైనపద్మావతిని ముదమునఁ
బ్రేమమీరఁగ నాకిచ్చి పెండ్లిసేయు
నపుడు మకుటముగా శీర్షమందు నిలువు. 171

అట్టికిరీటం బెట్టిదనిన నూఱుబారువులు కనకంబుతోఁ దీర్చి వెలలేనిజీవమణులఁ బాఁపించియుండు ప్రతిశుక్రవారంబును దప్పక యమ్మకుటంబు నాఱుగడియలు శిరంబున ధరింతు నపుడు మదీయాత్ములం బానందబాష్పంబులు ధరించు నయ్యాఱుగడియలు నీవు సుఖింపుచుందువుగాక యని యానతిచ్చిన విని చోళరాజు శాపగ్రస్తుండై చనియె. అంత హరి వల్మీకంబునం బ్రవేశించి గొడ్డటంబడినగాయంబున కోపంజాలక బృహస్పతిని మనంబునఁ దలంప నాగురుండు వల్మీకంబుకడకు విచ్చేసినం జూచి దీనవదనుండై హీనస్వరం బుతోఁ దన కందుజరిగినవృత్తాంతం బంతయుఁ జెప్పి హరి వెండియు నిట్లనియె. 172

సీ. ఓ దేవ దేశిక సాదరంబున విను
గాలకర్మంబులు గ్రహగతులును
గూడినందునఁ గోపకుఁడు నడినెత్తిపై
గొప్పగొడ్డంటను గొట్టినాఁడు
నొప్పి మెండైనది దెప్పున నౌషధం
బిప్పుడ భావించి చెప్పు మనఁగ
సురగురుం డది విని శోకాకులస్వాంతుఁ
డగుచు నిట్లనియె మహాత్మ నీకుఁ
తే. గాలమును గర్మమును గ్రహగతులు గలవె
నీమహిమ లన్యు లెఱుఁగరు నీకుఁ దెలియు
నైన మంచిది నన్ను మున్నడిగి తీవు
గానఁ జెప్పెద నొకమందుఁ గమలనాభ. 173

తే. పట్టుగా విను జిల్లేడిప్రత్తినెత్తి
పాలలో నద్ది నడినెత్తి పట్టి గాయ
మం దిడిన నొప్పి శాంతమౌననుచుఁ జెప్పి
హరికిఁ బ్రణమిల్లి సురగురుం డరిగె నంత. 174
సీ. హరి గురుఁ డెఱిఁగించినట్టిమం దాగాయ
మందుఁ బెట్టుచునుండె ననఁగ నవ్వి
శౌనకాదులు విని జాలినొందుచు సూతు
నీక్షించి వెఱగంది యిట్టులనిరి
ఘనరోమహర్షణమునిపుత్ర తింత్రిణీ
భూజవృత్తాంతంబు పుట్టవిధము
మొదలగువృత్తాంతములు చెప్పు మీకథ
విన వేడుకయ్యెడు మనసులందు

తే. లలిని పుట్టించు రక్షించు లయ మొనర్చు
నట్టిసర్వజ్ఞునకు లేనియాపదలును
గలిగె నిదివిన్న మది వెన్నకరణిఁ గఱఁగు
చున్నదని బాగుగాఁజెప్పు సుకృతధనుఁడ. 175

క. అని వా రడుగగ సూతుఁడు
విని యిమ్మెయిఁ బల్కె నాది వెన్నునిచరితల్
ఘన మగుగూఢార్థంబులు
గనుక విశేషముగఁ జెప్పఁగా వశమగునే? 176

వ. అయిన నాకుఁ దోఁచినంతవఱకుఁ జెప్పెద వినుండు. దశరథుండును గౌసల్యయు దేహముక్తు లగుకాలంబున నారామచంద్రునియం దత్యంతమోహంబుంచి చనినకారణంబులఁ బద్మసంభవుండు భావించి ఋణానుబంధానుసారంబుగ రామకృష్ణరూపంబులకుఁ గారణంబు నైనహరికి నిరవుగ నుండుటకై దశరథునితేజంబు తింత్రిణీవృక్షంబుగఁ గౌసల్యాదేవితేజంబు వల్మీకంబుగ వేంకటాద్రియందు నిర్మించె. తత్క్రమంబుగ వసుదేవదేవకులును దేహవిముక్తికాలంబులఁ గృష్ణునియందు వాత్సల్యతకుఁ దింత్రిణీమహీజరూపదశరథునితేజంబున వసుదేవునితేజంబును, గౌసల్యారూపం బగు వల్మీకంబున దేవకీదేవితేజంబు నుంచె. నారామకృష్ణాభిధానకలితుఁ డైనవిష్ణుం డాకాలంబున మాతృగర్భంబునం దున్నశిశువుకరణి పదివేలవత్సరంబు లాపుట్టయందు వసియించియుండెఁ గావున దశరథుండు తింత్రిణీపాదపంబు, కౌసల్యయ వల్మీకంబు, లక్ష్మణుండ శేషపర్వతంబు, అయోధ్యయ తద్భూభరపుణ్యకాననంబు, సరయువ స్వామిపుష్కరిణి, రామ

చంద్రుఁడ వల్మీకవాసియగు శ్రీనివాసుఁడు, తదనంతరంబు వసుదేవుండ తింత్రిణీతరువు, దేవకిదేవియ వల్మీకంబు, బలభద్రుండ పన్నగాచలంబు, మధురానగరంబె వేంకటగిరి, యమునానదియ స్వామిపుష్కరిణి, యాదవులె మృగంబులు, గోపికలె ఖగంబులు, కృష్ణుండె వల్మీకవాసి యగువేంకటేశుండు, మఱియు వైకుంఠంబ నిగమమయం బగుశేషాచలంబు, విరజానదియ సువర్ణముఖరి, నారాయణుండ లీలామానుషవిగ్రహుం డైన శ్రీనివాసుండు, అచ్చట ననేకముక్తబ్రహ్మ లనేకఖగంబులై యనేకముక్తరుద్రులు మృగంబులై సనకసనందనాదులు వనచరులై వర్తించుచుండఁగఁ బరమపురుషుండైన వేంకటేశ్వరుం డందు విచిత్రలీలావినోదంబులఁ గ్రీడించుచుండియుఁ దనకు శరీరబాధగల్గినట్లు మాయగా నటించినాఁ డింతియగాని యమ్మహానుభావున కాబాధ లేదు. మీరలు నెమ్మదిగ వినుండు, ఆస్వామిని దర్శింపవచ్చినవారు సకలసత్కార్యసిద్ధులం బొందుదు రని చెప్పి సూతుండు వెండియు శౌనకాదుల కిట్లనియె. 177

శా. వైకుంఠంబును వీడి శేషగిరిపై వల్మీకగర్భంబులో
శ్రీకాంతుండు వసించి చేసిన మహాచిత్రంబుల న్వింటి రిం
కాకంజాక్షుఁడు మర్త్యుఁడై నరులలో నాటాడె నాచందముల్
మీకుం గొంచె మెఱుంగఁ జేసెదను నెమ్మి న్వీనులం బట్టఁగన్.

మ. వినుఁ డానిర్జరదేశికుండు హరికిన్ వే నొప్పి వారింపఁ జె
ప్పినపాల్లాదియఁ దెచ్చి గాయముపయిం బెట్టన్ హితుం
డొక్కఁడై, నను లేకుండఁగ నేమిసేతు నని శ్రీనారాయణుం

డార్తుఁడై, తనమం దప్పుడు తాన వెచ్చుటకుఁ బ్రాతఁగ
కాలమం దొక్కఁడే. 179

సీ. అరుగునప్పుడు వరాహస్వామి వృషభాసు
రునితోడఁ బోరాడి దునిమివైచి
యవల భూదేవితో నఖిలపర్వతగుహా
సానుశృంగములందు సంచరించి
బహువత్సరములకుఁ బన్నగాద్రిఁ దలంచి
మఱలివచ్చుచు నున్నమార్గమునను
నరునిచందమున శ్రీహరి నిల్చియుండఁగఁ
గని నరుంబోలి రక్కసుఁ డొకండు
తే. క్రచ్చరం జూచి పోరాడ వచ్చినాఁ డ
టంచుఁ గడు నట్టహాసంబు మించిచేసి
దిగ్గజంబులు మూర్ఛిల్ల దృఢముగాను
ఘుర్ఘురారావ మొనరించె ఘోరముగను. 180

క. ఆరభసంబున కులుకుచు
నారాయణుఁ డదిరి చూచి ననపాదలోనఁ
దూఱుకొనంగాఁ గని యా
దారిని గిటిదేవుఁ డరిగ దర్పము మీఱన్. 181

క. ఘోరాకారుం డగుచును
గోరలు గీటించి యంత గొబ్బునఁ బొదలో
దూఱిన ఘోణిం గని యపు
డూరక యొకమూల విష్ణు వొదుకుచు నుండెన్. 182

వ. అట్లుండి కన్నీరు నించుచుండ నతనిదీనదశం జూచి దనుజుండు
గాఁడు దనుజాంతకుం డని తెలిసి నిష్కారణంబుగ నితని

యందుఁ గోపంబుచేసితినని మనంబున వగచి బాష్పపూరిత
లోచనుండై యందుండు లీలామానుషవిగ్రహునిచెంతఁ జేరి
యోడకు మని యిట్లనియె. 183

సీ. వైకుంఠ మెడఁబాసి వచ్చినగతియేమి
సిరి యురంబున లేనిచిత్రమేమి
మానవాకృతి నిందుఁ బూనియుండుటయేమి
తలమీఁద గాయంబు దగులు టేమి
యుడిగినబలముతో నొదుగుచుండు టిదేమి
గన్నులబాష్పముల్ గారు టేమి
నేను వచ్చినయప్డు నిల్చి పల్కక నాకు
లోగిన ట్లడవిలోఁ డాఁగు టేమి
తే. వింతగాఁ దోఁచుచున్న దీవిధము నాకుఁ
దెలుపు నిక్కంబుగా నంచుఁ గలఁతనొంది
యడుగ నణమఱ లేక దీనాస్యుఁ డగుచు
నిట్టెయిం బల్కె నాతని కిట్టు మెఱసి. 184

సీ. విను ఘోణిరూప నావృత్తాంతమంతయు
వైకుంఠమున నుండ శ్రీకలితుఁడయి
యప్పుడా భృగుమౌని యక్కునఁ దన్నె నా
యందు నుండినలక్ష్మి యపుడు చూచి
పరపురుషుఁ డేతెంచి పాదంబునం దన్ని
నట్టియెడంబాసి యరుగుదాన
నంచుఁ గొల్లాపురం బందుఁ జేరినయంత
వైరాగ్యమును బొంది వచ్చి తిటకుఁ

తే. గాన సంసారసౌఖ్యంబు నేను రోసి
నీకడకు వచ్చి విపులవల్మీకమునను
గుదిరియుండఁగ నందొక్క గొల్లవాఁడు
గొడ్డటం గొట్టె నడినెత్తి యెడ్డెఁ డగుచు. 185

క. ఆగాయము మానెడుకొఱ
కాగిప్పతి మందు చెప్పె నయ్యౌషధమే
యీగిరిమీఁద న్వెదకుచు
రాఁగా నినుగంటి నోవరాహవరేణ్యా. 186

క. తలగాయము నొప్పింపఁగ
బలహీనుఁడ నైతిఁ గాన బలవంతుఁడవై
చెలఁగుచు నాపై రొప్పిన
నలుకుచుఁ బొదఁజేరి తిట్టు లనుపమధైర్యా 187

ఆ. కరుణమీఱ నీవు గలసి మాటాడితి
వందువలన డెందమందుఁ బూర్వ
మున్న చింత దీరె నన్ను నీవానిగఁ
జెంత నుంచుకొనుము శ్రీవరాహ. 188

క. ఆవైకుంఠము నొల్లక
నీవే నేనంచుఁ జాల నెన రెనయఁగ నీ
తావున నుండితి నెక్కడ
నీవుంటివి చూడ లేదు నే నిం దనుచున్. 189

సీ. హరి యపు డడుగఁగ నావరాహస్వామి
పలికె నిట్లంచు నీపర్వతమున
వృషభాసురుఁడు చేరి విడివడి శ్యామాక
ధాన్య మెందుండినఁ దా గ్రహించి

గొనివోవు గనుక యాక్రూరాసురునితోడ
బహుదినంబుల ఘోరభండనంబు
నేయుచునుంటి నమ్మాయరాక్షసుఁ డెందుఁ
జిక్కకయుండియుఁ జిక్కెఁ గనుక
తే. వాని శిక్షించి యిచటికి వచ్చి నిన్ను
నేను జూచితి నన్నును నీవు నిపుడు
గాంచితివి నాకు నీవును మంచినేస్త
కుండ వైతివి సంతస మొందివాఁడ. 190

ఆ. అని వరాహదేవుఁ డప్పుడు వల్కఁగ
విని ముదంబునొంది విష్ణుఁ డనియె
నవనిఁ గలియుగాంత మందాక తగినచో
టొండు చూపు నాకు నుండుటకును. 191

సీ. అని చక్రి వల్కఁగ విని వరాహస్వామి
యిదియేమి యని సంశయించి పల్కె
హరి విను పేదల నాశ పెట్టఁగరాదు
చెంత నెప్పుడు బలవంతులకును
దావీయరా దైన ద్రవ్య మిచ్చితివేని
కొలచి నూఱడుగులు కుతల మిచట
నీకిత్తు ననిపల్క నాకంజలోచనుం
డిట లక్ష్మి నాతోడ నెనసియున్న
తే. ధనము నీకిత్తు నిపుడు శ్రీతరుణి యలిగి
తాను గొల్లాపురముసేరెఁ గాన ధరణిఁ
గొనుటకై గూక లెవరినేఁ గొలిచి లెత్తు
ప్రబల యాచించితిని యిందు బ్రదుకవలయు. 192

చ. అని హరి వల్కఁగా వినిమహామహుఁ డైనవరాహదేవుఁ డి
ట్లనియె నిదేటిమాట లిపు డర్థ మొసంగక భూమి నియ్యన
న్నను గిటిఁ జూచి మాధవుఁడు నవ్వుచు నిట్లనియెన్ ధరాతలం
బొనరఁగ నీయధీన మగుచున్నది కొంచెము నాకొసంగుమా..

సీ. ఎంత నీవిచ్చిన యంతలో నేనుండి
జీవనోపాయంబు సేయుకొఱకు
నరునిచందంబున నటియించి యిచటికి
నరల రావించి నీ కిరవుగాను
పంచామృతస్నాన మంచితంబుగ దిన
దినము సేయింతు నీతీర్థమందు
మునిఁగి ముందుగ నీకు మ్రొక్కికొన్కలొనంగుఁ
డని నియమింతు నాజనుల కెల్ల

తే. నదియుఁగాక దినంబన్న మరల మొదట
నిచ్చి యావల భుజియింతు నెలమి వినుము
నిజ మిది యనంగ నాకిటి నెయ్యమారఁ
గొలిచి యిచ్చెను మూఁడడుగులధరిత్రి. 194

వ. ఇవ్విధంబున వరాహస్వామి హరి నాదరించి శేషాద్రియందు నిలిచె నప్పుడ యిద్దఱశీర్షంబుల దేవతలు పుష్పవృష్టి గురియించిరి, వరాహదేవుండు తనచెంతఁ బరిచారిక యైయుండు వకుళమాలిక నాహరిచెంత నుండె, నావకుళమాలిక హరికి శ్యామాకాన్నంబును దేనెయున్ భోజనంబు సేయించుచు గొడ్డఁటిగాయంబునకు నౌషధం బిడుచు నుండఁగ, మున్ను ధేనువత్సరూపంబులు ధరించినబ్రహ్మరుద్రు లంతర్ధానంబు నొందిరి, అంత శ్రీనివాసుం డాపర్వతంబున సకలవినోదంబు

సేయుచు రాక్షసులకు భయప్రదుండై భక్తులకు ముక్తి ప్రదుండై గొడ్డటిగాయంబు మాయంబై పోవ దివ్యసుందర లీలామానుషవిగ్రహుం డై తల్లి చెంత ముద్దులు చూపు చుండునట్లు వకుళమాలికయొద్ద నటింపుచుండె ననిన ముని లిట్లనిరి. 195

సీ. వకుళమాలిక యెవ్వ రకళంకచరిత మా
కెఱిఁగింపు మన సూతుఁ డిట్టులనియె
శ్రీయశోదాదేవి చిన్నికృష్ణునియందుఁ
బుత్రవాత్సల్యంబు పొసఁగనుంచి
కాలగతిని నొందఁగా హేమగర్భుండు
గని యట్లచేయుట గాదటంచు
వకుళమాలిక యన వసుధను బుట్టించి
భూవరాహస్వామిపొంత నిలిపె
తే. నప్పు డాకిటిదేవుఁ డాయతివఁ జూచి
చక్రధరుఁ జెంతనుండఁగఁ జెప్ప నాపె
జననిపలెఁ గాచుచుండె సుస్వాంత యగుచు
నాయశోద మఱొక్కతె యనఁగఁబడదు. 196

ఉ. శ్రీరమణీవిభుం డవల శేషగిరీంద్రముమీఁద నిల్చి వి
స్తారముగా వినోదములు సల్పుచునుండి యశోవిహారుఁడై
గారవమొప్పు నొక్కనృపకన్యను బెండిలియాడె మెచ్చి స
చ్చారిత నెల్లనిర్జరులు సంతసమందఁగ వింటిరే యనన్. 197

సీ. విని మౌను లాసూతుఁ గనుఁగొని విస్మయం
బంది యిట్లనిరి యాహరికిఁ దగిన



కన్యకామణియందుఁ గన్గె దానికిఁ జూడ
దలిదండ్రు లన్నను దమ్ము లెవరు
సావధానుండవై యావిధంబంతయు
విశదీకరించుము వినఁగవలయు
నడుగఁగ సూతుఁ డిట్లనియె నిర్వ్యదియెన్ని
ది ద్వాపరాంతానఁ దెలియ నవని
తే. వెలయు కలియుగమం దొప్పు విక్రమార్క
ముఖ్యరాజులు జనియించి ముదముమీఱ
భూమిఁ జక్కఁగఁ బాలించి పోయి స్వర్గ
లోకమునఁ జేరి రిపుడు భూలోకమణులు. 198

వ. తదనంతరంబు చంద్రకులపాండవదౌహిత్రవంశంబున సువీరుం
డనురా జుదయించి భూమి నేలుచుండె నాతనికి సుధర్ముం
డనుపుత్త్రుం డుదయించె, మాధవుండనువానిచరిత్ర మిది
పఱక వినియుండువారలుగదా! యాతఁడ, యాసుధర్మునకు
జ్యేష్ఠపుత్త్రుఁడై పుట్టి యాకాశరా జనుపేరం బ్రసిద్ధుఁ
డైయుం ఆమాధవాఖ్యునిభార్యయగు చంద్రరేఖ పతి
స్మరణంబు సేయుచు దేహంబు చాలించుటం జేసి యామె
యొక రాజింట ధరణీదేవినామంబున జనించి యుండ నాధరణీ
దేవి యాసుధర్ముండు తనకుమారుం డగునాకాశరాజు కిచ్చి
వివాహం బొనరించిరని వెండియు నిట్లనియె. 199

సీ. తలఁపఁగ వినుఁ డాసుధర్మాధిపుఁ డొకనాఁ
డడవిలోపల వేట యాడి బడలి
యచ్చట నొకపంకజాకరంబున కేగి
సుకుమార నాగకన్యకను జూచి

మోహించి పలువిధముల దానిఁ బ్రార్థింప
నది యొడంబడక యిట్లనియె రాజ!
నీవు మానవుఁడవు నే నాగకన్యక
గాన దాంపత్య మేకరణి నమరు

తే. పొమ్ము నీత్రోవ ననిపల్కి పోక దాని
వీడఁజాలక మఱిమఱి వెంట నంటి
చాల వేఁడఁగ నాకన్నె జాలినొంది
యవలఁ బోలేక నీ వెవ్వఁ డనఁగ నృపతి. 200

క. తనకులమును గోత్రము పే
రును దాఁ బ్రభువగుటయును నిరూఢిగఁ దెలుపన్
విని యానాగకులాంగన
మనుజేశుని మోముఁజూచి మఱి యిట్లనియెన్. 201

సీ. భూనాథ ననునీవు పొందిన పుత్త్రకుం
డురగలోకంబున గరిమ నెసఁగు
తనతండ్రి యెవఁడని యనఁగ నేనప్పు డే
మని చెప్పనగు విను జనవరేణ్య
అనఁగ సుధర్ముఁ డిట్లనియె నీకు సుతుండు
గల్గి నన్నడిగినకాలమునను
నా పేరు చెప్పి నిర్ణయముగ నంపుము
తగ నర్ధరాజ్యంబు తడయక గొను

తే. మనుచుఁ దనముద్దుటుంగరం బానవాలు
గా ముదంబున నానాగకన్య కిచ్చి
డెంద మారంగ నాకన్యయందుఁ జొక్కి
నవల నాకన్య యేగెఁ దా నలరవచ్చె. 202

తే. పరఁగ నా నాగకన్య గర్భంబుఁ దాల్చి
నాగలోకంబునకుఁ బోవ భోగినాథుఁ
డావిధంబు నెఱింగి యేమనక కార
ణంబు నూహించి మది సంతసంబు నొందె. 203

క. ఆకన్యక కందఱు దడఁ
జేకొని రక్షించుచుండ శ్రీకరుఁ డనఁగాఁ
బ్రాకటశుభలగ్నమున సు
ధాకరునింబోలెఁ గల్గెఁ దనయుం డెలమిన్. 204

తే. అంతకంతకు నభివృద్ధి యగుచు బాలుఁ
డమ్మ నాతండ్రి యెవ్వఁడటంచు నడుగ
నాగకన్యక వినుచును నగుచుఁ దనయు
నెత్తి ముద్దాడి లాలించి యిట్టు లనియె. 205

తే. తనయ నీజనకుండు సుధర్మరాజు
ధారుణీతలమును బ్రసిద్ధంబుగాను
బాలనము సేయు నటకు నిర్భయుఁడ వగుచుఁ
బోవలసియున్న సుఖముగఁ బొమ్ము తనయ. 206

ఉ. అచ్చట నర్ధరాజ్యము మహాముదమందఁగ నాఘనుండు నీ
కిచ్చు సుధర్మపద్ధతిగ నేలుము నన్నుఁ దలంచుచుండు మిం
కిచ్చట కార్యమేమి యట కేగి సుఖంబుగ నుండుమంచుఁ దా
మచ్చికమీరఁ జెప్పి చనుమార్గము తేటఁగఁజూపెఁ బ్రీతితోన్

వ. అప్పు డబ్బాలుండు మాతామహుం డగునాగరాజేంద్రునకు
నమస్కరించి దీవనలంది తల్లికి నమస్కరించి దీవనలంది పాతాళ
బిలమార్గంబున నిర్గమించి వచ్చుచుండఁ దల్లియు వెంటనంటి
భూమిపై కిం దెచ్చి విడిచి తనభర్త యొసంగినయుంగరంబక్క

మాఁరున కిచ్చి, హరిభక్తుఁడ వై చక్రవర్తివై సత్యవ్రతుండ వై యుండుమని చెప్పి ముద్దిడి నాగలోకంబునకుం జనియె. నబ్బాలకుండు నారాయణవనపురంబుం జేరి సుధర్మరాజు సమీపంబున కేగి మ్రొక్కఁగ నయ్యర్భక శ్రేష్ఠుని జూచి నృపాలుం డిట్లనియె. 208

సీ. ముద్దుబాలక నాకు మ్రొక్కి నిల్చితివి నీ
వెవఁడవు తలిదండ్రు లెవరు చెపుమ
యనఁగ నాడింభకుం డళుకింత లేకుండ
నరనాథ నాతల్లి నాగకన్య
తండ్రి సుధర్మభూధవుఁడు శ్రీకీర్తి వి
ఖ్యాతుఁ డటంచు నుంగర మొసంగ
నాముద్రికను జూచి యతఁడు మంత్రిపురోహి
తాత్మబంధుజనమిత్రాదులకును

తే. నందనుని జూపి మును దాను నాగకన్యఁ
గలసి యుంగర మిచ్చినకారణంబు
పరఁగఁ జెప్పి కుమారుని బట్టి తొడల
మీఁదఁ గూర్చుండ నిడుకొని మెచ్చికొనుచు. 209

వ. తొండమానుండని నామంబిడి యుపనయనవివాహాదులం జేసె నంత నాసుధర్మరాజేంద్రుండు పుత్త్రు లగునా కాశరాజుకుఁ బట్టంబుగట్టి నాగకన్యకయందుఁగనిన తొండమానుని యువ రాజుం జేసె నంతకొంత కాలంబునకు నాసుధర్ముండు దివంబునకు నేగె. కుమారు లాతండ్రి మరణంబునకు దుఃఖసాగరంబున నోలలాడుచుఁ గ్రియలు నిర్వర్తించి యిర్వురేకోదరులచందం బున నత్యంతమైత్రి గలవారై నారాయణనామపారాయణ

యుక్తులై యుండి రందు నాకాశరాజేంద్రునకు సంతానంబు
లేమింజేసి చింతించుచు బృహస్పతికి నమస్కరించి యిట్లనియె.

సీ. సద్గురువర నాకు సంతానభాగ్యంబు
గలుగకుండుట కేమికారణంబు
చెప్ప వేఁడెద టంచు నొప్పుగఁ గొనియాడ
నతఁ డిట్టులనియె నాక్షితిధవునకు
నీవు పాపము లెన్ని గావించియుండిన
పరిహారమగుట కుపాయ మొండు
చెప్పెద నెట్లన్నఁ జెలఁగి భక్తిని బుత్ర
కామేష్టి గావింపు క్రమము మెఱసి
తే. సుతులు పుట్టెదరని ధర్మహితము దనరఁ
బల్కఁగా విని మ్రొక్కి భూపాలుఁ డచటఁ
జెలఁగి యజ్ఞప్రయత్నము ల్జేసి కనక
హాలమున న్భూమి దున్నించె నతిముదమున. 211

చ. అటు ధర నప్డు దున్నఁగ సహస్రదళంబులుగల్గి యొప్పువి
స్ఫుటతరపద్మమందుఁ బొడసూపినఁ జూచి నృపాలకుండు నేఁ
డిటువలె నబ్జ మీధరణి నెట్లు జనించె నటంచుఁ జూడఁ ద
త్పుటుతరకంజమధ్యమున బాలిక గన్పడె నద్భుతంబుగన్. 212

ఉ. అప్పుడు దానిఁ జూచి నృపుఁ డార్యులనెల్లరఁ బిల్చి భక్తిమై
నొప్పుగఁ బద్మమధ్యమున నుండెడుకన్యను మెచ్చి వారికిం
దప్పక చూపుచుండఁగ ముదంబున నం దశరీరి యిట్లనెన్
మెప్పుగ దీని బెంపు మిఁక మేలు ఘటించును నీకు భూవరా

చ. అని యశరీరి పల్కఁ గని యచ్చెరువంది నృపాలకుండు మె
ల్లనఁ గమలస్థకన్యకను లాలనఁ జేయుచు గారవించుచున్

జని తనమందిరంబునకు సంతస మారఁగఁ బోయి భార్యచే
నొనరఁగ నిచ్చి చెప్పి బహుళోత్సవము ల్నడిపించి యిట్లనెన్

తే. విను మయోనిజ యైనట్టితనయ నపుడు
నీకు దేవుఁడు దయనిచ్చె నెమ్మి నెగడ
బాగుగం బోషణముసేయు పడఁతి నీవు
పుత్త్రచింత యిఁకేలపో భూతలమున. 215

క. తద్దయు నాతలిదండ్రులు
ముద్దారఁగఁ బెంచుచున్న మురిపెము దనరన్
ముద్దులుసూపుచు జిలిబిలి
సుద్దులు చెప్పుచును వేడ్కఁ జూపుచునుండెన్. 216

సీ. ఆకన్య తమయింటి కరుదుగ వచ్చిన
ఘనలక్షణమున నాకాశరాజు
భార్య గర్భము దాల్చెఁ బరమముదంబున
నైదవనెలను శుభావహముగ
సీమంతమారాజు సేయించె నటుమీఁదఁ
బొలుపొంద నవమాసములు నెసంగె
దశమమాసంబునఁ దరణి కన్యారాశి
యందుఁ బ్రవేశించినపుడు శుక్ల

తే. పక్షదశమియు రోహిణి భార్గవాస
రంబు సాయంసమయమున రాజుగారి
కెలమి పుత్త్రుండు పుట్టె భూతలమునందు
జనులు వొగడంగ నానాఁడు సౌఖ్యముగను. 217

వ. అప్పు డారాజేంద్రుఁడు సంతోషమగ్నుండై స్నానం బాచ
రించి బ్రాహ్మణులకు నవధాన్యాదులు దానంబు లొసంగి నిజ

గురుపూజచేసి సుతునకు వసుధానుం డని నామకరణం
బొనర్చి సుతకుఁ బద్మావతి యని పేరిడి యందఱకు మృష్టా
న్నంబు పెట్టించి పుత్త్రీపుత్త్రకుల నత్యంతప్రియంబునఁ బెంచు
చుండఁగ దినదినప్రవృద్ధమానులై క్షీరసాగరాజమందిర
మధ్యంబునఁ లక్ష్మియుఁ జంద్రు లుండినయట్ల రాజుగారి
సుందరమందిరంబునఁ బ్రకాశించుచుండి రంత నారాజు
కొన్నాళ్ల కయ్యిద్దఱకు విద్యాభ్యాసం బొనరించి యనంతరము
పుత్త్రునకు నుపనయనంబుచేసి పద్మావతికిం దగినవరుని వెద
కుచు గురువుకు నమస్కరించి యిట్లనియె. 218

సీ. పుణ్యాత్మ గురుచంద్ర పుత్త్రకామేష్టి మీ
యనుమతిఁ జేసెద మనుచు నేను
భూమి దున్నింపఁగ భూమియం దొకపద్మ
ము లభించె నందున లలిత మెఱుపు
బాలిక దొరకఁగఁ బద్మావతీ యని
పేరు శాస్త్రమురీతిఁ బెట్టి యిపుడు
పెంచుచున్నాము తా మంచితగుణవర్య
నాకన్యకకుఁ దగినట్టివరుని
తే. గని వివాహంబు సేయంగ మనమునందు
నెంచియున్నాఁడ నెందైన నెఱిఁగియున్నఁ
జెప్పుఁ డన నాగురుండు నీకొప్పుగాను
దగినయల్లుఁడ వచ్చు సిద్ధం బటంచు. 219

మ. అని యాదేశికుఁ డానతిచ్చి చనె నం దారాజు పద్మావతిం
గనిసంతోషనిమగ్నుఁడై మురియుచుం గారాబుగాఁబల్కుచు

ఘనదివ్యాంబరభూషణావళులు శృంగారించి ముద్దిచ్చి తాఁ
దనయుఁ సూనుని జూచి చూచి మదిలో ధన్యుండ నేనైతిగా

వ. అని యానందించుచు నుండె. 221

సీ. అపుడు పద్మావతి నానందముగఁ బెండ్లి
యాడెద నని వేంకటాద్రివిభుఁడు
భావించుచుండఁగఁ బద్మావతికి నవ
యౌవనకాలంబు నవతరించె
నంతలోపలన వసంతకాలము వచ్చె
శృంగారములు లలిఁ జిగురులెత్తెఁ
గోరకంబులతోడఁ గుసుమము ల్వికసించెఁ
దగిన * శలాటువుల్దనరె మించి
తే. యంతకంతకు ఫలియింప నెచ్చు టచట
గుములుగాఁ గూడి కోయిల ల్గూయసాఁగె
నతిముదంబుగ నళులు ఝంకృతు లొనర్చెఁ
గలికి చిలుకలు కలరవంబులను మించె. 222

సీ. చిగురుటాకులు మెక్కి చెలరేఁగుపికములు
మేలు పూఁదేనియ ల్గ్రోలు నళులు
పరిపక్వఫలములఁ గొఱుకుశారిక లబ్జ
నాళము ల్మెక్కు మరాళములును
సందడింపఁగ సదానందకరంబు లై
తనరారు శృంగారవనము లన్ని
మెఱయఁ బద్మావతి మేడపైనుండి యా
సుమవనంబుల నెల్లఁ జూచి చూచి

* శలాటువు = పచ్చికాయ.

తే. వనవిహారము తాఁ జేయవలయునంచుఁ
జెలులతో ముచ్చటాడి మచ్చికలు చేసి
మేడ దిగివచ్చి తల్లిసమీపమందుఁ
జేరి యిట్లని పల్కె నాచిగురుఁబోఁడి. 223

తే. జనని శృంగారవనము విస్మయముగాను
గనకసౌధంబుమీఁదికిఁ గానుపించెఁ
గానఁ జెలులును నేను నక్కడికిఁ బోయి
తెచ్చెదము నీకుఁ బుష్పము లెచ్చుగాను. 224

చ. అన విని తల్లి యిట్లనియె నమ్మ సుమంబుల కీవు వోయినం
గని జను లెల్ల నవ్వెదరు గాన వనంబున కేను నిన్నుఁ బం
పను జెలికత్తెల న్ననుపు భాసురపుష్పము లింటి కిప్పుడే
ఘనముగఁ దెచ్చియిచ్చెదరు గావునఁ బోకుము బిడ్డ యంచనన్.

క. రంతులు సేయుచు నప్పుడు
గంతు లిడుచు నన్న మెంచకయ పానుపుపైఁ
జింతించుచుఁ బవళింపఁగ
నంతటఁ దనసుతను బిలిచి యాదర మొప్పన్. 226

వ. అక్కుం జేర్చి మందస్మితసుందరవదనారవింద యగుచు బుజ్జ
గించి యి ట్లనియె. 227

సీ. వనమున కీవు వోవల దన నలిగితి
నైన మంచిది లెమ్మ యనుచుఁ జెప్పి
చెలులను బ్రాహ్మణస్త్రీలను బిలిపించి
సుతతోడ వారల జతగఁ జేర్చి
తినుపదార్థంబులఁ గొని చెలికత్తెల
చే నిచ్చి పల్లకిఁ జేర్చి యపుడు

పంపఁగఁ జెలులతోఁ బరమముదంబున
మాట లాడుచు నట్టి దోఁట కరిగి
తే. రమ్యతరమగు కమలాకరంబుచెంతఁ
నందలము డిగ్గి లేచి యందందుఁ దిరిగి
విరులు గోసెద నని చాల వేడ్కనొంది
వనవిహారము సేసె నెమ్మనము మెఱయ. 228

సీ. చెలఁగి పువ్వులఁ గోసి చెలులపైఁ బడవేసి
కిలకిల నవ్వు నాకీరవాణి
మధురఫలంబులు మాటిమాటికిఁ గోసి
చెలుల కందిచ్చు నాచిగురుఁబోఁడి
లాలించి బెలించి నీలకంఠములతో
మేలంబు లాడు నానీలవేణి
రాయంచగతివలె నాయెడ నటియించి
సారెకు సోలు నాజలజవదన
తే. కోరి కోవెలలట్లు తాఁ గూజితంబు
చేసి చొక్కుచుఁ బలుమాఱు చిలుకగముల
సరణిఁ బల్కుచు భృంగినిస్వనమురీతి
గాన మొనరించు సొంపుగఁ బూని యచట. 229

క. మొల్లలు పొన్నలు వొగడలు
మల్లెలు సంపెంగవిరులు మందారములన్
గొల్లగఁ గరములఁ గోసి మ
ఉల్లాసము మీఱఁ బుడమి నొక్కెడఁ బెట్టున్. 230

క. ఒయ్యారంబున నడుచుచు
బుయ్యారంబుగ నెసంగుబోదరింటను డా

నుయ్యేల లూఁగును జెలులను
నెయ్యంబుగఁ బిలిచి యందు నెమ్మది తనరన్. 231

క. వింతఁగ మోదుగపూల వ
సంతము చేయించి చెలులు సంతస మందన్
దంతపుఁజిమ్మన గ్రోవులఁ
బంతంబులఁ జిమ్మి చిమ్మి పకపక నవ్వన్. 232

క. తెప్పున నేలను రాలిన
పుప్పొడి చేనంది మించి పొలఁతులపై మే
లొప్పఁగఁ జల్లుచు నుద్దులు
చెప్పుచుఁ గమలాకరంబు చేరుచు వేడ్కన్. 233

తే. చెలఁగుచును విప్రవనితల చెలులతోడ
వేఁడుకలు మీఱఁగా జలక్రీడఁ గొంత
తడవు సల్పుచుఁ దీరంబుఁ గడకఁ జేరఁ
దడిసిన శరీరమెల్లను దడయ కపుడు. 234

సీ. తరుణికి మృదులవస్త్రంబుతోఁ దడి యొత్తి
పట్టుపావడ మొలఁ గట్టె నొకతె
చలువగు వలిపెపుసరిగదువ్వలువ నా
పట్టుపావడమీఁదఁ గట్టె నొకతె
మొలనూలు నొడ్డాణమును దనుమధ్యము
నం దుంచె నొకతె మఱందముగను
జిలిబిలితళుకొత్తు చెంగావిఱవికను
బొందుగ నమరించెఁ బొలఁతి యొకతె

తే. భాసురం బగు నూతనాభరణములను
బొసఁగ నంగాంగములయందుఁ బొందుగాను

బెట్టె నొక్కతె మఱి పూలఁ జుట్టె నొకతె
నెమ్మొగంబును వలువచేఁ జెమ్మఁ దుడిచి. 235

సీ. తిలకంబు నిడె యొక్క ర్తు లలిఁ గన్నులకు నొక ర్తు
గాటుక నీటుగఁ గ్రాలఁ దీర్చె
పరిమళగంధ మాబాలికామణి మేన
నలరంగఁ జల్లఁగ నలఁదె నొకతె
చల్లనిగాడ్పులు మెల్లఁగ నొడలపై
నొలయంగ విసరెఁ బూవులను నొకతె
నెమ్మోము గనుఁగొన నమ్ముద్దియకుఁ బట్టె
నిలువుటద్దము దెచ్చి పొలఁతి యొకతె

తే. రాజనందన కిమ్మాడ్కిఁ బ్రమద మారఁ
జెలులు సేయంగ బ్రాహ్మణస్త్రీల కెల్లఁ
బసుపు కుంకుమ విరిసవ ల్ఫలము లలరఁ
గన్యకామణి యొసఁగె సద్వినత మ్రొక్కి. 236

వ. అప్పు డవ్విప్రాంగనాశిరోమణు లాపద్మావతిని దీవించి రంతఁ దెచ్చిన భక్ష్యభోజ్యంబు లచ్చోటఁ గుడిచి చెలులు రచించిన పూఁబొన్నునఁ గూర్చుండఁ జేసి సుగంధోపేత మగువిడియంబు లిప్పించి తాను విడియంబు సేయుచున్న సమయంబున. 237

పద్మావతితో నారదుండు సంభాషించుట.

క. ఆవనమునకుం జయ్యన
దేవమునీంద్రుండు వచ్చెఁ దిలకించి చెలుల్
భావించి యీతఁ డెవఁడని
యావరముని నడుగ నాతఁ డనెఁ గని యెలమిన్. 238

క. పరుఁడను గా దీనృపతికి
గురుఁడను నన లేచి భక్తి గూర్మి యెసంగన్
సరగునఁ బద్మావతి *యా
స్తరణము మునికిచ్చి మ్రొక్కెఁ దాపసుఁ డంతన్. 239

తే. వనజలోచన నీకు వివాహసిద్ధి
వేగ యగుఁగాత మంచు దీవించె రాజ
కన్యకామణి సంతోషకలిత యగుచు
నొదిగి సిగ్గున మాటాడకున్నఁ జూచి. 240

సీ. అమ్ముని పల్కె నోయమ్మ నామీఁద నీ
కలుమలు వలదు రమ్మనుచుఁ బిలిచి
కూర్చుండ నియమించి కూర్మి మాటలను హ
స్తంబు చూపు మనంగ నంబుజాస్య
పల్కె నిట్లని మునిప్రవర నాతండ్రివి
యనుచు హస్తంబు నాతనికి సాఁచి
చూపఁగఁ జిలునవ్వుఁ జూపు చాతాపసుం
డనియె నీహస్తాబ్జమును గనంగ
తే. శ్రీకరాంచితమైనట్టి రేఖ లలరి
యమ్మహాలక్ష్మిలక్షణా లన్ని చేతి
యందుఁ గన్పట్టుచున్నవి దైన నవియు
నమ్మరో విను చెప్పెద నవియు నిపుడు. 241

తే. స్వస్తికము పద్మమును ఛత్రచామరాలు
యవకులిశమత్స్యశంఖరేఖాదిలాంఛ

* ఆస్తరణము=ఆసనము - ఎఱ్ఱకంబళి.

నంబు లలరారుచున్నవి యఖిలశుభము
లొనరు నివి చేతఁ గలకాల మూర్వి నీకు. 242

తే. మఱియు నిట్లనెఁ గిసలయమార్దవంబు
గలిగియుండెడు నీవామకరమునందుఁ
గాంతి నొప్పుచు నిత్యమాంగళ్యరేఖ
వఱలుచున్నది చూడు భూవరకుమారి. 243

క. ఈరేఖ లుండుబలమున
నారాయణుఁ డెలమి నీకు నాథుం డగు నీ
కోరిక ఫలియించునుపో
శ్రీరామామణిగ నుండు చెలఁగుచు నమ్మా. 244

సీ. అనుచుఁ బద్మావతి కమ్ముని సర్వాంగ
సౌందర్యకలితలక్షణములన్ని
బాగుగఁజెప్పి తా నేగె నాదినమున
నంబుజాక్షుఁడు వేంకటాద్రిమీఁద
నుదయకాలంబునం దొనరంగ భుజియించి
కడువేడ్కఁ బసిఁడిచల్లడము దొడిగి
కొనలందు ముత్యాలకుచ్చు లొప్పినదట్టి
తనరంగ తననడుమున బిగించి

తే. కురులు సవరించి విరులతోఁ గొండెఁ గట్టి
మేలు చందురుగావిరుమాలఁ జుట్టి
సరిగెజిగి వల్వ మేన మెచ్చంగఁ దాల్చి
మెఱయుభూషలు నొడలపై మెఱయఁజేసి. 245

క. తిరుమణిఁ దిరుచూర్ణము శ్రీ
కరము లలాటమునఁ దీర్చి గంద మలఁది బం

గరుజన్నిదంబు భుజమునఁ
గరము ప్రకాశింపఁజేసి కమలాక్షుఁ డొగిన్. 246

తే. కనకమయ మగుసున్న పుఁగాయ వక్క
లాకులును వస్త్రమున నొబ గలరఁ గట్టి
కక్షమందుంచి కోదండకాండములను
బరఁగఁ జేఁబట్టె నప్పుడు హరి ముదమున. 247

శ్రీనివాసుఁడు వేఁటాడుట.

సీ. దైవయోగంబునం దనసమీపమునకు
నురుతరజవనాశ్వ మొకటి వచ్చి
నిలువఁగ దానిపై నీరజాక్షుం డెక్కి
చని వనగిరులందు సంచరించి
సారంగభల్లూక చమరీశరభసింహ
శార్దూలముఖమృగసంఘములను
వేఁటాడుచుండె నావేళ నందొకమద
కరి చక్రి నెదిరించె గహనమందు

తే. దాని సమయింప సమకట్టి దానివెంట
నరుగ నది పర్వతము డిగి యరిగెఁ జక్రి
తత్తిమె వెంబడి యోజనార్థంబు వోయి
చేరెఁ బద్మావతిగలశృంగారవనము. 248

తే. చెంగటం జేరి ఘీంకృతిఁ జేయ గజముఁ
జూచి పద్మావతీదేవి చొప్పరయుచుఁ
జెట్లచాటునఁ జేరఁగఁ జెలులు నట్ల
చేరి యిట్లని పల్కిరి చిత్రపడుచు. 249

సీ. అతివలారా చూడుఁ డబ్బురంబుగ నాము
ఱేనుంగు వచ్చె నిఁకెట్టులమ్మ
కన్నులు దెఱచి చక్కఁగ దానిఁ జూడక
తలకు నేలకు వంచి తలఁగ మేలు
నడుమఁ బద్మావతి నిడికొని చుట్టును
మన ముండఁబోదము మంచిదమ్మ
మనమెట్టులైనఁ బద్మావతిం దనరార
రక్షింతమమ్మ ధైర్యంబు మించి
తే. యనుచు నొండొరు లిమ్మెయి నంచునుండ
ఘనతరం బైనగుఱ్ఱంబు గానవచ్చె
దానిపై నొక్కపుర్షుండు దఱుముకొనుచు
వచ్చుచున్నాఁడు గూర్చుని వనితలార. 250

వ. అట్లు చెప్పుకొనుచుండుసమయంబున నగ్గజంబు తన్నుఁ దఱు
ముచు వెంబడివచ్చుహరిం జూచి భీతిల్లి తనకరంబు పైకెత్తి
దండంబు వెట్టినం జూచి హరి కరుణించి తఱుమక నిలిచె నంత.

క. హరి తన్నుఁ గరుణ విడువఁగఁ
గరివరుఁ డటువోయి పెద్దకాననమందుం
జొరఁబడె నావల నచ్చట
సరసిజనాభుండు పొదలచాటున డాఁగెన్. 252

వ. అంత నందున్న కాంత లాదంతిని తురంగంబును బుర్షుని గానక
వెఱఁగంది యిట్లనికొనిరి. 253

సీ. అమ్మలారా చూడుఁ డచ్చట గజతురం
గంబులఁ బురుషుని గాన మిపుడు

మాయగ నున్నది మహిమ యేమనువారు
నది వట్టి కల్లహో యనెడువారు
భ్రాంతిఁ బొందితిమంచుఁ బకపక నగువారు
కలఁగంటిమో యని పలుకువారు
పొలసి నిద్దురవోక గలగా దనెడివారు
నహహా యేమిచిత్ర మనెడువారు
తే. నంద అన్ని విధంబుల ననఁగ నవ్వి
చెలులఁ గన్గొని డగ్గఱఁ జేరఁ బిలిచి
యనియెఁ బద్మావతీదేవి మనకదేల
యెట్లువోయినఁ బోనిండు నిపుడు మనము. 254

వ. అని తొల్లియెడం గూర్చుండి చదరంగము సంతసంబార
నాడుచుండె. 255

సీ. శృంగారవని నిట్లు చెలులతోఁ జదరంగ
మాడుపద్మావతి యంద మలరఁ
గాంచి తద్రూపరేఖావిలాసము లన్ని
పాదలమాటునఁ జూచి పొసఁగఁ జక్ర
తనమదిలోఁ దాన తలఁచె నిట్టుల నహో!
యీ రాజకన్యక యెలమిప్రాయ
మును జూడ రతికన్న ముదిత భారతికన్న
వరగౌరికన్న శ్రీవనితకన్న
తే. నతిశయంబైన యందంబు నలరియున్న
దెట్లు ననుఁ జూచి మోహించు నిపుడటంచుఁ
దలఁచి యాయింతినెమ్మోముదళుకుఁ జూచి
యిట్లు వర్ణించె ముదమూర నెట్లు ననక. 256

సీ. పాదజంఘోరువు ల్పల్లవకాహళ
కరికరంబుల భంగపఱచి మించుఁ
గటిమధ్యకుచయుగ్మగౌరవంబులు చక్ర
మృగపకందుకముల నొగి హసించు
హస్తకంఠమనోహరాననంబులు కంజ
కంబుసోములను జక్కఁగ జయించు
భాసురాధరదంతనాసికీలాదులు
ఫలకుందతిలపుష్పములను గెల్చు
తే. నింతచక్కనిలలితాంగి యెచటఁగాని
చూడలే దీవనంబునం జూచినాఁడ
నిట్టిసుందరి నానజుం డెట్లు దీర్చె
ననుచు మెచ్చుచు మఱి యిట్టులనియె మెచ్చి. 257

సీ. కర్ణనేత్రభ్రూయుగములు శ్రీకారాబ్జ
పత్రకందర్పచాపముల గెల్చుఁ
గాంతిసౌరభనీలకుంతలంబులు హేమ
పాటలబంభరప్రభల నడఁచు
గమనభాషణనిరీక్షణములు గలహంస
కలకంఠమదనాస్త్రముల నదల్చు
శాంతిసుస్మితగానసరణులు ధర కౌము
దీవీణలను జాల ధిక్కరించు
తే. నహహ యీకాంతరూపంబు నవనియందు
హాటకము మెత్తఁగా నూఱి యమృతరసము
పోసి మెదిచి మహాచిత్రముగ నజుండు
నేను మెచ్చుటకై చేసి నిల్పినాఁడొ 258

క. అటుగాకుండిన నిజముగ
నిటువంటిశరీరకాంతు లింతులకు మహిం
బటిమగ నుండునె ? యిమ్మెయి
నిటలాక్షుఁడు దీనిఁబొగడ నేరఁడు చూడన్ 259

సీ. కమలాసనుఁడు సర్వకాంతిసంచయమున
నతులితసౌందర్యవతిని దీర్చి
కమలమునం దిడఁగాఁ జూచి యాకాశ
నరపతి గైకొనె నా కటంచుఁ
గావున దీని శీఘ్రంబుగ నేఁ బెండ్లి
యాడెదనని మోహ మగ్గలింప
నంతఁ బద్మావతిచెంతకు మెల్లఁగఁ
బోవుచు నందందుఁ బూలఁ గోసి
తే. పాలఁతి నీకిటు తలఁబ్రాలిఁ బోతుననెడి
సైగగాఁ బుష్పములఁ గొని చల్లు చోరిమ
సేయుచును మించి రా చూచి చెంతఁజేర
నపుడు దిగ్గున నాలేమ యతని జూచి. 260

తే. పసిఁడిచెఱఁగులరవసెల్ల పైన వేగ
పాదువుగాఁ గప్పుకొని పూలపాదమఱుఁగున
నిలిచి యళుకుచు బెళుకుచుఁ జెలులఁ జూచి
చిలుకవలె ముద్దుపల్కులఁ బల్కె నిట్లు. 261

చ. అరమఱలేక రాజసుత లాడుచునుండెడుచోటు కీగతిం
బరపురుషుండు రాఁదగదు భామినులార భయంబునొందితోం
దరపడనేల రావలదు దవ్వుగ నేగు మటంచుఁ జెప్పు మ

త్తరుణి వచింపఁగా నపుడు ధైర్యముతో హరి గాంచి నవ్వు
చున్.

క. ఆపద్మావతి కడ్డుగ
నాపాలఁతులు నిలిచి హరికి నగుపడకుండం
బ్రాపించి కోపమున నా
శ్రీపతి నీక్షించి చాలఁ జిడిముడి వడుచున్ 263

సీ. పలికి రిట్లని రాచపట్టి యిందుండఁగఁ
బరుఁడ వొక్కింతను భయము లేక
వచ్చితి విప్పు డావల కేగుమంచును
దఱుముచు రాఁగ నాదైత్యరిపుఁడు
నగవుతో నిట్లనె నలినాక్షులార మీ
రాజపుత్త్రిని జూచి రహిఁ జెలంగ
మాటాడ వచ్చితి మాటలాడక మీరు
పొండన నారాజపుత్త్రిఁ గాంచి
తే. చెలులతో నసె నతఁడు మిమ్ములిరిపడఁగఁ
బలుకుచున్నాఁడు శబరుండు పాపమేమి
వీనిబంధువు లెవ్వరో వీఁడెవండొ
వీనికులగోత్రములు నేవొ విశదముగను. 264

తే. అడుగుఁడని రాజసుత పల్క నపుడు చెలులు
చక్రధరుదిక్కుఁ దిరిగి యోశబర నీకుఁ
దల్లిదండ్రులు పేళ్లేమి దగ కులంబు
గోత్రమును చెప్పుమనఁగ వైకుంఠుఁ డపుడు. 265

ఉ. వారిని జూచి యిట్లనియె వారిజలోచనలార యిచ్చటం
గూరిమిమీర నాకులము గోత్రములెల్లను జెప్పదేను మీ

భూరమణాత్మపుత్త్రి ననుఁ బొందఁగఁ జేసితి రేని మీకు నేఁ
గూరిమి నిచ్చెదన్ ముదము గోరినపన్నియు నిశ్చయంబుగన్.

సీ. అని చక్రి మఱల నిట్లనియె మాకులము శీ
తాంశుకులంబు వసిష్ఠగోత్ర
మగు తండ్రి వసుదేవుఁ డా దేవకీ తల్లి
యగుహాలపాణి మాయన్న గారు
లలితురాలై నచెల్లెలు సుభద్రాదేవి
పావనుండైనగాండీవి మఱఁది
ధర్మరాజాదులు దగు బంధుజను లన్న
తెలుపలు నగుచు నీదేహమెల్ల
తే. నలుపిదే మన్న వెన్నుండు నగుచుఁ బలికె
గృష్ణపక్షము నడిరేయి గినిసి కూడి
నపుడు పుట్టితి గనుక దేహంబు నీల
మయ్యె నందున ననుఁ గృష్ణుఁ డనిరి బుధులు. 267
క. నాకులగోత్రము లిప్పుడు
మీ కెఱిఁగించితిని గనుక మెండొడ్డక మీ
రీకన్యకులము గోత్రము
నా కొనరఁగఁ జెప్పుఁడనఁగ నగి చెలులెల్లన్. 268
తే. అనిరి చంద్రకులంబును నత్రిగోత్ర
జనితుఁ డాకాశరాజను జనవిభునకుఁ
బుత్త్రికామణియై పుట్టి భూతలానఁ
బెరిగి పద్మావతీ యనం బరఁగె వినుమ. 269
తే. మేటియై మము నొగిఁ జిన్ననాఁటనుండి
యొరిమ మాతోడ నాటాడుచుండు మాకు

సకలవస్తువు లిప్పించు సఖ్య మెసఁగ
నెప్పుడు నీయమ్మ సదయ మమ్మేలుచుండు. 270

చ. అన విని వెన్నుఁ డిట్లనియె నంబుజలోచనలార మిమ్ము నె
ల్లను గృప నేలుచున్న కమలాక్షిని సఖ్యము నేయ వచ్చితిన్
ఘనముగ నన్నుఁ గూడుమని గన్గొని మీదొరపట్టి కిప్పుడే
మనమలరంగఁజెప్పుఁ డనుమానము లేకయటంచుఁబల్కఁగన్

క. విని పద్మావతి కోపం
బునఁ జెలులం బిలిచి దిట్టి పొమ్మను వానిన్
ఘనత నెఱుంగక యున్నాఁ
డని తాఁ బొమ్మనియె దూర మరుగు మటంచున్. 272

సీ. అనిన వెన్నుం డిట్టు లనియె నోలలితాంగి
నిష్ఠురం బేల నే నీకు నాకు
మార్దవంబుగ మేటిమాటల నాడుము
చెలఁగి కన్యాపేక్ష గలిగి యిటకు
వచ్చితి నను నీవు వరియించుటకుఁ దగు
పాత్రుఁడ నేగాని బరుఁడఁ గాను
బాత్రదానము నేయు ప్రభువుకు నిహపర
సౌఖ్యము ల్గల్గు నీజనకుఁ డెలమి

తే. నన్నుఁ గాంచినయప్పుడ నిన్ను నాకు
నీయఁ గోరును సందియం బేమి లేదు
చంద్రకులజుండ వేఱ వంశజుఁడఁ గాను
నన్నుఁ జేరుము సరవి ననంగ నపుడు. 273

క. నీవు నిషాదుఁడ వయ్యును
వావిరి ఘనచంద్రకులమువాఁడ నటంచున్

గావలసి పల్కినా విప్రు
డావలఁ బో మ్మెదుటనుండ కల్పుఁడ మఱియున్ 274

సీ. తగ వెఱుంగక తప్పుదారిసుద్దులు చెప్ప
కరుగు మాతండ్రి నీవన్నమాట
విన్నను సంకెళ్లు వేయించుఁ గొట్టించు
నంతకుమున్న నీవరుగు మెచట
హరి యిట్టులనియె నాయందధర్మం బేమి
నే బ్రహ్మచారిని నీవు కన్య
వగుటచే నీవివాహము చేసుకొనుట ధ
ర్మముగాని యది యధర్మంబు గాదు
తే. నీవు నాయందు దయయుంచి నిష్ఠురోక్తు
లాడ కింపుగ ననుఁ బెండ్లియాడు మనినఁ
గనుబొమలు ముడివెట్టుచుఁ గన్ను లెఱ్ఱ
చేసి యాయింతి చక్రి నీక్షించి పలికె. 275

క. ఓరి నిషాదుఁడ నీ వీ
క్రూరపుమాటంటి వైనఁ గొట్టింపను బో
నూరక నీత్రోవం జను
మూరక మాటాడనేల నొప్పమి గలుగున్ 276

వ. అనిన విని హరి యిట్లనియె. 277

క. చుట్టపుదాన వటంచుఁ గ
గుట్టుగ నే నిన్ను వేడికొన్నందున నం
గొట్టింపకు మన్నునిచేఁ
గొట్టింపఁగనేల నీవ గొట్టుము తరుణీ. 278

సీ. అని చక్రి పలుకఁగ నతివ యిట్లనియె నీ
వీలీల మోదుగుపూలు వేసి
పలుమాఱు నాకుఁ గోపంబు పుట్టించెద
విఁక జీవితేఱువు లేదేమొ నీకు
ఛీ పొమ్మనఁగ హరి చిఱునవ్వు నవ్వుచు
ననె జనించినవారు చనుట నిజము
గనుక చింతెక్కడఁ గలసినపిమ్మట
జగతి నుండిన మేలె చనుట మేలె
తే. రమణి నా కందుకై విచారంబు గలదె?
వినుము తలఁచినపని యైనవెనుక నీవు
పట్టి కొట్టిన దిట్టిన భయము లేదు
వేఱమాటలు వల్కకు వెలఁది నీవు. 279

వ. అనిన విని పద్మావతి యిట్లనియె. 280

క. నాకడ నీ విటు ప్రేలుట
యాకాశనృపాలుఁ డెఱుఁగ నంతట ని న్నీ
లోకంబున మననీయఁడు
పో కష్టంబేల దూరముగ మేలొందన్. 281

వ. అనినవిని హరి నగుచుఁ బద్మావతి కిట్లనియె. 282

సీ. పుట్టినవారెల్లఁ బోవుట నిజమైన
దెఱుఁగుదు నేను ని న్నెట్టులైన
విడువను నీతండ్రి విమలధర్మాత్ముండు
గాన న న్బాధింపఁ డైనఁగాని
బాధింపఁ జూచెద భయము లేదు మఱేమి
ప్రియముగ నా కిచ్చి పెండ్లిసేయ

నావల నేమగు ననఁగ నాపద్మాక్షి
యిట్లనె నా వేంకటేశుఁ డుండ
తే. కంచి శ్రీవరదుఁడు రంగఁ డంచితులయి
యుండఁగా నీకు నాతండ్రి యొప్పి దాన
మిచ్చునే హోమ్ము నీకేల యిట్టిభ్రాంతి
కానికార్యంబునకు నీవు పూననేల. 283
వ. అనిన విని చక్రి యిట్లనియె. 284
క. హాహా మ్మని మొగమాటం
బీపట్లను నీకు లేక హెచ్చుగ నాపైఁ
గోపము చేసితి వని నిను
బ్రాపించక నేను బోను పద్మదళాక్షి. 285
క. అనఁగాఁ బద్మావతి యి
ట్లనెఁ దలిదండ్రులను విడచి యకటా నీవి
ట్లనుట యసంభావితమై
చను మూరక లేనిభ్రాంతి సమకొననేలా. 286
వ. అనిన నాదైత్యారి మందస్మితవదనారవిందుండై యిట్లనియె.
చ. విను సతి నీవు నా కిటు వివేకము చెప్పితి వెంత చెప్పినన్
వనజభవుండు నానుదుట వ్రాసినవ్రాతఫలంబు దప్పు నే
నిను వరియించి పిమ్మటను నే నెటు వోయినఁగాని నేమమే
గనుక నిజంబుగాను నినుఁ గౌఁగిటఁ జేర్పకపోను జేడియా.

పద్మావతి హరిపై ఱాలను రువ్వించుట.

వ. అని పల్కుచు డగ్గఱకు వచ్చుటం జూచి పద్మావతి కోపో
ద్రేకియై చెలులం బిలిచి యీదుష్టుని ఱాలంగొట్టి దూరం
బుగఁ దఱుముఁడనిన వారలప్పుడు తెప్పున ఱాలనందికొని

యొప్పమి గల్గునట్లు తప్పక గుఱిమీఱి గొట్ట నాహరిమీఁద శిలావృష్టి గురిసె నప్పు డప్పద్మాక్షుండు కార్యము తప్పెనని తలంచె నప్పు డప్పాలంతులు పాటవంబున మీటు ఆల పోటులు నాట ఘోటకంబును దాఁటి పోనేరక నేలంబడియె. నంత శ్రీకాంతుండు హయంబును డిగి యూరక వారిం జూచుచుండ నాబోటులు వాటంబుగ ఱాలనంది మఱి మఱి రువ్వుచుండిరి. ఆఱాలవ్రేటులు దప్పించుకొనుచు నిలువనేరక యుత్తరాభిముఖుఁడై వేంకటాచలంబునకు నెగ నెక్కుచుం దనకు నివాసంబైన వల్మీకంబునం బ్రవేశించి వకుళమాలిక నిర్మించిన విరులపాన్పుపైఁ బ్రళయకాలంబున మహాబ్ధి యందు వటపత్రంబునఁ బరుండిన పరమపుర్షునిచందంబున శయనించియుండె. అంత నిక్కడ వనమధ్యంబునందుఁ జెలులం జూచి పద్మావతి యిట్లనియె. 289

సీ. చెలులార మాతల్లి చెప్పినమాటలు
వినకుండ వచ్చి యీవిధముగాను
అనుభవించితిఁ గష్ట మమ్మమ్మ నేఁ జెల్ల
నీపుష్పవనమున కింక రాను
జాలు నిచ్చోటను శబరుఁ డాడినమాట
లప్పు డమ్మకు మీరు చెప్పవలదు
చెప్పిన మనకెల్ల సిగ్గుపా ట్లగునని
పలికి యందలమెక్కి చెలులతోడఁ
తే. గుసుమఫలములఁ గొన్ని చేఁ గొనుఁడటంచుఁ
బోయి మణిమందిరముచేరి పూలఁబండ్లఁ

దల్లికి నొసంగి యంతటఁ దాను బోయి
పాన్పుపైఁ జేరె హాయిగఁ బల్కకుండ. 290

వ. అని చెప్పి హరి యొనర్చినకార్యంబులు విని సంతసించి హరి యావల నేమిచేసెనని యడుగ మునులకు సూతుం డిట్లనియె.

చ. మునివరులార మీ కిపుడు ముచ్చట మీఱఁగ నేనుజెప్పెదన్
వినుఁడు పరాత్పరుండు హరి విష్ణుఁడు మర్త్యనిరీతిఁ గాముకుం
డనఁదగి మోహతాపమున నారట నొందుచుఁ బవ్వళించి యే
మనక ముసుంగువెట్టుకుని యార్తునికైవడిఁ జింత సేయుచున్.

తే. వేఁడినిట్టూర్పు విడిచి తా విమలపాన్పు
పైని బొరలుచు దీనునిపగిది నున్న
వకుళమాలిక యచటికి వచ్చి హరిని
గాంచి యిట్లని పల్కె సత్కరుణ మెఱసి 293

శా. అన్నా వేంకట లెమ్ము లెమ్మిపుడు నీ వాకొంటి వాలస్యమే
మన్నంబుం బరమాన్నభక్ష్యములు నీ కర్పింప నేఁదెచ్చితిం
జెన్నొందన్ భుజియించు నీవనఁగ నా శ్రీస్వామి మాటాడలే
కున్నం జూచిమనంబునన్ భయము పెంపొందంగ నాఁ డెంతయున్.

సీ. వికలత్వమును బొంది వకుళమాలిక యిట్టు
లనియె నాతండ్రి నీ వార్తినొంది
కనులనీ రిటు నింపఁ గారణం బేమి నీ
వీవిధంబునఁ జింత యేలపడెదు
పగలు నిద్దురవోవఁ దగదని తెలిసి నీ
విప్పు డిమ్మాడ్కి నిద్రించు టేల
విపులధైర్యస్థైర్యవీర్యంబులను వీడి
పోఁ జేసి దీనతఁ బొందు టేల

తే. లేచి కూర్చుండి నాదెస లెస్స చూచి
నీమనంబునఁ గలచింత నిశ్చయముగఁ
జెప్పుమని బుజ్జగింపఁగ శ్రీధరుండు
మాఱువల్కక యుండె సమ్మదము లేక. 295

వ. అంత వకుళమాలిక భీతాత్మయై దగ్గఱఁ గూర్చుండి వెండియు
నిట్లనియె. 296

చ. అడవికి వేటఁబోయి మఱి యచ్చటిక్రూరమృగవ్రజంబునం
బొడగని భీతినొందితివొ భూతము సోఁకెనొ లేక తాలపై
వడి చెడి జాఱి నేలపడి వాఁగులఁ జేరితో యేమి చెప్పుమా
కొడుక నిజంబు నాకు నొగి గొబ్బున నిప్డు చికిత్సఁ జేసెదన్.

సీ. పడిలేచియుండినఁ బరఁగ మేనఁ బొసంగఁ
దైలంబుచేత రుద్దంగవలయుఁ
జత్రాతిమీఁదఁ గ్రచ్చర జారి మ్రొగ్గినఁ
బొసఁగ వేఁడిజలంబు బోయవలయు
మృగభీతి హృదయాన నొగి నాటినట్టైన
నెట్టన నడివీఁపుఁ దట్టవలయు
నదిగాక భూత మెందైన సోఁకిన భూతి
దెప్పునఁ బట్టి మంత్రించవలయు
తే. నిట్టి నాల్గుచికిత్సలం దేచికిత్స
చేయు దది నీవు నిజముగఁ జెప్పుమనినఁ
దెలియునే నామనంబున దిగులుదీర
నున్న దున్నట్లు చెప్పు నాకన్నతండ్రి. 298

తే. అనుచు నాపాదశీర్షపర్యంత మప్పు
డొనర నివురుచుఁ జెమటచే నుష్ణమైన

దేహమందున్న బలుతాల దెబ్బలుబ్బి
యుండుటంజూచి భీతిల్లి యూరకుండి. 299

వ. ఎట్టకేలకు నవ్వకుళమాలిక హరి కిట్లనియె. 300

సీ. ఓతండ్రి నీమేన నుష్ణపుస్వేదంబు
పొంగుచు నీరీతిఁ బుట్టుటేమి
మృదుశరీరమునందు మెండుగ తాలదె
బ్బలు దాఁకియున్న దీపాపమేమి
ధీరుండ వయ్యును దీనదశను బొంది
నీవిట్లు కన్నీరు నించుటేమి
కల్గినరీతి నిక్కముగఁ దెల్పుమటన్న
మాటాడ విపు డింతమౌనమేమి
తే. యనుచుఁ గప్పినవస్త్రంబు నవలఁ దీసి
యొప్పుగా లేవనెత్తి కూర్చుండఁజేసి
వేగ గదుములు తాఁ ద్రోమి వేఱవస్త్ర
మొకటి పైఁగప్పి చందనం బొడలనలఁది. 301

క. చల్లనిజలములఁ గన్నులు
మెల్లఁగఁ దా నివిరి నివిరి మేల్కొల్పుచు మే
ల్తొల్లలు గ్రుచ్చినమృదుతర
పల్లవముల విసరివిసరి బడలికఁ దీర్చెన్. 302.

క. హరి కిటు బడలిక దీరిన
సరవిగ వకుళాఖ్య యింతి సదయహృదయ యై
పరమాన్నము భుజియింపుము
వరసుత యని పిలువ శిరము వంచినవాఁడై. 303

క. పంకజలోచనుఁ డుండఁగ
సంకటపడి వకుళ చాల జాలిని బల్కెన్
మంకుతనము చేసెదవా
వెంకట నీమదిని యేమొ వింత జనించెన్. 304

మ. అని యాకాంత మఱియిట్లువల్కె విను నీ వాకోన నెందేనియై
నను సౌందర్యవిలాసవిభ్రమకళానైపుణ్యముల్గల్గుకాం
తను మోహంబునఁ జూచి వచ్చితివె? చిత్తంబందుఁ దద్రూ
పముల్, ఘనమై నిల్చెనో నీయురఃస్థలమునన్ గామాస్త్రము
ల్నాటెనో. 305

సీ. నాతండ్రి నీవు గన్నది కిన్నరాంగనో
గీర్వాణకాంతయో గిరులయందు
గమనింపఁ జెంచితో గంధర్వకాంతయో
వనదేవతయొ లేక వగలుగుల్కు
నూర్వశియో మేనకో సర్వగుణములఁ
దగినరంభయొ తిలోత్తమ ఘృతాచో
పూని యీపదుగురలో నెవ్వరిం జూచి
నీవు వచ్చితి వది నిక్కముగను
తే. జెప్పుమని వల్కఁ దల వంచి శ్రీధరుండు
పలుక కూరక కనుల బాష్పంబు లొల్క
దిగులువడియుండుచక్రిని తగ మఱొక్క
సారి వీక్షించి పల్కెనో సత్కుమార. 306

తే. మోహినీభూత మేమైన ముందు నిలిచి
కనులఁ బొడఁగట్టి పోయెనో గహనమందుఁ

గామినీభూత మెందేని గదసి నిన్నుఁ
బట్టెనో తెల్పు కొడుక మఱెట్టివిధము. 307

క. అటు గాకుండిన నాతో
నిటు మాటాడకయ యుండ నేవిధమున సం
కటపడ వెన్నఁడు దీనికిఁ
గటగట నే నేచికిత్సఁ గావింతునయా. 308

క. ఒకమాట నాకుఁ జెప్పక
వికలాత్ముఁడ వగుచు ఘనవివేకముగాఁ బ
ల్కక నీవుండఁగ నామది
కకవిక లొందినది నాకు గతియే మింకన్. 309

సీ. మౌనివై నీవిటు మాటలాడకయున్న
నిక్కడ మనకు దిక్కెవ్వరింక
నావరాహస్వామికైన నీవృత్తాంత
మెఱుఁగఁ జెప్పఁగఁ దీర దింకమీఁద
నంత అట్లేల నా కాప్తంబుగా నీమ
దిని గలిగినచింత దెల్పు మిప్డు
నానావిధంబుల నేను విచారించి
నీచింత దీర్చెద నిశ్చయముగ
తే. నన్ను నఱమఱగాఁ జూడ కన్న నీవు
బ్రదికియుండిన నేనిందుఁ బ్రదుకఁగలను
లేకయుండిన దేహంబు నాకు వలదు
నేను నీవున్నచోటన నిల్చియుందు. 310

సీ. కన్యకాదీక్ష నిక్కంబుగఁ బూనినే
గురునిష్ఠ నుండఁగఁ బరమగురుఁడు

పుణ్యాత్మ నీయట్టిపుత్త్రరత్నంబును
గనక పెంచక నిచ్చె ననుచు నిన్ను
నెఱనమ్మి యుండఁగ నేఁడు నీ విచ్చట
శోకించువిధ మేను జూడలేను
నాయందు దయను మనంబునఁ గలయిష్ట
మెఱిఁగించుఁ జేసెద నేదియైనఁ
తే. జేతిలోఁ జేయిఁ బెట్టి మచ్చిక శిరంబు
నివిరి యాచక్రధరుని కన్నీరు దుడచి
తాను గన్నీరు నింపఁగఁ బూనినాపె
కివ్విధంబుగ ననియె నయ్యీశ్వరుండు. 311
చ. కనుఁగవ మెల్లఁగాఁ దెఱచి కామవికారము మానసంబునం
బెనఁగొనఁ దల్లి నీవిపుడు ప్రేమను జెప్పిన దంతె చాలు నీ
విను మొకవారణేంద్ర మటవిం బొడసూపఁగ దానివెంబడిం
జని గిరి డిగ్గఁగా నెదుటఁ జల్లఁగఁ బుష్పవనంబు గన్పడెన్.
క. ఆవనమున నొకసుందరి
లావణ్యవిలాసకలిత లక్షణవతియై
భావజుబాణముకైవడి
గా విద్యుల్లతికరీతిఁ గన్పడె నెదుటన్. 313
సీ. ఆకాంతపాదంబు లమలపల్లవములు
జంఘిక ల్కాహాళుల్ సఖియతొడలు
కదళికాస్తంభము ల్కటిసైకతంబు మ
ధ్యము గగనంబు హస్తములు శోణ
కమము ల్మెఱుంగునూఁగారు చీమలబాఱు
కలికి కుచములు బంగారుగిండ్లు

గళము శంఖంబు చక్కనిచెక్కు లద్దముల్
తేటైనకెమ్మోవి తేనెబావి
తే. దంతములు మొల్లమొగ్గలు తళ్కుచెవులు
శ్రీలు నాసిక తిలపుష్ప మాలతాంగి
కనులు బలుగండుమీలను గడియు బొమలు
కళలచే సొగసైనసింగాణు లనఁగ. 314

వ. తనరారుచుండు నదియుంగాక. 315

తే. చంద్రబింబసమానంబు సతిముఖంబు
మెఱుపుతుమ్మెదఱెక్క లమ్మెలఁతకురులు
జనని యాకామినీమణిచక్కఁదనము
చెప్పలేఁ డజుఁడైన నేఁ జెప్పఁగలనె. 316

చ. తలఁపు నిజంబుగా వినుము దానికి నాకుఁ బ్రియానుబంధ మిం
కెలమిని గల్గెనేని యొగి నేలుచునుండెద దాని లేనిచో
నిలువఁగ నోప నిందు జననీ తలగాయము మాన్పినట్టిని
న్నిలనెడఁబాసిపోవుటకు హేతువుగల్గునటంచు నాత్మలోన్.

వ. చింతించువాఁడ నప్పద్మనేత్రను జొప్పడ నీవిటకుఁ దోడ్తెచ్చు
త్రోవ యెఱింగి మాటాడితెమ్ము మద్దాని నిడుకొని యియ్యెడ
నెయ్యంబార నుండెద. 318

చ. అని హరి పల్కఁగా వకుళ యాతని నెమ్మొగమారఁ జూచి
యి, ట్లనియెఁ గుమార నీవు గనినట్టి లతాంగికులంబు గోత్ర
మున్, వినవలెఁ దల్లిదండ్రులను వేడ్క నెఱుంగఁగఁ జెప్పు
దానినిం, గనవలెఁ బెండ్లియాడఁ దగుకన్యకయైన వరింపఁగాఁ
దగున్. 319

తే. దాని పేరేమి యుండెడుతా వదేది
చెప్పు మేర్పడ నేఁ బెండ్లి సేయు దిప్పు
డంచు వకుళాడ నాచక్రి యనియె జనని
వినుము చెప్పెదనని యక్క వివర మెల్ల. 320

సీ. జనని యాక్రమము నిశ్చయముగ విను సుధా
కరునికులజుఁడు నాకాశరాజు
తనకు సంతతి లేక ఘనపుత్త్రకామేష్టి
దనరఁ గావింప నద్ధరణితలము
దున్నింప నవనిలోఁ దోయజం బుదయించె
నాతోయజంబునం దామృగాక్షి
గనుపింపఁగాఁ దెచ్చి గగనాధిపుఁడు పెంచె
ధరను బద్మావతి దానిపేరు

తే. పరఁగ దానికి నాకు దాంపత్య మజుఁడు
నిశ్చయముచేసి యుండెనా నేను బ్రదుక
గలను లేకున్న నిచ్చోట నిలువలేను
వనిత వైకుంఠపురిఁ జేరవలయుఁగాక. 321

వ. అమ్మా! విను మక్కన్యకామణి లక్ష్మీసమాన యగుంగావున జన్మాంతరపుణ్యంబును గలపుర్షునకు లభించుంగాని పెఱవారి కేల లభించు మత్పుణ్యపరిపాకంబున నక్కన్య నీక్షించి సుభాషింపఁ గలిగె నట్టిసుందరిం జూచి విడిచివచ్చితి నిఁక నాకన్నోదకంబు లభిలషింప నప్పద్మావతి నాయందు ననురక్తి లేమి చెలులంబురికొల్పి శిలావృష్టిం గుఱియించె నావృష్టి కోపంజాలక తురంగంబుపైఁబడి తెప్పున నిప్పర్వతం బారోహించి పునర్జీవితుండనైతి నజుం డట్టిసుందరిం బుట్టించి కట్టిఁడి

బుద్ధినిచ్చి నాకింత కష్టంబు వెట్టి మత్పాతకం బింతకుఁ దెచ్చె బ్రహ్మాయు నక్కాంతకును నా కప్పుడ సంధింపఁజేయకపోయె, నైన నీవు తత్కన్యకారత్నంబును నాకు నొడఁగూర్పఁ బ్రహ్మాతంత్రంబును దోడ్పడ నెంచెద, నట్లుచేసితి వేని మజ్జననీ జనకసహోదరాది బాంధవులును, మద్భక్తులగు ప్రహ్లాదనారదాది పరమభాగవతోత్తములును, నీవ యని నిశ్చయింతు, ననేక గోభూహిరణ్యాన్నదానాదులఫలంబు చేకుఱు, నాచేఁ బద్మావతికంఠంబున మాంగల్యంబిడంజేయు మంతియ చాలు నని మఱియు నిట్లనియె. 322

తే. తగిన శుభలగ్నమున నాకు దాని కీవు
పెండ్లిచేయించినంతకుఁ బ్రీతి నాకుఁ
గలుగ దేలోక మెంద్రైనఁ గనుక వేగ
నాకుఁ బెండిలిసేయించు నయనిధాన. 323

మ. హరివేడ్కన్ వచియింప నవ్వకుళ నెయ్యంబారఁగాఁబుత్త్రకా
పరమాశ్చర్యముగా ధరాతలములోఁ బద్మంబునం దట్టిసుం
దరి బుట్టం దగుహేతువేమిపుడు మోదం బొప్పఁగా నాకునీ
వారిమం జెప్పుమటన్నఁజూచిహరియిట్లొప్పారఁగాఁబల్కెదాన్

హరి వకుళకు రాములకథ చెప్పుట.

సీ. వినవమ్మ తొలికాలమున నప్పు త్రేతాయు
గంబును జరుగ శ్రీకరుఁడు ఘనుఁడు
దశరథేశ్వరునకుఁ దనయుండనై పుట్టి
గాధేయుసవనంబు గాచి శివుని
చాపంబుఁ ద్రుంచి యాజనకాత్మజను బెండ్లి
యాడి సాకేతాఖ్య నగుపురంబు

చేరి మజ్జనకాజ్ఞ శిరసావహించి నీ
తను లక్ష్మణుని దోడుకొని వనముల
తే. కరిగి యందుండ నొక్కమాయామృగంబు
నచట జానకిచూచి నెయ్యమున దాని
దెచ్చియిమ్మని యడుగ మేమచ్చటుండ
పోవ దశకంధరుఁడు వచ్చి పొలఁతిఁజూచి. 325

సీ. ధరణిజ నెత్తి రథంబుపై నిడుకొని
జనఁగ రామా యని జనకపుత్రి
విలపింప నెవరందు విడిపింప లేకున్న
నపు డగ్ని దేవుఁ డయ్యనిమిషారిఁ
జేరి దశగ్రీవ సీతగా దీకాంత
మఱి యెవ్వరన్న నెమ్మదిగ వినుము
చెప్పెద రాముఁ డాసీతను నాచెంతఁ
జేర్చి విప్రాంగన స్నీతవలెను
తే. జేసి యందుంచి చనియె నీస్నేహమేను
గోరి చెప్పితి నీరీతి గుట్టటంచు
శాంతముగఁ జెప్పి సీతవేషంబు వేద
వతికిఁ గల్పించి తెచ్చి రావణునికిచ్చె. 326

క. ఆమూఢుం డగురావణుఁ
డామైథిలి నచట విడచి యావేదవతిం
గామించి తోడుకొని చనె
నేమఱక యశోకవనిని యెలమిగ నుంచెన్. 327

క. రామా యని పేర్కొంచును
దా మైథిలిరీతి నచటఁ దల్లడఁబడుచున్

నేమ మొకించుక దప్పక
యామానిని చెఱను నిల్చి యడలుచు నుండెన్. 328

క. అనలుఁడు తనసతిచెంగట
నొనరఁగ జనకజను డాఁచియుండఁగ నే నా
యనిమిషవైరిని దునుముట
కనిమిషపతి సుతుని ద్రుంచి యాసుగ్రీవున్. 329

సీ. చేఁబట్టి లవణాబ్ధి చెచ్చెర బంధించి
కదసి రావణకుంభకర్ణముఖ్యు
లగురాక్షసులఁ ద్రుంచి యందఱు మెచ్చుట
కై యందుఁ జెరనుండునట్టిసతిని
గాంచి నీవగ్నిలోఁగాఁ బ్రవేశించి వ
చ్చినఁగాని నిన్నుఁ జేకొన నటంచుఁ
బల్కితి నయ్యింతి పావకజ్వాలల
యందుఁ బ్రవేశించె నందఱు గన
తే. నప్పు డిద్దఱు సీతలై యగ్నియందు
నిలిచియుండఁగ జనకజ నేను బిలిచి
చేడె నీవలెఁ జెంతను జేరియున్న
కమలలోచన యెవతె నిక్కముగఁ దెల్పు. 330

సీ. అన విని సీత యిట్లనె దశాస్యుఁడు నన్నుఁ
దెచ్చునప్పుడు నేను దిగులునొంది
పరఁగ నిన్నేర్కొని పలువిధంబుల నేడ్వ
ననలుండు దనచెంత నప్పుడున్న
వేదవతిని దెచ్చి విబుధాహితున కిచ్చి
నను దనలో డాఁచికొనియె వేద

వతి లంకచేరి రావణునిచే హింసలు
వడియె నాకొఱ కిది భాగ్యవతియు
తే. నిన్నుఁ గోరి తపంబున్నకన్నె మిన్న
గనుక నీభావమందు సత్కారణమునుంచి
ప్రేమ మీరఁగ నిద్దానిఁ బెండ్లియాడు
మనఁగ నే నంధు కొల్ల కిట్లంటి నపుడు. 331
తే. పడఁతి విను మేకపత్నీవ్రతుఁడను గనుక
యిపుడు నేఁ బెండ్లియాడ నియ్యిందుముఖిని
రహిఁ జెలంగఁగ దేహాంతరమున దీని
పెండ్లియాడుదు వేడుక పెచ్చుపెరుఁగ. 332
వ. అదెట్లనిన నిరువై యెన్మిదవ ద్వాపరాంత కలియుగంబున
ననేకభక్తరక్షణార్థంబు వేంకటాద్రియందు నవతరింతు నపు
డీకన్యకను బెండ్లియాడుదు నంతపర్యంతంబు నీకాంత సత్య
లోకంబున వసియించి యుండవలయు, వేంకటాద్రియం దుద
యించిన నపు డియ్యింతి భూమియందు నుద్భవించు నపు
డేను పరిగ్రహింతు. 333
క. అని పల్కితి నీగోప్యం
బనలునకును నాకుఁ దెలియు నదిగా కిది యా.
జనకజకును వేదవతికిఁ
దనరారఁగఁ దెలియు మర్మధర్మం బిదియున్ 334
సీ. పరు లెందు విననినీపరమరహస్యంబు
నీకుఁ జెప్పితి నేఁడు నెనరు మీఱి
మది నుంచు మటుమీఁద మహిమ మీరఁగ నేను
వహ్నియం దావేదవతిని నిల్పి

చిరతరకరుణ నాసీతను మెచ్చి చేఁ
బట్టి విభీషణుపట్ల మచటఁ
గట్టి సౌమిత్రి . ఁ గపులతో సాకేత
పట్టణంబును జేరి ప్రజలనెల్లఁ
తే. బాలనము సేయుచుంటి నక్కాల మట్ల
జరిగె నటమీఁద నేను ద్వాపరమునందు
మొనసి వసుదేవునకుఁ గృష్ణుఁడన జనించి
యుంటి వల్మీకమున నిందు నున్నవాఁడ. 335

తే. అనుచు వకుళకుఁ బూర్వవృత్తాంతమెల్ల
చక్రి వినిపింప నయ్యింతి సంతసించి
వేదవతిపూర్వవృత్తాంతవిధము దెల్పు
మనఁగ నాచక్రి యిమ్మాడ్కి ననియెనపుడు. 336

సీ. విను వకుళాదేవి ఘనపూర్వకథ నీకు
విశదీకరించెద విప్రకన్య
యగు వేదవతి నన్ను మగనిగ భావించి
తపము సేయుచునుండ దనుజవిభుఁడు
తా దాని గామింపఁగా దేహమందాశ
విడిచి యాలలితాంగి విశ్రవసుని
తనయుని గాంచి సిద్ధంబుగ హరిచేత
నిన్ను నేఁ జంపింతు నెఱీఁ దలంచు
తే. నంచుఁ బంతంబొనర్చి తానగ్నిఁ జొచ్చెఁ
బావకుఁడు దాని డాఁచి తప్పక దశాస్యుఁ
డెలమి సీతను గొంపోవ నెఱిఁగి వాని
కిచ్చె వేదవతిని సీత నీయకుండ. 337

వ. అంత నాదశాస్యుని జంపి వేదవతియనుసీత నగ్నిం బ్రవేశించె
నంత వేదవతి పద్మంబుననుండి యాకాశరాజేంద్రునికి
లభించె, నే నద్దానింగని మరులెసంగి తల్లడంబడువాఁడ
నయ్యెది నను మఱచివోరొయె నంత. 338

మ. అని యమ్మాధవుఁ డాత్తతం దనదువృత్తాంతంబు పద్మావతీ
జననంబు న్వినుపింపఁగా వకుళ శ్రీస్వామి న్విలోకించి యి
ట్లనె నోదేవ మహానుభావ మును నే నజ్ఞాననై మానవుం
డని బాలుండని యుండి తేను నిను బ్రహ్మం బంచు సేవించెదన్.

శా. నీవే బ్రహ్మను గన్నతండ్రి వి మహానిర్వాణసంధాత వీ
వే విష్ణుండవు రామచంద్రుఁడవు నీవే కృష్ణదేవుండు వీ
వే వేదాత్మవు సర్వతోముఖుఁడ వీవే కర్త వాభోక్త వీ
వే విశ్వంబు వరాహదేవుఁడవు నీవే శేషశైలాధిపా. 340

క. తోయజలోచన నే నీ
మాయను గనలేక నా కుమారుఁడ వంచున్
నీయందుఁ బ్రేమముంచితి
నాయీశుఁడ వంచుఁ దెలియ నైతి మహాత్మా. 341

సీ. అన విని విష్ణుఁ డిట్లనియె నిచ్చట నీవు
తలగాయమును మాన్పి తల్లివలెను
బోషింప నీఋణంబును దీర్చు టెట్లుకో
యని నేను జింతింతు ననుచు వకుళ
మాలికపై విష్ణుమాయఁ దెప్పునఁ గప్పి
పుత్రవాత్సల్యసద్బుద్ధి నిల్పి
మఱల నిట్లనియె నమ్మా వివాహము నాకుఁ
జేయు మీవంచు మచ్చికలు వల్కి

తే. తప్ప కిప్పుడ పెండ్లి పెత్తనము చేయఁ
బోయి రమ్మని వల్కనా పొలఁతి హరిని
గాంచి పుత్రక యిప్పు డా కన్యయున్న
దివ్యపుర మెట్టిదో దారి దెల్పుమయ్య. 342

తే. అనఁగ హరి యిట్టులనియె నీయద్రి దిగువ
నమరు నమరావతీపురం బనఁగఁ బుడమి
నున్నతంబై ప్రకాశించు నొక్క నగర
మట్టి పట్టణ మిపుడు నీ వెట్టి దనిన.

సీ. వేదవేదాంగప్రవీణులై వేదాంత
వేత్తలై వెలసిన విప్రవరులు
ప్రవరబాహాశౌర్యపటిమజితారాతి
వారంబు గలభూమి వరమణులును
మణికాంచనోజ్జ్వలమందిరాంగణనట
ధ్వజమందిరులు నైన వైశ్యవరులు
ధరనిర్జరులపాదసరసిజసేవైక
శుభధురంధరు లైన శూద్రఘనులు

తే. గలిగి విలసిల్లు గోపురకలితలలిత
రత్నకాంతపరిభ్రాంతి రాజహంస
పథనిరోధకసాల విభ్రాజమాన
మై ప్రకాశించు నారాయణాఖ్యపురము. 344

ఉ. అప్పురమేలువాఁడు గగనాఖ్యధరాపతిచంద్రుఁ డుత్తముం
డెప్పుడు ధార్మికుం డతఁ డభీష్టసుఖప్రదుఁ డంచు సజ్జనుల్
మెప్పుగ నెన్నుచుండ్రు కడు మేలుగ భక్తి విరక్తి యుక్తులం
దొప్పినవాఁడు దేవతచయోన్నతి సన్నుతిఁ జేయ నొప్పెడున్.

సీ. సప్తాంగములవెలి సవరించి యాత్మ యం
దష్టాంగసరణిపై నాసఁ బెంచి
బైటశాత్రవకోటిపటిమంబు నిర్జించి
యంతర్విరోధుల నడఁగఁ జేసి
బాహ్యపుణ్యనదీప్రభావంబు నీక్షించి
యాంతర నదులపై నాత్మ నుంచి
వెలుపలిచక్రము ల్వేడ్కతోఁ బాలించి
సొరిదిలో చక్రముల్ చూడ నెంచి
తే. దీనజనమానసాధీన ధీర విష్ణు
చరణకంజాత సంజాత సారమధుక
రాయమాన మనస్కుఁడై రహిని వెలయు
నెమ్మిమీరంగ నాకాశనృపవరుండు. 346

తే. తొండమానుండు ముద్దుతమ్ముండు పరమ
భక్తియుక్తుండు శాంతుండు పరఁగఁ బుత్త్ర
కుండు వసుధానుఁ డని భార్య యోగ్యశీల
ధరణి దేవీయనంగ పద్మావతీసుత. 347

చ. అని గగనక్షితీశ్వరుని యభ్యుదయంబును జక్రి చెప్పఁగా
విని వకుళాంగనామణి వివేకము మీరఁగ నద్రి డిగ్గి యో
వనజదళాక్ష మార్గమిఁక వారకచూపుమటంచుఁ బల్క నె
మ్మనమునఁ జూపు దేను వినుమాత కృపాన్విత ధర్మపాలితా

వ. ఇప్పర్వతంబు డిగివోవ నచ్చట పావనకపిలతీర్థం బొండు
గలదు. అద్దానియందు మునింగి కపిలమునివలనఁ బూజ
లందఁబడిన శివలింగంబునకు నమస్కారంబు లిడి శ్రీనివాసు
నకు నతిశీఘ్రంబుగ వివాహలగ్నము సమకూర్చు మని విను

తించి యవ్వలంబోయి శుకాశ్రమంబు చేరి యం దాశుక యోగీంద్రులకు మ్రొక్కి అగస్త్యాశ్రమంబున కరిగి యం దమ్మునివలన నిర్మింపఁబడిన శివునకు నమస్కరించి తదాలయ సన్నికృష్టగ్రామనివాసు లగుబ్రాహ్మణులకు మ్రొక్కి వారి నారీమణుల్లను గూడి మైత్రి యొనరించుకొని నారాయణవన పురంబునకుఁ బోయి తద్రాజపత్నికడ కేగి యయ్యంగనామణిం జూచి ప్రియోక్తులాడుచు నావలఁ బద్మావతిసంగతి నించుక దెల్పించుము. జరుగు కార్యం బావల జరుగుననిన వకుళ మాలిక విని యిట్లనియె. 349

సీ. విను దేవ! వారు నీ వృత్తాంత మడిగిన
నప్పు డే నేమేమి చెప్పవలయు
ననిపల్క నాయంబుజాక్షుండు గనుఁగొని
యనియె నోయమ్మ వా రడిగి రేని
వరచంద్రకులజులౌ వసుదేవకులు ధాత్రి
తలమున నాతల్లిదండ్రు లనుము
బలభద్రుఁ డన్న సుభద్ర సోదరియును
గోత్రమడ్గ వసిష్ఠగోత్ర మనుము
తే. రహిని నక్షత్ర మడిగిన. శ్రవణమనుము
లలితయౌవనసౌందర్యకలితుఁ డనుము
మానధనుఁడను భవ్యనిధానుఁ డనుము
భువిని బద్మావతికిఁ దగు పురుషుఁ డనుము. 350

వకుళమాలిక నారాయణవనపురమున కేగుట.

వ. అని చెప్పుచుండఁగ దేవమాయానిర్మితం బగుతురంగంబు రయంబున హరికడకు వచ్చి నిలుచుటం జేసి వకుళమాలిక

సంతసించె నాచక్రి తురంగంబునకుఁ దగునాజ్ఞ యిచ్చి వకుళ నాతురంగంబున నారోహింపఁజేసె. అంత నావకుళ చక్రి చెప్పి నట్లు కపిలేశ్వరునకు నమస్కరించి ప్రార్థించి శుకునకు నగస్త్యు లకు మ్రొక్కు లిడి శివలింగంబులకుం బ్రణమిల్లి యొక్కయెడఁ గూర్చుండి తద్దేవాలయంబులో నిలిచియున్న కన్యకలయం దొక్కకన్యను జేరఁ బిల్చి ప్రియోక్తుల నిట్లనియె. 251

క. చెలి నీవెవ్వరిదానవు
చెలువారఁగఁ జెప్పుమనినఁ జింతించుచు నా
చెలిమిన్న దాఁప కిట్లనెఁ
జెలువారఁగ వకుళతోడఁ జిత్తం బలరన్. 352

సీ. ఆకాశరాజేంద్రు నాత్మజచెలికత్తె
నన నగ నవ్వకుళ దానిని బ్రియంబుఁ
జూచి యమ్మా! మోము సొక్కినట్లున్న ది
యేమి చెప్పు మటన్న నామెలంత
గని యమ్మ నాచింత కడుకష్టమైనదే
నెట్లు చెప్పుదు నీకు నెల్ల మగువ
వకుళ యిట్లనెను దాఁపక చెప్పు మంతయు
నన నగ నాచెలికత్తె యనియె నిట్లు
తే. వనవిహారంబు సేయంగ వాంఛ యెసఁగి
మనుజనాథునిపుత్త్రి పద్మావతియును
మేము నట కేగి విహరింపఁ మేటిగజము
వచ్చెఁ బరుగిడి వెనువెంట వచ్చె నొకఁడు. 353

సీ. వాఁ డెట్టివాఁ డన్న *వనదాభవర్ణుండు
లలిత సద్భూషణాలంకృతుండు
నాజానుబాహుండు నబ్జపత్రాక్షుండు
పర్వేందువదనుండు భాగ్యయుతుఁడు
గంభీరవక్షుండు కరుణార్ద్రహృదయుండు
మహితశ్రీమన్మథమన్మథుండు
కమనీయతురగంబు గలవాఁడు శరచాప
ములు పూని విక్రమంబును గడంగి
తే. రాఁగ నాయాము లేనుఁగ నేగె నంతఁ
దురగమును డిగ్గి వచ్చిన పురుషుఁ డపుడు
పరఁగఁ బద్మావతిం జూచి పల్కులాడు
చుండె నేమేమొ బహువింత లొప్ప నచట. 354

వ. అంత నారాజకన్యక వచ్చిన శబరునియందుఁ గోపించి ఱాలను రువ్వించె నతఁ డెక్కినతురంగంబు నేలం బడియె నతం డుత్తరాభిముఖుండై మఱల నాహయంబును దట్టి దానియందలి గూర్చుని నేగె నప్పద్మావతి నిజమందిరంబున కేగి యక్కిరాత విభుని మఱలఁ దలంచుటం జేసి, యేమో యొకవిచారంబు మనంబునం బొడమి మాటాడక తాపజ్వరంబునఁ దలిదండ్రులతోడ మాటాడకుండుటం జేసి జననీజనకులు తజ్జ్వరతాపంబు నివారణంబు సేయుటకు బృహస్పతిని రావించియమ్మహాత్మునికిం బద్మావతింజూపి కన్నీరునించుచు నానృపాలుం డిట్లనియె. 355

సీ. దేశికా పద్మావతికి నిట్లు తాపజ్వ
రంబు రాఁగా బిడ్డ రాత్రి నిదుర

---

వనద = మేఘము.

శోక తాపంబుచేఁ బొరలుచు నుండె మీ
రిది మాన్ప నౌషధం బియ్యవలయు
నన విని గురుఁ డిట్టు లనియె నృపాల యీ
బాలామణికిఁ బ్రాణభయము లేదు
చింతింపవలదు చెచ్చెరను రుద్రాభిషే
కంబు సేయింపుఁడు కల్గు సుఖము
తే. నీవు చేయింపుమని పల్క భూవిభుండు
బ్రాహ్మణుల నిచ్చటికిఁ బంపి ఫలసుమములు
గొనుచు పొమ్మని నాచేతఁ గోవెలకును
జెప్ప వచ్చితి నవి గొని చింత నిడియ
నింక నీవెందు వచ్చితో నెఱుఁగఁ జెపుమ. 356

వ. అనిన విని వకుళ మనంబునఁ దలంచినకార్యం బనుకూలము నకు వచ్చినదని సంతసించుచు నవ్వేలఁది కిట్లనియె. 357

సీ. వినుమోలతాంగి నే వేంకటేశునిదాసి
యొకకార్యమునకు ని ట్లుదయమునన
పైనమైవచ్చితిఁ బట్టణం బిఁకఁజేరి
యంతరంగంబున కరిగి యచట
నాధరణీదేవి కాప్తవాక్యము చెప్ప
వచ్చితి ననఁగ నవ్వనితపల్కె
నభవుని కభిషేకమగునంత కిచ్చోట
నిల్చియుండితివేని నేను నిన్నుఁ
తే. దోడుకొనిపోదు నన దాని తోడుకొఱకు
వకుళ యచ్చటనుండె నవ్వల ఫణీంద్ర

శైలపతి యప్పుడతిమీఁదిబాళిచేత
ధీరుఁ డయ్యును మదిని చింతించుచుండె. 358

వ. అని చెప్పిన సూతుంజూచి శౌనకాదు లావలిచరిత్ర మేమన
నతం డిట్లనియె. 359

క. సోమదివాకరలోచన
దామోదర శంఖచక్రధర భవహరను
త్రామోద్ధారక గురువర
శ్రీమద్వేంకటగిరీంద్ర జితదనుజేంద్రా! 360

మాలిని.—
సురుచిరగుణధామా శుభ్రసత్కీర్తికామా
మురదనుజవిరామా మోక్షకల్యాణసీమా
గురుతరశుభనామా ఘోరసంగ్రామభీమా
ద్విరదకుముదసోమా దేవతాసార్వభౌమా! 361

గద్య. ఇది శ్రీతరిగొండ లక్ష్మీనృసింహ కరుణాకటాక్షకలిత కవితా
విలాస వసిష్ఠగోత్రపవిత్ర కృష్ణయామాత్యతనూభవ వేంక
మాంబా ప్రణీతం బైన శ్రీవేంకటాచలమాహాత్మ్యం బను
భవిష్యోత్తరపురాణంబునం దిష్టదేవతా ప్రార్థనంబును, శౌన
కాదులు ప్రశ్నయు, జనకశతానందసంభాషణంబును, శేష
మారుతసంవాదంబును, శేషాద్రి ప్రమాణ భావంబులును,
మాధవాఖ్యవిప్రునిచరిత్రయు, వేంకటేశ్వరుఁడు వైకుంఠం
బును జేరుటయు, నారదుండు బ్రహ్మకు వేంకటేశ్వరుఁడు
వైకుంఠమునకుఁ బోయినట్లు చెప్పుటయు, నారదుఁడు
త్రిమూర్తులం బరీక్షచేయించుటయు, భృగుండు త్రిమూ
ర్తులగుణంబులు గనుటయు, హరితోడ లక్ష్మీదేవి ప్రేమకల

హంబు పూని కొల్లాపురంబు సేరుటయు హరి వైకుంఠము విడిచి శేషాచలంబున వల్మీకంబునం జేరుటయు, బ్రహ్మరుద్రులు ధేనువత్సరూపంబులం జని హరికి నాహారంబు నొసంగుటయు, చోళరాజాంగన గోపకుని దండించుటయు, హరిశిరంబునగోపకుండు గొడ్డంట నడుకుటయు, చోళరాజుకు చక్రి శాపం బిడుటయు, గీష్పతి హరికి నౌషధంబు చెప్పిపోవుటయు, శౌనకాదులు హరిచరిత్రకుఁ బశ్చాత్తాప మొందుటయు, వల్మీకతింత్రిణీప్రభావంబును, శేషపర్వతమహిమంబును, వరాహ శ్రీనివాసుల సంవాదంబును, హరికి వరాహస్వామి చోటిచ్చుటయు, వకుళమాలికావృత్తాంతంబును, శ్రీమదాకాశరాజు వృత్తాంతంబును, పద్మావతి భూమియం దుదయించుటయు, వసంతఋతువర్ణనంబును, పద్మావతి వనవిహారంబు సేయుటయు, నారదుండు పద్మావతితో సంభాషించి పోవుటయును, శ్రీనివాసుండు వేటాడుటయు, హరి కరిని రక్షించుటయు, వనమధ్యంబునఁ బద్మావతిని హరి చూచి తనయుదంతంబంతయుఁ జెప్పుటయు, పద్మావతి కలహించి చెలులచేత హరిపై రాల రువ్వించుటయు, హరి గిరికేగి వల్మీకంబునఁ జొచ్చుటయు, వకుళమాలిక హరిని ప్రియంబున మాటాడించుటయు, హరి యెట్టకేలకు వకుళకుం దననిజంబు వక్కాణించుటయు, రామకథయు, వేదవతీవృత్తాంతంబును, నారాయణవనపుర వర్ణనంబును, పద్మావతిగృహంబున కరిగి హరిం దలంచుకొని తాపజ్వరం బనుభవించుటయు, వకుళ నారాయణవనపురి కేగి పద్మావతి చెలికత్తెంజూచి మాటాడుటయుననుకథలంగల చతుర్థాశ్వాసము.

శ్రీ ర స్తు.

# శ్రీ వేంకటాచల మాహాత్మ్యము

## పంచమాశ్వాసము.

---

క. విశ్వాతీతగుణాకర
విశ్వోద్ధర విష్ణుదేవ వేదవిహారా
విశ్వేశ్వర సురపూజిత
శాశ్వత తఱికుండనృహరి జనహితకారీ. 1

ఆ. సూత వకుళ దండశూకాద్రి దిగిపోయి
నపుడు విష్ణుదేవుఁ డద్రియందు
నుండి యే ప్రయత్న మొనరఁజేయుచునుండె
చెప్పు మనఁగ సూతుఁ డప్పు డనియె. 2

తే. వినుఁడు మునులార హరిసేయు వింతలన్ని
చెప్పెదను మీ కదెట్లన శ్రీధరుండు
వేంకటాచలమందుండి వేడ్కగాను
దాను దనమదిలో నిట్లుదలఁచె నెలమి. 3

సీ. వకుళను నే నావివాహప్రయత్నంబు
నేయనంపితి వారిఁ జేరి యచట
నెళవుగ మాటాడ నేర్చునో నేరదో
సుగుణులు సనులౌనె పొలఁతిచేత

బడుచు గల్గినవారు పట్టుగ నామూల
  మెఱుఁగలు గనుక నా కీయమనుచుఁ
బొమ్మన నటుమీఁదఁ బోఁగూడ దచటికి
  మొదట సంధానమే కుదురవలయు
తే. ననుచు యోచించి సర్వజ్ఞుఁడయ్యు నరుని
కరణిఁ జింతించి తాను శీఘ్రముగ లేచి
యప్పుడతిఁ జూడఁగోరి మోహంబుచేతఁ
దాళనోపక యొకవిచిత్రం బొనర్చె. 4

ఉ. అవ్విధ మెట్టులన్న వినుఁ డబ్జదళాక్షుఁడు జీర్ణవస్త్రమున్
నివ్వటిలంగఁ గట్టుకొని నేయపు మై నొక ప్రాఁతకంచుకం
బవ్వల బాగుగాఁ దొడఁగి యవ్వ విధంబున నొంగి లేచుచున్
నవ్వుచుఁ గొండ డిగ్గి తన నాఁడెము లోకుల కెల్లఁ జూపుచున్.

సీ. దంతపుసొమ్ములు తగుబండి గురిగింజ
  దండ లొప్పఁగ మెడనిండఁ దాల్చి
నీరజభవు నేడునెలల బాలుని చేసి
  యాదరించుచుఁ బ్రక్క నంటఁగట్టి
సంకుటుంగరములు పొంకంబుగాఁ బెట్టి
  తగువగు నొక్క బెత్తంబు పట్టి
మునుకొని నవధాన్యములు నించి యొకబుట్టి
  శిరమునం దిడుకొని శీఘ్రముగను
తే. బోయి నారాయణాఖ్య సత్పురము నేరి
చెలఁగి యాయూరియమ్మలక్కలను జూచి
యెఱుక యెఱుకోయటం చెలుంగెత్తి పలుక
విని పురస్త్రీలు దాని బల్పింతగాను. 6

తే. మురిపమునఁ జూచి పలికిరో ముసలిదాన
గద్దె చెప్పుము మాకు నిక్కంబుగాను
బలుకగా నంతలో రాచచెలులు వచ్చి
యెఱుకతను జూచి వేడ్కమై నిట్టు లనిరి. 7

క. దిట్టతనంబుగ నీవిపు
డెట్టిట్టు వచింపకుండ నెదనెన్నికలం
బట్టుగఁ జెప్పితె యెఱుకత
పట్టుపలువ లిత్తు మెలమి వలుకుము సరవిన్ 8

క. ఎఱుకత యిట్లనియెను నా
యెఱుకయ జీవనము జనులకెల్ల నెపుడు నా
యెఱుకయ శుభదము శాశ్వత
మెఱుకయ సకలప్రపంచ మెఱుకయ నేనున్ 9

సీ. వినుఁడు నా యెఱు కెట్టిదని యంటిరేని యీ
పంచభూతాలఁ బుట్టించు నెఱుక
సరసజాగ్రత్తకు స్వప్నంబునకు దుదఁ
మొదలు తానై మూఁట గుదురు నెఱుక
దండిగ బ్రహ్మాండభాండతండములందు
నిండి కుండలినంటి యుండు నెఱుక
మొనసి యాపోజ్యోతి నెనసి తాఁ దనయంద
నిలిచి యానందించి వెలుఁగు నెఱుక
తే. యిట్టి యెఱు కెవ్వ తెరుఁగరా యెఱుక నిజము
నెఱుక నేర్చినవారి కా యెఱుక యేను
జెప్పెదను గాని మీకు నేఁ జెప్ప ననినఁ
జెలులు విని ధరణీదేవి చెంత కరిగి. 10

తే. పల్కె రెట్లని తల్లి యీపట్టణమున
కొనర నెఱుకలసాని వచ్చినది దాని
నిటకు రప్పించి సుతకష్ట మేవిధమున
దీఱునో తద్రహస్యంబు దెలియ నడుగు. 11

మ. అని యాకాంతలు వల్క రాజసతి నెయ్యం బొప్పఁగా
దానిఁ దోడ్కొని రాఁ బొండని వల్కఁగా నరిగి వే కోర్కె
ల్గనం దాని రమ్మనుచున్ గొప్పఁగ నెంచి వారు పరమాహ్లా
దంబుతో నందుఁ బిల్చిన వేరాకయ బిడ్డఁ దేద్చు ననుచుం
జేఁదట్టి లాలించుచున్. 12

ఉ. ఆకుఱవంజి యిట్లనియె నాటకు రమ్మని బిల్వ వచ్చి నా
రాకొనినాఁడు బిడ్డఁ డిప్పుఁ డమ్మల నక్కల నేడనైన నే
జోకుగఁ జేరి వారలకు సోదె నిజంబుగఁ జెప్పకుండినన్
నాకడు పెట్లు నిండునని నవ్వుచుఁ బల్కుచుఁ మూల్గి యిట్లనెన్.

సీ. భాగ్యవంతులు వారు బహుపేదరాలు నే
నెట్టువత్తు నచటికి నెలమిమీఱ
నాబొక్కనోరును నాతెల్లవెండ్రుకల్
గొప్పకడుపును బెద్ద దొప్పచెవులు
గూని వీఁపును బండిగురిగింజదండలు
దంతపు సొమ్ములు వింతదెల్పుఁ
గనుఁగొని మణుల బంగరుసొమ్ము లొగిఁబెట్టి
యుండువారలు నవ్వుచుండ్రు గనుక
తే. నాకు సిగ్గగు నీరాచనగరి కేను
వచ్చుటకుఁ గార్యమేమి నావలెనె పేద

తెలిసి నైనట్టివారికి నెఱుక చెప్పుచుం
బొట్టఁ గడుపుచు నుండుదు పొలఁతులార. 14

తే. అనిన వారిట్టు లనిరి మాయమ్మ తెలుక
నిజముగా నీవు చెప్పిన నీకురత్న
భూషణాలిచ్చి బంగరు పుట్టమిచ్చి
పొమ్మనును నీకవిప్పింపఁ బూటి మేము. 15

మ. అని వా రాసతి కాప్తలై పలికి నెయ్యం బొప్పఁగా దాని దో
డ్కొనియంతఃపురమందుఁ జేర్చి రచటం గూర్మిక్ ధరాకాంత దా
నిని బంగారపుఁ బీటపై నునిచి మన్నింపంగ నీక్షించి యి
ట్లనె నా సోదెలసాని నవ్వుచు మహాహ్లాదంబు దీపింపఁగన్.

ఆ. వనిత నీవు భాగ్యవతి నేను గడు పేద
దానఁ గాన నాకుఁ దనయునకును
బాలు బువ్వబెట్టి మేలైన విడెము నా
కిచ్చి యడుగు మెఱుక యెలమి గులుక. 17

క. అప్పుడు క్షీరాన్నంబును
దెప్పున బిడ్డఁడును దానిఁ దిని లేచి ముదం
బొప్పఁగ ధరణీదేవిని
గప్పురవిడె మిమ్మటంచు గ్రక్కున నడిగెన్. 18

సీ. ఆయెఱుకలసాని కాధరణీదేవి
విడెమిచ్చి పల్కెనో వెలఁది మీఁది
యేదేశ మిపుడు మీ యుండ్లేడనుండు మీ
యూరు పేరేమి మాయూరి కేల
వచ్చితి వనఁగ నవ్వనితను జూచి సో
దెలసాని నవ్వుచుఁ బలికె నిట్లు

తెలుప మిన్నా! విను మెఱుకులవారికి
నింద్లెందుఁ గలవు భూమీశవనిత
తే. గుడిసె లాడాడఁ గావించి కొన్ని దినము
లుండిపోయెడువారల కూరు దేశ
మేల యీయూరిదయితల కెఱుక సెప్ప
వలసి వచ్చితి వింటె మాకులగతులును. 19

సీ. ఎఱుకవారల కెల్ల గుఱికట్టుగా నిల్వ
నొక్కచోటున్నది నిక్కముగను
నవి యేడన్న నాల్గాఱును బదియుఁ బం
డ్రెండుపదాఱును రెండునైన
శృంగపంక్తులుచేత నింగి కెగురుచుండు
నాఱుకొండలకు మీఁదైన కొండ
వేయు శృంగములొప్పు వీక్షింపఁ దగుకొండ
మూఁడేళ్లతోఁగూడి మొనయుకొండ
తే. నాల్గు త్రోవలకును నట్టనడిమి కొండ
పాము తనలోన నుండఁగఁ బ్రబలు కొండ
మేటి కరుపలిఁ దనరారి మెఱయు కొండ
తొంటి మా పెద్దలున్నట్టి దొడ్డ కొండ. 20

క. ఆకొండమీఁద నిక్కము
మాకాఁపుర మెపుడు చెలఁగు మఱి జీవికకై
లోకుల కెఱుకలు సెప్పుచు
జోకుగఁ బ్రదుకుదుము మేము సోదె లడుగుమా. 21

క. చెప్పెద ముం తెడు ముత్తెము
లిప్పించుము నాకు ననుచు నెఱుకత తనతోఁ

జెప్పఁగ నానృపసతి విని
యప్పుడ ముత్యము లొసంగె యానందముగన్. 22

ఆ. పసిఁడి చేటలోని పండుముత్తెంబు లా
గద్దె పొలఁతి సూచి కరము సాఁచి
ముత్తెములను బిసికి మూఁడురాసులు చేసి
మధ్యరాశియందు మనసు నిల్పి. 23

వ. ముమ్మాఱు నారాసికిం జేనెత్తి మ్రొక్కి నోట గంగాపుణ్య తీర్థంబులను గాశీగయాప్రయాగప్రముఖపుణ్యక్షేత్రంబులను, హరిహరబ్రహ్మాదిదేవతలను, బరాశక్తి ప్రముఖానేక శక్తులను వచించుచు మ్రొక్కి మఱియు నిట్లనియె. 24

క. విను ధరణీసతి యిచటికి
నెనరున దేవుళ్లువచ్చి నిలిసిరి నీవిం
కను దక్షిణతాంబూలం
బును గొనిరా మ్రొక్కు గద్దె బుట్టను దనరన్. 25

వ. అనిన విని దక్షిణతాంబూలంబులు వెట్టి గద్దెబుట్టికి మ్రొక్కులిడి యెఱుకలసానితో ధరణీదేవి యిట్లనియె. 26

తే. కొమ్మ నామదిలోనుండు గోర్కె నీవు
చెప్ప నీకొడుకున కందె లొప్ప నిత్తు
నీకు దివ్యాంబరంబుల నెమ్మి నిత్తు
దబ్బరాడకు నెఱుకత తలఁచి నుడువు. 27

క. అని పల్కఁగ రాణిం గనుఁ
గొని యెఱుకత యిట్టు లనియెఁ గొడుకా మదిలో
ననుమానింపకు మిప్పుడు
ఘనతగ నీకోర్కెఁ జెప్పఁ గల నెసలారన్ 28

వ. అని చెప్పుటంజేసి ధరణీదేవి దాని కెదురుగఁ బసిండిపీటం గూర్చుండఁ దనచేతిజెత్తం బయ్యింతిచేతి కిచ్చి తా నొక ప్రక్క పట్టుకుని 'విఘ్నేశ్వరా వీరభద్రా మళయాళభగవతీ మధురమీనాక్షీ యామ్నాయాక్షీ కామాక్షీ కనకదుర్గాంబ చౌడాంబ జ్ఞానాంబ కొల్లాపురిలక్ష్మీ మీరెల్లరు వచ్చి మంచివాకియ్యరే వాకియ్యరే యని ప్రార్థించి యిట్లనియె.

క. దిక్కులు సూడక సతి నా
దిక్కున నీవిపుడు చూడు దేవరతోడే
నిక్కము సెప్పెద నీకని
మక్కువ నాయెఱుకలమ్మ మఱి యిట్లనియెన్. 30

వ. అవ్వో యవ్వ నీతలఁచినతలంపు మేలౌతాదంట దేవుళ్లు పలుకుచుండారు, తలంచినతలం పేమంటివా సెప్పెద విను. వైతమ్మ బిడ్డంటె కడుపుసూపుదు తోడఁబుట్టంటె భుజంబును సూపుదును నీవిట్లు తోడఁబుట్టు కడుగలేదు. ఇట్లా బిడ్డ కడుగుసుండావు. ఆబిడ్డ ఆడుబిడ్డంటావా మగ బిడ్డంటావా చెప్పెద సూడు కొడకా, యాఁడబిడ్డంటె చెవుసూపుదును మగబిడ్డంటె గడ్డంబుసూపుదును, ఇదిగో యిట్టి మగబిడ్డ కడుగలేదు. ఆఁడబిడ్డ కడుగుసుండావే, అవ్వో యవ్వ ఆయాఁడబిడ్డకు నొకసింత కలిగుండాది ఆసింతయేమంటావా నిన్నటిదినము నీబిడ్డ వనానికేగినాది ఆడ తురగారూఢుండైన నల్లనయ్యను జూచి మోహించియుండాది యెందుండి ఆనల్లనయ్య వచ్చినాడంటారా చెప్పెదను దల్లీ ఇదిగో యీ మూలనుండాఁడు ' ఆమూల దెలియలేదంటె యీడికి వాయువ్యభాగాన బడిగెలతో మెఱయుసుండు బంగారు

కొండమీాద నుండెవాఁడె కొడుకా వాఁడెవం డంటావా
బొల్లినామంబులు పెట్టుకొని బొల్లిగద్ద నెక్కి కొల్లకాఁడై
యెల్లదిక్కుల దిరుగు నల్లనయ్యే తల్లి, వాఁడు నిబద్దిగాను
నారాయణుండెకాని నరుండుకాఁడే యమ్మా వాఁడు నీబిడ్డను
బెండ్లాడవలె నని యుండాఁడె వాని నీబిడ పెండ్లాడనెంచి
యుండాదె, కాఁబట్టి నీపుత్త్రికను ఆసామికిచ్చి పెండ్లిచేసి
కన్నులార సూడుము తల్లీ సుకంగానుంటాది లేకుంటె
కష్టాలు రాఁబోతుండాదె యమ్మ' యని చెప్పిన విని ధరణీ
దేవి యెఱుకతం జూచి సంతసించి యిట్లనియె. 31

క. ఓయెఱుకత నీమాటలు
మాయఁగఁ దోఁచినవి మనుజ మానినులను నా
రాయణుఁడు పెండ్లియాడిన
దీయవనిం గాన మెందు నిది నిజమేనా. 32

సీ. అని వింత పడి నవ్వి యడుగఁగ నప్పుడా
యెఱుకలసాని తా నిట్టు లనియె
నాస్వామి మదకరి నదలించి తఱుముచు
వచ్చి నీసుతయున్న వనము సేరి
తనకులగోత్రము ల్తనకోర్కె నీముద్దు
చిన్నారిబిడ్డకుఁ జెప్పినాఁడు
నీపుత్త్రి యది విని నిష్ఠురోక్తులు పల్కి
యతఁ డెక్కి వచ్చిన హయముమీాఁద
తే. ఱాల రువ్వింప నేల గుఱ్ఱంబు పడియె
నతఁడు మన్నించి యావేంకటాద్రిఁ జేరె

ముదిత కామిూఁద మఱికామ మూర్ఛదాఁకె
విరహతాపజ్వరంబుతో వేఁగసాఁగె. 33

తే. ఆజ్వరము మాన్ప వేఱె లే దౌషధంబు
కమలనయనుని మోము నీకన్య కిపుడు
చూప నాలేమమిన్నకుఁ దాప మడఁగు
నూరకే నన్ను నడుగుట నొప్పుఁ గలదె? 34

తే. అనుచుఁ బల్కిన కొఱవంజి యవ్వఁ జూచి
ధరణిదేవి యిదేమిపో దబ్బ రనుచు
కమలలోచనుఁ డేడ మా కన్యయేడ
నతని యిది చూచు టేడ నీ వనుట కల్ల. 35

క. విన విన దబ్బరగాఁ దోఁ
చిన దిది యెప్పుడును లేనిచిత్రం బాహా
యన నెఱుకత విని యీవిధ
మనియెను నామాట దప్ప దవ్వో యవ్వా. 36

సీ. ఇఁకఁ గొంతతడవున కిచటికిఁ బెండ్లిపె
త్తనము నేయుటకు మోదంబుమీఱ
నావేంకటేశ్వరుం డంపఁగ నొక యింతి
వచ్చును నానిజ మచ్చుమెచ్చు
తెలియు నీకిపు డెంత తెలియఁ జెప్పినఁగాని
దెలియలేదో ధరాదేవి నీకుఁ
దెలిసినప్పటికి న న్బిలిపించి బహుమాన
మిప్పించు మిప్పుడే మియ్యవలదు

తే. నాకిపుడు నీవు సెలవిమ్ము నీకొమార్తె
పెండ్లినాఁటికి వత్తు నాబిడ్డతోడ

మగువనే నీకుఁ జెప్పిన మాట నిజము
దబ్బ రని యెంచ కమ్మరో తనయ నడుగు. 37

వ. అవ్వో యవ్వ కడుపుకూటికి దబ్బరాడితి నని తలంచి యుండావే, అది కల్లగాదు కైలాటగాదు తరకట బరకట గాదు తబ్బిబ్బుగాదు, తసుకుకాదు తాటోటు మాటలు గాదు, ఆడంబరముగాదు, ఈడెలుగాదు, ఈలు తాలు గాదు, బొంకుగాదు, బోసకత్తెలు మాటలుగాదే యమ్మ కూఁతునుజూచి యడిగితె నిజంబు దెలస్తాదె, నామాట నా గెద్దబుట్టతోడె నాబుడకఁడుతోడె నిజమేగాని కల్లగాదు తల్లీ యని దిగ్గున లేచి పోయి పరమపురుషుండైన నారాయణుండు వేంకటాద్రియందు నిజరూపంబున నుండె నంత ధరణీదేవి పరమాశ్చర్యంబునఁ బద్మావతికడకుం జని యిట్లనియె. 38

ఉ. అమ్మ యిదేమి పద్మ యిపు డారటఁ బొర్లుచుఁ బవ్వళించి యీ, సొమ్మసిలంగ నేల యికఁ జొప్పడలే యిక నిన్నుఁ జూచి నే, నెమ్మది నెట్టు లుండెదను నీమదిలోఁ గల మర్మ మిపు డిక్కముగఁ జెప్పు నీకలికి కన్నుల నీరిటు నించ నేటికే.

క. నేవల దన్నను నిలువక
యావనమున కరిగి నిన్న నాటాడఁగ ని
న్నావించుచుఁ గని రెవ్వరు
నీవెవరిం గంటి వచట నీరజనేత్రా. 40

తే. నీవు బిడ్డవు నాకు నే నీకుఁ దల్లి
యఱమఱను లేక చెప్పు నీ యాత్మచింత
వింత దాఁపక యికఁ జెప్పు వెఱువ నేల
యనిన నక్కన్య మాటాడ కడలసాఁగె. 41

క. ఆకన్యక యీవిధమున
శోకింపఁగఁ జూచి కొంత చోద్యపడుచు నీ
కీ కరణిగ నతిదుఃఖము
రాకకు గత మేమి దెల్పు రహిఁ మాయమ్మా 42.

తే. అమ్మ నిజముగ లోకాన నాప్తు లింక
నాకెవరు లేరు నాకన్న నీకు లేరు
నన్ను నఱమఱఁగాఁ జూడ కున్నమాట
దాఁపకయచెప్పు మిపుడు నాతండ్రితోడె. 43.

చ. అని యిటు లానఁబెట్టి సుత నప్పుడు మెల్లఁగ లేవనెత్తి తా
ననుపమప్రేమతోడను నిజాంకతలంబున నుంచి శీర్షముఁ
దనచెయిదమ్మిచే నివిరి తద్దయు లాలనఁజేసి యడ్గఁగాఁ
దన తలవంచి పల్కనిసుతం గని యిట్లనె ధాత్రిదేవి తాన్.

ఆ. పట్టినీడు పాపఫలమును గాదిది
యరయ నేనుజేసినట్టిపాప
ఫలముగాని నిన్ను బాధింప నేటికి
నంచు నీరు వెట్టె నతుఁ లందు. 45.

సీ. ఆరీతిఁ దనతోఁజ కార్తిబొందిన తల్లి
నాపడంతుక చూచి తాపమొంది
కనులబాష్పములొల్కఁగా నిట్టు లనియె నో
యమ్మపుష్పవనంబునందు నేను
సఖులతో నాటాడు సమయాన నచటికి
దివ్యపూరుషుఁ డొక్కతేజిమీఁదఁ
దగ నెక్కివచ్చిన న్నొగిఁజూచి యెక్కస
క్కెములాడె నేనట్టి గేలి కపుడు

తే. ఱాల రువ్వించి తతనిపై నేల యతని
గుఱ్ఱమొగ్గెను మఱి యతం డుఱ్ఱఁబాఱె
నెచటికోపోయె నాతని నిఘుగన్న
యట్టులున్నది తల్లి నాయాస పడకు. 46

క. అని పద్మావతి వల్కఁగ
విని ధరణీదేవి సుతను వీక్షించి మనం
బున మోదము ఖేదము పెనఁ
గొనఁగా లజ్జించి ప్రేమ కూఁతురి కనియెన్ 47

సీ. నాతల్లి యీచిన్ననాఁట నీ కిటువంటి
బుద్ధి యేల జనించెఁ బుత్రి చూడ
వనమున కేగి యావనపూరుషునిఁజూచి
వలచె నందుఱు నిన్ను వనజవదన
పుట్టిపుట్టక తొల్లి పురుషస్వరూపంబు
నీకెట్లు దెలిసెనే నీలవేణి
వానికులంబేమొ వానిపై నీకింత
మఱులేల కల్గెనె మధురవాణి

తే. కటకటా! మానధనుఁడు నిన్గన్నతండ్రి
నీమనోవ్యథ నిజముగ నేఁడు వింటి
చింతచేఁ దలయెత్తలే కింత మదిని
గుందుదును దీనికే త్రోవ గుట్టుగాదె. 48

క. వనమున సుందరపురుషుని
గనుఁగొని మదిలో వరించెఁగాఁ గూఁతు రటం
చును రాజు నవరె లోకులు
వినవలయుఁ గదా మఱింక విధి కేమందున్. 49

క. లోకం బంతయు మాయను
మాఁకుఁడు లే దతని నేల మోహించితివే
కూఁతుర మాకును నీకును
బ్రాకటబుణ మింతె కీర్తి రాఁగలదె మహిన్. 50

సీ. అని యిట్లు వలుకఁగ నపుడు పద్మావతి
హరి పూర్వవృత్తాంత మాత్మయందుఁ
దలఁచి యిట్లనియె నోతల్లి నీ కపకీర్తి
వచ్చును ననుచింత వల దతండు
మనుజమాత్రుఁ డటంచు మది నెంచినావేమొ
మనుజుండు గాఁడు రమావిభుండు
పురుషోత్తముండు సంపూర్ణప్రకాశుండు
సర్వజ్ఞుఁ డాఢ్యుండు శాశ్వతుండు
తే. గాన నాస్వామియందు నామానసంబు
కుదిరి నిలిచిన దది నాకుఁ గొదువగాదు
నాకొఱకు భూమి నపకీర్తి మీకు లేదు
కావలసినట్టిపను లింకఁ గాక వోదు. 51

వ. వినుము జననీమతల్లి చింతమాను మే మహామహుని దివ్య చక్రంబు కౌరవబలంబులం ద్రుంచి కరినగరంబున ధర్మరాజును పట్టభద్రుంజేసి తత్పురసంరక్షణంబు సేయుచుండు, నేమహాత్ముని శంఖారావంబు దైత్యబృందంబునకు భయప్రదంబై దేవతల కానందంబు నిచ్చుచుండు నట్టి శంఖచక్రధరుం డైన పరమపురుషుండు లీలామానుషవిగ్రహుండునై నిన్న నవ్వనంబున నాకుంగాక చెలులకుంగూడ దర్శనం బిచ్చినవాఁడు నే నీమర్త్యలోకంబున నుండఁదగినరీతి కాతని

యందు ఆలకువ్వించితి నయ్యపచారం బేను జేసినందుల కష్ట హావిష్టుండు నన్ను రక్షించునో రక్షింపఁడో యనుసందియం బును భయంబును బెనఁగొని కన్నీరునించుటయె కాని కామ వికారవ్యాపారంబు నాకింత కేల శ్రీనివాసుని దివ్యమంగళ రూపంబు నాకు నగుపడకుండినచో నుసురులఁ దొఅంగెదఁ బ్రత్యక్షం బైనఁ బ్రాణంబు లుంచుకొనెదనని పూలపాన్పు నందు వ్రాలుటంజేసి చూచి ధరణీదేవి యచ్చెరువంది యిట్లనియె. 52.

సీ. అమ్మ పద్మావతీ హరిభక్తి నీచిత్త
మం దింతగా నిల్చినందువలన
నీకోర్కె సిద్ధించు శోకింప వల దింక
నాచక్రి నినుఁ బెండ్లియాడు ననుచు
దేటగ నొకధర్మ దేవత వచ్చి నా
కెఱుఁగఁజెప్పినమాట లేలదప్పు
దప్ప దిప్పుడు నీవు స్థైర్యంబుతో నుండు
మని చెప్పుచుండఁగా నంత నటకుఁ
తే. గ్రమముగా విప్రముఖ్యు లగస్త్య లింగ
మునకు రుద్రాభిషేకంబు దనరఁజేసి
పరఁగఁ దత్తీర్థమును బూలు పత్రి పండ్లు
కోరి గైకొని రాఁజూచి వారితోడ. 53.

తే. చెలులతోఁగూడి గుడినుండి చెలిమి దనర
వకుళమాలిక పల్కుచు వచ్చె నపుడు
ద్విజులు రుద్రాభిషేకసత్తీర్థ మమరఁ
జల్లి పద్మావతిశిరంబు నుల్లసముగ. 54.

తే. పూలు మంత్రాక్షతలు పండ్లు పాలఁ దెచ్చి
దీవన లొసంగి వోయిరి వేగ పెండ్లి
యగునటంచును వకుళను నపుడు వేఱ
వనితగానుంట గనుఁగొని మనమునందు. 55

క. ధరణీదేవి రయంబునఁ
బెరిమను దోడ్తెచ్చి రత్నపీఠమునందుం
గరమర్థి నునిచి వకుళను
గురుతర వినయంబు నడిగెఁ గూర్మి యెసంగన్ 56

సీ. అమ్మ నీ వెవ్వరికై వచ్చితివి యిట్టు
లెందుండి వచ్చితి విటకు నెలమి
వచియింపు మనఁగ నవ్వకుళమాలిక యిట్టు
లనియె నోయమ్మ శేషాద్రినుండి
వచ్చితి ననఁగ నెవ్వరిదాన వని ధర
ణీదేవి యడుగఁగా నిక్క మేను
ధర వేంకటేశుని దాననై యుందు నా
స్వామిపంపించఁగ వచ్చితిచటఁ
తే. జేరినానని వకుళ మచ్చికను బల్క
విని మహీపతి సతి యేమి పనికి నీవు
వచ్చినావని యడుగఁగ వకుళ యేను
బెండ్లి పెత్తనముగ ననెఁ జేర్మిఁ దనర. 57

క. అనిపల్కిన వకుళనుఁ గనుఁ
గొని ధరణీదేవి యెవరికొఱ కిప్పుడు పె
త్తన మిచటఁ జేయవచ్చితి
వని యడుగఁగ వకుళ యిట్టు లనియె ముదమునన్. 58

సీ. విను ధరణీదేవి వేంకటేశ్వరునకు
నల నీదుపుత్త్రిని నడుగ నిట్లు
వచ్చితి మీరన్యవరుని జూడఁగ మాని
మాటచెప్పుఁడు నాకు మనసు నెంచి
యన ధరణీదేవి యనె నిట్లు కులగోత్ర
ములు చెప్పు దల్లిదండ్రులను నుడువు
మని ధరణీదేవి యడుగఁగ వకుళ యి
ట్లనియెఁ గులంబు శీతాంశుకులము
తే. వరవసిష్ఠులగోత్రంబు వార కతని
దేవకీదేవి మఱి వసుదేవుఁ డెంచఁ
దల్లిదండ్రు లటంచును దనరఁ జెప్ప
నా పె నాతనిరూపగుణాదు లెల్ల. 59

వ. వినుపింప మనిన నవ్వకుళమాలిక యిట్లనియె. 60

సీ. సతి నీవు మాస్వామి సౌందర్య మడిగిన
మహితయామన్మథమన్మథుండె
పట్టుగ నతని సౌభాగ్యంబు నడిగినఁ
జెప్ప శక్యంబె లక్ష్మీవిభుండె
సురుచిరం బైనట్టి సుగుణంబు లడిగిన
గురుతరకల్యాణగుణగణుండె
చెలఁగి సదాచారశీలంబు లడిగిన
వేదోక్తసద్ధర్మవిధివశుండె
తే. సాహసౌదార్యగాంభీర్యసంపదలకు
శాంతసౌహార్ద్యకరుణారసంబులకును

విష్ణు వని యెంచురాజదేవీ భవత్కృ
దయమునందున నింక నింతకును మించి. 61

వ. చెప్ప నాకుఁ దరంబుగాదు గావున నీకన్యకారత్నం బాత్మ
నికిం దగినద పెక్కుయోచనలు సేయకు సత్యంబు వక్కా
ణించితిని. 62

మ. అని యాభామినివల్క రాజసతి నెయ్యం బారఁగా శ్రీరమా
వనితారత్నము చెంతనుండఁగను భావం బొప్ప మాకన్యకం
దమ చేఁబట్టు నటంచుఁ బల్కితివి చిత్తంబంచు నెంచంగ నా
కనుమానంబుగ నున్నదంతయు నరుల్ హాస్యంబు గావింపరే.

సీ. అని ధరణీదేవి యనుమానముగఁ బల్క
వకుళ యిట్లనియె నవ్వార్ధితనయ
కొల్లాపురముసేరి యెల్లభక్తులను ర
క్షించుచు నున్నది చెలఁగి నచట
కమలలే దాతని కడఁ గాన నీపుత్రి
నీక్షించి చక్రి మోహించినాఁడు
మీరు మీకన్యను నారాయణున కిచ్చి
చెలఁగి వివాహంబు సేయుఁ డంచుఁ
తే. జెప్పి యాసిరి యాపురిం జేరినట్టి
కారణం బంతయును జెప్పి కరము ప్రియము
వేదవతి జన్మవృత్తాంత మాదినుండి
పొసఁగ వినుపించి క్రమ్మఱఁ బొలఁతిఁజూచి. 64

తే. పల్కె నిమ్మెయి వకుళ మీపట్టియైన
పద్మపద్మాలయాంశసంభవయగాని

వేఱ జన్మముగాదు భావింప మీకుఁ
బుత్రియై పుట్టె మీపూర్వ పుణ్యమునను. 65

తే. పెండ్లి యేర్పాట్లు గావింప వేడ్క నన్నుఁ
బంపు మేగెద నాచక్రపాణి మీకు
నల్లుఁ డగుటకు మీభాగ్య మంచు ధరణి
దేవి కలరంగఁ జెప్పి యో దేవి యింక. 66

వ. నావచ్చినకారణం బంతయు రాజేంద్రునకు సంతసంబాఱ
వచించి నన్నుఁ బ్రయాణంబు గావింపు మనిన. 67

మ. ధరణీదేవి ముదంబుతో నరిగి చింతం బొందుచున్నట్టి భూ
వరునిం జూచి ప్రియోక్తులార శుభసద్వార్తల్ క్రమం
బొప్పఁగా, ధరఁ బుత్రిజననంబు దాని నిజవృత్తాంతంబు
నా శేషభూధరవాసుండు వరించినట్టి విధముఁ దార్ఢ్యం
బుగాఁ జెప్పఁగన్. 68

సీ. విని వింత నొంది వచ్చినవకుళాంగన
జూచి మన్నింప నాసుదతి చూచి
రాజుతో ననియె నో రాజ మీయింటికి
వచ్చి శ్రీశుభకర వార్తలన్ని
దేవేరి కెఱిఁగించితిని నిజం బిక్కార్య
మిఁకఁ బెండ్లిలగ్నంబు నెలమిఁజూడుఁ
డని వల్క నాన్నృపుం డానందమగ్నుఁడై
హరియేడ నేనేడ యహా యిదేమి

తే. వింతయనుచును వకుళతోఁ జింత తలఁగ
నామనంబునఁ బట్టు కున్నట్టితాప

మింక సుకృతుండ నైతి భూమీశులందుఁ
గీర్తి వడసితి నాభాగ్య కృతముగాదె. 69

వ. అని కొంత హరిలీలాచరిత్రంబునకు నచ్చెరువంది వకుళతో వెండియు నిట్లనియె. నీవు మాకుఁ బరమాప్తురాలైతివి, నీవశంబున నాచక్రి మాకు జామాత యగుటంజేసి మేము సుకృతాత్ములైతిమి నాపుత్రి నాహరి వరించినకథ విన నాహ్లాదం బగుచున్న యది. అని వకుళమాలికను బ్రియంబునంజూచి గౌరవించి పద్మావతి చెంతకేగి ముద్దిడి లాలించి యిట్లనియె.70

క. విను పద్మావతి నీమన
మున నింకఁ జింతింపవలదు ముజ్జగములు పా
లనసేయు సామి కిప్పుడ
నిను నొసఁగుదు వేడ్క వెలయ నిజము కుమారీ. 71

వ. అని పద్మావతికి నెమ్మదిచెప్పి నిజగురుని ధ్యానింప నతండు వచ్చుటంజూచి యాతని కెదురేగి యుచితార్చనలు గావించి తోడ్తెచ్చి బంగరుపీట నునిచి వకుళమాలిక వేంకటాద్రినుండి వచ్చిన యుదంతంబెల్ల నుడువ నగ్గురువర్యుం డానంద మొంది రాజుం గని యిట్లనియె. 72

సీ. అరయ నీపురికి నుత్తరభాగమునఁ బంచ
క్రోశదూరంబున గొప్పగాను
బ్రహ్మానుసంధాన పరుఁడై నశుకయోగి
యున్నవాఁ డతని మీ రుచితులైన
వారిని బంపి యవ్వరమునిఁ రావించు
విని రాజు వేడ్కఁ దమ్మునిని బంపి

శుకుని రప్పించి తాఁ జూచి యాతని కుచి
తార్చనములు చేసి యమల రత్న
తే. పీఠమునఁ జేర్చ నావలఁ జేర్చి గుహుని
చూచి సంతోషచిత్తుఁ శుకుఁడు పల్కె
నేమి యీనాడిన మిచ్చుట నెలమి మనము
చేరుటలటంచు నృపునకుఁ జెలఁగు శుభము. 73

క. సురగురువర నన్ని చటికిఁ
గరుణను బిలిపించినట్టి కార్యము తెల్పోఁ
ద్వరగాఁ జెప్పుఁడనంగను
గుహుఁడు ముదంబొదవ నాశుకున కిట్లనియెన్. 74

సీ. విను శుకయోగీంద్ర ఘనుఁ డైన వెంకటే
శ్వరుఁడు పద్మావతి వలచి తాను
బెండ్లియాడెద నను బ్రేమ శోభింపంగ
వకుళమాలిక యను వనిత నెనఁగ
ఘనతగఁ బెండ్లి పెత్తనము నేయుటకు నేఁ
డంపించినాఁడు నన్నెందుకోఅకు
నృపతి రప్పింపఁగ నేను వచ్చితి నీవు
వచ్చితి విపుడు భూవరున కేమి
తే. చెప్పవలె నన్న గురుని వీక్షించి శుకుఁడు
పల్కె నీరాజుపుణ్యప్రభావమునన
పద్మ గల్గిన దట్టి సౌభాగ్యనతికిఁ
దగఁడు మనుజుండు శ్రీరమాధవుఁడ గాక. 75

తే. అని నృపాలక నీవు మహాతపంబు
చేసి యుండుటఁ జేసి లక్ష్మీసమాన

యగు సుతం గాంచితివి వివాహంబు సేయు
శ్రీహరికి నిచ్చి పొందు సుశ్రేయసంబు. 76

చ. అని శుకయోగి పల్కఁగ ధరాధిపుఁ డెంతయు సంతసించి యి
ట్లనియె గురూత్తమా! యిఁక శుభాస్పదలగ్న మొకండు నీవు
పొం,తనములఁ జూచి పెట్టుఁ డనఁ దప్పక నాశుకుఁడుం
గుపుండు శ్రీ,తనరఁగఁ జూచి చూచి విధి ధర్మపథంబుల నొలి
న తెలిపెన్. 77

వ. నాడీరజ్జుగణ యోనివర్ణదినమాహేంద్ర దీర్ఘ గ్రహ మైత్ర
కూటాదులు వధూవరులకు సమరియుండుటకు మెచ్చి పుష్క
రాంశ ప్రకారంబునఁ దిథివారనక్షత్ర యోగకరణాదులం
బాతాభావాదిదోష వివహితంబుగం జూచి మధుమాసంబున
కెట్టి దోషంబులు లేవని వచించి పూర్వపక్షుక్ష పాకరసంచార
కాలంబున నిర్దోషంబుగ నొకముహూర్తంబు నిశ్చయించి
రాజు కెఱింగించి సంతసింపఁజేసిరి. అంత నాయాకాశ
రాజేంద్రుం డాబృహస్పతిం జూచి యిట్లనియె. 78

సీ. హరికి నమస్కారమనుచు వ్రాయించెద
నన విని ధిషణుఁ డిట్లనియె రాజ
ఆస్వామి మానవుం డై నీసుతను బెండ్లి
యాడఁ దలంచినాఁ డందువలన
మొనసి నమస్కార మని వ్రాయఁగూడ దా
శీర్వచనంబను శ్రేయమంచు
నమరఁ బత్రిక వ్రాసి యంపించు మని శుక
బ్రహ్మయుఁ బల్క భూపాలకుండు.

తే. సకల బంధుజనంబులు సకలమిత్ర
జనము లెల్లరు హర్షింప మనసునందుఁ
బొంగుచును భార్యయును వేడ్కఁ బొందఁగాను
బ్రాకటంబుగ బంగరుఁజేకుమీఁద. 79

వ. వకుళమాలిక సంతసింప నివ్విధంబున వ్రాయించె. 80

సీ. శ్రీమదఖండలక్ష్మీప్రసన్నేక్షణా
సదుల్లాసు లైన
యఖిలాండకోటి బ్రహ్మాండనాయకు లైన
సర్వజ్ఞులైన శ్రీ స్వామివారి
కాకాశనృపుఁ డాయురారోగ్యపుత్రపౌ
త్రాభివృద్ధులు గల్గునట్లుగాను
దీవించితిని మఱిదినమునఁ గుశలంబు
మాకు మీకుశలంబు మఱువకుండ

తే. వ్రాయుచుండఁగవలయు నావ్యాససుతుఁడు
గురుఁడు చెప్పఁగ మీకు నాకూఁతురైన
పద్మ నిచ్చి వివాహంబు బాగుగాను
జేయ నెంచితి కరుణించు శ్రీనివాస. 81

వ. అని వ్రాయించి హరిద్రాలేపన చిహ్నంబు సేయించి గురువుచే
నొసంగె నతం డది చూచి శుకయోగీంద్రుని కరంబుననిడె,
నతండు గని యానందించుచుండ శ్రీనివాసున కీశుభపత్రిక
గొంపోయి యిచ్చి ప్రత్యుత్తరంబు దెచ్చుటకు యోగ్యులగు
వారు తామయనిగురుండు శుకునింగని వల్క నదివిని శుకుం
డట్ల కానిమ్మని యాలేఖఁగొని వేంకటాచలారోహణంబు సేసి
వచ్చుచుండు శుకునిం గని శ్రీనివాసుం డెదురుసని ప్రియో

క్తులం దోడ్కొనివచ్చి తింత్రిణీవృక్షమూలంబునఁ దానిర్మించి
యున్న పుష్పపీఠంబునందుఁ గూర్చుండఁబెట్టి యిట్లనియె.

క. ఓ యోగీశ్వర సత్కృప
నీయెడ కిప్డొడ్కి వచ్చు టిది మేలయ్యెన్
మాయావిరహిత ! నాపని
కాయో పండో నిజంబుగాఁ దెల్పుమయా. 83

క. అనఁగను మందస్మితుఁడై
విని శుకయోగీంద్రుఁడనియె విశ్వాత్మక నీ
ఘనచిత్తంబునఁ దలఁచిన
పని కాయని చెప్పనేల పండై యుండన్. 84

చ. అని శుకయోగి వల్క నపు డబ్జదళాక్షుఁడు సంతసించి య
మ్మునికి నమస్కరించి తనముచ్చటలెల్ల నొకింత చెప్పఁగా
విని ముదమంది తాపసుఁడు వేడ్కను దాఁ గొనివచ్చినట్టి శ్రీ
తనరెడు భవ్యరేఖను మదాసురవైరికరంబుఁ బెట్టఁగన్. 85

క. అప్పుడు హరి యాపత్త్రిక
తప్పక తాఁ జదివి తెలిసి తడయక యపుడే
యొప్పుగ గేదఁగిఱేకున
గొప్పగ నిటు వ్రాసెఁ జేతిగోటం గ్రమమున్ 86

సీ. అంత శ్రీశుకునకు నానంద మొదవంగ
సరసిజనాభుండు చదివె నిట్లు
శ్రీపూర్ణ రాజపూజితులై నధర్మత
త్పరసుధర్మ సుధర్మ వరసుతులగు
సామ్రాజ్యకలితరాజశ్రీగగనరాజు
వారికి శేషాద్రివల్లభుండు

వందనంబులు నేఁటివఱకు మాకు శుభంబు
 వఱలుమీకుశలంబు వ్రాయఁదలఁతుఁ
తే. దసర వైశాఖమాసాది దశమి శుక్ర
వారమునరాత్రి శుభలగ్న మారయంగ
నుంట దెల్పుటచేత మే ముల్లసముగ
వత్తు మానాఁడు పదివేలు వందనములు. 87

సీ. అని తాను వ్రాసియున్నట్టియుత్తరమును
 శుకునకు వినిపించి చుట్టివాని
తోఁ బుష్పహారంబు దొడరియొసంగి య
 మ్మునితోడఁ బర్వతంబును ముదంబు
నం దిగి పంపి తా నగమున కేగెను
 నారాయణవనాఖ్యనగరమునకుఁ
జేరిమౌనీశుఁడా భూరమణునకిచ్చె
 నతఁడంది భార్యకు నలరఁ జూపి
తే. బంధుమిత్రాదులకుఁ జూపి పరమముదము
నొందె నావల శుకముని యుర్విపతికి
హరివచించిన విస్మయం బైన పల్కు
లన్ని యెఱిఁగించె దేవేజ్యుఁ డనుముదంబు. 88

వ. పొందెనంత నాకాశరాజేంద్రుఁ డాశుకమహర్షి కిం ద్రిదశా
చార్యకుం బ్రణమిల్లి సన్మానించుటంజేసి వారు తమస్థానంబుల
కేగిరి నృపుండు పురంబలంకరింపఁ జేయుఁడని చారులకు
నానతిచ్చె, నాధరణీదేవి వకుళమాలికకు దివ్యాంబరా భర
ణాదులచే సన్మానించి వీడ్కొలుప శేషాద్రికివచ్చి శ్రీనివాసుని
వీక్షించి యిట్లనియె. 89

సీ. నాతండ్రి వేంకట నారాయణపురంబు
నకుఁ బోయివచ్చితి సకలశుభము
లొదవె వివాహమహోత్సవంబునకు నే
నేమిపనుల్ సేయు దిచట నింక
విని హరివల్కెనో జనని యీపెండ్లి పె
త్తనము చేసితి వింక ద్రవ్యమేడ
దెచ్చెద వేనేడ దెత్తు దీని కుపాయ
మేమి నా కెఱిఁగింపు మిప్పుడనిన
తే. వకుళమాలిక పల్కె నవ్వనధితనయ
నిచ్చుటకిఁ బిల్వనంపిన నెచ్చుగాను
ధనము నీకిచ్చు ననఁగ నవ్వనజనేత్రుఁ
డపుడు వకుళను గాంచి యిట్లనియెఁ బ్రీతి. 90

సీ. వనజాలయను బాసి వచ్చి యిచ్చట పెండ్లి
యాడెద ననిన నా కాప్తమగును
ధనమిచ్చునే సిరి యని పల్కి తల వాంచి
చింతింప వకుళ యాశ్రీనివాసు
నీక్షించి వారితో నెంతయు నిజముగఁ
జెప్పి వచ్చితిని నీ విప్పుడిట్లు
చింతనొందిననేమి సేయుదు నీమాట
లావరాహస్వామి కైనఁ జెప్పి
తే. తప్ప కేమైన నొకప్రయత్నంబు చేసి
మానరక్షణ గావింప మంచిదరయ
వారు రమ్మన నపుడు ద్రవ్యంబులేక
పెండ్లి కిరీతిఁబోవఁ బ్రాపించు గేలి. 91

క. అని యవ్వకుళ మహాభయ
మునఁ బలుకఁగ నవ్వి చక్రి ముచ్చటగా ని
ట్లనియె వరాహస్వామిని
ధన మిమ్మని యడిగిరమ్ము తల్లీ యనఁగన్. 92

వ. అని హరి వినోదంబుగఁ జెప్పుటంజేసి వకుళాంగన వరాహ
స్వామి కడకేగి నమస్కరించి యిట్లనియె. 93

సీ. శ్రీవరాహస్వామి శ్రీనివాసుఁడు పెండ్లి
యాడఁ దలంచినాఁ డర్థమిచట
లేదు వివాహ మేలీల నౌ నందుల
కేయుపాయముసేయ నెసఁగుధనము
పడుచు నిచ్చెడువారు భాగ్యవంతులు వారి
తో సరిగాఁ దుల దూగవలయు
నదిమాటవేంకటుఁ డామహీపతిగన్న
కన్యకు మెడబొట్టుఁ గట్టఁదలఁచి
తే. నాఁ డతం డిట్లు చేసిన నరులు నవ్వి
పోదు రటుగాని నీవైన భూరిధనము
పోసఁగ నోడఁగూర్చు మనఁగ నా భూవరాహ
దేవుఁడాసతి నీక్షించి ధీరుఁ డగుచు. 94

సీ. పలికె నోవకుళ నిర్భయముగ నుండుము
ధనము లభించు వెన్నునకు నిచట
నూరకుండుము శ్రీశుఁ డూరక నీతోడ
మాటాడియుండు నెమ్మదిగ నుండు
నీవు చెప్పకమున్న నే నాహరిచరిత్ర
ముల నెఱింగినవాఁడ నెలమి నీవు

హరికడ కేతెంచు మచట బ్రహ్మాదులు
వచ్చి చేయుదురు వివాహపనులు
తే. పొమ్మనంగను విని వింతఁ బొంది వకుళ
వచ్చి వరహావతారుఁడు వల్కినట్టి
పల్కులెల్లను వచియించెఁ బద్మనాభు
నకు విచారంబు లేకుండ నయము మెఱసి. 95

వ. అంత నా శ్రీకాంతుండు స్వాంతంబున నెంతయు సంతసించి యంతరంగంబున గరుడుల స్మరింప నప్పు డుప్పొంగి యప్పన్న గేంద్రుండును గరుడుండు నా వేంకటాద్రికి వచ్చి చక్రికి దండప్రణామంబు లాచరించినం జూచి రెండు శుభపత్రికలు లిఖించి వారలచే నొసఁగి యిట్లనియె. 96

ఆ. గరుడ నీవు వోయి కంజసంభవునకీ
లిఖిత మిమ్ము మఱియు నిఖిలబంధు
సహితముగను వచ్చి సంతసముగ నాకు
క్షిప్రముగను బెండ్లి సేయు మనుము. 97

క. పొమ్మని యావిహగేంద్రుని
సమ్మదమునఁ బంపి శేష! శర్వుని బిలువం
బొమ్ము కుటుంబయుతంబుగ
రమ్మను నా పెండ్లి కెలమి రయమున శివునిన్. 98

మ. అని నారాయణుఁ డంపఁగా నపుడు శేషాఖ్యుండు శ్రీకంఠుఁ బిల్వను బోయె న్విహగేంద్రుఁ డంత వడి నవ్వాణీశ్వరుం జేరికొమ్మని యా పత్రిక చేతి కిచ్చె నపు డయ్యంభోజగర్భుండు గన్గొని యచ్చో మును లెల్లరు న్వినఁగఁ దాఁ గూర్మిం బఠించెం దగన్. 99

సీ. శ్రీరస్తు బ్రహ్మ కాశీర్వాద మహిగిరి
మీఁద మాకు శుభంబు మీకు శుభము
వ్రాయించి పంపించ ఫలయును దర్వాత
సురుచిర వైశాఖ శుక్లదశమి
శుక్రవారమునాఁడు శుభముహూర్తంబున
గగనాధిపతి సుతం గ్రమముగాను
గలియుగంబునఁ గరగ్రహణంబు చేసెద
మేటికుటుంబసమేతముగను
తే. రాఁ దగిన మిత్రులనుగూడి రయముగాను
వచ్చి మెఱమెచ్చ ాకు వైవాహికంబు
సేయుమని యుండ మునులు విస్మితము నొంది
రంత నాపత్త్రికను గను లద్దికొంచు. 100

వ. అక్కమలాసనుండు శ్రీనివాసుని వైవాహంబునకు దిక్పాల ప్రముఖులకు నుత్తరంబు వ్రాయించిరమ్మని పచించి మునులం దోడ్కొని సకలదివ్యాభరణాలంకృతుండై సావిత్రి గాయత్రి సరస్వతులంగూడి మదమరాళంబునెక్కి వివిధమంగళవాద్యంబులు చెలంగ ఖగేంద్రునితోడ వేంకటాద్రికి చ్చె నది దెలిసి చక్రి లేచి బ్రహ్మ కెదురేగిన, యజుండు హంసవాహనంబును డిగి హరికి నమస్కరించినం జూచి విష్ణుం డజుని మీఁది పుత్రవాత్సల్యం బగ్గలింప ముహూర్తద్వయంబు గద్గదకంఠుండై మాటాడకుండి యంత నజుని నాలింగనంబు చేసుకొని వచ్చి తింత్రిణీ వృక్షమూలంబునఁ గూర్చుండఁ జేసి వచ్చిన సన్మునిపుంగవులకుఁ దాఁ బ్రణమిల్లి వారికిం దగిన యాసనంబుల నుండఁజేసి భృగుమునీంద్రుఁడు తన్నినకతన.

లక్ష్మి కొల్లాపురిచేరిన చరిత్రంబును దాఁబడిన చిక్కుపాట్లను నుడివి వరాహదేవుండు దనకు నుండుటకు నెడనొసంగి నదియుం జెప్పుచుండు సమయంబున. 101

సీ. శేషుండు కైలాసశిఖరికిం జని చంద్ర
శేఖరునకు శుభరేఖ నిచ్చె
నదిచూచి శంభుఁ డయ్యద్రికుమారిత
ప్రమథగణంబులు బాగుగాను
వినఁగఁ బఠింపఁగ వేడ్కఁజెందిరి వారు
శివుఁ డంతఁ బార్వతిం జెంతఁ బిల్చి
తమకుండు దివ్యవస్త్రాదిభూషణములు
దాల్చు మటంచును దాను బ్రమథ
తే. గణములను గూడి వృషతురంగంబు నెక్కి
వివిధవాద్యరవంబులు వేడ్కఁ జెలఁగ
విఘ్నపతి ముందు నడువ నుర్వీతలానఁ
దనరుచుండెడు శేషాద్రి దాఁపుఁజేరి. 102

వ. వచ్చుచుండుటం జూచి శ్రీహరి లేచి యచటి యజునితోడం గూడి యెదురేగినం జూచి శివుండు నందిని డిగ్గి నమస్కరించె నాహరి రుద్రు నాలింగనం బొనరిచి తోడ్కొనివచ్చి మణిమయాసనాసీనుంజేసి తనవృత్తాంతం బంతయు నెఱింగించె నంతఁ దమతమ కళత్ర పుత్త్ర మిత్ర బంధుజనసమేతులై యింద్రాదులు సని హరిహరబ్రహ్మలకు నమస్కరింప వార లాశీర్వదించి రంత శ్రీహరి శేషగరుడులంబిలిచి యింద్రాదులను నుచితాసనాసీనులం జేయుఁడని నియమింప వా రట్లు

గావించిరి, హరివచ్చి కుశలప్రశ్నంబు లడిగి యనంత
అంజూచి హరి యిట్లనియె. 103

సీ. ఇంద్రాదులార నే నీకలియుగమందు
నాకాశపతిపుత్రి నాత్మ వలచి
యఱమఱలే కుద్వాహంబాడు వాఁడ మీా
కిది యిష్టమేగద యెలమి ననుచు
నడుగఁగ వారంద అజ్ఞాతు నీక్షించి
పరమసంతోష సంభరితు లగుచు
శ్రీకాంత మిక్ష్వాకుర్య మీాకలియుగమున
నడుపుట యిష్టంబ గడుముదంబ
తే. యనఁగ హరి యప్పు డింద్రుని కనియె నీవు
మయుని రావించి యిపుడు రమ్యంబు గాను
భూరి భవనము నిర్మింప పోయి గగన
రాజు గల పురియందు నిర్ణయము గాను. 104

వ. అనిన నయ్యింద్రుండు మయునిం దోడ్కొని వోయి మణి
మయాలంకృతకుడ్యకవాటకూటంబులునుశృంగాటకమందిరం
బులు,నింద్రనీలజాలకశయ్యాగృహంబులును, చంద్రకాంతో
పలసౌధంబులును, వివిధవిచిత్రరచితసభామంటపంబులును,
రమణీయకమలకల్హార షండసంకలితశీతలవారిపూరితకాసార
తీర రసాలసాలవకుళమాలూరాద్యనేకమహీజసందోహ పరి
వృతవిరాజితం బై యొప్పు నవ్యపురంబును హర్మ్యంబును
నిర్మింపఁజేసి యిద్దఱు వేంకటాద్రికి వచ్చేసిరి. అనంతర
మాహరి, పిలువఁదగిన వారలం బిలుచుటకు షణ్ముఖు
నకును, ప్రత్యుత్థానాదికృత్యంబు లాచరించుటకు మన్మథు

నకు, పరిపక్వరుచిరాన్నాదులు చేయుటకుఁ బావకునకు, జలం బులఁ దెచ్చియిచ్చుటకు వరుణునకు, జందనపుష్పాదులొసంగుటకు గంధవాహునకు, ధనదానంబు సేయుటకుఁ గుబేరునకు, దీపప్రకాశంబు సేయుటకుఁ జంద్రునకు, వలసిన పాత్రలు దెచ్చి యిచ్చుటకును దండించుటకును దండధరునకు, నియమించె నంత వసిష్ఠుండు వరాహస్వామి సాన్నిధ్యంబున యజుశ్శాఖోక్త ప్రకారంబున గృహయజ్ఞ ప్రయత్నంబు సేయించె నంతం బద్మభవుఁడు వివాహపీఠి నిర్మించి యందు బార్వతీప్రముఖ సువాసినులచేత సంపెంగతైలాదిమంగళ ద్రవ్యంబులును బంగరుపళ్లెరంబునఁ దెప్పించి యందుంచి హరిం జూచి యభ్యంగనస్నానాదు లొనర్చికొని పుణ్యాహవాచనంబును గులదేవతాప్రార్థనంబును జేయవలయు నతిశీఘ్రంబుగ రమ్మని చెప్పిన, హరి చింతాక్రాంతుండై బ్రహ్మ కిట్లనియె. 105

క. విను పద్మజ కొల్లాపుర
మున శ్రీసతి యున్నదిపుడు ముచ్చటగా న
వ్వనజాలయ లేనిది నా
మనసొప్పదు స్నానమునకు మఱిచింత యగున్. 106

తే. కారణంబిట్టు లుండఁగఁ గార్యమటులఁ
బట్టనేటికి సిరి యల్గి పోయె నిపుడు
ప్రీతితో నట్టిసతి లేక పెండ్లియాడఁ
దగదు తగదంచు లక్ష్మిని దలఁచి తలఁచి. 107

సీ. హరి చింతపడఁగ నయ్యబ్జగర్భాదులు
బదులు సెప్పఁగలేక కొదుకుచుండ

నిదియేమి చోద్యమీ యిందిరేశుని కని
శివుఁ డాహరినిఁ జూచి చెప్పె నిట్లు
శుభకాలమున నీవు శోకింపఁగారాదు
మఱియు లౌకికహాని మాను మదియు
ప్రేమతోఁ దొల్లన పిలిపించుటను మాని
యభ్యంగనస్నాన మంటు నిట్లు
నేయఁగారాదు నీవయీ చింతనుండ
తే. నెవరు నీకెదురాడుదు రేరితరము
మదిని ఖేదంబు మాని యీమంచిలగ్న
మంద పీఁటకుఁ జేరుము సుందరాంగ. 108

క. అని రుద్రుం డాలగ్నం
బున హరి నభ్యంగనంబు మోదంబునఁ జే
యను హెచ్చరికగ లెమ్మన
విని శంభుని జూచి యాదివిష్ణుం డనియెన్. 109

సీ. శంకర బాలభాషలు వల్కకీక వారి
వారిదుగఖంబులు వారికెఱుక
పరులకుఁ దెలియవా బ్రహ్మప్రళయవేళ
పరదేశినై వటపత్రమందు
నేనుండినపుడు నిత్యానపాయిని యైాచు
నాహృదయంబును నంటియున్న
కమలాలయను దుష్టకాలముచేఁ బాసి
ఏకాకినై యుంటి యిన్నినాళ్లు
తే. నాకపుడు మది నొకచింత లేకయుండె
నిపుడు నేను వివాహేచ్ఛ నెంచఁగాను

గలిగిరందఱు నిచట శ్రీకాంత యొకతె
తక్కువైయుండుకతన ఖేదంబు గల్గె. 110

సీ. వనధిజరాక వివాహంబు కాఁగూడ
దన యెవ్వరైన నా కాప్తముగను
జెప్పుదు రనియుంటిఁ జెప్పరై రిచ్చటఁ
గావున మదికి దుఃఖంబు పుట్టె
నని హరి వల్క బ్రహ్మాదులు భీతిల్లి
ముకుళితహస్తులై ముందు నిల్చి
పల్కి రిట్లని రమాభామరాకయ పెండ్లి
యిప్పుడు సేయంగ నొప్పదంచు
తే. సిరిని బిలిపింపుఁ డని మీకుఁ జెప్ప వెఱచి
యుంటి మపచారమాయె నయ్యుదధికన్య
రాకయుండినఁ బెండ్లిగా రాదటంచు
మీకుఁ దోఁచినదే మాకు మేలు తండ్రి. 111

చ. సిరి నిపుడైన నిచ్చటికి శీఘ్రముగాఁ దగఁ బిల్వనంపు నం
దఱ కిది సమ్మతం బనఁగఁ దామరసాక్షుఁడు సంతసించి యిం
దిర నహిపర్వతంబునకుఁ దెప్పనఁ దోడ్కొనిరమ్ము పొమ్ము పో
సరసిజమిత్ర యంచనఁగ సారసమిత్రుఁడు మ్రొక్కి యిట్లనెన్.

సీ. హరియేను గరవీరపురమునందుండెడు
శ్రీరమాసతి కేమి చెప్పవలయు
నానతీ లెఱిఁగింపు మన విని సప్తాశ్వు
నిం జూచి హరి నవ్వి నీరజాప

విను మాజలధికన్యఁ గని మ్రొక్కి శ్రీహరి
వేంకటాచలముపై వేడ్కమీఱఁ
గడు నశక్తుండయి కనులఁ జూడఁగ నిన్ను
వాంఛించుచున్నాఁడు వార్ధిపుత్రి
తే. మోము చూపు మటంచును ప్రేమఁజెప్పి
తోడుకొని రమ్మటంచును నేఁడు నాకుఁ
జెప్పి పంపంగ వచ్చితిఁ జెప్పినాఁడ
ననుచుఁ జెప్పుము పోపొమ్ము మరసి లక్ష్మి. 113

వ. వచ్చును సందియం బుండదనిన విని దివాకరుం డట్లరిగి. 114

తే. శ్రీసతికి మ్రొక్కి వల్కె నోసింధుతనయ
చక్రి యిప్పు డశక్తుఁడై జాలివడుచు
శేషగిరియందు నున్నాఁడు శీఘ్రముగను
నేఁడు నినుఁజూడ నున్నాఁడు నిజము తల్లి. 115

క. అని యాసూర్యుఁడు వల్కఁగ
విని భీతినిబొంది లక్ష్మి వేగరథముపైఁ
దనరార నెక్కి నభపథ
మునఁ జని శేషాద్రి డిగియెఁ బుర్షునిజూడన్. 116

క. అప్పుడు బ్రహ్మేంద్రాదులు
తప్పక సిరి రాక యెఱిఁగి తమవాద్యతతుల్
తెప్పున మొఱయించుచుఁ జని
రప్పరమపవిత్ర లక్ష్మి కానందముగన్. 117

సీ. శ్రీలక్ష్మి నీక్షించి చెలఁగి దండము లిడి
తోడ్కొని వచ్చిరి తోడరి యపుడు

పార్వతీభారతీప్రముఖామరాంగనా
మణులెల్ల నామెను మహితభక్తి
మ్రొక్కిరి యంత దామోదరుం డాలక్ష్మిఁ
జూచి డగ్గఱ కేగి సురుచిరోక్తు
లాడుచు గారవం బారఁగఁ జేసి ము
హుర్ముహుర్ముదము లక్ష్మి కుల్లమలరఁ
తే. గా రహస్యపుమాటల మీరఁ బల్కి
తాను జేసినకార్యంబు పూనిచెప్పి
యొప్పిదముచేసి పీఠిపై నొనరజేర్చి
తాను గూర్చుని వెండియుం దనర ననియె. 118

క. శ్రీవనితామణి నాపై
నీవలుగుట మొదలుగాను నేఁటివఱకు ని
న్నీ వేళఁ దలఁచుచుండుదు
నీవల్మీకంబులోన నిరవుగ నుంటిన్. 119

ఆ. గొల్లఁ డిటకు వచ్చి గొడ్డంట నడినెత్తిఁ
బగులఁ గొట్టినపుడు బాధపడుచు
నుంటి నన్నుఁ జాల నూరడించుచు నిందు
వకుళయుండెఁ దల్లివలెను గాచె. 120

సీ. పటుకుఠారము తలపైఁ దాఁకు నప్పటి
బాధకు నేనోర్చి బ్రదికినట్టి
మహిమ యేమనిన నీమంగళసూత్రస
న్మహిమయగాని నామహిమగాదు
వనజాక్షి నీపతివ్రతనిష్ఠచే నేను
జీవించితిని యది సెప్ప నేల

యది యటులుండ ని మ్మాకాశనృపకన్య
నన్ను మోహించెను సన్నుతించి
తే. గాన దానిని నేఁ బెండ్లికరము ప్రీతి
నాడ నెంచితి నీవాడ మంటివేని
పెండ్లియాడెద లేకున్నఁ బెండ్లివలదు
తొంటిసంగతి మది నెంచు తోయజాక్షి. 121

మ. అని పద్మాక్షుఁడు వల్కఁగా మనమునం దాశ్చర్యముం
బొందుచుఁ, వనజాతాలయ వల్కె నట్లు మఱి యవ్వా
మాక్షి మోహించి తా, నినుఁగాఁ బిల్చెనో దాని నీవిపుడు
మన్నింపం బ్రయత్నంబు లిం, దొనరంజేయుటఁ జూచితి
న్మనసునం దుష్పొంగితిం గేశవా. 122

సీ. కమలాక్ష మంగళకరముగఁ బసపుజా
బింపుగఁ దొల్తఁ బంపించకీవు
మొగి నసక్తుఁడ నని మోము చూచుటకు ర
మ్మని నన్నుఁ బిలిపించినందువలన
భీతిల్లి వచ్చితి ఖ్యాతిగ నేవచ్చు
రీతి రానైతి సంప్రీతిమెఱయ
నేఁ దొల్త వచ్చిన నీపెండ్లి కిపు డొప్ప
నని సంశయించితి నందుచేత
తే. నింత పనిచేసితివి మంచి దీవివాహ
కారణముచేత నైన నిక్కడకు నన్ను
నేఁడు పిలిపించినందున నీముఖంబు
గంటి నా కింతయేచాలుఁ గమలనాభ. 123

తే. వసుధపై నీవు పెండ్లికావలయు ననిన
నేను విఘ్నముసేయను నీకు నేను
గలిగియును లేకయుండెడు కారణంబు
చే వివాహేచ్ఛపుట్టె నీ చిత్తమునను. 124

క. నా కిది సమ్మతి యైనది
నీకిఁక సంశయమువలదు నెమ్మదిగా నిం
దాకన్యను జేఁబట్టుము
ప్రాకటముగ నాకు సుఖమ రహి నీకదియే. 125

క. నీవు మనుష్యాకృతి వడి
గా వేంకటశైల మెక్కి గాయవడిన ని
న్నీ వకుళ వచ్చి గావఁగ
జీవించితి వింతె చాలు చిన్మయరూపా. 126

ఉ. నాకిపు డేమిగావలయు నాఁడు భృగుం డెడఁబాపె నిన్ను న
న్నో కమలాక్ష నే నచట నుండిన నీమహనీయరూపమే
జోకుగ నాత్మయం దునిచి చూచి సుఖించెదఁ గాని వేడ్కగా
నాకలికి న్వరించిముఖు లందఱు మెచ్చఁగఁ బెండ్లియాడుమా.

క. అని కన్నీ రొల్కఁగ సిరి
తనశిరమును వాంచియున్న దామరసాక్షుం
డనుమానించుచు లక్ష్మిని
కనుఁగొని యిట్లనియె నపుడు కరము ప్రియమునన్. 128

సీ. సిరి నీవు మదిలోనఁ జింతింపవలదు నీ
కన్న నాకాప్తు లెందైన లేరు
నీవ నాదైవంబు నీవ నాప్రాణంబు
నీవ నాభాగ్యంబు నిశ్చయముగఁ

గావున నాపెండ్లి నీవిప్పు డొప్పి చే
సిన మేలె చేయకుండినను మేలె
నాకేమి గావలె లోకవిడంబనా
ర్థంబుగ నీప్రయత్నంబు నేఁడు
తే. కాలకర్మానుగుణముగఁ గల్గె ననుచుఁ
దాను గన్నీరు నించిన ధవునిజూచి
వల్కె సిరి యిట్లు దేవ యీపాపమంబు
నీకుఁ దగ దని చాల మన్నించి నగుచు. 129

సీ. హరి నాదరించి బ్రహ్మాదుల నీక్షించి
యిదియేమి యాలస్య మెల్ల రారు
లేచి మీమీపనుల్ చూచి చేయుఁడు చక్రి
కభ్యంగనము నేయుఁ డనుచు లక్ష్మి
యానతియ్యఁగ నంద అన్ని పనుల్జేసి
రపు డబ్జజుండు ఖగాధిపతిని
పన్న గేంద్రానిలప్రముఖులఁ బంపించి
పుణ్యతీర్థముల నా భుజగగిరికిఁ
తే. గలశముల నిండఁ దెప్పించి క్రమముగాను
గుంకుమముగల్పి నాల్గుదిక్కులను బెట్టి
సూత్రముల వానిచుట్టును జుట్టుఁ డనుచు
నతఁడు సెప్పఁగ గిరిజాముఖాంగనలును. 130

తే. మంగళస్నానములుచేసి రంగుమీఱ
వస్త్రభూషణములు దాల్చి వచ్చి దీప
కలశము ల్మంగళారతు ల్కరములందుఁ
బట్టి కల్యాణపాటలుపాడు చెలమి. 131

ఉ. పాడి తలంగకుండఁ దొలి పద్మజుఁ డాడినరీతి నద్రిశల్
పోఁడిమిఁ గుంకుమం బిడినఁ బుణ్యశుభోదకకుంభము ల్దగన్
వేడుకమీఱ నుంచి సరవి న్వరసూత్రము చుట్టి యైదువల్
జోడుగ దానిమధ్యమున శోభిత సన్మణిపీఠ ముంచఁగన్.132

ఆ. అజుఁడు పెండ్లిపీఁటయందుఁ గూర్చుండుఁడో
స్వామి యనఁగఁ జక్రి జలధికన్య
దెసనుజూడ విష్ణుదేవుని మోమెట్లు
చూడ కాదిలక్ష్మి చోద్యముగను. 133

సీ. చెక్కిట చెయిఁజేర్చి శిరమొగి వంచి ప
దాంగుష్ఠమునసున్న లవనిమీఁద
వ్రాయుచు మఱి చింతచేయుచు నెమ్మోము
చిన్నచేసుకుని యందున్న వేడ్క
లైనఁ జూడకయుండి నట్టి రమాసతిఁ
దాఁ జూచి హరి యిట్లు దలఁచె మదిని
నేఁబెండ్లియాడుట కీయిందిరకుఁ జింత
గల్గుచున్నది నేయుకార్యమేమి

తే. యనుచు యోచించి తనచింత నడఁచి సరవి
వాలుగన్నుల నారమావనితమోము
సారెసారెకుఁ జూచుచు జాలినొంది
పద్మసంభవు నీక్షించి పలికె నిట్లు. 134

సీ. ధాత యీపెండ్లి యత్నముచేసి యేనొప్పి
నందుచేఁ దప్పు నాయందుఁ గల్గెఁ
గాన నాకీపెండ్లి గావలసినదేమి
నేనొల్ల మీరెల్ల నేడుగదలి

పోయి మీమీపురంబులు సేరఁ డెప్పటి
పగిది వల్మీకగర్భంబునందు
నిలచెదఁ దల్లిదండ్రులు లేని పరదేశి
వానికిఁ బెండ్లి కావలెనె యిపుడు
తే. దిక్కులకు నేను దిక్కనై దిక్కులేక
నొంటిగా నిల్చి తేఱకామింటనుండి
మంటిపై వ్రాలి పొట్టకై మానవులను
జేరి యాచించి బ్రదుకుట సిద్ధమయ్యె. 135

తే. ఇట్టి నాకు వివాహేచ్ఛ పుట్టఁదగదు
గనుక యభ్యంజనము నొల్లననఁగ బ్రహ్మ
దేవుఁ డదరుచు శ్రీస్వామి దిక్కుచూచి
పాదముల వ్రాలి యిట్లనిపల్కె నపుడు. 136

వ. దేవా మహాలక్ష్మి మీకు నిత్యానందదాయినియై పత్నియై యుండి నేనును మన్మథుండును బుత్త్రులమై తక్కిన రుద్రపవనేంద్రాదులు మనుమలై మునిమలె వృద్ధినొందుచుండఁగ నందఱకు నాధారభూతమై కూటస్థబ్రహ్మంబైన నీకు విచారం బేల యని సాభిప్రాయంబుగఁ బల్కిన విని హరి యిట్లనియె.

సీ. అంబుజాసనచేతఁ దాంబూల మిపు డిచ్చి
నన్ను దీవించు మానందముగను
నాకిప్పు డభ్యంగనముచేయు వార లె
వ్వారంచుఁ జింతతో నీరుకనుల
నింపఁగ సిరి హరినిం జూచుచుండఁగఁ
దమ్మిచూలి మఱుప్ను నెమ్మి సంజ్ఞఁ

జేసి రమ్మనఁగ నా శ్రీలక్ష్మి హరి చెంతఁ
జేరి నవ్వుచు రెండుచేతు లపుడు
తే. పట్టి లేపగఁ దనమదిఁ బుట్టియున్న
చింత విడిచి ముదమున వసిష్ఠముఖ్య
మునుల కప్పుడు మ్రొక్కి దీవనలునంది
యొనర పీఠంబుమీఁదఁ గూర్చుండెఁ జక్రి. 138

వ. అప్పు డరుంధతీప్రముఖసువాసినులు శోభనపాటలు పాడు చుండ మంగళవాద్యంబులు మ్రోయుచుండఁ బార్వతియు సావిత్రియు సరస్వతియుఁ గుంకుమోదకంబులు పైఁడిపళ్లెరంబుల నించి యారతు లిచ్చి రంత రమాదేవి మంగళాక్షతలు లలాటశీర్షంబులం దుంచికొని కర్పూరతాంబూలం బా స్వామిచే నిచ్చి దీర్ఘనీలకుంతలంబుల చిక్కుఁదీయుచుఁ బైఁడిగిన్నియలోని సంపెంగతైలంబుం జేర నిండం బట్టికొని దీర్ఘాయుష్మంతుఁడవై యష్టపుత్త్రవంతుఁడవై చతుర్దశభువనంబు లనేకఛత్త్రాధిపత్యంబున నేలువాఁడవై వృద్ధినొందు మోయంబుజాక్ష యని యాశీర్వదించి యభ్యంగనంబు చేయించి కర్పూరకస్తూరి హరిద్రాచూర్ణములు పునుఁగు తైలంబునం గల్పి నలుగుపెట్టి పరిశుద్ధోదకంబున నభిషేకం బొనరించి కృతార్థురాలైతి నని సిరి మనంబున సంతసించె నంత పార్వతీసావిత్రిసరస్వతులు కలశంబులఁ గుంకుమోదకాభిషేకం బొనర్చి లక్ష్మితోడఁ బుడిసిళ్ల దత్తీర్థంబు వట్టి శ్రీరామరక్ష యని శిరంబునకుఁ జుట్టి చల్లి రంత. 139

సీ. సావిత్రి దెచ్చి వస్త్రం బియ్యఁగా సిరి
తడియొత్తె శిరమును దనర నివిరి

చక్కని వెండ్రుకల్ చిక్కును సవరించి
గంధపుసామ్బ్రాణి కమ్మధూప
ము నొసంగెఁ బార్వతి ముదమునఁ బీతాంబ
రము లియ్యఁ హరి గట్టె రమణమీఱ
శ్రీసరస్వతి దెచ్చి చేతి కీయఁగ లక్ష్మి
వరరత్నభూషణావళు లమర్చె
తే. ముకుర మటుమీఁద గాయత్రి మొనసి చూపెఁ
దిలకమును రతిరీతిగఁ దీర్చె నుదుట
రమ్యముగ శచి వింజామరమును వీచెఁ
బట్టె ఛత్రంబుఁ బవనునిపత్ని గరిమ. 140

తే. పాదుకలు గంగ పెట్టఁగ బ్రహ్మసభకు
నడచుచును వచ్చి సింహాసనంబుమీఁద
నమరఁ గూర్చుండి మునిముఖ్యు లలరిచూడ
బ్రహ్మనుంజూచి శ్రీహరి పల్కె నిట్లు. 141

వ. సురజ్యేష్ఠుఁడా! యిఁక లక్ష్మీదేవికి మంగళస్నానంబు సేయ నియమింపు మనినఁ బద్మజుండు వోయి పార్వతీప్రముఖాంగనలం బిల్చి మజ్జననికి మంగళస్నానంబు సేయింపుఁ డని వచించి లక్ష్మిని కనకపీఠికపైఁ గూర్చుండుమనిన శిరంబువంచి విరించితో సిరి యిట్లనియె. 142

క. వనరుహభవ నే నభ్యం
గన మొల్లను మజ్జనంబు గ్రక్కున నేఁ జే
తును నని పల్కఁగ నది తా
విని సందియ మొంది యాది విష్ణుం డనియెన్. 143

సీ. అబ్ధిజ నీ విప్పు డభ్యంగనస్నాన
మొప్పకుండిన వివాహోత్సవంబు
నేనొల్ల నని వల్కఁగా నవ్వికొని రమా
సతి యూరకుండఁగ శైలకన్య
మొదలుగ నందున్న ముత్తైదువులు సిరి
కభ్యంగనము చేసి యపుడు పసుపు
నలుగొప్పఁబెట్టి స్నానంబును జేయించి
తడియొత్తి నవ్యవస్త్రముల నొసఁగి
తే. కురులు విడఁదీసి గంటిడి విరిసరములు
చుట్టి కుంకుమతిలకంబు పెట్టి నుదుట
గనులఁ గాటుగఁ దీర్చి శ్రీగంధ మలఁది
వరుసగా రత్నభూషణావళులఁ దొడఁగి. 144

తే. పెండ్లిపాటలు పాడి సంప్రీతి సిరిని
దోడుకొని వచ్చి యాచక్రితోడ జతగఁ
గూరుచుండఁగఁ బెట్టి రవ్వారిజాక్షుఁ
డంత సిరిఁజూచి తాను సంధ్యను నొనర్చె. 145

వ. ఆసమయంబున వసిష్ఠాదిమహామునులును సనకాదియోగివరులును నింద్రాదిదేవతలును గరుడగంధర్వాదులును లక్ష్మీనారాయణుల నానందంబునం జూచుచుండఁగా నిది శుభలగ్నమంచు నందుండు జ్యోతిశ్శాస్త్రవేత్తలు చెప్పుటంజేసి వకుళమాలిక విని సరగున, మంగళద్రవ్యంబు లొక పైఁడిపళ్లెరంబున నిడుకొని వచ్చి స్వామిసన్నిధానంబున నునిచి హరికి నలంకరించుమని సిరికిం జెప్ప నారమాకాంత సంతసంబున లేచి నిజకాంతునకు నలంకరించె నంత కుబేరుండు

దివ్యభవ్యరత్నాంబరాభరణాదులు దెచ్చి లక్ష్మి కందియిచ్చె నవి స్వామికి నాలక్ష్మియ యలంకారంబు చేసె నంత వసిష్ఠకశ్యపాత్రిభరద్వాజశుకవత్సాదిమహామునులకుం జక్రి లోకవిడంబనార్థంబుగ నమస్కరింప నాసమయంబున వసిష్ఠుండు.

సీ. ముత్యముల చతురశ్రమముగ వివాహ
వేదిక రచించి యర్థి శ్రీవేంకటాద్రి
పతిని సతి యగులక్ష్మిని పరఁగ నుంచి
తత్పురోభాగమున నగ్నిఁ దనరఁజేసి. 147

వ. అంత యజుశ్శాఖోక్తప్రకారముగ వైఖానససూత్రపద్ధతిం బుణ్యాహవాచనాదిశుభకృత్యంబు లాచరించి వచ్చిన యశేషజనంబులకు సవినయోచితపూర్వకంబుగఁ దాంబూలాదు లిప్పించి తదనంతరం బాహరిం జూచి కులదేవతారాధనంబు సేయవలయు నయ్యధిదేవత నామం బెద్ది యని యడుగ నాహరి పాండవులకును మాకును శమీవృక్షంబ కులదేవత యనిన విని వసిష్ఠుం డయ్యవనీరుహం బెందుఁగల దనఁగఁ గుంభసంభవుండు విని యది కుమారధారాతీర్థంబుకడ నున్న దని వచింప నయ్యెడకు మంగళవాద్యంబులతోడ హరిం దోడ్కొనిపోయి యవ్వృక్షరాజంబునకుఁ బూజ లొనరింపించి ప్రదక్షిణనమస్కారాదులం జేయించి తత్పాదపశాఖాగ్రపల్లవంబు లనుగ్రహించి హరి శిరంబున నునిచి యందుండి వచ్చి కులదేవతకలశం బెందుండవలయు ననిన విని నారదుండు వరాహస్వామిసన్నిధానంబున నుండఁ జేయవలయు ననియె నంత నచ్చోట ముక్తతండులంబులరాశింబోసి తత్కలశంబున కలంకరించి యందుంచి తదుపరి హరిద్రంబునఁ బద్మ

లాంఛనరచితవస్త్రయుగ్మంబును నారికేళంబును నిడి పూజింపఁ జేయించి అఖండదీపంబు వెలుఁగఁజేసి తద్దీపంబునకు దీపారాధనలు చేయించి మ్రొక్కించిన వరాహస్వామిని హరి చూచి యిట్లనియె. 148

సీ. శ్రీవరాహస్వామి నీవును భూదేవి
రావలె నిప్పుడు నావివాహ
మునకు నంచనఁగ నిట్లనియె నాదేవుఁడు
క్షేత్రమంతయు ఫలించినది గనుక
రాఁ దీర దిపుడు నిర్ణయముగ నామాఱు
వకుళయ పెండ్లికి వచ్చుఁ బొమ్ము
మనవుడు నటులైన స్నానతియ్యఁడు పోయి
వచ్చెద మని మెఱమెచ్చుఁ బలికి
తే. నంత బ్రహ్మను జూచి ప్రయాణభేరి
మొఱయఁజేయింపు మనఁగ నమ్ముదముఁ జూచి
బ్రహ్మ యిట్లనె నేమియో పరమపురుష
పరఁగ సంతర్పణంబు నెల్లరకుఁజేసి. 149

వ. రేపుదయంబు పైనం బొనరించుట శ్రేయంబు నేఁడు పైనంబు గడుపందగదు. శుభాస్పదదినలాంఛనం బనఁగ నిదియ గదా యనిన విరించిమాటలకు నంచితంబుగ హరి యిట్లనియె. 150

ఆ. దేశకాలములను దెలియక యత్నంబు
నీవు నేయ నెంచినావు చూడ
నలర దొరకు నేపదార్థ మాయద్రిపై
ననినఁ జక్రి కిట్టు లనియె శివుఁడు. 151

క. చేసినయత్నము పూర్తిగఁ
జేసిగదా మేలు నెపుడు చెందవలయు నేఁ
డీసంతర్పణ సేయక
గాలిసి యిపు డటకుఁ బోవఁ గారాదు హరీ. 152.

చ. అని గిరిజాధిపుం డనఁగ నాహరి నవ్వి పొసంగ నబ్ధిపు
త్త్రిని నడుగంగఁ బూనియు నిదేమి మగండయి సిగ్గుమాలి దా
నిని బతిమాలనేల యీపనికి నెమ్మివరాల నొసంగు మంచుఁబో
యనుచును శూలి నయ్యజుని నర్థిమెయిం గని గూడి గ్రక్కునన్

వ. వల్మీకసమీపంబునఁ గూర్చుండి యుండు పార్వతీభారతీ
ప్రముఖవరాంగనల నడుమం గూర్చునియుండు లక్ష్మీదేవి
తోఁ జెప్పకపోయి పుష్కరిణీతీర్థతీరవరాశ్వత్థవృక్షచ్ఛాయం
గూర్చుండి కుబేరుని రావించుకుని యేకాంతంబున నిట్టు
లనియె. 154

సీ. ధనదావివాహయత్నము నేను జేసితి
నర్థంబు లేదిపు డబ్ధిసుతను
నాపెండ్లి కీవు ధనం బిమ్ము మనుటకు
నాకు నిష్టము లేదు నయముగాదు
నీవు ద్రవ్యం బిమ్ము నెఱి నీకుఁ బత్త్రంబు
వ్రాసియిచ్చెదను సంవత్సరమున
కొకమాఱు వడ్డి నీ కొప్పించు చుండుదు
గలియుగాంతమున నేఁ గాసువీస.
తే. మేమి నిల్పక యొసఁగెద నెడఁదనిదియు
మోసమనియెంచవలదు నాబాసఁగొనుము.

శంభుఁడును ధాతయునుగూడి సాక్ష్యములను
వేసియిత్తురు నన(గ భావించి యతఁడు. 155

సీ. పలికె నిట్లనుచు నోపద్మాక్ష నీకృప
నిపుడుండు ధనమునే నెంతథ్యైన
నిచ్చెద వడ్డియు నేటికి వైవాహ
మైనచోఁ జాలు మా కందఱకును
బరమసంతోషంబు భావింప నింతక
న్నను లాభ మొక్కండు గనుటఁగలనె?
యనఁగ నాహరి యిట్లులనియె దానం బేను
గొనుటకుఁ దగదు నీ కనువుగాను
తే. వడ్డిపత్రంబు నొకయాశ్వపసరుచేత
వ్రాసిపట్టను దగఁ దాను బూని వ్రాసి
యజుని శంభుని సాక్ష్యంబు లలర నిడఁగఁ
జేసి యిచ్చెను విత్తంబు చెంత లేక. 156

వ. అంత శంభుని యజుని వీక్షించి హరి యిట్లనియె. 157

చ. అజహరులార! యీకలియుగాంతము వచ్చెడుదాక ధన్యమౌ
భుజగగిరీంద్రమందుఁ బరిపూర్ణవిలాసము లద్భుతంబుగా
సుజనుల కెల్ల మెచ్చువడఁ జూపి వరంబు లొసంగి విత్తముల్
నిజముగ సంగ్రహించి యట నేను గుబేరున కప్పుదీర్చెదన్

తే. మీరు సాకిరు లని పల్కి భూరి ముదముఁ
దాను వ్రాసినయట్టిపత్రంబు నజుని
చదువుమన నబ్జభవుఁ డంత సరవి దాని
చదివె నీరీతి ధనదుఁ డీశ్వరుఁడు వినఁగ. 159

సీ. శ్రీకరలీల స్వస్తిశ్రీ జయాభ్యుద
యాష్టాదశద్వాపరాంతమందుఁ
గల కలి నాదివేంకటనాయకుఁడు ధన
పతి కొసంగిన వడ్డిపత్ర మెట్లు
యనిన నావైవాహమునకు నీచే నప్పు
గొనిన టెంకీలును గోటిసంఖ్య
లలిని జతుర్దశలక్షలందుకు వడ్డి
ప్రతివత్సరంబును బరఁగ నిత్తు
తే. కలియుగాంతమునందునఁ గాసువీస
ముంచ కొగిఁ దీర్చివేయుదు మొనసి దీని
కజుఁడు శంభుఁడు మఱియు హిమాంశుఁ డినుఁడు
సాక్షులు నిజంబు వృక్షరాజంబు సాక్షి. 160

తే. ఇట్లు నాయిష్టమున వ్రాసి యిచ్చినట్టి
స్వకరలిఖితం బటంచును వనజభవుఁడు
చదివి వినిపించి పార్వతీశ్వరునిచేత
నిచ్చి చూడు మటంచును మెచ్చఁ జెప్పె. 161

వ. ఇచ్చుటం జేసి యది చూచి యిందుకు నొకసందియంబుండదు సఖుఁడా యని ధనదుని మెఱ మెచ్చఁ బల్కి యొసంగె నప్పుడా ధనేశ్వరుండు పత్రంబుచేకొని హరికి రయంబున యక్షులచే స్వర్ణరామటెంకీలు కోటినిదెప్పించి యెంచి యొసంగుటం జేసి పుచ్చుకొని క్రమ్మఱ నాధనం బాయక్షేశుని కడ నుంచి వలసిన పదార్థంబులు దెప్పింపు మని చెప్పె. నాధనేశుం డవ్వివాహంబునకు వలసినమంగళద్రవ్యంబులును, వస్త్రభూషణాంబరంబులును, భోజనపదార్థంబులును, మఱి యితర

పదార్థంబులును దెప్పించె, నంత నాహారి పావకునింజూచి
భక్ష్యభోజ్యాన్నాదు లింతకుఁ జేయకుండు టేల యని
యడుగ నతం డిట్లనియె. 162

క. పాత్రుఁడ వన్నింటికి నీ
క్షేత్రంబునఁ బాక మలరఁ జేయుటకును మృ
త్పాత్రంబు లైనలక్ష్మీక
ళత్రా లేవనఁగ లేక లలియుందు నిటన్. 163

వ. అనిన విని షణ్ముఖునిం బిలిచి యడుగ నతం డూరకయుండుటం
జేసి బ్రహ్మాదులు వినుచుండ నగుచు నారాయణుం డిట్లనియె.

సీ. పరదేశి పెండ్లికిఁ బాత్ర లెందుండును
నమరు పుష్కరిణి దివ్యాన్నపాత్ర
పరిశోభితంబైన పాపవినాశమ
శుద్ధోదకానికి శుద్ధపాత్ర
ఆకాశగంగయ యన్నపుపాత్రగో
గర్భంబ పరమాన్నకంబు పాత్ర
గురుతరంబైన తుంబురుకోనచిత్రాన్న
పాత్ర శాకముల నేర్పఱచి నేయు
తే. భక్ష్యముల నిడు శ్రీపరబ్రహ్మతీర్థ
పాత్ర మఱి పచ్చడులకును బాండుతీర్థ
పాత్ర ముపదంశములకు సత్పాత్ర మాకు
మారధారయ యనుచు రమావిభుండు. 165

వ. వినోదంబుగఁ బల్కుటం జేసి యష్టవసువులు విని చిన్నవోయి
లజ్జించి సత్వరంబున నక్షయపాత్రలు దెప్పించి యొసంగుటం
జేసి వైశ్వానరుండు సంతసంబు మృష్టాన్నం బొనరించి భోజ

నంబునకు లెండని పచింప హరి విని కార్తికేయుని పిల్చి బ్రాహ్మణభోజనంబునకు విశాలప్రదేశంబు లేకుండుటం జేసి శంభుని నానతిచొప్పున భూతగణంబులం దోడ్కొని పాండవ తీర్థము మొదలు శ్రీశైలముపర్యంతము నేలం జదరంబు సేయింపు మనిన నతం డట్లు చేయించె, నంత నందఱు స్నాన సంధ్యాద్యనుష్ఠానాదు లొనర్చుకుని బంతులుగఁ గూర్చుండ నప్పు డజునిఁ జూచి యనర్పితాన్నంబు బ్రాహ్మణులకు యోగ్యంబు గాదనియు నహోబలనారసింహున కర్పితంబు సేయు మనియుఁ జెప్ప నప్పద్మజుం డట్లుచేసి వైశ్వదేవబలిహరణాది నిత్యకర్మకలాపంబుల నంతరంబు చేసి బ్రాహ్మణులకు నుచితాసనంబు లిచ్చె. శ్రీనివాసుండు నియమించిన రీతిం బవనుండు కదళీపర్ణంబులు బంతులుగ వైచి ఘృతలాంఛన మిడి సకల పదార్థంబులను వడ్డించె. బ్రహ్మ గంధపుష్పాక్షతంబుల ద్విజార్చనంబు చేసి వరుణుండు బ్రాహ్మణులకును సుమంగలీశ్రేణులకు నాపోశనాంబువులిచ్చె. వసిష్ఠుండు "ఏకోవిష్ణుర్మహద్భూతం" అనుచు వచింప నందఱును జెప్పుచుం గృష్ణార్పణమస్తని పంచప్రాణాహుతు లిడుకొనఁ బవనుండు హస్తోదకంబునొసంగె. మన్మథుండు నాంజనేయుండును బంతులఁ దిరుగుచుం బ్రొద్దయ్యె నిదానంబున భుజింపుఁ డని యుపచారంబులు చెప్పుచుండిరి. భక్ష్యభోజ్యలేహ్యపానీయంబులతోఁ బరితృప్తింబొంది యజునివలన నుత్తరాపోశనంబు గైకొని లేచి పాణిపాదప్రక్షాళనంబు నాచమనంబును జేసుకొని హరి నియమింపఁబడిన రమ్యస్థలంబునం గూర్చుండి "తృతీయస్యామితోదివి సోమ ఆసీత్" అనుచుఁ జెప్పు వేదధ్వనికి హరియానం

పదార్థంబులును దెప్పించె, నంత నాహరి పావకునింజూచి
భక్ష్యభోజ్యాన్నాదు లింతకుఁ జేయకుండు టేల యని
యడుగ నతం డిట్లనియె. 162

క. పాత్రుఁడ వన్నింటికి నీ
క్షేత్రంబునఁ బాక మలరఁ జేయుటకును మృ
త్పాత్రంబు లైనలక్ష్మిక
ళత్రా లేవనఁగ లేక లలియుందు నిటన్. 163

వ. అనిన విని షణ్ముఖునిం బిలిచి యడుగ నతం డూరకయుండుటం
జేసి బ్రహ్మాదులు వినుచుండ నగుచు నారాయణుం డిట్లనియె.

సీ. పరదేశి పెండ్లికిఁ బాత్ర లెందుండును
నమరు పుష్కరిణి దివ్యాన్నపాత్ర
పరిశోభితంబైన పాపవినాశమ
శుద్ధోదకానికి శుద్ధపాత్ర
ఆకాశగంగయ యన్నపుపాత్రగో
గర్భంబ పరమాన్నకంబు పాత్ర
గురుతరంబైన తుంబురుకోనచిత్రాన్న
పాత్రశాకముల నేర్పఱిచి సేయు
తే. భక్ష్యముల నిడు శ్రీపరబ్రహ్మతీర్థ
పాత్ర మఱి పచ్చడులకును బాండుతీర్థ
పాత్ర ముపదంశములకు సత్పాత్ర మాకు
మారధారయ యనుచు రమావిభుండు. 165

వ. వినోదంబుగఁ బల్కుటం జేసి యష్టవసువులు విని చిన్నవోయి
లజ్జించి సత్వరంబున నక్షయపాత్రలు దెప్పించి యొసంగుటం
జేసి వైశ్వానరుండు సంతసంబు మృష్టాన్నం బొనరించి భోజ

నంబునకు లెండని పచరింప హరి విని కార్తికేయుని పిల్చి బ్రాహ్మణభోజనంబునకు విశాలప్రదేశంబు లేకుండుటం జేసి శంభుని నానతిచొప్పున భూతగణంబులం దోడ్కొని పాండవ తీర్థము మొదలు శ్రీశైలముపర్యంతము నేలం జదరంబు సేయింపు మనిన నతం డట్లు చేయించె, నంత నందఱు స్నాన సంధ్యాద్యనుష్ఠానాదు లొనర్చుకుని బంతులుగఁ గూర్చుండ నప్పు డజునిఁ జూచి యనర్పితాన్నంబు బ్రాహ్మణులకు యోగ్యంబు గాదనియు నహోబలనారసింహున కర్పితంబు సేయు మనియుఁ జెప్ప నప్పద్మజుం డట్లుచేసి వైశ్వదేవబలిహరణాది నిత్యకర్మకలాపంబుల నంతరంబు చేసి బ్రాహ్మణులకు నుచితాసనంబు లిచ్చె. శ్రీనివాసుండు నియమించిన రీతిం బవనుండు కదళీపర్ణంబులు బంతులుగ వైచి ఘృతలాంఛన మిడి సకల పదార్థంబులను వడ్డించె. బ్రహ్మ గంధపుష్పాక్షతంబుల ద్విజార్చనంబు చేసి వరుణుండు బ్రాహ్మణులకును సుమంగలీశ్రేణులకు నాపోశనాంబువు లిచ్చె. వసిష్ఠుండు "ఏకోవిష్ణుర్మహద్భూతం" అనుచు పచింప నందఱును జెప్పుచుం గృష్ణార్పణ మస్తని పంచప్రాణాహుతు లిడుకొనఁ బవనుండు హస్తోదకంబునొసంగె. మన్మథుండు నాంజనేయుండును బంతులఁ దిరుగుచుం బ్రొద్దయ్యె నిదానంబున భుజింపుఁ డని యుపచారంబులు చెప్పుచుండిరి. భక్ష్యభోజ్యలేహ్యపానీయంబులతోఁ బరితృప్తింబొంది యజునివలన నుత్తరాపోశనంబు గైకొని లేచి పాణిపాదప్రక్షాళనంబు నాచమనంబును జేసుకొని హరి నియమింపఁబడిన రమ్యస్థలంబునం గూర్చుండి "తృతీయస్యామితోదివి సోమ ఆసీత్" అనుచుఁ జెప్పు వేదధ్వనికి హరియానం

దంబు నొందుచుండఁగ మన్మథునిచేత నంజనీసుతునిచేత దివ్య తాంబూలంబు లొసంగఁజేసి బ్రహ్మ ధనదునివలన దక్షిణలిప్పించె. శ్రీహరి లేచి యాబ్రాహ్మణశ్రేణికి నమస్కారంబు సేయ వారు మంత్రాక్షతల నాశీర్వచనంబులు సేసిరి. అవి తాఁగొని పుత్రకళత్రాదులకును భటులకును శిరంబులం గరంబర్థి వైచి తా సంతోషమగ్నుండయ్యె. అంత హరిహరబ్రహ్మేంద్రాదులు తమ నిజభార్యాసమేతులై సంతసంబార భుజించిరి. హవ్యవాహనపవనమన్మథకార్తికేయాంజనేయాదులు భుజించి భూతగణాదులకును, తదితరులకును, మృష్టాన్నభోజనంబు లంబరితృప్తి గావించిరి. పాకపాత్రంబు లందుండు చారులు పరిశుద్ధంబు చేసిపెట్టి రంత. 166

## సూర్యాస్తమయ చంద్రోదయ సూర్యోదయముల వర్ణనము.

తే. హరివివాహంబునకు వచ్చినట్టి బ్రహ్మ
ముఖ్యులందఱు భోజనములను జేసి
రింక నిచ్చట నాకుండ నేమి మేరు
భూధరంబున నాదిక్కుఁ బోయి వత్తు. 167

తే. చంద్ర నీవింక వేంకటాచలముమీఁద
సకల సురమునిముఖ్యులు సంతసించు
కొఱకు వెన్నెల నంతట నెఱపు మనుచుఁ
జెప్పి చనినట్లు యపరాద్రిఁ జేరె నినుఁడు. 168

సీ. అబ్జబాంధవుఁ డిట్టు లపరాబ్ధిఁ గ్రుంకఁగ
నపుడహిగిరినుండు నట్టిలక్ష్మి
మొదలైనసతులను ముచ్చటగాఁ జూడ
హేమాంబరము ధరియించి పద్మ

రాగభూషణములు రక్తచందనమును
బసుపుకుంకుము దాల్చి భక్తిమెఱయ
పశ్చిమాశాకాంత పైనమై వచ్చెనో
యనఁగ సంధ్యారాగ మతిశయిల్లె
నందుచేఁ బార్వతీప్రముఖాబ్జముఖుల
మణుల భూషణముల రక్తిమములు మించెఁ
బతులారత్నములు చూచి ఫలములనుచు
మెక్కఁటకుఁ బొందుగతి చెట్లమీఁద వ్రాలె. 169

తే. విపుల నీలాంబరమునిండ విమలమౌక్తి
కముల గుమిగూర్చి శేషనగంబుపైనఁ
గట్టినటువంటి *చందువాకరణిఁ దార
కంబు లంతంతకు నభంబుఁ గ్రాలె నపుడు. 170

సీ. జలధి నుప్పొంగించి జలరుహపంక్తుల
నీక్షించి నోళ్ల మూయించి మించి
కుముదసంతతులను బ్రమదంబు నొందించి
తొలఁగక శుభ్రకాంతులను బెంచి
విరహుల నలయించి విరసము ల్గలిగించి
చక్రవాకుల వేడ్క లాక్రమించి
చీఁకటిఁ గబళించి చిగురుటాకుల దీప
ములమాడ్కి వెల్గించి మొనసి యొంచి
తే. చలువచీఁకటులు సానుదేశముల నిండఁ
బఱచినటువలె వెన్నెలఁ బ్రబలఁజేసి

* చందువ=మేలుకట్టు, సోపానము.

పూర్వదిక్కాంత నీక్షింపఁ బోసఁగుకరణి
సరగ వచ్చుచునుండె నాచంద్రుఁ డంత. 171

చ. వనగిరి సానుశృంగముల వారిజసంభవుఁ డాదిగా మహా
మునులు శివుండు దిక్పతులు మోహము లొందఁగ నప్పు
గామినీ, జనములఁ గూడి యుండఁగను జక్రి మహానియమం
బుతో సిరికై, నెనరున వక్షమం దిడక నేల రచించు చిగుళ్ల
పాన్పులన్. 172

ఆ. వకుళయొద్ద లక్ష్మి వల్మీకవివరంబు
చెంతఁ జక్రియును వసించి యొక్క
రొకరి నంటకుండు టుంట రాజు గని క
లంక మొంది రోష మంకురింప. 173

క. నాతోడఁ బుట్టి వెలసిన
శ్రీతరుణీమణిని వేఱచేసిన దనుజా
రాతికి నేఁ డుపకారము
బ్రాఁతిగ నేఁజేయననుచు పగఁ గనుఁగొనుచున్ 174

తే. చెలువుగా హరియురమున నలరి భోగ
లీల వెలయఁగ మును బవ్వళించులక్ష్మి
రాగవిరహితయై కొండరాతిమీఁద
నిపుడు శయనించి యున్నది యెట్లుచూతు. 175

సీ. మునియగు భృగుఁడు చేసినపని కలిగి కొ
ల్లాపురమందున్న లక్ష్మి నిటకు
మొదటఁ బిల్పింపక మోసతోఁ దాను మా
యలువన్ని తనకుండ లంటువేళ

పిలిపించె నిఁకనైనఁ బ్రేమమై సుఖముగం
దుంచును గద యని యెంచి నమ్మి
వచ్చితి శ్రీరమావనిత నాహరి తేఁజ
జేసినవిధము చూచితిని గనులు
తే. చల్లనాయెను నేను హాచలము దీఱ
నేమి సేయుదు నను గ్రోధ మిసుమడింప
శ్రీశునేత్రాబ్జములనిండ శీతకిరణ
జాలమును జొన్ని ముకుళింప సరగఁజేతు. 176

తే. రెండుజాములు దనుక యీరీతి మేను
మఱచి నిదురించు మోహావమఱఁపి యనుచు
హెచ్చి హిమకిరణుఁడు శాపమిచ్చె నేమొ
యనఁగహరినిద్రవోయె దేహంబుమఱచి. 177

తే. తలిరుఁబానుపుపై విశ్వతైజసులను
నడచి ప్రాజ్ఞుని దాఁటి యఖండతుర్య
మం దమరఁ బొంది తదతీత మైనసుఖము
ననుభవించుచు నుండెఁ బద్మాక్షుఁడచట. 178

క. అంతట నలరులపై శ్రీ
కాంతామణి నిదురఁ జెందఁగాఁ జూచి కడుం
జింతాక్రాంతమనంబున
సంతోషము లేక చిక్కి సగముగుపగిదిన్. 179

సీ. శుక్లపక్షమునాఁటిసోముఁ డాలోచించి
తలఁచె నిమ్మెయి రమాతరుణి కిచట
నలుక దీఱిచి పక్షమం దుంచికొనియుండ
కాకాశరాజేంద్రునాత్మసుతను

దాఁ బెండ్లియాడుట దలఁచెఁ గదా హరి
దయ లేనివాఁ డయ్యె ధాతగూడ
నిపుడైన సురమునం దిందిర నిడుకొని
యేలంగ మేలు మఱేల పెండ్లి
తే. యనుచు మునులైనఁ జెప్పక యలరువారు
కాని వీరికి వనములఁ బూని పోవు
నపుడు చీఁకటి చేయింతు ననఁగఁ బశ్చి
మాబ్ధి కేగుదు నని చంద్రుఁడరుగుచుండె. 180

చ. తమవిభుఁ డబ్ధిపోవఁ గని తారలు విన్నఁదనంబు నొందుచుం
గ్రమముగఁ జంద్రుతోడుతన గ్రక్కునఁ బోవుచు నుండె
నప్పుడే, కుముదవరాప్తుఁ, డేగుటకుఁ గ్రూరుఁడు వచ్చుట
కార్తినొందుచుౕ, భ్రమయుచు నీటియం దొదుగుభావముతో
ముకుళించె ఖిన్నతన్. 181

ఉ. అప్పుడు చంద్రుఁ డేగె నిఁక నంబుజమిత్రుఁడు జాముప్రొద్దుకే
తెప్పున వచ్చువాఁడు చను దేరక మున్నె విరించిముఖ్యులం
దప్పక చూడవచ్చును గదాయని నల్లన చీరఁగట్టి వే
యొప్పుగ మబ్బుచాన చనుచున్న దనం దగఁ గ్రమ్మెఁ గొండపై.

సీ. ఆచీఁకటిని జూచి యద్రిరూపమునున్న
పన్నగేంద్రుఁడు నిజఫణము లెత్తి
హరిహరబ్రహ్మాదు లంగనలనుగూడి
యుండఁగఁ జీఁకటి యుండఁదగునె
యని ఫణామణుల నత్యంతముగా వెల్గఁ
జేసినాఁ డన నద్రిఁ జెన్ను మీఱ

జ్యోతిర్లతావళుల్ చూపట్టె హేమాద్రి
కీవల నున్నట్టి* యిఱులనెల్లఁ
తే. బట్టి గొట్టెను కో యనునట్టిరీతి
నుదయగిరియందు వనజాప్తుఁ డొందె నైజ
కిరణములఁ జూపి యిఱులెల్ల నురుభయంబు
వడి వడంకుచు డాఁగె నప్పుడు కడంగి. 183

ఆ. హరిని లేపి పెండ్లి కంపించుటకు శుభ్ర
వస్త్రమును ధరించి వగఁ జెలంగఁ
దూర్పుపడఁతి భక్తితో వచ్చెనో యనఁ
దూర్పుఁ దెల్లగాను దుఱఁగలించె. 184

తే. పసుపు సున్నము బంగరు పళ్లెరాన
నీటితోఁ గల్పి చక్రికి నెమ్మి యార
తియు నొసంగుటకై ఛాయ దేవి తెచ్చె
ననఁగ నరుణోదయంబయ్యె నంతకంత. 185

క. మక్కువతో హరిపెండ్లికిఁ
గ్రక్కునఁ బోవలయు ననెడుకై వడి నపు డా
చక్కని యుదయాచలమున
నెక్కుచు రానుండె వేడ్క నెసలారంగన్. 186

తే. చంద్రకిరణంబులకు హరిసరవి నేత్ర
సరసిజము మూసుకొనియుండఁ జనదటంచు
నెంచి లేచినవాఁడే సుమి యంచుఁ జూడ
వికసితములయ్యె ననినట్లు విష్ణుఁ డపుడు. 187

ఇఱులు=చీఁకటి.

తే. కనులు దెఱచి ముదంబునఁ గమలముఖము
చూచి శ్రీకర మగుఁగాక నీరిది నాకు
నంచు మది నెంచి లేచి బ్రహ్మాదులకడ
కెలమి రావించి పైదాని కేమి యింక. 188

వ. అనిన విని విహగనాథుం డట్లు చేసె. 189

తే. వసుధ మిత్త్రుండు తముఁ గావ వచ్చినపుడు
శత్త్రుఁడగు చంద్రుఁ డల్కమైఁ జనుటఁ జూచి
నవ్వెను ననంగ సరసుల నళినచయము
తనర వికసించె నానందదాయకముగ. 190

క. సరసిజములలో రాతిరి
కరము చెఱం దనరుచుండి ఘనుఁ డినుఁడు చెఱన్
సరగ విడిపింప వెడలిన
కరణి నళుల్దిరుగుచుండెఁ గడుహతములతోన్ 191

తే. కలకలధ్వను లెసఁగ ఖగంబు లెల్లఁ
జక్రి పెండ్లికి రమ్మంచు సరవిగాను
బొసఁగ దిగ్దేవతలఁ బిల్వఁ బోవునటులఁ
జెలఁగి కూయుచు నెల్లదిక్కులకుఁ బాఱె. 192

ఉ. పీతనిజప్రకాశమును బెంచుచు వృక్షలతాద్రిదిక్పుర
వ్రాతములందుఁ గప్పుచును వచ్చు దివాకరుఁ జూచి లేచి యా
ధాతృముఖామరార్యులును దాపసులున్ హరియున్ శివుండు వి
ఖ్యాతిగనుండు పుష్కరిణిగట్టునఁ జేరి యథాక్రమంబుగన్.

శా. స్నానార్ఘ్యాదికనిత్యకృత్యవిధులన్ సంతోషముం జేసి రం
దానారాయణుఁ డెండ మించు నిఁక లెం డంచుం బ్రయా
ణంబు తా, నానందంబునఁ జెప్ప వారలు ప్రియం బారంగ

వెన్వెంట రాఁగా నాగేంద్రుఁడు చక్రపాణికిని సత్కల్యా
ణముం బాడుచున్. 194

శా. ముత్తైదుల్ చనుచుండఁగా ద్విజవరుల్ మోదానవేదంబులె
ల్లెత్తెంతో వచియింపఁగా నెలమిమై నింద్రాణి దేవాంగనల్
ముత్తెంబు ల్విరులఁ శుభాకర కరంబుల్పట్టి యాచక్రికిం
జిత్తంబుల్ ముదమంద నేసలోగి శ్వేశ్రేయంబుగ శ్శీర్షమున్.

వ. చల్లి రంత. 196

ఆ. హేమరథముమీఁద నిందిర పుష్పర
థంబుమీఁద వకుళ తార్క్ష్యవాహ
నంబుమీఁదఁ జక్రి నందిపై రుద్రుండు
హంసవాహనంబునందు బ్రహ్మ. 197

సీ. ఎక్కిరి పురుహూతుఁ డిభమునం దగరుపై
నసలుండు మహిషంబునందు యముఁడు
నరునిపై నిబురుతి వరమకరంబున
వరుణుండు మృగమునఁ బవనుఁ డెలమి
హయముపై ధనదుండు నవలతక్కినవారు
తమవాహనంబులం బ్రమదమారఁ
గూర్చుండి తమతమగూర్మిపత్నులతోడ
హరికి ముందట ధాత నరుగ వెన్క
రుద్రుండు కుడిదట్టు రూఢిగ శ్రీసతి
యెడమదిక్కున వెన్క నెలమి గుహుఁడు
తే. వివిధవాద్యంబు లెంతయు వీనులలరు
చుండ మ్రోయంగ నరదంబు లోలిరాఁగ

నేములధ్వను లొప్పార నెమ్మి మాగ
ధులు ముదంబున బిరుదులు చెలఁగి వొగడ. 198

తే. గొడుగు శేషుఁడు పట్టఁగఁ గుడియెడమల
సమర పవనుండు వరచామరములు వీవ
భక్తి మెఱయంగ సేనాధిపతి ముదమున
నాలవట్టముపట్ట శేషాద్రి డిగ్గి. 199

వ. నేల యీనిన చందంబున నెఱసి కపిలతీర్థ మార్గంబునం జని
చని శుకాశ్రమంబునకుఁ బోవుచుండఁగ నాశుకుండు స్వామి
కెదురువచ్చి తోడ్కొని వోయి సుస్థలంబునందుంచి నిజ
యోగప్రభావంబున సకలపదార్థాకర్షణంబుచేసి హరిహర
బ్రహ్మాదులకు విందుచేయించె నయ్యష్టమినాఁటిరాత్రి హరి
గంధర్వయక్షకిన్నరగానంబు లాలకించుచు రంభాద్యప్సర
స్త్రీలనృత్యంబు లీక్షించుచు సామగానంబులు విని విని
చొక్కి సుమశయ్య విశ్రమించి లేచి యమ్మరునాఁడు నారా
యణవనపురసమీపంబునకు నాకాశరాజు పురోహితామాత్య
జనసమేతుఁడై చతురంగబలములతోడ నాచక్రి కెదురుగ
వచ్చి పూజాలింగనాది సత్కృత్యంబు లాచరించి కడువైభ
వంబునం బురమార్గంబున వేడ్కం దోడ్కొనివచ్చి విడిది
గృహంబున నుంచి హరికి సంతోషం బొనరించి నిజమందిరం
బున కేగి తొండమానుని శౌరిసాన్నిధ్యంబునకుఁ బంప
నతండు వచ్చి హరిహరబ్రహ్మాదులకు నమస్కరించి గౌరవం
బున భోజనంబులు చేయించి తాంబూలంబు లిప్పించి గృహం
బున కేగి గురువాక్యప్రకారంబున నాకాశరాజు భార్యా
పుత్రికలతోడ సన్మంగళస్నానంబులు చేసి వివాహమండపం

బున వివిధవాద్యాదులు మ్రోయుచుండ నాందీప్రముఖవిధి
విహితకర్మకలాపంబు లాచరించె నంత. 200

సీ. అస్తమయముగాఁగ హరితోడ విడిదిలో
బ్రహ్మరుద్రాదులు పవ్వళించి
నిదురించి రావల నుదయపర్వతముపై
నరుణోదయంబయ్యె నపుడ లేచి
యందఱు స్నాన సంధ్యాది కృత్యంబులు
నెఱవేర్చి రంతట హరియు స్నాన
సంధ్యాదు లొనరించి సంతోషమారంగ
నావశిష్ఠులఁ జూచి యనియె నిట్లు
తే. నేను లక్ష్మియు నజుఁడును నీవు వకుళ
మాలికయు భుక్తిఁ గొనక నేమమున నుండ
వలెఁ గదా కన్య నొసఁగెడివారలింట
నవ్విధంబుండవలెఁగదా యనుచు మఱియు. 201
తే. తొండమానుండును బురోహితుండు నైన
సురగురుండు భుజింప కచ్చోటఁ దగిన
నియమమున నుండవలెఁగదా! నిలిచినట్టి
వారలందఱు భుజియింపవచ్చుఁ గనుక. 202

వ. త్వరగ బ్రాహ్మణభోజనంబు సేయింపందగు ననిన విని వసి
ష్ఠుండు కుబేరుని కాయుదంతంబంతయుం జెప్పి పంప నతం
డరిగి యుపవాసనియమ సంతర్పణప్రకారంబాకాశరాజుకుం
జెప్ప నృపాలుండు సంతసించి మధ్యాహ్నంబునకు బ్రాహ్మణ
సంతర్పణంబు సేయించి యొక్కొక్క నిష్కంబు దక్షిణ లిచ్చి
ప్రొద్దుగ్రుంకినపదమూఁడు గడియలకు ముహూర్తంబు

గావలయుఁ దగు మంగళద్రవ్యంబులు వివాహమంటప వేదిక యందు నుంచవలయు నని పరిచారులకు నియమించి పురోహిత బంధుమిత్ర కళత్రజనాదులతో ధరణీదేవి సువాసినులం దోడ్కొని సాయంసమయంబున మంగళవాద్యంబులతో హరియుండు విడిది మందిరంబున కేగి నక్షత్రగణ పరివృతుండైన సుధాకరుని చందంబున నజశంకరుల నడుమ నవరత్నపీఠంబునం గూర్చునియుండు హరిని జూచి యానందించి వసిష్ఠాదిమునులం జూచి స్వామివారిం దోడ్కొని మద్గృహంబునకు రావలె నని ప్రార్థించె నపు డాస్వామిని వసిష్ఠుండు పూజింపు మని చెప్పిన విని ధరణీదేవి సంకోచంబున నయంధతిని మున్నిడుకొని భయభక్తు లెసంగ నాస్వామికి దివ్యవస్త్రాభరణ చందనతాంబూలంబు లర్పించి పుష్పహారంబు కంఠంబున నుంచి కృతార్థురాలైతి నని సంతోషించెఁదొండమానుఁడు సభాసదులకుం జందనపుష్పతాంబూలంబు లిప్పించెననంతరంబు. 203

సీ. ఐరావతముమీఁద హరిని శ్రీసతి నుంచి
కొని రాజవీథులం గోరి రాఁగ
వేడ్కమై వరచతుర్వేదఘోషణములు
ఘన యక్ష గంధర్వగానములును
మిన్నంది ఘోషింప మెఱయుచు రంభాది
వనితలు నృత్యముల్ వఱల సల్ప
ఘనతరకరదీప గగనబాణంబులు
పెక్కుదిక్కులను దీపింపఁగాను

తే. సకల దిక్పతులును పద్మసంభవుఁడును
గొలువఁగాఁ జక్రి సంతోషకలితుఁడగుచు
నిర్మలుం డగునాకాశనృపతి నగరు
చేరుటకు వచ్చి మందిరద్వారమునను. 204

తే. నిలువ మంగళవాద్యాలు నెమ్మిఁ జెలఁగఁ
దొండమానునిభార్య సంతోషముగను
నైదువులతోడఁ జేఁబట్టి హరికి సిరికి
మంగళారతు లిచ్చె శుభాంగముగను. 205

క. తనకును సిరి కారతు లి
చ్చిన వారికి వీడెములను జీనాంబరముల్
ఘనమతి వరనిష్కములను
బెనుపుగ నిప్పించె నాకురేరునిచేతన్. 206

వ. అంత శ్రీనివాసుం డైరావతంబుడిగ్గి లక్ష్మిని కరంబు పట్టుకుని
బ్రహ్మరుద్రాదులుతోడ నంతఃపురంబులోనికేగి కల్యాణమంట
పంబునం జతురశ్ర రత్నవేదికలయందున్న హేమసింహాసనం
బుమీఁద లక్ష్మీసమేతంబుగఁ గూర్చుండఁగ విధ్యుక్తముగ
నాకాశరాజేంద్రుఁడు నిశ్చితార్థం బొనర్చె నంత. 207

సీ. అమరఁ బద్మావతి కనసూయ మొదలగు
నైదువలెల్ల సమ్మోదమెసఁగ
భాసుర నూతనాభరణంబులను నవ్య
చేల చందన పుష్పమాలికలను
గాటుక కుంకుమ క్రమముగ నిపు డలం
కారంబు చేసి శ్రీగౌరిచెంత

నుంచి పూజలను జేయించిరి ఋషులు క
న్యావరణముచేసిరంత వేడ్క.
తే. సుతను దీవించి మంగళసూత్రమటుతఁ
గట్టె నాధరణీదేవి కన్యతోడఁ
గూడ నైదువలను దోడుకొని వివాహ
మంటపము చేర వచ్చి నెమ్మనము నెసఁగ. 208
తే. తూర్పుముఖముగ సుతనుంచెఁ దోయజాక్షుఁ
డచట పశ్చిమముఖముగ నలరుచుండె
నలఘు మంగళవాద్యము ల్చెలఁగుచుండ
విప్రవర్యులు చూడంగ విధిక్రమమున. 209
క. గడియలు కావచ్చిన దని
కడువడిఁ బురహూతముఖ్య గంధర్వాదుల్
కడుకొని చెప్పఁగ నృపుఁ డ
క్కడ హరిసాన్నిధ్యమునకుఁ గ్రక్కునఁ జేరెన్. 210
సీ. అచ్చట వైవాహికాంగద్రవ్యంబులు
గని వసిష్ఠుఁడు ముదంబును దగంగ
నపుడు నూతనభర్మ యజ్ఞోపవీతముల్
ధరియించి కంకణధారణంబు
చేయించుకొని యున్న శ్రీహరిపాదప
ద్మముల బంగరుపళ్లెరమున నుంచి
తపసులు పురుషసూక్తంబులు చెప్పంగ
పుణ్యతీర్థమును నాభూపవరుని
ఆ. భార్య దెచ్చి యీయఁ బరమానుముదమునం
గడిగి యమలతీర్థ మెడఁద భక్తి

శిరముఁ జల్లికొనుచు సరసి 'ర్యశిరంబు
నందుఁ జలె బంధులందుఁ జల్లె. 211

సీ. ఆచక్రి కాచమనార్ఘ్యము ల్మధుపర్క-
మిచ్చి పద్మావతి నెలమిఁ బిలచి
జగదీశుఁ డవల నుండఁగ నిప్వరకు మధ్య
మున యవనికఁ బట్టి మొనసి నృపతి
యను ముఖంబున నప్పు డత్రిగోత్రజనుపీ
రకభూమినాథపుత్రికను ధర్మ
రాజాత్మజుఁడ నభోరాజాఖ్యుఁడను నేను
నాకన్య నిచ్చెద నీకు నిప్పు
తే. డగ్నిసాక్షిగఁ జేఁబట్టు మంబుజాక్ష
యనఁగ విని చక్రి సంతోష మతిశయింప
సకలసురమునిముఖ్యులు సాక్షిగాఁగ
నావసిష్ఠానుమతి నిట్టు లనియె నపుడు. 212

వ. వసిష్ఠగోత్రోద్భవ శూరసేనాత్మజ వసుదేవపుత్త్రుండనై,
వాసుదేవనామధేయంబు నొంది శ్రీవేంకటేశ్వరుండ నైన
నీయత్రిగోత్రసంజాత యగు పద్మావతిని నగ్నిసాక్షిగఁ బాణి
గ్రహణం బొనర్చెద ననిపల్కిన విని నృపాలుండు హరికి వర
దక్షిణ కోటినిష్కంబులు సమర్పించి యవ్వల నమూల్యాభర
ణాంబరంబులును నవరత్నరచితశతభారకిరీటంబును దశసం
ఖ్యాకభార సువర్ణరత్నరచితబాహుపురులును విమలరత్నాం
చిత ముత్యాలహారంబును నాగాభరణంబును, దివ్య
మౌక్తిక కుండలంబులును ద్వాత్రింశ ద్భారసువర్ణ కటిసూ
త్రంబును, భాగ్యప్రదపద్మరాగ గోమేధిక స్థగితవీరమ

ద్రాద్యంగుళీయకంబును, దశభార వజ్రకవచంబును, నష్టా
దశ సువర్ణ భారపాదుక యుగళంబును శ్రీనివాసునకు
నలంకారంబు సేయించి ఋషులు మంగళాష్టకంబులు చదువం
గుశ పుష్ప హిరణ్యాక్షతోదకంబులు చేబట్టి కనకరత్నా
భరణాంబరభూషిత యగు కన్యకను హరి కరకమలంబుల
దారవోసి యానందపూరిత బాష్పలోచనుండై ధర్మార్థకామ
మోక్షసంకల్పంబులయం దీకన్యకారత్నంబును గొని ప్రియం
బున రక్షింతువుగాత, అనిసాభిప్రాయపూర్వకంబుగ స్వామిని
ప్రార్థింప నాకర్ణించి హరి మహాప్రసాదంబనుచు నాకాశ
రాజేంద్రుని వచనంబు లంగీకరించె. నంత మాంగల్య కంకణ
ధారణంబులును, అక్షతారోపణంబును, బ్రధానహోమం
బును, సప్తపదాతి క్రమణంబును, లాజహోమంబును, ప్రవేశ
హోమంబును, నరుంధతీపతివ్రతావలోకనంబును, పతివ్ర
తాంగనామణుల సందర్శనంబును, స్థాలీపాకంబును, నౌపాస
నాదులును, వృద్ధదంపత్యాశీర్వచనంబులును, మున్నగునవి
గురువసిష్ఠాత్రిప్రముఖులు నిర్వర్తించి రంత రాజేంద్రుఁడు
షోడశమహాదానంబు లిచ్చి గంధాక్షతపుష్పంబుల సభకుం
బూజచేసి ఫలదక్షిణ తాంబూలంబు లొసంగి సంతుష్టులం
జేసె నంత. 213

సీ. బ్రహ్మ రుద్రాదులు పరిఢవిల్లెడు సభఁ
బేర్మి యా నవరత్నపీఠ మునిచి
పటువజ్రకలితదీప స్తంభములమీఁద
బహుళమాణిక్యదీపములఁ బెట్టి

పైడిపళ్లెర ముంచి భక్ష్యభోజ్యాది ప
దార్థము ల్వడ్డించి రపుడు శౌరి
వనధిజ పద్మావతిని తా నుభయపా
ర్శ్వముల నుంచుకొని ముచ్చటలు మీఱఁ
తే. దనకుఁ జుట్టురు బంతులు దనరియున్న
బ్రహ్మరుద్రాదులుం గూడఁ బ్రమదమార
నారగించుచు నుండఁగ నంద మొదవఁ
దాను భుజియించె విభవంబు తనర నపుడు. 214

వ. అంత నందఱు హస్తపాదప్రక్షాళనం బొనర్చుకుని దివ్యమం
దిరం బొక్కయెడ వీడెములను జేసి యించుక నిదురించిరి. 215

ఆ. నిదురఁజెంది సూర్యుఁ డుదయింపఁగా లేచి
వారివారిపనులు వఱలఁజేసి
రంత సిరికిఁ బద్మ కలరంగఁ జక్రికి
నల్లు లిడిరి దినదినంబు నెలమి. 216

సీ. నలుగులు *నామెతనంబులు బువ్వముల్
సంతర్పణంబులు సంతసముగ
నడుపుచు మూఁడవనాఁడు † పాకెనచేసి
నయముగ నాల్గవనాఁటిరాత్రి
అందఱితో శౌరి హరిబువ్వము భుజించి
శయనించి పిదప దా జామురాత్రి
కడ లేచి సరవి నప్పుడు శేషహోమము
గావించి యగ్నికి భావమలర

* మెత విందు. † పాకెన=సదస్సునాఁటి మహదాశీర్వచనము.

తే. మ్రొక్కు లిడి తనచేతికిఁ జిక్కినట్టి
కనకకలశముఁ గొని దొంగతనముగాను
బోరుగు వారిల్లు సేరె నప్పుడు రయమున
నగజమొదలగు నింతులు నగుచు లేచి. 217

తే. కాంచి పద్మావతిని హరికడకు నెలమిఁ
దోడుకొని వోయి మోహము దొడరఁ జంద
నంబు నలఁదించి పుష్పహారంబు గంఠ
మందు నిడఁజేసి తాంబూల మలర జేత. 218

వ. పట్టుకొను మని లజ్జమాని నాతోడ రమ్ము కోపం బేల యని
యడిగించి యిప్పించి రంత. 219

చ. అన విని పెండ్లికూఁతురు మహాభయభక్తులు మానసంబునం
బెనఁగొన హాసచంద్రికలు బింబ నిభాధరమందుఁ గ్రమ్మగాఁ
గనుఁగవ బెళ్కు ముద్దుఁగులుకంగ నిజేశుని మోముచూచి ల
జ్జను దలవాంచి చిల్కవలె జాణతనంబున నవ్వి చిట్లనెన్. 220

సీ. ఆత్మేశ చోరుఁడ వై నీవు మాచెంబు
దెచ్చినా వదియేమి చెప్పవోయి
మఱి యజ శివులముందఱఁ జిన్న పని నీవు
చేసినదే చాలు చెప్పవోయి
అల లక్ష్మికిని నాకుఁ దలఁవంపు పని నీవు
చేసిన కతమేమి చెప్పవోయి
ఘననాక బలికాలమునఁ దేఱి కీయల్కఁ
జేసి వచ్చిన దేల చెప్పవోయి

తే. దేవ పెండ్లికి నీవప్పుఁ దీసినట్టి
ద్రవ్యమున కీడుగా దొంగతనముచేసి

తెచ్చితివి చెంబు దీనిచేఁ దీఱ దప్పు
రమ్ము మేమీయఁగలము వరాలు సామి. 221

ఆ. గొల్లవారియిండ్లఁ గొల్లఁబెట్టుచుఁ బాలు
వెన్న ముచ్చిలించు చున్నబుద్ధి
విడువ కూరివారి వేశ్మమునం దిట్లు
చెంబు దొంగిలింపఁ జెల్లదోయి. 222

వ. అని యనేకప్రకారంబులం బ్రియోక్తులం బ్రార్థించి పల్కినం జూచి హరి చిఱునవ్వు నవ్వి పద్మావతి కరంబును బట్టుకుని తొడయందుఁ గూర్చుండఁబెట్టుకొనఁగ నందుండు జను లందఱు మందహాసంబులు చేసి రంత హరి పద్మావతి కరంబు పట్టుకొనఁగ నందఱు వైభవంబున వివాహమందిరంబునకుఁ దోడ్కొనివచ్చి యావలం గ్రమ్మఱ మంగళస్నానం బొనర్చి వస్త్రభూషణాలంకృతుఁడై రమాపద్మావతులతో నవరత్న పీఠంబునం గూర్చునియుండె. 223

సీ. అల నాకబలి దేవతార్చనంబును నీల
మణిధారణంబును మధురఫలము
లార్యులకొసఁగుట లైదువలకు శూర్ప
దానముల్ సేయుట దనరగా వ
సంతోత్సవంబును సరవి దంపతులకు
ఫలపుష్పతాంబూలములను బేళ్ల
నడిగి యిచ్చుట వార లానందముగఁ జెప్పి
దీవించి పోవుట భావ మలర

తే. నాంది వైసర్జనము చేసి నరధవుండు
వచ్చి యుండెడు బ్రహ్మాదివర్యులకును

బంధుమిత్త్రాదులకును సంపత్కరముగ
మంగళస్నానములను బొసంగ నపుడు. 224

వ. చేయించి దంపతులుగం గ్రమంబుగ నుచితాసనంబులం గూర్చుండఁబెట్టి భార్యయుం దానును వారివారికిం దగు మర్యాదవచనోక్తులం జందన పుష్ప నూతనాంబరాభరణాదు లొసంగి ఫలతాంబూలంబుల నిచ్చె నంత నాఁటి సాయంకాలంబున నలంకారయుక్తంబు నగు నైరావతంబున హరిని సిరిని పద్మావతినిం గూర్చుండఁ జేసి పురవీథులయందు సంతసంబున నుత్సవం బొనరించి నిజమందిరంబునకుఁ జేర్చి, హరి తోడవచ్చిన పరిజనంబులకు సంతసంబారఁ బసదనంబు లొసంగి యనంతరంబు కృతార్థుండ నైతి నని నెమ్మదిఁ జెందె నమ్మఱునాఁ డరుణోదయంబున హరి ప్రయాణోన్ముఖుండై పద్మావతిం బంపుఁ డనిన నయ్యాకాశరా జిట్లనియె. 225

సీ. శ్రీశేషగిరివాస శ్రీసతితోడ మీ
రొక్కమాసం బైన నుండుఁ డిచట
ననుచుఁ బ్రార్థింపఁగ హరి యిట్టు లనియె నిం
దుండఁగూడదు పను లుండు నచట
ననఁగఁ బద్మావతి నంపించువిధ మెట్లు
పసిబిడ్డ యగు గాని ప్రౌఢగాదు.
గాన నేనిపు డంప లేనన్న విని చక్రి
సిరిఁ జూచి కనుసన్న చేసె నపుడు.

తే. చక్రిభావంబు దెలిసి యాజలధికన్య
తాను నాకాశనృపుఁ జూచి తండ్రి పద్మఁ

జక్రితోఁ బంప వచ్చును సంతసంబ
మాకు నిప్పుడ మఱి చింత మీకు వలదు. 226

సీ. వకుళమాలిక తల్లివలె బ్రోచు నచ్చోట
నన్యు లెవ్వారు లేరని యనేక
రీతులుగా సిరి ప్రీతిమై వల్కఁగ
నతఁడు సమ్మోదము నప్పు డొంది
సిరికిని దనయకుం జెలువారు దివ్యాంబ
రాభరణంబు లొప్పార నొసఁగఁ
జేసి ముత్యంబులు చెలఁగి పుత్త్రికలకు
నొడిఁబ్రాలుఁ గట్టించి యుల్లమలర
తే. హరికి వస్త్రాభరణముల నలరఁజేసి
తనయ నాసిరి కొప్పించె నెనరు మించి
హరి మఱందికి వస్త్రభూషాదు లొసఁగె
వకుళ కాధరణీదేవి వఱలుగరిమ. 227

వ. అమూల్యాభరణాంబరంబుల నలంకరింపఁజేసి ఫలపుష్పతాం
బూలాదుల నెలమి వఱలంజేసె నంత. 228

క. గగనాధీశుం డంతట
జగదీశుని జెంతఁ జేరి సచ్చిత్తుం డై
నిగమాంతగుంభితోక్తులఁ
బొగడుచు మఱి యిట్టులనియెఁ బొలుపారంగన్. 229

సీ. పెద్దకాలమునుండి బిడ్డలు లేకుండి
గాంచితిఁ బద్మను గమలనయన
నీకన్యగల్గిన నెలమిచే వసుధానుఁ
డుదయించె వానిని ముదముగాను

బాలింపవలయు మాపద్మావతీదేవి
నిచ్చితి గనుక మీ రింకమీఁదఁ
జిరకృప నీటముంచినఁ బాలముంచిన
భారంబు మీదంచు బాష్పములను
తే. గన్నులను నించి మఱువల్కకున్న చక్రి
భూవరుని జూచి వల్కె గంభీరముగను
మామ మీకూఁతునకుఁ జింత యేమి వలదు
రక్షణముసేయ నే కమలాక్షినయ్య. 230
తే. పెద్దలైతిరి మీరు సంప్రీతి నెపుడు
చూడుఁ డొప్పుగ మాయందు సుభగయుతుఁడ
యనుచు నుండఁగ నొకగంభ మొనరఁబట్టు
కొని ప్రియోక్తుల నత్త యిట్లనియె నపుడు. 231
తే. అయ్య మాపద్మ నేలుము నెయ్యమార
దాని కొక కష్ట మెఱుఁగదు దైత్యనాశ
బాల సుకుమారి లక్ష్మితోఁ బరఁగువాఁడ
వగుట పెక్కులు చెప్పంగ నగునె నాకు. 232
వ. అంత రమాదేవికిని వకుళమాలికకును జెప్పఁదగిన వచనంబులు చెప్పి నంత నాహరి ప్రయాణంబై యున్నయెడ నారాజేంద్రుఁడు శాలితండులంబు లిన్నూఱులక్షల భారువులును, ముద్గధాన్యంబు ముప్పదిభారువులును, తింత్రిణీఫలేక్షుఫలంబులు నలువదివేల భారువులును, సహస్రక్షీరభాండంబులును శతశర్కరమధుఘటంబులును, కదలీకూష్మాండకందమూలాది శాకనిచయంబును, హింగుళీయాది పాకపదార్థంబులును, హయగజవృషభంబులపై నిడి శ్రీనివాసార్పితంబుగ దత్తంబు

చేసె, మఱియు దాసీజనశతంబును ద్విశతదాసజనంబులును,
దశసహస్రగోవులును, దివ్యపర్యంకాద్యనేకోపకరణంబును,
త్రికరణంబుగా నిచ్చి హరి సాన్నిధ్యంబునకుఁ గ్రమ్మఱ
వచ్చినం జూచి శ్రీనివాసుండు లేచి యిట్లనియె. 233

సీ. అవనీశ మీసుత కరణంబు తగుమాత్ర
మీవలె నింతమాకేల ననఁగ
నాకాశ నృపుఁ డిట్టు లనియె లక్ష్మీశ మీ
కేమి తక్కువగాదు హెచ్చుగాను
బూని మీకీయను నేనెంతవాఁడను
గలుముల చెలి మాకుఁ గరుణ మెఱయ
నిచ్చిన యిచ్చితి నింతమాత్రం బైనఁ
గైకొనుఁ డని పల్కి కరము మోడ్చె
తే. నపు డగస్త్యాశ్రమంబున కరుగవలయుఁ
బద్మ నీకుఁ బంపుఁ డనఁగ నా పద్మ తండ్రి
సుతనుఁ జూచి ప్రియంబార సురుచిరోక్తు
లెసఁగఁ జెప్పి మఱింక నీ విపుడు చక్రి. 234

వ. వెనువెంటం జను మనినం దల్లియు నిట్లు వచించె. 235

చ. అన విని పద్మ సంప్రియము నంబను జేతులఁ గౌఁగిలింపఁగా
నెనరున బిడ్డ నెత్తి ధరణీపతి కన్నుల నీరు నింపుచుం
మనమునఁ బ్రేమ ముద్దులిడి మచ్చికమైఁ దగ గారవించి యి
ట్లనియె విచారమేల సిరి యంతకు నున్నది హో కుమారికా.

సీ. నాకన్న నెక్కువ నళినాక్షి నిను సిరి
మన్నించుచుండు నెమ్మనము దనర

నది గాక వకుళ నిన్నాదరించుచు భక్తి
చేఁ గృప నచట పోషించుచుండు
హరి సిరి నిను నొక్కసరణిగ నీక్షించు
నేల చింతించెదు బేల యగుచుఁ
బతిభక్తి గల్గి నీపతితోడ వేంకట
గిరియందు సిరితోడఁ బరఁగుచుండు
తే. మేము వచ్చెద మచటికిఁ బ్రేమమీఱ
నీవు వత్తువు మాతోడ నెమ్మి నిటకుఁ
జెలఁగి వొమ్మని శ్రీలక్ష్మి చేతి కిచ్చి
పరఁగ నిట్లని వల్కె నిందిరను జూచి. 237

క. అమ్మా సిరి పద్మావతి
నిమ్మధుసూదనుని కిచ్చి తిటఁ గడు సమ్మో
దమ్మున నాసుత మఱి మీ
సొమ్మైనది గానఁ గరుణ చూడుము తల్లీ. 238

సీ. ఆటలాడుచునుండు నబల యేపనిపాట
లెట్టిదో తప్పొప్పు లెఱుఁగ దిపుడు
కావున మీరు చక్కఁగ బుద్ధి లిఁకఁ జెప్పి
వరుసగ దిద్దుకోవలయు సరవి
నామఱుంగున నిన్ని నాళ్లుండె నిపుడు మీ
మఱుఁగునఁ జేరె నెమ్మదిగఁ గనుఁడు
బిడ్డలు లేకయ పెద్దకాలంబుండి
కాంచితి నీకన్యకను బ్రియమునఁ
తే. బెంచి నీచేతి కిచ్చితిఁ బిన్నపడుచు
నెట్లు బ్రోచిన మీభార మింక నేను

జెప్పవలసిన మాటలు జెప్పినాఁడ
ననుచుఁ గన్నీరు నింప నిట్లనియె లక్ష్మి. 239

మ. ధరణీదేవి ముదంబుతో జనక యాతాపంబు నీకేల నేఁ
బరఁగ న్నన్నును నీసుతం గరుణమై భావించి రక్షించు శ్రీ
హరియం దున్నది చింతసేయ కిఁక నీ వానందచిత్తంబునన్
గరుణం జూడుము మమ్ముఁ బెద్దవు సుఖఖ్యాతిం దగం బొం
దుమా. 240

వ. అనుచుండఁ బద్మావతిం జూచి ధరణీదేవి యిట్లనియె. 241

తే. వినవె నాముద్దుపట్టి వివేకముగను
హరికి సిరికిని శ్రీవేంకటాద్రియందుఁ
గీర్తి నొందుము భక్తిసంపూర్తి సేవఁ
జేయుచును దల్లి! సిరితోడఁ జేరి పొమ్ము. 242

క. అప్పద్మావతి తల్లిని
తప్పక కని కనుల బాష్పధారలు వెడలన్
ఱెప్పల నడ్డము సేయుచు
నప్పుడు సిరితోడ విభుని కభిముఖి యయ్యెన్. 243

వ. అంత శ్రీనివాసుండు లక్ష్మిని బద్మావతిని దోడ్కొని గరుడ వాహనము నెక్కి బ్రహ్మాదులతోడ నగస్త్యాశ్రమంబునకుం బోయి బ్రహ్మరుద్రాదులకుం దమ కాదినంబందు నగస్త్యులు తన తపోబలంబున నానందంబుగ విందులు చేయించె. నమ్మఱునాఁడు బ్రహ్మాదులుతోడ వేంకటాద్రి కేగి యచ్చట నెల్లరకుం గ్రమ్మర విందు లొనరించి గౌరవింప వారెల్లరు మాధవు నాజ్ఞానుక్రమంబునం దమ నివాసంబుల కేగిరి సిరి

కొల్లాపురంబునకుం బ్రయాణం బై హరిం జూచి సవినయం
బుగ నిట్లనియె. 244

తే. దేవ కరవీర పురి కరుదేరవలయుఁ
గరుణతో సెలవిమ్ము మోకంజనయన
విని శిరమువంచి విన్నవై వెన్నుఁ డప్పుడు
కమలనేత్రను జూచి తాఁ గరము పట్టి. 245

వ. ఇట్లు వక్కాణించె. 246

సీ. ఇందిర నన్ను నీ వెడఁబాసి పోను గా
ల్గాడునే నిన్నుఁ బోమ్మంచు నాకు
నోరాడునే ? నీవు నూతనబంధుల
వలె సెల విమ్మంచుఁ బలుకఁ దగునె ?
పద్మావతిని నీవె పాలింప వలయు నీ
కన్యను బోషింపఁ గలనె తగునె ?
యకట నీవిందుండ కరిగినకతముచే
ధనదుఁ డిచ్చిన యప్పు దప్పకుండ
ఆ. నేను దీర్పఁగలనె ? యియ్యెడ నాకూడ
నుండు మన్నిటను సఖండసౌఖ్య
దాయిని వయి నన్ను ధన్యుని జేయుము
నాకు దిక్కుగలదె నీకుఁ దప్ప. 247

వ. అనిన విని యిందిర మందహాససుందరవదనారవింద యగుచు
నరవిందదళాక్షున కిట్లనియె. 248

మ. సకలజ్ఞత్వము డాఁచి దివ్యమహిమల్ చాలించి పద్మావతిం
బ్రకటాసక్తిని బెండ్లియాడితివి సౌభాగ్యంబు నీకిచ్చి నే

నిఁక నెందుండిన చింతలేదు నను నీ విందుండు మంచు న్వచిం
పక పంపించుము వచ్చెద న్సఖల నోప్రాణేశ శీఘ్రంబుగన్.

చ. అన విని వెన్ను డిట్లనియె నంబుధికన్యక నేను రాముఁడై
జననము నొంది యున్నతఱి జానకివై మఱి లంకలోన ము
న్నొనరుచు నున్న వేదవతి నొప్పి వివాహము చేసుకొమ్ము నీ
వనిన రహస్యసూక్తి హృదయంబున నున్నదొ లేదొ యెం
చుమా. 250

మ. అనలం బందుఁ జెలింపకున్నపుడు నీ కాప్తంబుగా మేలు చే
సిన యావేదవతీ వధూమణియ రాజీవంబులో నుండఁగాఁ
గని యాకాశనృపాలుఁ డీసతిని తా గారాబుగాఁ బెంచె నీ
వని యున్నట్టి విధంబుఁ దప్పక వివాహం బైతిఁ బద్మావతిన్

శా. నే నీవాక్యము మీఱరా దనుచు నీ నీ రేజపత్రేక్షిణి ని
ట్లానందంబుగఁ బెండ్లియాడితిని నిం కన్యోన్యభావంబుగా
దీనిం బాలనమాఱఁ జేయుటకు నీదే భారమై యుండఁగాఁ
బైనం బైతివి తేరకత్తెవలె నాపైఁ బ్రేమ యింతేగదా 252

ఉ. పావనమూర్తి యైనమునిపాదము నాయురమందుఁ దాఁకఁగా
నీవపు డల్గి వోయితివి ని న్నెడబాసిన జాలిచేత నే
నావల నన్నియు న్విడిచి యార్తిని బొందుచు వచ్చి పుట్టలో
నీవఱదాఁక యుంటి నిపు డిందుముఖి యురమందు జేరుమా.

చ. నను విడనాడి దూరముగ నర్మిలి నెంచక తొంటియట్ల నేఁ
జనెదనిచెప్పు శేల పతి సన్నిధినుండుటె ధర్మ మింతికిం
దనకును దప్పునెడుటకు ధర్మముగాదని నీ వెఱుంగవే
గనుక యురంబునం బ్రియముగా వరభూషణరీతి నుండుమా

మ. అని నారాయణుఁ డానతీయఁగ మహాయాసంబుతో లక్ష్మి
యి,ట్లనె నోనాథ భృగుండు నీయురమునం దజ్ఞానియై తన్ని
నం,దున నిచ్చో నిలువంగ లేక యట సంతోషంబుగా నిల్చి నే
ననిశంబు న్మదిఁ గుందుదాన నిఁక నే మందుం ద్రిలోకేశ్వరా.

శా. కాలం బీగతిఁ జేసె నాభృగు ననంగానేల నాయందు నీ
మేలైనట్టి దయారసం బిడినచో మేలొందుచు న్నుండెదన్
లీలామానుషవిగ్రహా యిఁక సదా లీలం దగంగన్య న
న్నోలె న్నామది కిష్ట మియ్య వని నంభోజాక్ష మన్నింపవే.

క. శ్రీరాముఁడ వైనప్పుడు
వారక నేవేదవతిని వరకృపతో నీ
వారయఁ గొనుమని చెప్పితి
వారితిం బెండ్లియాడి తైనది వేడ్కన్. 257

వ. అని ప్రియోక్తులం బద్మావతిని గారవించి హరికి సంతసంబున సేవఁ జేయుమని యనేకప్రకారంబులుగ బుజ్జగించిచెప్పి వకుళ మాలికనీక్షించి యిప్పుడంతినిబోషించుచుండుమని నియమించి హరికి మ్రొక్కి రమాదేవి కొల్లాపురంబు చేరి చక్రిని హృద యకమలమునం దిడుకొని సుఖస్థితినుండె నంత వేంకటేశుండు అగస్త్యుని వీక్షించి యిట్లనియె. 258

తే. సంయమీశ్వర వేంకటాచలము చేర
మేముపోయెద మనివల్కఁగా మునీంద్రుఁ
డనియె మాసపర్యంత మహీగిరీంద్ర
మెక్కుదురె పెండ్లికొమరు లోయిందిరేశ. 259

క. అనఘా మాసంబులు
చను నంతకు నిచటనుండు సంతోషము చా

లన విని వేంకటగిరిపతి
తనసతితో నచట నుండెఁ దద్దయు వేడ్కన్. 260

వ. అంతం గొన్నిమాసంబులకు నాకాశరాజేంద్రుండు వైకుం
ఠంబున కరిగిన వసుధానుం డుత్తరక్రియ లొనర్చి దూత
మూలకముగ నారాయణవనంబునకు నవ్వార్త వినిపోయి
తొండమానుని విచారించి దుఃఖించుచుండినపద్మావతి నూర
డించె ననిన విని శౌనకాదు లిట్లనిరి. 261.

సీ. ఆకాశరాజు శ్రీ హరిపదంబునఁ జేరి
విమలుఁ డై వోయినవెనుక యతని
తమ్ముఁడు తనయుఁ డిద్దఱునుండి రందుఁ బ
ట్టాన్ధుఁ డెవ్వఁ డయ్యె నావిధంబు
చెప్పు మటన్నఁ దానప్పుడు సూతుండు
మునులార నృపతితమ్ముఁడు ధరిత్రిఁ
దనదైన నగనృపతనయుండు తమతండ్రి
యేలినరాజ్యమే నేలవలయు
తే. ననిన విని తొండమానుండు నాగ్రహించి
పలికె నిరువురమునుగూడి భండనంబు
చేయుదము నీవు మించి గెల్చినను బృథ్వి
నీది నే మించి గెల్చిన నాది ధాత్రి. 262.

క. అని యిర్వురు పౌరుషముల
నెనయుచుఁ గయ్యం బొనర్ప నేతెంచి హరిం
గని తొండమానుఁ డనె ని
ట్లని వీర్యం బారఁ జేయు మని మఱి యనియెన్. 263.

సీ. వసుదేవసుత నేను వసుధానుఁ డీక్షితి
కొఱ. కింక ఘోరాజి మెఱయఁజేయ
వలయుఁ దోడ్పడు రమ్ము చెలఁగి నీవన నవ్వి
తన మది నిటు దాను దలఁచె శౌరి
తొండవానుని కేను దోడుగఁ బోయితి
నైనఁ బద్మావతి కలుక పుట్టు
తనతమ్ముఁ డగు వసుధానుని ప్రక్క నే
నుండిన సతి చాల నుత్సహించు
తే. తొండవానుండు పరమభ క్తుండు నాకుఁ
బరఁగ వసుధానునిం గన బావమఱఁది
గనుక యిర్వురితోను సఖ్యంబు వొసఁగఁ
జేయవలె దీని కిఁక నేమి సేయు దకట. 264

మ. అని యోచింపుచుఁదొండవాను నపు డయ్యబ్జాక్షుఁ డీక్షించి
యిట్లనె నోమామమహాజి దిపుడు తోడై నేను నీదిక్కు వ
చ్చిన పద్మావతి తోడఁబుట్టు కొఱకై చింతించుచుండు న్మదీ
నిను వీడం దగ దెట్టులైన జయమే నీతట్టుగా నుంచెదన్. 265

సీ. అని రహస్యంబుగ నతని కా ప్తతఁ జెప్పి
సమ్ముదంబునఁ దనచక్ర మిచ్చి
పంపించె నటుమీఁద బావమఱఁది వచ్చి
తనకుఁ దో డడుగఁగ విని రయమున
లేచి యాపకుళమాలికకుఁ బద్మావతి
నం దొప్పగించి నెయ్యంబు మెఱయ
బావమఱఁదితోడఁ బైనమై నారాయ
ణాఖ్యపురంబున కరిగి యచట

తే. భండనము చేయఁ జతురంగబలములందుఁ
గొలువఁగా బావమఱదిని గూడి సమర
భేరి వేయించె నప్పు డాభూరిరవము
తొండవానుండు విని మహోద్దండుఁ డగుచు. 266

క. శరచాపంబులు గైకొని
సరవిగ ధైర్యంబు గదుర సంగరమునకున్
హరికిని వసుధానునకును
సరగున నెదురేగి నిలిచె సంరంభముతోన్. 267

వ. అప్పుడు హరియును వసుధానుండును గనకరథంబు లెక్కి వీర్యవీరులై నిల్చియుండుటం జూచి తొండవానుండు తన రథముపై నుండి నిజచతురంగబలంబులం బరబలంబుపైఁ బురికొల్పి నప్పు డుభయబలంబు లుప్పొంగి రథంబులమీఁద రథంబులును గజంబులమీఁద గజంబులును ఘోటకంబులుమీఁద ఘోటకంబులును గాల్బలంబులపైఁ గాల్బలంబును బడి యొండొరులు కరవాలంబుల ఝళిపించుచు నఱకుచు నుఱుకుచు ధనుష్టంకారంబుచేసి బాణంబులం బ్రయోగించుచు డాయుచుం గుదియుచు నఱచుచు బాహాస్ఫాలనంబుచేసి ప్రతాపంబులు వల్కుచుం గుంతలంబులన్ గ్రుచ్చుచు ముద్గరంబుల నొడిసిపట్టి త్రిప్పుచుం బొడుచుచు శూలంబుల నాటించుచుం బూర్వ పశ్చిమసముద్రంబులు దారసిల్లినభంగి పోరుచుండిరి తొండవానునిబలంబు లరిబలంబునంబడి పోరాడంజాలక యుఱుకుచున్నంజూచి నిలునిలువో తగదని పలచి వసుధానుండు తనరథంబు దోలించి చండకాండంబులం బ్రయోగింప నది యోపంజాలక తొండవానుం

దుద్దండ పరాక్రమంబు పెంచుకొని వాడిశిలీముఖంబు లొక్కుమ్మడి వృష్టిపలెఁ గుఱియింప నతండు రోషభీషణా రావంబు సేయుచు హరియొసంగిన చక్రంబు పైవ నప్పు డాచక్రంబు ప్రళయార్కబింబంబుచందంబున వచ్చుచున్నం జూచి హరికఱకు కోపంబున నతనికడ్డంబుగ నిలిచె నప్పుడా చక్రంబు శ్రీనివాసునిపైఁబడిన నాహరి మూర్ఛాక్రాంతుఁడై రథంబుపైఁ బడుటం జేసి భీతిల్లి తొండవానుండు శస్త్రాస్త్రం బులు విడచి నిజరథంబు డిగ్గి హరి రథంబుమీఁది కరిగి పన్నీటం దడవుచుం దాలవృంతంబుల విసరుచుండె నపుడా వసుధానుండును బాష్పపూరితాక్షుండై రథంబుదిగి హరిరథం బుపై కరిగి కప్పురంపుపలుకులు నమలి చెవినూఁదుచుండ శ్రీనివాసుండు కొండొకతడవుకు మూర్ఛతెలిసి లేచి కూర్చుండినం జూచి కరకమలంబుల మోడ్చి తొండవానుం డిట్లనియె. 268

క. హరి నే వసుధానునిపై
నరిభీకరచక్ర మేసి నపు డడ్డముగా
సరగున నిల్చితి వందునఁ
బొరిఁ జక్రము దాఁక మూర్ఛఁ బొందితి వకటా. 269

క. నీ కపకారముచేసిన
ప్రాకట పాపంబు నన్నుఁ బాయుటకొఱకై
జోకను గాశికిఁ బోవలె
నాకిప్పుడు సెలవొసంగు నళినదళాక్షా. 270

క. వసుధానున కొగిఁబట్టము
వస మీఱఁగఁ గట్టి రాజ్యపరిపాలన తా

నెసలారఁ జేయని మ్రిూ
వసుమతి నే నొల్ల నింక వనజదళాక్షా. 271

క. అన విని హరి వసుధాసుని
గనుఁగొని యిట్లనియె నిన్నుఁ గాంచిన జనకుం
డనఘుండై పరలోకం
బున కేగెను బిన్నతండ్రి పుణ్యముకొఱకై. 272

క. ఘనగంగానది కరిగెద
ననుచున్నాఁ డిందు కిప్పు డాలోచన నిం
పొనరఁగఁ జెప్పుము నీ వన
విని వసుధానుండు పలికె వినయము దనరన్. 273

సీ. హరి నీవు నను బ్రోవ నడ్డంబుగా రాఁగ
నిరుపమచక్రంబు నిన్నుఁ దాఁకె
నపుడు మూర్ఛిల్లితి పట్టిపాపము వోవ
నింక నిందుండి రామేశ్వరమున
కరిగెద నగ్రజుఁ డైనట్టి మాతండ్రి
పట్టంబుఁ బినతండ్రి గట్టుకొనుమ
టంచుఁ జెప్పుము మది నలరంగ ననఁగ నా
శౌరి చూచి యగస్త్యసన్మునీశు

తే. శుకమునీంద్రుని రావించి సకలవిషయ
ముల నెఱింగించి యెటుసేయవలయు ననిన
నవ్వి వా రిట్టు లనిరి శ్రీనాథ వీరి
కించుకేనియు నోపిక యెడఁద లేక. 274

సీ. కాశిరామేశ్వరగతులేల వీరికి
నన్నదమ్ములపాళ్లు నరసి మీరు

గగనాఖ్యనృపునిపా లొగిఁ బంచి యీవసు
ధానుని కిపుడియ్య ధర్మమగును
దొండవానునిపాలు తొండవానునికీయు
నట్లు సేయుట మంచిదగును వినుము

ఆ. వేఱువిధము సేయ విధి తప్పునని ముసు
లపుడు వల్కఁ జక్రి యాసుధర్మ
సొమ్ము రెండుపాళ్లు చొప్పడ నొనరించి
వారికిచ్చి మునులఁ బంపి యంత. 275

వ. తాను వేంకటాద్రి కరిగి పద్మావతితో సంతసంబున నుండె. 276

తే. అర్ధరాజ్యము వసుధానుఁ డలర నేలు
చుండఁగా నర్ధరాజ్యంబు తొండవానుఁ
డేలఁగాఁ బుణ్యపరిపాకకాల మొదవ
నప్పుడానృపుఁ డాత్మ నిట్లని తలంచె. 277

ఉ. వేంకటనాయకుండు మఱి విష్ణువగాని నరుండు గాఁడు నే
మంకుగుణంబుచే మనుజమాత్రుఁడటంచుఁ దలంచుచుంటినా
పంకజనేత్రు దివ్యపదపంకజముల న్మది నమ్మి భక్తిమై
నింక నిజంబుగా నతని నేర్పడఁ బూలను బూజచేసెదన్. 278

క. ఆపరమాత్ముఁడు మనుజుం
డై పద్మావతిని గూడి యల్లునివలెఁ దాఁ
గాపట్యముతో మెలఁగుట
లీపట్లం దెలిసె నింది రేశునిమహిమన్. 279

సీ. అని యగస్త్యాశ్రమంబునకు వేగమ వచ్చి
శేషాద్రిపతిమర్త్య వేష మమరఁ
దెలియనడ్గి మఱందు నిలువక హరిచెంతఁ
జేరి ప్రాకటభక్తి చిత్తమందుఁ
దనరంగ నప్పుడు దండప్రణామంబు
లం జేయ నక్కమలాక్షుఁ డెలమి
చూచి యిట్లనె నృపా యీచందమున నాకు
మామవై మ్రొక్కుట యేమిధర్మ
తే. మనఁగ నాతొండమానుండు ఘనత మెఱయఁ
గాంచి యోమాధవామాయ నుంచి నన్ను
వెఱ్ఱివానినిగాఁ జేయ వేడ్క నీకు
నహహ యింక నిన్నుఁ బాయక యాత్మయందు. 280

వ. ధ్యానించుచుండెద నెంతయుం గృతార్థుం డైతి నని యనేక
విధంబులఁ బ్రార్థింప నాచక్రి విశ్వరూపంబుఁ జూపుటం జేసి
తొండమానుండు వెండియు నిట్లనుతించె. 281

దండకము. శ్రీమద్రమాధీశ జీమూతసంకాశ కాలత్రయాతీత
కంజాతసంజాత తాతా జగత్త్రాత వేదార్థనిర్ణేత భూతాత్మ
సీతాధిపా సద్గుణవ్రాత పూతావనీజాతనాథా శచీనాథ
దాతా మహాఘోర దైత్యాద్రిదంభోళిధారాసహస్రార
సంచార భర్మాద్రిధీరా సదాసింధుగంభీర మంథాచలోద్ధార
నారాయణానంత నీపాదముల్ చూడ పాతాళమై శీర్ష
భాగంబు నీక్షింపఁగా సత్యలోకంబునై మధ్యదేహాంగము
ల్మధ్యలోకంబులై నేత్రముల్ సూర్యశీతాంశులై శ్రోత్రము
ల్దిక్కులై నాసికాంగంబు నాసత్యయుగ్మంబునై జిహ్వ నీర

ప్రభుండై మహాకుక్షియంభోధిబృందంబునై నాఁడులెల్లఁ బ్రవాహంబులై రోమముల్ వృక్షజాలంబులై శల్యముల్ సర్వశైలంబులై కేశపాశంబులుఁ మేఘజాలంబులై ప్రాణము ల్గంధవాహుండునై బాహు లింద్రాదులై దివ్యగుహ్యేంద్రియంబుం బ్రజానాథుఁడై వృష్టి సద్వీర్యమై సుస్తనంబెన్నఁగా ధర్మమార్గంబునై వెన్ను ధర్మంబునై సారవాగింద్రియం బగ్నియై దంష్ట్రలుం దండహస్తుండునై మించె నిత్యాది చిత్రంబు లీవేళ నీయందుఁ గన్పింపఁగా మిక్కిలిఁ వేయు శీర్షంబులుఁ వేయునేత్రంబులుఁ వేయుహస్తంబులుఁ వేయు పాదంబులుఁ గోటికోట్యర్కసంకాశ పూర్ణప్రకాశంబుచే నొప్పు నీవిశ్వరూపంబు నేఁజూడ శక్తుండనే దేవ పూర్వస్థితి న్నీ మహాసౌమ్యరూపంబు నేచూపి రక్షింపుమీశా చిదాకాశ శేషాచలేంద్రా తరీకుండ సత్పట్టణాధీశ్వరా నారసింహా ప్రభూ శ్రీనివాసా నమస్తే నమస్తే నమస్తే నమః. 282

వ. అని యనేకవిధంబుల వినుతించిన నాహరి సంతసించి తనవిశ్వరూపంబు మాని యెప్పటియట్లనుండి తొండవానుని జూచి యిట్లనియె. 283

క. మానూ నేను వినోదము
గా మనుజుఁడనగుచు వేడ్కగా మీకన్యం
బ్రేమమునఁ బెండ్లియాడితి
నీమీఁద గృహస్థధర్మ మేను వహింతున్. 284

క. అమరఁగ వేంకటశైలా
గ్రమునందు నయంబు మెఱయఁగాఁ గనకమయం

బమలమణిరచితభవనము
క్రమముగ భావింపు విశ్వకర్మ కుశలతన్. 285

సీ. దేవాలయంబుగఁ దీర్పింపు మెట్లన్నఁ
గుదురుగ నొకరెండుగోపురములు
ద్వారసప్తకమును దగు వాస్తుశాస్త్రప్ర
కారంబుగాను వేంకటగిరీంద్ర
మందుఁ గట్టించి నన్నందుంచి నీవు ప్ర
కాశుని జేయు నీకలియుగమున
మును పీనగంబుమీఁదను నీవు ద్రవ్వీన
బావి గట్టడమును బాగుమీఱఁ
తే. జేయుమన నద్భుతంబంది శ్రీనివాస
బావి నేనెప్పు డాస్వర్ణపర్వతమునఁ
ద్రవ్వ లేదని నృపుఁడన నవ్వి నృపుని
గాంచి యిట్లని పల్కె శ్రీకాంతుఁ డపుడు. 286

క. మనుజేశ్వర జన్మాంతర
మునఁ జేసిన యట్టిధర్మములు మఱచితినే
యనుమానించెద వది నే
వినుపించెద నిచట నీవు వేడుకమీఱన్. 287

క. విను వైఖానసవంశం
బున నుద్భవమైన విప్రముఖ్యుఁడు విమలుం
డను శాంతుఁడు సద్గుణగణుఁ
డనఘాత్ముఁడు గోపినాథుఁ డనుఘనుఁ డవనిన్ 288

తే. కృష్ణలీలల విని చొక్కి గెంట కతని
కలియుగాదిని పూజింపఁ దలఁచి చోళ

దేశమున కేగి యచ్చట ధీరుఁ డగుచుఁ
దపముచేయుట కై కుశస్థలిని నిలిచి. 289

సీ. శ్రీకృష్ణరూపంబుఁ జిత్తమందుంచి త
పంబు సేయఁగను గోపాలవేష
ముల నేను బ్రత్యక్షముగ నిల్చి వరమేమి
కావలెనని పల్కఁగా నతండు
పరమాత్మ కృష్ణరూపంబుతో మీరుండ
వలె నేను బూజింపవలయు నట్టి
సద్వరంబీయుమో స్వామియంచు వచింప
నతని కిట్లంటి శేషాద్రియందు

తే. శ్రీనివాసుఁడనంగఁ బ్రసిద్ధినొంది
యుందు నన్నందుఁ బూజింపుచుండుఁ గృష్ణ
వేషమునఁ బూజగొన నిది వేళగాదు
గాన నీక లేచి వేంకట*గ్రావమునకు. 290

చ. జనుమని రంగదాసుఁ డనుసజ్జనుఁ డొక్కఁడు దారిలోపలన్
గనఁబడువానిఁ దోడుకొని కాననభూముల దాఁటి పోవఁగాఁ
గనకమయాద్రి ముందటఁగఁ గన్పడు వేడుక మీఱ నందు నీ
వును నతఁ డేగ నే నెలమి నొందఁ బ్రసన్నుఁడ నయ్యెదం
గృపన్. 291

తే. శూద్రుఁడైనట్టి రంగదాసుండు పుష్ప
తులసికాదళములను సంతోషమెసఁగఁ
దెచ్చి నీచేతికిచ్చు సందేహ మాత్మ
నుంచ కవిగొని పూజించుచుండు నన్ను. 292

---

*గ్రావము=కొండ.

ఉ. అచ్చటఁ గృష్ణలీలల నొయారముగం బ్రకటింతు నీకు నే
నెచ్చుగ వింతవింతలుగ నేడ్తెఱ నావల నీ కులస్థులే
వచ్చి సభక్తి నర్చనలు వారక చేయుచు నుందురంచు నే
నిచ్చితి సద్వరంబని యదృశ్యుఁడ నైతిని ధాత్రినాయకా.

సీ. వరవిప్రుఁ డందుండ వచ్చుచుండఁగ రంగ
దాసాభిధానుఁడు దారియందు
జతగూడఁగా శేషశైల మాయిర్వురు
చేరి న న్నచట వీక్షించి మ్రొక్కి
యారంగదాసుఁడే యచ్చట నొకబావిఁ
ద్రవ్వి గట్టునఁ బూలతోఁటవేసి
తాన శ్రీతులసిసద్దళసుమంబు లొసంగ
భూసురుం డవి గొని పూజసేయు

తే. నావిధంబుగఁ గొన్నియేం డ్లరిగె నవల
సకలజన మోహనం బౌ వసంతఋతువు
వచ్చె నాదాసుఁ డడవిలో వరసుమములఁ
బుట్టలోనుంచుకొని వచ్చి పుష్కరిణిని. 294

తే. జలకమాడెడు గంధర్వసతులఁ జూచె
నపుడు చిత్తంబు గఱఁగి వీర్యంబు జారి
నందు కపవిత్రగాత్రుఁడనైతి ననుచుఁ
బుష్కరిణిలోనఁ గ్రుంకి తెప్పునను బోయి. 295

సీ. కుసుమముల్ క్రమ్మఱఁ గోసి తెచ్చిన నందుఁ
గోపినాథుఁడు చూచి కోపగించి
స్వామిని పూజించుసమయంబునకుఁ బూలు
తులసి దేనె తివి దుష్టచిత్త

గర్వించి చెడితివి గావున నిందుండ
కరిగి యధోలోకమందుఁ బుట్టు
మని శపింపఁగను వాఁ డడరి శోకింపఁగ
నే జాలినొంది మన్నించి పిలిచి
తే. దోషభోగ్యుఁడనే నీవు దుఃఖపడక
రంగదాసరి నీమనోరాగ మింత
చేసె బ్రాహ్మణశాపంబు సిద్ధముగను
నే నివారింప లేనట్లు గాన నిపుడు. 296

తే. పుష్కరిణిలోన మునిఁగి యీబొంది విడువు
మటను ధర్మమహీపతియందుఁ జేరి
నాగకన్యకగర్భంబునఁ జనించి
ధారుణిం దొండమానాఖ్యఁ దనరి యవల. 297

సీ. వసుధ నేలుచును నావాఁడవయ్యెదవు సి
ద్ధముగ నాసేవ వ్యర్థంబుగాదు
చింతింప కిపుడు నేఁ జెప్పినపని సేయు
మన రంగదాసుఁ డం దట్లచేసె
నతఁడు నీవై పుట్టి హితము రెట్టింప నా
భక్తుఁడ వైతివి పార్థివేంద్ర
పూర్వజన్మమున నేర్పగ నీవు ద్రవ్విన
బావి యిందున్నది భద్రముగను
తే. జక్కఁజేయింపు మిక నది శాశ్వతముగ
నుండు నేఁదాల్చి విడుచుచునుండు పుష్ప
ముల ధరించుట కది ధర ముఖ్యముగను
జారశుభమూర్తి తొండమాఁచక్రవర్తి. 298

చ. అని హరి యానతిచ్చిన మహాద్భుతమంది ధరాధినాథుఁ డి
ట్లనియె మహానుభావ సకలాత్మల కాత్మవు నీవు గాన నా
జననము పూర్వజన్మగతి సర్వము చెప్పితి వాదిదేవ నే
మనుజుఁడఁ గాన నీత్రిగుణమాయ నెఱుంగుదునే పరాత్పరా.

క. అని బహువిధములఁగా నిటు
వినుతులు గావించి హరిని వీడ్కొని యపుడా
జనపతి సంతోషించుచు
ఘనభక్తి చెలంగ విశ్వకర్మను గొనుచున్. 300

వ. వేంకటాద్రిఁజేరి తాముున్నద్రవ్విన బావిని బాగుచేయించి స్వామివారికి దేవాలయంబు నిర్మింపు మనిన విని యావిశ్వకర్మ విధిచొప్పు దప్పక ప్రాకారత్రయంబును గోపురద్వయంబును సప్తద్వారంబులును, స్వామి నిజాస్థానమంటపంబును, గోశాలయును, ధాన్యశాలయును, వస్త్రభూషణాగారంబును, శయ్యాగృహంబును, వైవాహిక మండపంబును, తైలఘృతాలయంబును, అన్నశాలయును, భూతీర్థకూపంబును, నిర్మించి యన్నిటకు మధ్యప్రదేశంబునం దాళవృక్షప్రమాణోన్నతవిమానంబు రచించి తదుపరి శాతకుంభంబునుంచి విశాలకక్ష్యాత్రయంబుగావించి వేంకటాద్రికి భక్తవరులు వచ్చుటకు యోజనమార్గ సోపానంబులును, నడుమ నడుమ మండపంబులును, నీరాగారంబులును, నిర్మించి సకల పదార్థాకర్షణంబు సేయించి యాయాగృహంబులయం దుంచి గిరిడిగ్గి హరిచెంతఁజేరి మ్రొక్కి యిట్లనియె. 301

మ. హరి మీసత్కృపచేత వేంకటగిరీంద్రాగ్రంబున న్మీకు మం
దిరముం జెల్వుగనైన దం దొగి సదా దేవిం బ్రియం బారఁగాఁ

దిరమై యుండఁగ నేను గింకరుఁడనై దేవా! సభక్తిఁ భవ
ద్వరపాదంబులఁ బూజనేసెద మునివ్రాతా కృపాంభోనిధీ.

వ. అని తొండమానుండు వేఁడుటంజేసి. 303

క. ఘనవైఖానసవంశం
బున నుద్భవుఁడైన విప్రముఖ్యునితోడన్
వనజాక్షుఁడు శుకకుంభజు
లను దోడ్కొని వేంకటాచలముమార్గమునన్. 304

క. వచ్చుట కుద్యుక్తుం డగు
టచ్చట వసుధానుఁ డెఱిఁగి యబ్జాక్షునకున్
మెచ్చుగఁ బద్మావతి కం
దిచ్చెదనని భూషణములు హేమాంబరముల్. 305

తే. తెచ్చి వారల కర్పించి దీనవదనుఁ
డగుచు నుండఁగఁ జూచి యిట్లనియెఁ జక్రి
చింత నీకేల వసుధాన శేషగిరిని
నిలచి యుండెద మనిపల్కి నెమ్మి మీఱ. 306

ఆ. మఱల నిట్టు లనియె మచ్చిక నార్యుల
నాదరింపుచుండు మబ్జవతిని
జూచుకొఱకు దండకారణ్యాద్రి కెపుడైన
వచ్చు వోవుచుండు వసుధ నేలు. 307

వ. అని యిష్టంబుచెప్పి సంతసింపఁజేసి వాని వీడ్కొని పద్మావతీ
సమేతుండై తొండమానుని దోడ్కొని మంగళవాద్యముల
మొఱయ వికృతినామసంవత్సరంబునఁ బాడ్యమితిథియు
నశ్వినీనక్షత్రంబును గురువాసరంబును, గూడిన శుభదినంబున
సాయంసమయమునకు వేంకటాద్రిఁ జేరి వైఖానస బ్రాహ్మ

ఋనివలన వైఖానసాగమోక్త ప్రకారంబునం బుణ్యాహ
వాచనాది కృత్యంబు లాచరింపించి సుస్థిరలగ్నంబున బ్రహ్మ
ఋషులు శుభదాశీర్వచనంబులు సేయ శ్రీనివాసుండు
మంగళకరంబగు నానందనిలయంబునం బ్రవేశించె నప్పుడు
బ్రహ్మేంద్రాదు లానందంబుగఁ బుష్పవృష్టి గురియించి శ్రీని
వాసునిచెంతఁ జేరి నుతించిరి. అందు వైఖానస సద్విజుండు
ద్వారపాలకుల నిల్పి యథాప్రకారంబుగ హరిం బూజించె
నప్పుడు హరి పద్మపీఠంబుమీఁదఁ బాదంబును నిల్పి కటి
ప్రదేశంబున వామకరంబు నుంచి దక్షిణపాదప్రదేశంబును
దక్షిణకరంబుతోఁ జూపుచు బ్రహ్మాదులంజూచి యిది పరమ
పదంబని పలికె నంతఁ బద్మజుండా హరిసాన్నిధ్యంబున రెం
డఖండదీపంబులుంచి యింద్రాదులతో నిట్లనియె. 308

సీ. ఎందాక కలిధర్మ మిద్ధాత్రియందుండు
నందాక దీపద్వయంబు నుండు
నెందాక దీపంబు లొందును నందాక
మహనీయదివ్యవిమాన ముండు
కలియుగం బడఁగిన మలుఁగుదీపంబులు
నపుడు విమాన మాయవని ద్రెళ్లు
నవ్విమానము వడినప్పు డీవేంకటే
శ్వరుఁడు శ్రీవైకుంఠపురము చేరు
తే. నంత కృతయుగ ముదయించు నవనియందు
ధర్మదేవత నాల్గుపాదముల నడచు
మూఁడుయుగములు వైకుంఠమున వసించి
కలిని శేషాద్రిఁ జేరు వేంకటవిభుండు. 309

క. అని బ్రహ్మ పల్కుపల్కులు
విని ముదమును బొంది యాదివిష్ణుం డిచటన్
వనజజ నాకు రథోత్సవ
మనువొందఁగఁ జేయు మఱల నన నజుఁ డంతన్. 310

వ. అం దాక్ష్యుండై యున్న తొండమానుం డనుచక్రవర్తిచేత వైఖానసాగమోక్తంబుగ నుత్సవప్రయత్నంబు సేయించి పూర్వప్రకారంబుగఁ గన్యామాసంబునం దంకురార్పణంబును ధ్వజారోహణంబును వివిధవాహన రథోత్సవ తీర్థవారి ప్రముఖకృత్యంబు లాచరింపఁజేసి బహుభక్ష్యభోజ్యంబులు నైవేద్యంబులు సమర్పించి సర్వంబు శ్రీనివాసార్పితంబు గావించి మ్రొక్కి తదాజ్ఞానుసారంబుగ నింద్రాదులు నిజ నివాసంబుల కరిగిరి. అంతఁ దొండమానుండు హరికి సకలోత్సవంబులు నడపి నిజరాజ్యపరిపాలనంబు సేయుచుండె నందొక్కనాఁడు. 311

సీ. శ్రీకరమతిని వసిష్ఠగోత్రుఁడు కూర్మఁ
డను బ్రాహ్మణోత్తముఁ డటకు వచ్చి
తొండమానుని జేరి తొలుత గార్యార్థియై
యాశీర్వదించి యిట్లనియె రాజ
విను భార్యతో జాహ్నవీయాత్ర వోవఁగ
భార్యకు గర్భంబు ప్రాప్త మయ్యెఁ
బంచాబ్దములవాఁడు బాలుండు తల్లిని
వీడి నావెంట రాలేఁడు గనుక
తే. ధర్మ సంకటమైన దిత్తఱిని సతిని
సుతుని నిందుంచి వోయెద సుస్థిరముగ

నిరుపురకు నన్ను మిప్పించి యీస్థలమున
నీవు పాలించుచుండుమో భూపరేణ్య. 312.

మ. అని యావిప్రుఁడు పల్కఁగా నృపుఁడు నీ వారీతి నిందుంచి
పొమ్మనఁగాఁ గూర్మిఁడు నమ్మి యాత్ర జనె నం దావిప్ర
భార్యన్ సుతున్, మనుజేంద్రుం డొకమూలగేహమున
నేమం బొప్పఁగా నుంచి తెప్పన మాసా లోగి నాఱునం
దునిచె సంపూర్ణప్రియం బారఁగన్. 313.

ఆ. బహువిశాలమైన భవనంబులో నంత
విప్రభార్య యుండె విధివశమున
వీధితల్పు చిలుకు వేసి యం దెవ్వఁడో
యుఱికె దాని విప్రునువిధ చూచి. 314.

ఉ. వాకిలి తీయుఁ డం చవలివారిని బిల్చిన వారివీనులన్
సోఁకకయుండె నప్పలుకుఁ జోద్యము నొందుచు విప్రభార్య
నే, నేకరణిం దరింతు హృదయేశ్వరుఁ డిచ్చట నుంచె నంచుఁ
దా, శోకము నొందుచున్ దిశలు చూచుచు నచ్చట నుండె
నయ్యెడన్. 315.

ఆ. ఆఱునెలలబత్తె మైపోయె నటు మీఁదఁ
గూడులేక మిగులఁ గుంది కుంది
బెండువడి కృశించి బిడ్డ లిద్దఱు తాను
బ్రాణములును విడిచి పడిరి ధరను. 316.

చ. ఘనుఁ డగు తోండవానుఁ డిటు కర్మవశంబున విప్రకాంత
నం, దొనరఁగ నుంచుట న్మఱచి యుండఁగఁ గాశికిఁ బోయి
బ్రాహ్మణుం,డును దను జేరి పుత్త్రి సుతుఁడు న్సతి యేడ

నటంచుఁ బల్కఁగా, విని మది భీతినొంది నృపవీరుఁడు చారుల
నంపె న త్తఱిన్. 317

ఉ. చారులు వోయి విప్రుసతి సంతతితో నశియించి యుండుటన్
వారక చూచి వచ్చి నృపవర్యుని కంతయుఁ జెప్పఁగాను దా
నారటమొంది దుఃఖ మపు డాత్మను నుంచి సధైర్యచిత్తుఁ
డై, యూరక యుండి విప్రుఁ గని యుల్లసముం దగఁ బల్కె
నిమ్మెయిన్. 318

సీ. విను బ్రాహ్మణోత్తమ వేంకటేశుని దర్శ
నార్థమై మాయింటియాఁడువారు
సనఁగాఁ బతివ్రత యన నొప్పు మీభార్య
వారితో శ్రీ శ్రీనివాసుఁ జూడఁ
బోయిన దిఁక వచ్చు భోజనకృత్యంబు
సేయించుచుండుము చిత్తమలర
నని చెప్పి సామగ్రి నంపించి యచ్చటఁ
బగ లంతయుం బుచ్చి పరిధవిల్ల
తే. రాత్రి కాఁగనె బిలము మార్గంబునందుఁ
బోయి శ్రీవేంకటేశుని పుణ్యచరణ
యుగళముల బాష్పధారలు నొల్క నిల్చి
యుండుటం జేసి హరి యనె నుర్విపతికి. 319

సీ. రాజేంద్ర నీవింత రాత్రికాలమున నొ
క్కఁడ విందు వచ్చిన కార్యమేమి
చెప్పు మేర్పడ నన శ్రీనివాసుని కిట్టు
లనియె నృపాలకుం డంబుజాక్ష

పాపాత్ముఁడై నేను బ్రాహ్మణస్త్రీ వధ
చేసితి నన్ను రక్షింపవలయు
ననుచుఁ దత్క్రమము దుఃఖాక్రాంతుఁడై చెప్పఁ
గా హరి వల్కె భూకాంత వినుము
తే. మించి పోయిన పని కింక మిడుకు లేల
యెండి పడియుండు దట్టంబు లిచటి కిపుడ
నీవు దెప్పించు మనఁగ నానృపుఁడు భటుల
చేతఁ దెప్పించెఁ దనువుల శ్రీశుకడకు. 320

వ. అంత శ్రీనివాసుండు తొండమానునితోడ నక్కళేబరంబులఁ బట్టించుకొని పుష్కరిణికిఁ బూర్వదిగ్భాగంబున నున్న దివ్య సరోవరంబునకుఁ బోయి తత్తీర్థంబునం దాకళేబరంబులను ముంచి యెత్తె నప్పు డమ్మువ్వురు సజీవులై లేచి రంత దేవతలు పుష్పవృష్టిఁ గురియించి యప్పుణ్యతీర్థంబునకు, నస్థితీర్థంబని నామం బిడి మఱియు నమృతసరస్సని వాగడి రందుఁ దొండమానుండు సంతసించి హరిని వినుతించె నంత శ్రీనివాసుండు, కలియుగంబున మనుజులతో మాటాడినపక్షంబున నిక నిట్టి ధర్మసంకటంబులు ప్రాసంగుచుండుఁ గావున నీనాఁటఁ గోలె మౌనధారినై యుండవలయు నని నిశ్చయించె నంతఁ దొండమానుండు సజీవు లగువారిని దెచ్చి గూర్మిం దనువిప్రున కొసంగె నపు డాబ్రాహ్మణుండు భార్యాపుత్త్రులం జూచి యెందుఁబోయి యుంటి రని యడుగ నత్తరుణి యిట్లనియె. 321

సీ. స్వామి నేనేమని చర్చించి చెప్పుదు
మహిమాఢ్యుఁ డగువిష్ణుమాయచేతఁ

బుణ్యమార్గంబునం బోయి బ్రహ్మాదు లు
న్నట్టి లోకంబుల నన్ని చూచి
వచ్చితి ననియె నవ్వాలఁ గుమారుం డిటు
లనియె నోతండ్రి నే నద్భుతముగఁ
బోయి సప్తద్వీపములను దోయధులను
గైలాసగిరిని శంకరుని జూచి
తే. వచ్చి తని చెప్పఁ బుత్త్రిక వచ్చి యిట్టు
లనియె నోతండ్రి పర్వతవనములను వి
బుధుల రాక్షసగణములఁ బుణ్యమునులఁ
జూచి వచ్చితి వేడ్కమై దాఁచనేల. 322
క. అని యాముప్పురు తమతమ
యనుభవములఁ జెప్పి రప్పు డావాక్యములన్
విని వెఱఁగున విప్రుం డి
ట్లనియెన్ మీపుణ్య మతిశయం బై యొప్పున్. 323
ఆ. అనుచు వారితోడ నరుగ నుద్యుక్తుఁడై
యుండురీతిఁ దెలిసి తొండవానుఁ
డపుడు భూషణంబు లంబరంబులు వారి
కిచ్చి ద్విజుఁడు నృపుని మెచ్చి లేచి. 324
తే. రాజు నాశీర్వదించి భూరమణ మేము
పోయివచ్చెద మని పల్కి పొగడి సతిని
బాలకులఁ దోడుకొని వోయి పరఁగ మదిని
సంతసించుచు నిజనివాసంబుఁ జేరి. 325
క. తోషించి సతిని బిడ్డలఁ
బోషించుచుఁ దాను ముక్తి బొందెడుకొఱకై

శేషాచలపతి మహిమ వి
శేషముగాఁ బ్రజల కెఱుఁగఁ జెప్పుచు నుండెన్. 326

సీ. అన విని మునులెల్ల నాశ్చర్యమును బొంది
యిట్లని పలికి రిదేమివింత
యీకళేబరముల నేఱె నేలఁ బడవైచి
వోయి లోకాంతరంబులఁ జరించి
క్రమ్మఱ వచ్చి తద్ఘటములలోఁ జొచ్చి
యాకూర్మునకు వార లచటఁ గనిన
వింతలు చెప్పిన విధము తేటగఁ జెప్పు
మన విని సూతుఁ డిట్లనియె వారు
తే. స్థూలములను విసర్జించి సూక్ష్మతనువు
లందు వెల్గుచు నుండి లోకాంతరముల
స్వప్నములఁ గన్న వింతలచందముగను
గూర్మునకు వారు చెప్పి రాగుఱుతు లెఱిఁగి. 327

ఆ. బ్రహ్మమందు జీవపఙ్క్తులు కర్మసం
స్కారలింగదేహకలితు లగుచు
నంబరమునఁ దిరుగునట్టి పక్షులరీతి
సకలలోకములను సంచరించి. 328

వ. అవ్వలం దమఋణానుబంధంబుగఁ గర్మసంస్కారంబులతోడం గూడి యరుణరూపులై గగనాంతర్గతవాయుపథంబునం బడి సూర్యకిరణోద్గత మేఘబృందంబులం బొంది వృష్టిమార్గంబున సకలౌషధీజాలంబులం జొచ్చి యన్నరూపంబు నొంది పురుషవీర్యరూపంబై స్త్రీగర్భంబులయందుఁ బ్రవేశించి స్థూలదేహంబుల ధరించి నవమాసంబు లందుండి వెడలి బాల్య

యౌవనకౌమారవార్ధకదశల ననుభవించి కాలపరిపాకంబున మృతినొంది క్రమ్మఱం బుట్టిన వారలు లోకాంతరంబులం దనుభవించిన కష్టసుఖంబుల మఱలం జెప్ప మఱచి వోదు రటు గావున నీముగ్వురు కాలపరిపాకంబుగాకయ యన్నంబు లేకయ నశించిన స్థూలదేహంబులం దుండక సూక్ష్మదేహం బుల నవలంబించికొని లోకాంతరంబులం జరించి హరి కటా క్షంబువలన నప్పుణ్యతీర్థంబునం బ్రవేశించి పరిపూర్తినొందిన పూర్వస్థూలదేహంబులంద మఱలం జేరినందున వారి కాలోకాంతరవ్యాపారంబును హృదయంబులందుండి నిద్రఁ జెంది కలలం గని మేల్కాంచి పరుల కాకలలు చెప్పిన చందంబున వారాకూర్మునకుం దమవిహారంబులు చెప్పి రిది యంతయు విష్ణుమాయ యని యెఱుంగవలయు. నీయితి హాసంబు విన్నవారి పాపంబు నశించి ధన్యు లగుదురని చెప్పిన విని శౌనకాదులు, సూక్ష్మజ్ఞానదృష్టిచేత జీవతత్వాను భవప్రకారంబు తెలిసి సూతుం జూచి వెండియు నిట్లనిరి. 329

సీ. నీవు చెప్పిన సూక్ష్మనిర్మలభావంబు
తెలిసెనో సూత సందియము తీఱె
నది యటులుండని మ్మాకూర్ముఁ డరిగిన
వెనుక నృపాలుండు వేంకటాద్రి
పతి నెవ్విధంబున భక్తుఁడై పూజించె
నారీతిఁ జెప్పు మిం కనిన మునులఁ
గని సూతుఁ డిట్లనె జననాయకుఁడు భూమి
నేలుచు శ్రీవేంకటేశ్వరునకు

తే. డాసుఁడై నిత్యమును హోమభాసురాబ్జ
ములను గొంపోయి బిలమునఁ జెలఁగి హరిప
దారవిందంబులకుఁ బూజ భూరి భక్తి
చిత్తమున నిడికొని యొగిఁ జేసె నపుడు. 330

ఆ. అపల మఱల పోవునపుడు కుమ్మరవాఁడు
మంటిపూలుఁ దులసి నింటఁ దీర్చి
దారుమూర్తియందుఁ దా సమర్పింపఁగ
నట్టిమంటిపూలు హరిని చేరె. 331

క. వనజాక్షుం డాసుమములఁ
దనయందే డాఁచుచుండు ధరణీంద్రునకుఁ
గనఁబడనీక కులాలుని
తనమదిలో మెచ్చుచుండుఁ దద్దయుఁ బ్రేమన్ 332

సీ. రాజుచేసినపూజ రాజసం బని మెచ్చ
కుండి మృత్కుసుమంబు లొక్కనాఁడు
భూనాయకుఁడు తన్ను పూజ చేసెడువేళఁ
జూపె నాఁడామృత్ప్రసూనములును
గాంచి నేనితని బంగరుపూలఁ బూజింతు
నీమట్టిపూవు లిం దెవ్వఁ డుంచె
నని సంశయించుచు నబ్జాక్షునకు మ్రొక్కి
పలికె నిట్లనుచు నోపరమపురుష
తే. నే సమర్పించుసుమముల నేలఁ ద్రోసి
మట్టిపూ లిందుఁ బెట్టిన మనుజుఁ డెవఁడు?
దెల్పు మని నృపుఁ డడుగ నద్దేవుఁ డపుడు
నృపుని కిమ్మెయి ననియెను నీతి యెసఁగ. 333

తే. అనఘ యిచటికిఁ గ్రోశద్వయార్ధదూర
మం దొకఁడు కురవ్యకగ్రామమందుఁ గలఁడు
ధరఁ గులాలుఁడు భీమాభిధానుఁ డధిక
భక్తుఁ డొగిఁ జేదవాఁ డందుఁ బ్రతిదినమున. 334

ఉ. కుండలు చేసిచేసి యొకగూటను బెట్టుచు నప్పుడప్పుడున్
రెండు కరంబులం బులిమి రేగినమట్టిని చిత్రపుష్పముల్
దండిగఁ జేసి నావలనె దారుకరూపము నేర్పరించి తా
నిండినభక్తి మీఱఁగను నిత్యము నర్చనఁ జేయుచుండఁగన్.

సీ. ఆపుష్పములను నే నంగీకరింతు ని
ట్లనుదినం బని వల్కె నపుడు నృపతి
వెఱగు నొందుచు హరి వేవేగ పూజించి
బిలము వెల్వడివోయి భీముచెంతఁ
జేరిన రాజు నీక్షించి కులాలుఁ డి
ట్లనె మహారాజ నీ వద్భుతముగ
శూద్రగృహమునకుఁ జొచ్చి వచ్చుట కేమి
పని యానతిం డన జనవిభుండు

తే. పల్కె నిట్లని భీమ నీభక్తిశేష
శైలపతి మెచ్చినాఁడు నిశ్చయముగాను
నీవు చేసిన సద్భక్తి భావరీతిఁ
దేటగా నా కిపుడు నీవు దెల్పు మనఘ. 336

చ. అనినఁ గులాలుఁ డిట్లనియె నయ్య నృపాలక శూద్రజాతివాఁ
డను బహునీచకర్ముఁడ జడత్వమనస్కుఁడ నేను విష్ణుభా
వనఁ గని నీకుఁ జెప్పఁ గలవాఁడనె భూపవరేణ్య యంచు న
య్యనఘుఁడు పల్కుచున్న తఱి నంబరమార్గమునందు ధీరుఁడై.

తే. గరుడవాహన మెక్కి వేంకటవిభుండు
భీముం డన్నట్టిచోటుకుం బ్రేమం బోయి
పరమపావనచరితుం డాభక్తవరుండ
రమ్ము సాయుజ్య మిచ్చెద నెమ్మి నేండు. 338

క. సరసిజనాభుండు వల్కంగ
సరగున భీముండు మ్రొక్కి సతితో నపుడే
హరి సాయుజ్యపదంబున
కరుగంగం గని తొండవాసుం డారట పడుచున్. 339

సీ. హరి కిట్టు లనియె నోయబ్జాక్ష నీభక్తుం
డగుభీముం జూచి నే నాప్తముగనుం
భాషించు చుండంగం బరమపదమ్ము వాని
కిచ్చి పంపించితి వింతలోన
నాకు సాయుజ్య మెన్నటి కీయం దలంచి యు
న్నా వన విష్ణుండు నగుచుం బల్కె
నితనిసాత్వికభక్తి కిష్టంబు నొందితి
సాయుజ్య మిచ్చితి సజ్జనుండు
తే. పూర్వమే మోక్ష మడుగ నీ పూజపరుల
కెఱుకరైై చక్రవర్తినియింటి కెపుడు
వచ్చునప్పుడు నీకు నీవనిత కేను
మోక్ష మిచ్చెద నని యంటి నీక్షణమున. 340

క. వానికి మోక్షం బిచ్చితి
దీనికిం జింతింపనేల ధీరుండ వగుచున్
నీనందనునకుం బట్టము
మానితముగం గట్టియుంచు మానవనాథా. 341

సీ. పట్టి సద్భక్తివైరాగ్యము
ల్గలవాఁడ వగుచు దుష్కామములను
విడిచి నిర్మలుఁడవై విజనస్థలము చేరి
నన్ను ధ్యానించు నిర్ణయము మెఱసి
సారూప్యపదవి నిశ్చయముగ నిచ్చెద
నని యతనికిఁ జెప్పి నంపెఁ జక్రి
నిజనివాసముచేరి నెఱిఁ దప్పకయ తొండ
మానుండు సుతునకు శ్రీనివాసుఁ
తే. జేరి వేడ్కను రాజ్యాభిషిక్తుఁ జేసి
వేంకటేశుని చరణారవిందములను
గ్రమముగాఁ గొల్చి నిత్యోత్సవములు సేయు
మనుచు సుతునకు నియమించె ననఘుఁ డచట. 342

ఆ. తొండమానుఁ డంతఁ దుర్యభక్తిజ్ఞాన
యుక్తుఁడై మహావిరక్తుఁ డగుచు
వేంకటాద్రిఁ జేరి విజనస్థలమునందు
నిలిచి ధ్యానయోగనిష్ఠ నొందె. 343

ఉ. అంతటఁ గొంతకాలమున కంబుజలోచనుఁ డాన్నృపాలకున్
స్వాంతమునందు మెచ్చుచును సత్కృపతో నట కేగి నవ్వుచున్
వింతగఁ జెంత నిల్చె నటవి న్వసియించిన భూవిభుండు శ్రీ
కాంతుని జూచి లేచి కరకంజములన్ ముకుళించి నమ్రుఁడై.

ఉ. సద్గుణ మొప్పగా మది నచంచలభక్తిరసంబు నిండఁగా
గద్గదకంఠుఁడై నృపుఁడు కన్నులు బాష్పములుఁ గ్రమ్మ మ్రొక్కుచున్
మద్గురుచంద్ర నన్నిచట మానసమందుఁ దలంచి వచ్చితే
చిద్గగ నాత్మ నీమహిమ శేషుఁడు సన్నుతి సేయ నేర్చునే. 345

శా. నేనా మానవమాత్రుఁడం జపలుఁడన్ నీచాత్ముఁడం గాముఁ
డన్, నే నిన్నే మి నుతింపనేర్తు నను మన్నింపన్ స్వభావంబుచే
నే నిర్హేతుకజాయమానకరుణ న్నేఁ డిందు వేంచేసినా
వానందం బొదవెన్ గృతార్థుఁ డొగినేనైతిన్ జగన్నాయకా.

మ. మును నేఁ జేసిన నేరము ల్మఱచి నామూర్ఖత్వమున్ గర్వమె
ల్లను బోఁగొట్టుచుఁ దండ్రిచందమున నన్ లాలించి విజ్ఞాన మి
చ్చిన నీదొడ్డఋణంబుఁ దీర్పఁగలనే శ్రీస్వామి నీసత్కృపా
ఘనతం గాచితి విన్నినా ల్లిపుడు మోక్షం బిచ్చి రక్షింపవే.

చ. మతిసెడ విప్రుభార్యను గుమారుని కూఁతును దేఱ కేను జం
పితి నటువంటిపాప మిల భీకరవృత్తిని ముంచు నంచు నన్
హితముగఁ గావ వారలకు హెచ్చుట దేహము లిచ్చినట్టి నీ
యతిశయ మెంచ శంభునకు హాటకగర్భునకైన శక్యమే. 348

చ. సతి పతి యేకమైనపుడు సారవివేకము లేక రాత్రివ
చ్చితి నలనాఁడు నేనిటులఁ జేసిన ద్రోహము నెంచ కింత బ్రో
చితి యటువంటినైరణయుఁ జిక్కనె యెంతటివారికైన శ్రీ
పతి నినుఁ బోలు వేల్పులు ప్రపంచమునం గలరే రమేశ్వరా.

వ. అని యనేకప్రకారంబుల వినుతించిన నృపాలకు న్మెచ్చి
హరి దయార్ద్రహృదయుఁ డై యిట్లనియె. 350

చ. విను నృప నీకు సాత్వికవివేకము పుట్టుటకై తపంబు నే
యను నియమించి తిప్పుడు మహాపురుషోత్తమ భక్తి నిష్ఠ నీ
మనమున నిల్చెఁ గాన ననుమానము లేదిఁక మోక్ష మిచ్చెదన్
నను బరమాత్ముఁ డంచు నెఱ నమ్మిననమ్మిక ఱిత్త వోవునే. 351

చ. జనవర యింకఁ గొన్ని దివసంబులు భూతలమందు నిల్చెదో
ఘనభుజ మోక్ష మీక్షణమ కావలెనో నిజ మీవు చెప్పుమా

యన హరిఁ జూచి నవ్వి నృపుఁ డర్థిని మోక్షమ నా కొసంగవే
యని శరణాగతుం డగుచు నంచున రాఁ గని చక్రి నవ్వుచున్.

సీ. కరుణారసము నృపాగ్రణిమీఁదనిండించు
చుండఁగ గగనమందుండి దివ్య
పుష్పకం బచటి కద్భుతముగ వచ్చె న
ప్పుడు తొండమాను నాపుష్పకంబు
నందుంచి సారూప్య మతనికిఁ దానిచ్చి
వైకుంఠపురికిని వఱల నంపి
తన నివాసము చేరెఁ దదనంతరమున నా
చక్రవర్తిసుతుండు సాంగముగను
తే. వేగ తండ్రికిఁ బరలోకవిధు లొనర్చి
శ్రీనివాసుని పాదరాజీవయుగళ
మందు భూభార ముంచుచు నచలుఁ డగుచుఁ
దాను వసుధానుఁడును రమాధవుని కచట. 353

సీ. ప్రథితనిత్యోత్సవ పక్షోత్సవములు మా
సోత్సవ సంవత్సరోత్సవములు
నడిపించుచుండఁగ నారాయణుఁడు శిలా
విగ్రహుఁ డై మహావిభవములను
సొంపుగ నంగీకరింపుచు వసుధాను
నా శ్రీనివాసుండు నాదరమునఁ
బాలన సేయుచు భక్తి భావించుచు
సకలకార్యములను స్వప్నములను
తే. దాన చెప్పుచు మౌనముద్రను ధరించి
కుదిరి పద్మావతిని గృపఁ గూడి వివిధ

వరము లందఱ కిచ్చుచు వారిధనము
లాదరించుచు శ్రీపన్నగాద్రియందు. 354

ఉ. వేంకట నాయకుం డనఁగ విశ్వమునందుఁ బ్రసిద్ధి నొందుచున్
గొంకక భక్తి విత్తమును గూరిమితోఁ గొని కోర్కు లిచ్చు
చున్, సంకరజాతి మర్త్యులకుఁ జానుగ విత్తము నొప్పగించు
చున్, బింకము చూపుచు న్ధర కుబేరుని వడ్డికి రూక
లిచ్చుచున్. 355

క. లీలామానుషచర్యలుఁ
జాలం జూపుచు సమస్తజనులకు హితుఁడై
మేలు నొసంగుచు
కాలము ఫణిశైలమునను గనుపడుచుందున్. 356

ఆ. కలియుగాంతమునను గ్రమ్మఱ వైకుంఠ
మందుఁ జేరి కలియుగాదికాల
మవల వచ్చినప్పు డా వేంకటాద్రిపై
మఱలఁ జేరుచుండు మాధవుండు. 357

క. అని సూతుఁడు వేంకటపతి
ఘనచరితము లొప్పఁ జెప్పఁగా మునులెల్లన్
విని సంతోషము నొందుచు
నని రిట్లని సూతుఁ జూచి యద్భుతపడుచున్ 358

మ. అహహా సూతపరాత్పరుండు జలజాతాక్షుండు నిత్యుండు శ్రీ
యహిరాట్పర్వతనాథుఁ డవ్యయుఁడు సర్వాత్ముండు లీలార్థమై
మహి మర్త్యాకృతి నొంది పిమ్మట మహామాహాత్మ్యపాషాణవి
గ్రహుఁడై లోకుల బ్రోచు సత్కథల మాకర్ణప్రమోదం
బుగన్. 359

క. చెప్పితి విచ్చట వరుసగఁ
దప్పక వింటిమి మహాముదం బొదవెను నీ
గొప్పతనం బింతంతని
యప్పప్పా పొగడ శక్య మగునె మహాత్మా. 360

చ. అని ఘనశౌనకాదిమును లందఱు గౌరవ మొప్పఁ బ్రస్తుతిం
చిన విని సూతుఁ డి ట్లనియె సింధుసుతాధిపుఁ డైనపద్మలో
చనునిచరిత్రము ల్పొగడ శక్యముగాదు విధాతకైన నే
నొనరఁగ మీకటాక్షమున నూహకుఁ దోఁచినయట్లు చెప్పితిన్.

సీ. అనుచుఁ బల్కిన రోమహర్షణసుతుఁ జూచి
మును లిట్టు లని రాదిమూల మైన
విష్ణుఁడ పాషాణవిగ్రహ మైన యుండు
హేతువే మన సూతుఁ డిట్టు లనియె
ననఘాత్ములార శ్రీహరి స్వస్వరూపంబు
నందఱకును జూపఁ డందువలనఁ
దనచిహ్నములు సర్వజనులు చూచి తరించు
టకుఁ గృప లోకవిడంబనముగఁ

తే. దాము పాషాణమూర్తికదారుమూర్తు
లందు దీపించి భూలోకమందు వివిధ
పుణ్యనామంబులను దాల్చి పూజగొనుచు
వారి కిష్టార్థముల నిచ్చు భూరికృపను. 362

వ. ఇవ్విధంబున నొప్పు నర్చావిగ్రహచిహ్నంబుల నీక్షించి హరి
చిహ్నంబు లిట్టివని తెలిసి యాచర్మచక్షుస్సులతోఁ జూచిన
విగ్రహంబులు మనోదృష్టికిఁ బ్రత్యక్షంబు లగుచుండఁగ
హరి వారి మనోమాలిన్యనివారణంబు నేయుచుండుం గావునఁ

ప్రతిమార్చనంబులు చేసి తర్వాత హరి సర్వాంతర్యామి యగుటంజేసి రామకృష్ణాది విభవావతార ధ్యానగుణాను భవంబు చేయుచుండి దాన యనిరుద్ధప్రద్యుమ్నసంకర్షణ వాసుదేవ వ్యూహప్రభావంబు లెఱింగి ధ్యానించి తన్నామ జపంబులు చేసి పరమగతిం బొందుట కర్చారూపంబులు హేతువు లగు నందు సకలజనసంరక్షణంబు సేయుకొఱకు శ్రీనివాసుండు స్వయంవ్యక్తార్చావిగ్రహుం డయ్యెనని చెప్పి సూతుండు వెండియు నిట్లనియె. 363

క. శృంగారాంగునకుం జయ
మంగళ మహిరాజశైల మందిరునకు శ్రీ
మంగాపతి కతిశయశుభ
మంగళ మొనఁగూడవలయు మహియం దెపుడున్. 364

క. అని సూతుఁడు వచియింపఁగ
విని శౌనకముఖ్యమునులు వేంకటపతి నేఁ
గొని యాడుచు సూతునితో
నను వొందఁగ గోష్ఠినుండి రచ్చట వేడ్కన్. 365

క. భావజజనక శుభాకర
భావజరిపుమిత్రభూత భావనవిలస
ద్భావాతీతజగన్మయ
శ్రీవేంకటగిరినివేశ చిదచిదధీశా. 366

తురంగవృత్తము.—
వికటసురరిపుహరణ గురుతరవిశ్వరక్షణకారణా
సకలమునిజనహృదయకమలవిచారణాఘనివారణా

మకుటకలితవిలసితమణిఘృణిమస్తకాఖిలపూరణా
ప్రకటకనకరుచిరశిఖరయుతపన్నగాద్రివిహారణా. 367

మాలినీవృత్తభేదము.—
కర్మవిధాయక కర్మవినాశక కర్మఫలాశ్రితకాంతియుతా
ధర్మవివేచన ధర్మసుఖార్జన ధర్మయుతవ్రత ధర్మరతా
మర్మసుఖాస్పద మర్మఫలప్రద మర్మవిలక్షణ మర్మహితా
భర్మనగాత్మజ భర్మగిరీశ్వర భర్మమయాంబర బ్రహ్మమతా.

విభూతిమయవృత్తము.—
జ్ఞానమార్గదీపకా జ్ఞానదివ్యరూపకా
జ్ఞానయోగరక్షకా జ్ఞానవిజ్ఞశిక్షకా
జ్ఞానసద్విధాయకా జ్ఞానశక్తినాయకా
జ్ఞానకర్మసాధకా జ్ఞానపూర్ణబోధకా. 369

మాలిని. సురహృదయవికాసా క్షుద్రరక్షోవినాశా
గురుతరసువిలాసా కోటిసూర్యప్రకాశా
పరమపదనివాసా పాలితాచార్యదాసా
సురుచిరదరహాసా సుందరా శ్రీనివాసా. 370

గద్యము. ఇది శ్రీతరికుండ లక్ష్మీనృసింహ కరుణాకటాక్ష కలిత కవితావిలాస వసిష్ఠగోత్రపవిత్ర కృష్ణయామాత్య తనూభవ వేంకమాంబా ప్రణీతం బైన శ్రీవేంకటాచలమాహాత్మ్యం బనుభవిష్యోత్తరపురాణంబునం దెఱుక కథయును, హరి ధరణీదేవి కెఱుకచెప్పుటయును, ధరణీదేవి పద్మావతి నాదరించుటయును, పద్మావతి తల్లికి హరివృత్తాంతంబు చెప్పుటయును, వకుళవచ్చి ధరణీదేవితో సంభాషించుటయు, నాకాశరాజు హరికి శుభరేఖ పంపించుటయు, హరి యాకా

శరాజునకుఁ బ్రత్యుత్తరలిఖిత మంపించుటయు, వకుళ శేషాద్రికి వచ్చి హరికి శుభవార్త లెఱింగించుటయు, వివాహంబున కర్థంబు లేదని వకుళ వరాహస్వామితోఁ జెప్పుటయు, హరిచేత శుభరేఖ గైకొని గరుడుండు సత్యలోకంబునకు నరుగుటయు, శౌరిచే శుభపత్రిక కొని సనిశేషుండు శంకరున కిచ్చుటయు, శ్రీనివాసుఁ డింద్రాదులతో సంభాషించుటయు, సిరిం దలంచి హరి చింతించుటయు, కొల్లాపురివాసి యైనలక్ష్మిని సూర్యుండు దోడ్కొని వచ్చి హరిచెంత నిల్పుటయు, సిరితో హరి తనకష్టంబు చెప్పుటయు, హరితో లక్ష్మి సంభాషించుటయుఁ, గులదేవతార్చనంబును, హరి కుబేరున కప్పుపత్రంబు వ్రాసియిచ్చుటయు, సాయంకాలవర్ణనంబును, సూర్యోదయవర్ణనంబును, బ్రహ్మాదులతో శ్రీనివాసుండు వివాహంబునకుఁ దరలిపోవుటయు, స్వామి కాకాశరాజు కన్యాదానంబు చేయుటయు, వివాహానంతరంబునం జక్రి యగస్త్యాశ్రమంబునకుఁ బోయి బ్రహ్మాదుల వీడ్కొల్పుటయు, శ్రీలక్ష్మి క్రమ్మఱఁ గొల్లాపురంబున కరుగుటయు, వసుధాతొండవానులు యుద్ధసన్నద్ధులై యుద్ధము సేయుటయుఁ, దొండవానునకు హరి విశ్వరూపంబుఁ జూపుటయు, శ్రీనివాసునకు విశ్వకర్మ దివ్యాలయంబు నిర్మించుటయుఁ, బద్మావతీ సమేతంబుగ హరి శేషాద్రి చేరుటయుఁ, గూర్మనిచరిత్రంబును, శ్రీనివాసుండు భీమునకు సాయుజ్యమిచ్చుటయును, దొండవానునకుఁ జక్రి సారూప్య మిచ్చుటయు ననుకథలం గల పంచమాశ్వాసము.

శ్రీ ర స్తు.

# శ్రీ వేంకటాచలమాహాత్మ్యము

## షష్ఠాశ్వాసము.

శా. శ్రీమత్కోమలనీలతోయదనిభం శృంగారపూర్ణేక్షణం
హేమాభాంబరదివ్యభూషణధరం హేలావతీఖేలనం
కామారీశ్వర సన్నుతాంఘ్రికమలం కల్యాణలీలాగుణో
ద్దామం శ్రీతటికుండశేషకుధరాధ్యక్షం భజేహం సదా. 1

క. శ్రీమద్గురువర శుభకర
శ్రీమన్నరసింహదేవ చిన్మయభావా
శ్రీమహిళాధిప ఘనతర
శ్రీమద్వేంకటగిరీశ జితదనుజేశా. 2

### పద్మపురాణం బనునీరలక్ష్మీవిలాసము.

సీ. అని గురుదైవంబులను దలంపుచు వేంక
టాద్రిమాహాత్మ్యము చనుచు ధరను
వెలయు వరాహభవిష్యోత్తరపురాణ
ములయందు నలువదిమూఁడు నైన
భాసురాధ్యాయము ల్పద్యకావ్యంబుగ
మొనసి యైదాశ్వాసములు రచించి
హరికి సమర్పించి యవల పద్మపురాణ
మందు వింతగు వేంకటాద్రివిభుఁడు

తే. సిరిని గూరిచి తపమును జేసినట్టి
చరితములు కొన్ని లభియింప సంగ్రహముగ
సరవి నాశ్వాసమున కవి చాల వనుచు
వేఱుకల్పన కొంత గావింపవలసె. 3

క. కావున నిపు డొకగతిఁ గృతిఁ
గావించెద బుధులు తప్పుగా నెంచక నన్
గావుఁడు సంతస మారఁగ
సేవించెద నెల్లప్రాజ్ఞు చిత్తమునందున్. 4

తే. ఈకృతికిఁ దగునభిధాన మేది యనిన
శ్రీకరం బగువీరలక్ష్మీవిలాస
మనెడునామంబు పెద్దలయనుమతమున
నిర్ణయించితి నన్ను మన్నింపవలయు. 5

తే. భారతిని జిహ్వయం దుంచి నారసింహుఁ
డేవిధంబునఁ బలికించు నావిధమునఁ
బలికెదను భాగవతులు నాబాలభాష
వినుఁడు నెయ్యంబు మీఱఁగ విబుధులార. 6

వ. తత్కథాక్రమం బెట్టి దనిన శ్రీనివాసస్వామి చారిత్రంబుల
విని శౌనకాదిమునీంద్రులు వెండియు నొక్కనాఁడు ప్రాతః
కాలమున స్నానసంధ్యాద్యనుష్ఠానంబు లొనర్చుకొని
సూతుం జూచి యిట్లనిరి. 7

సీ. ఓసూతుఁడా శ్రీనివాసునిచరితంబు
లెన్ని విన్నను దృప్తి నెసఁగ దాత్మ
కావున నీవు తత్కథ లింకనుం జెప్పు
మనుజవేషమును రమావిభుండు

ధీరుఁడై పద్మావతిం బెండ్లియాడిన
వెనుక మహాలక్ష్మి విశ్వసించి
హరివక్షమందుండ కరిగి కొల్లాపుర
మందున్న పిమ్మట నబ్ధిసుతను
తే. దలఁచునో లేక చక్రి నిర్దయను మదిని
దలఁప కాకాశపతిసుతం దాను గూడి
మఱచి యూరకయుండెనో మఱల లక్ష్మి
నెదను జేర్చెనో లేదో మా కెఱుఁగ మనుడు. 8

క. మనమున శ్రీవేదవ్యా
సుని దలఁచుచు మౌనివరులఁ జూచి నగుచు ని
ట్లనియెను మునులారా హరి
ఘనచరితంబులను జెప్పఁగా వశమె వినన్. 9

క. నను మీ రడిగినవిధమున
మును దేవలుఁ డడుగ మోదమును దనరారన్
విని దేవదర్శనుం డను
ముని చెప్పెను విశదముగను మొనసి క్రమముగన్. 10

మ. విను మో దేవల వేంకటేశ్వరుఁడు శ్రీవిష్ణుండు పద్మావతిన్
మన ముప్పొంగఁగ గూడి యుండియును వేమాఱున్ రమా
దేవినిం, దనచిత్తంబున నెంచుచుం బ్రియముతోఁ దద్రూప
లావణ్యాచిం,తనముం జేయుచుఁ బన్నగాచలముమీఁదన్ సర్వ
భోగంబులన్. 11

సీ. అనుభవించుచు నుండె నటు కొన్ని యబ్దంబు
లరిగినవెనుక శేషాద్రివిభుఁడు

తనమదిలోఁ దాను దలఁచె నిమ్మెయి సిరి
నెడఁబాసి నరుఁడ నై యున్నియేండ్లు
గడపుచు నుంటి నింక నెడంబునం దుంచి
యుండుట పాడిగా దుదధిసుతను
వక్షమునం దుంచవలెఁ గాని యేరీతి
నైనఁ బ్రార్థించి నెయ్యంబు నిటకు
తే. నేను దోడ్కొని రాకున్న నిఖిలకార్య
ములును సంపూర్తిగావు పెంపుగ యశంబు
దక్కదు కుబేరునకు ఋణాధన మొసంగు
టకు నుపాయంబు లేదు దృఢంబు తలఁప. 12

తరల.—

నిరతము న్మదిఁ జింతఁజేయుచు నీరజేక్షణుఁ డార్తుఁడై
నరునిచందముగా విరక్తుఁ డనంగ నొప్పుచు సర్వము
మఱచి తాఁ దను జూచుచుండెడి మానిమాడ్కిని పద్మమం
దిరవిలాసగుణంబులెల్ల మదిం దలంచుచు నుండఁగన్ 13

సీ. అపుడు పద్మావతి హరి సర్వవైరాగ్య
కలితుఁడై యున్న లక్షణములెల్ల
భావించి భావించి భయమొంది యొక్కనాఁ
డేకాంతసమయమం దిట్టు లనియె
శ్రీస్వామి యిపుడు మీచిత్తంబునం జింతఁ
బుట్టుట మీముఖాంబుజమునందుఁ
గనిపించుచున్న దిక్కాలమం దరుదుగ
నిటు చింత వొడమిన హేతువేమి

తే. దాఁచకయ చెప్పు మనుచుఁ బాదములమీఁద
ఫాలమును జేర్చి విడువక బహువిధముల
వినుతి సేయుచు నడుగఁగ విడువదనుచు
సతిని గరములతో నెత్తి హితము మెఱయ. 14

క. లాలింపుచుఁ బద్మావతి
నాలింగన మాచఁజేసి యన్యోన్యముగా
శ్రీలక్ష్మీశ్వరుఁ డపు డా
హేలావతి మోము చూచి యిట్లని పలికెన్. 15

సీ. వినవె పద్మావతి వివరంబుగా నీకుఁ
జెప్పెద నెట్లన సృష్టి లేని
కాలంబునం దొంటిగా నిర్వికారుండ
నయి నిర్గుణబ్రహ్మ మగుచు నుంటి
నాయం దనాదియై పాయక మూలప్ర
ధానమ మాయాభిధాన మొంది
చిద్రూపమై లక్ష్మి సద్రూప మై నన్నుఁ
బొందఁగ నప్పు డానంద మొదవె
తే. నందు మహదాదితత్త్వంబు లన్ని వొడమె
వాని మేళనమున సృష్టి వరుసగాను
బట్టుగాఁ బుట్టె సర్వప్రపంచమయ్యె
నప్పు డంతటికిని గర్త నగుచు నేను. 16

క. అది మొదలుగ బ్రహ్మాదుల
పదపడి పుట్టింతు నీప్రపంచము నాలోఁ
గుదురై యుండును వెలివెం
పొదవుచు నీరీతి వెల్గుచుండు మృగాక్షీ. 17

క. ఇంత మహత్వంబా శ్రీ
కాంతకటాక్షమున నాకుఁ గలిగిన దిపు డా
యింతి నెడఁబాసి యుండుట
కెంతయుఁ జింతింపుచుందు నిందునిభాస్యా. 18

సీ. అద్వయబ్రహ్మంబునై నిరాకారమై
యచలమై యున్న నాయందుఁ బొంది
ఘనసుందరాకారమును నాకుఁ గల్పించి
తగు సుందరాంగియై తాను నిల్చి
గురుతరకల్యాణగుణములు నాకిచ్చి
నను గొప్పచేసె నానాఁటనుండి
చంద్రునియందున్న చంద్రికవిధముగ
వెలయుచు నాయురస్థలిని నిలిచి
తే. వేడ్కమై నుండఁగా నొకవేళ భృగుఁడు
వచ్చి సిరియున్నయురముపై వఱలఁ దన్నె
నందుచే లక్ష్మి నాయందు నలుకచేసి
విరసములు పల్కి కరవీరపురము చేరె. 19

క. అప్పుడు సర్వజ్ఞత్వము
తెప్పున నను విడచి లక్ష్మిదేవిం బొందెం
దప్పక యమ్మార్గంబును
దప్పక యీగిరికివచ్చి దైన్యముచేతన్. 20

సీ. విలసిల్లఁ దింత్రిణీవృక్షమూలమ్మున
నున్న వల్మీకాన నుంటి నపుడు
నాకు సర్వజ్ఞత లేకుండె నప్పుడు
తెలియకు గొల్లచే దెబ్బపడితి

నిన్నుఁ జూచి మోహించి నీసఖజనముచేఁ
గలిగె త్రాఁదెబ్బలు కఠినముగను
సిరిలేకయుండుటం జేసి వివాహేచ్ఛ
చే నాకుబేరునిచేత నప్పు
తే. గలిగె మాతండ్రి తమ్ములు చెలఁగి యిచ్చి
నట్టిధనమున ఋణమును నెట్టలేక
చింత పుట్టిన దిప్పుడు నేయుకార్య
మేమిదోఁచక యున్నది యిందువదన. 21

క. అన విని పద్మావతి యి
ట్లనియె మహాస్వామి మీకు నమరఁగ నాలో
చన యేను జెప్ప నేర్తునె
నను మీ రిట్టడుగురీతి నబ్బురముగదా 22

సీ. సృష్టిపూర్వమునంద చేఁబట్టి మిమ్మింత
గొప్పచేసినలక్ష్మి నిప్పు డిట్ల
నెడఁబాయఁ దగదు మీ రెట్లైనఁ బ్రార్థించి
తోడ్కొనివచ్చి నాతోడఁ గూర్చి
మీచెంత నిడికొన్న మీకిర్వురకు దాసి
నై భక్తిసేవింతు నంతెగాని
నామది కాలోచనం బింతకన్న వే
ఱేక నేమి తోఁచలే దిందిరేశ
తే. రయమునం బోయి కొల్లాపురంబు నేరి
కమల కుండెడు కోపంబు కడఁకఁ దీర్చి
యిరువురము దోడుకొని వత్తె మిటకు సరవి
ననిన శ్రీచక్రి యిమ్మెయి ననియె నపుడు. 23

మ. విను పద్మావతి యొంటికాఁపురము నీవే చేయుచు న్వేడ్కఁగా
నను నర్ధక్షణమైనఁ బాయక సదానందాత్మవై యుంటి వా
వనజాతాలయ వచ్చి సంతతము నావక్షస్థలం బందు ని
ల్చిన నీ వప్పుడు చూచి యోర్వఁగలవే చింతన్మదింబొందకన్.

క. నీవిచ్చట ననుఁ గూడుట
కై వననిధితనయ వచ్చినప్పుడు తిరుగా
నావక్షస్థలి నిడుకొన
కావేళనె పంచి తచటి కబ్జదళాక్షీ. 25

సీ. అన విని చింతించి యపుడు పద్మావతి
పలికె నిమ్మెయి రమాభామ యిటకు
వచ్చియున్నపుడు మీావక్షస్థలంబునం
దిడికొన్న కొదువ నా కేలగల్గు
నాలక్ష్మి మీాకు నా కన్యోన్యముగఁ జేసి
యంతటికిని గర్త యగుచు నుండు
శ్రీరమాకాంతయై సీతయై ననుఁ బెండ్లి
యాడు మటంచు నీ కాప్తముగను
తే. జెప్పినందుననే కదా చిత్తగించి
నన్నుఁ జేఁబట్టితిరి సదానంద మొదవె
నింత భాగ్యంబు కృపను నా కిచ్చినట్టి
సిరికిఁ బ్రత్యుపకృతి నేను జేయఁగలనె. 26

క. ఏరీతిగ నిచ్చటికిని
గూరిమితో సిరిని దోడుకొని వచ్చిన నే
నారామామణిపదములు
గౌరవమునఁ గొల్చియుందుఁ గమలదళాక్షా. 27

మ. ననుఁ గొల్లాపురమందుఁ జేర్పఁ డచట న్నానాప్రకారంబులన్
ఘనజాతాలయ కొప్పఁ జెప్పి మఱి సర్వంబు న్సమర్పించి ర
మ్మని నేఁ దోడ్కొని వత్తు నన్న దరహాసాస్యంబు దీపింప న
వ్వనజాతాక్షుఁడు సంతసం బెసఁగ నవ్వామాక్షితో నిట్లనెన్.

క. సతి నీలలితో త్తికి నా
కతి సంతసమయ్యె వకుళ యలరఁగ దోడన్
హితముగ నుండుము నే నా
సతి దోడ్కొనివత్తు నిటకు సంప్రీతి తగన్. 29

వ. అని శ్రీనివాసుండు నిశ్చయించె నట్టి వృత్తాంతంబు లక్ష్మి
భావించి తనలోఁ దానిట్లు వితర్కించె. 30

సీ. శ్రీ వేంకటేశుఁ డాశ్రితజనావనుఁ డింక
నిందుండ నీయ కహీంద్రగిరికి
ననుసత్కృపం దోడుకొని పోవుటకు వచ్చు
నపుడు నేరాను బొమ్మనుచు నాకు
నోరాడ దిప్పుడ గారవంబుగ డాఁగ
వలయు నే నాస్వామివక్షమందుఁ
బగలు రేయుండిన పద్మావతికిఁ జింత
గలుగ నాకేల నీకర్మ మంచు
తే. రయమునను లేచి కొల్లాపురంబువిడచి
దారి తప్పక యరిగి పాతాళమందుఁ
జేరి హరియంశుఁడయ్యు విశేషయోగ
మహిమచే నొప్పు కపిలాఖ్యమౌనిఁ జేరె. 31

క. అపు డాలక్ష్మిని గన్గొని
కపిలమునీంద్రుండు మిగుల గౌరవముగ న

విపులాశ్రమతలమున నా
చపలాక్షిని నిల్పె మదిని సంశయపడకన్. 32

క. హరియంశము గల మునిపై
నరమర మది నుంచుకొనక యంబుధితనయం
దిరవుగ నిలిచి నిజేశుని
స్థిరముగ మనసునను బూజ సేయుచు నుండెన్. 33

సీ. అటుమీఁద శ్రీవేంకటాద్రినాయకుఁడు ప్రా
తఃకాలమున లేచి తప్తహేమ
చేలభూషణములు చెలువుగ ధరియించి
గరుడవాహన మెక్కి గరిమ యెసఁగ
నటఁ బోయి వచ్చెద ననుచుఁ బద్మావతి
కనుకూలముగఁ జెప్పి ఘనత మెఱయ
నందున్న వకుళతో నావరాహస్వామి
తోఁ జెప్పి కదలి సంతోషముగను
తే. బోయి శ్రీకరకరవీరపురమునందుఁ
బద్మమందిర యున్నట్టి భవనమునకుఁ
జేరి యందందు వెదకి యాక్షీరవార్ధి
కన్యకామణి లేనట్టికతమునకును. 34

శా. ఖిన్నుండై మది నేమిదోఁచ కచటం గ్లేశాత్ముఁడై సారెకుం
గన్నీ రూరక నింపుచుఁ వెదకుచుం గామాతురుం డై మహా
పన్నుండై యకటా రమాతరుణి నాపై మోహముఁ లేకయిం
దిన్నాళ్లుం డిప్పుడెందు డాఁగినదొ నే నింకేడ శోధింపుదున్.

సీ. అని చింతసేయుచు నచట నుండక పోయి
పర్వతాదులఁ జూచి పలికెఁ జక్రి

గిరులార తరులార కిన్నరాంగనలార
కానరే మారమాకాంత నెందు
సురులార మునులార నరులార మీరైనఁ
గానరే మారమాకాంత నెందు
పద్మాకరములు మాపద్మాలయను జూచి
యుండినచోఁ జెప్పు డుండునుస్కి—
తే. నన్నుఁ గన్గొని యెచటనో యున్న దిపుడు
దానిఁ జూడక యుండిన తను వదేల
యనుచుఁ జింతించునప్పు డయ్యబ్ధిసుతను
జూచి యుండినవారలు సొరిది నపుడు. 36

వ. హరిం జూచి యిట్లనిరి. 37

మత్తకోకిల.—
దేవదేవ మహాత్మ మేచకదేహ యిచ్చట లేదు శ్రీ
దేవి యెచ్చట నుండునో యది తేటగాఁ గనలేదు మీ
కేవిధంబున విన్నవింతు మహీంద్రశైలనివాసకా
నావుడుక్ విని శౌరి యూరక నాల్గుదిక్కులు చూచుచున్.

వ. ఇవ్విధంబునఁ గొంతతడవుండి యాకొల్లాపురంబున నొక్కెడ నర్చారూపంబుగ లక్ష్మిని దీర్పించియుంచి పూర్వంబున నగ స్త్యుండు పూజించుచున్న లక్ష్మివిగ్రహంబును జూచి యచ్చోట నిల్చి తద్విగ్రహంబును బూజించుచు దశవత్స రంబులు తపంబుసేయుచుండె, నంత నొక్కనాఁడు సిరిం దలంచి చింతాక్రాంతస్వాంతుం డై యుండుసమయంబున నశరీరి యాహరి కిట్లనియె. 39

సీ. దేవ యిచ్చట రమాదేవి మీ కిప్పుడు
పొడసూప దీతపంబునకు మెచ్చి
గాన నిచ్చటికిఁ జక్కఁగ దక్షిణంబుగఁ
గీర్తి కెక్కినయట్టి కృష్ణవేణి
యను నది ప్రవహించు నటకు ద్వాత్రింశతి
యోజనంబులదూర ముండునట్టి
ముఖ్యమైన సువర్ణముఖరి యున్నది తత్త
టముఁ జేరి తపము సేయుము క్రమముగఁ
తే. కుంభసంభవుఁ డున్న దిక్కునను దూర్పు
గాఁ బ్రకాశించు సిద్ధసౌఖ్యస్థలంబు
స్వర్గమందున్న దివ్యసువర్ణకమల
మొకటిఁ దెప్పించి నాఁటి యందొనర నిలిచి. 40

క. ఆకమలమునకుఁ దూర్పు ది
వాకరుని బ్రతిష్ఠచేసి యర్చించినచో
నాకంజము ముకుళింపక
ప్రాకట శుభముగను వెలయు భావం బలరన్ 41
శా. నీ వాకంజమునందుఁ జూపిడుచు సన్నిష్ఠాపరతుండై కన
ద్భావం బందు రమాపతిం దలఁచి తత్పద్మాంతరాసీనయం
దేవేళం గనుచుండు పుష్పములతో నింపొందఁగాఁ జేయుమా
దేవిం బొందఁ బ్రసన్నయై నిలుచు నీదేహంబునన్ శ్రీధరా.
క. పదిరెండువత్సరంబులు
మది శ్రీసతియందు నిల్పి మౌనంబుగ నిం
పొదవఁగ లక్ష్మీమంత్రము
చెదరక యెప్పుడును జపము సేయు మహాత్మా. 43

సీ. అని భారతీదేవి యశరీరయై పల్కఁ
విని వింతగాఁ జక్రి కనులు దెఱచి
నాల్గుదిక్కులు చూచి నను దేని కెవరందుఁ
గన్పట్ట కుండఁగ గగనవాణి
చెప్పిన మాటలు సిద్ధం బనుచు లేచి
గరుడవాహన మెక్కి కదలి దారి
దప్పక శేషభూధరము గ్రక్కునఁ జేరి
వేఱ తా నొకరాజవేష మచట
తే. క్రమముగా ధరియించి పుష్కరిణియందు
స్నానసంధ్యాదికృత్యముల్ సల్పుచున్న
గాంచి రా రాజవరుఁ డని గౌరవముగ
నెంచి వైఖానసార్యులం దిష్టు లగుచు. 44
తే. వేగ క్రతుభోక్త యగుమహావిష్ణుదేవు
నతిథి యని పూజచేసి దివ్యాన్న మపుడు
పొసఁగ నర్పించి విడె మిచ్చి పుణ్యకథలు
చెప్పి దయయుంచు మంచు నాశీర్వదించి. 45
క. తను వీడ్కోల్పఁగఁ బర్వత
మును డిగ్గి యగస్త్యనామముఖ్యాశ్రమముం
గనుఁగొని దానికిఁ దూర్పుగఁ
జని సిద్ధస్థలమునందు సరగున జేరెన్. 46
వ. అప్పుడు విష్ణుండు గరుడుని డిగ్గి వాయుదేవుని స్మరింప
నతండు వచ్చి చక్రికిఁ బ్రణమిల్లి యిట్లనియె: 47
క. దేవా నన్నుఁ దలంచుట
కీవేళం గార్య మేమి యెఱిగింపుము నే

నేవిధకార్యం బైనను
శ్రీవల్లభ చేసె దేను సేవకుఁ డగుచున్. 48

వ. అనిన విని శ్రీహరి పవనునిం గనుంగొని. 49

సీ. పలికె నిట్లని విను పవన నీ వాస్వర్గ
మున కేగి యచ్చట ముఖ్యమైన
యలరుమందాకిని యందుండు వరకాంచ
నాబ్జంబు సురపతి నడిగి తెమ్ము
పొమ్మనఁగా జక్రి కమ్మారుతుం డిట్లు
లనియె హేమాబ్జంబు లమిత మగుచు
ముఖ్యంబుగా స్వర్ణముఖియందు నుండఁగ
వేఱ భర్మాబ్జము ల్వేడుక నేల
తే. ననఁగ నశరీరి తనకుఁ జెప్పినవిధంబు
నతని కెఱిఁగించి పంపఁగ ననిలుఁ డరిగి
వరసహస్రదళముల సువర్ణపద్మ
మమరపతి సెలవునఁ దెచ్చి హరి కొసంగి. 50

క. నిలువఁగ మాధవుఁ డిట్లని
పలికెను విను పవన నేఁ దపం బిచ్చోటన్
సలిపెద నీ కీగోప్యము
దెలిపితి నిది యెవరితోడఁ దెలుపకు మనఘా 51

తే. అనిన విని పవనుండు మహాప్రసాద
మంచు హరియాజ్ఞ గైకొని యరిగె నంతఁ
గమలలోచనుఁ డచటిపుష్కరిణి నడుమఁ
గుంతమునఁ గ్రుచ్చి గోకర్ణ మంతరైన. 52

సీ. ఖాతంబు చేసి యక్కడ సువర్ణాంబుజ
నాళంబు లోతుగ నాటి నీటి
పైనఁ బద్మము నుంచి భాస్కరు నాతూర్పు
నందుంచి పూజించి యచలమదిని
బద్మాకరమునకుఁ బశ్చిమతటమునఁ
జేరి పద్మాసనాసీనుఁ డగుచు
నేకాగ్ర మగుదృష్టి నా కాంచనాబ్జమం
దుంచి శ్రీసతిని భావించి యచట
తే. నిలిపి మానసపూజ తా నిత్య మొనర
ధీరుఁడై చేయుచును రమాదేవిమంత్ర
మును జపించుచు నచ్చోట మొనసి తపము
నేయుచుండెను వెన్నుండు సిరిని గూర్చి. 53

క. హరి యిటు తప మొనరించుట
హరిహయుఁ డెఱిఁగియును మఱచి యవనీస్థలిపై
నరపతి యెవఁడో ఘనతప
ముపనిష్ఠను నిల్చి చేయుచున్నాఁ డనుచున్. 54

ఆ. తలఁచి యతఁడు నేయుతపము పూర్ణంబైన
తనపదంబు నేరు ననుభయంబు
పొడమ దపమునకును బుడమిపై విఘ్నంబు
నేయు నంచు నెంచి జిష్ణుఁ డపుడు. 55

చ. తన మది నిశ్చయింపుచును దక్కక యప్పుడ వారకామినీ
జనములఁ బిల్చి యిట్లనియె సాహసి యొక్కఁడు మత్పదంబు చే
రను దప మాచరించు నలరాజును మోసముచేసి తత్తపం
బును జెఱుపందగుం జనుఁడు పుష్పశరు న్జతగూడి వేడ్కతోన్

మ. అని రంభాదిసతీసమూహమును నెయ్యం బొప్పఁ బంపింప న
త్తనుమధ్యల్ మణిభూషణంబులు సువస్త్రంబుల్ విరుల్ దివ్య
చందనముం దాల్చి యొయారము ల్చెలఁగఁగాఁ దాంబూల
ముల్ చేయుచుం, జన విష్ణుండు తపం బొనర్చు ఘనసుస్థానం
బునం జేరఁగన్. 57

క. కలకంఠము లళులును జిలు
కలు కలకలరవము సేయఁగా సూనశరుం
డులుకక మలయానిలమును
జెలువలరఁగఁ గూడి యచటిచేడెల చెంతన్. 58

క. చేరిన మారుని గని యా
నారీమణు లెల్ల మెఱయ నగి యచ్చటి శృం
గారవనములోఁ జొరఁబడి
కోరిక లుప్పొంగఁ బూలు గోయుచు నెలమిన్. 59

క. చిలుకలవలెఁ దగిజిలిబిలి
పలుకులు వల్కుచును జెలఁగి పకపక నగుచున్
జెలువారఁగ నొండొరులను
బిలుచుచు నిట్లనిరి చాల ప్రేమ యెసంగన్. 60

సీ. అక్కలారా కొమ్మ లెక్కి లు గోస
చక్కఁగ వనమెల్లఁ జల్లరమ్మ
భువిని వసంతమాధవుఁ జెంత వనలక్ష్మిఁ
జేర్చి వివాహంబు చేయరమ్మ
లఁ గోసి మగువలారా వేడ్కఁ
దలఁ బ్రాలు వోయరె దంపతులకు

గీరంబులం జెంతఁ జేరి పాటలు పాడ
సెలవు మీఱొసఁగరె చేడెలార
తే. యనుచు ఘనతాళపద్ధతి నాడిపాడి
రభసములు సేయఁగాఁ బరరాజవేష
ధారియై తపమొనరించు దానవారి
నాకపతిచేత కాత్మలో నవ్వుకొనుచు. 61

చ. కనులొగి నెట్టుచేసుకొనఁ గాంతులు దిక్కులు పిక్కటిల్లఁగా
వనజదళాయతేక్షణుఁడు వారిని జూచి చలింప కాత్మలో
వనధిసుతం దలంచుచును వారక యజ్ఞము దిక్కుఁజూడఁగా
ననిమిషకాంతలేభ్రమసియాహరిపైఁదమమోహముంచుచున్

మ. అపు డంచంచుకుఁబోఁయి పూలసరముల్ హాస్యంబుగాఁ
బూని య, త్తపనీయాంగుఁడు శౌరివక్షముపయిం దా
మేయుచుండ్ నవ్వుచుండ్, గపటంబుం దగ నవ్యనాట్యములు
సద్గానంబులం జేసిరిన్, జపలం బించుక లేక యచ్యుతుఁడు
నిష్ఠన్ నిల్చి యొప్పెం గడున్. 63

వ. అప్పు డయ్యంగనామణులు తమ కేమియుం దోఁచక. 64

సీ. ఒకరొక్కరిని చూచి యోయక్కలార యీ
నరపతి తపమే ఘనంబు చూడ
మొనసి విశ్వామిత్రమునితపంబున కన్న
ద్వైపాయనునిమేటి తపముకన్న
నతిశయించిన దిమ్మహారాజు కోడితి
మింకఁ బోవుద మని యెంచుచుండ
నప్పుడు దైత్యారి తెప్పున నొకమోహి
నీదేవి సృజియించె నెమ్మిఁ దనర

తే. దేవతాస్త్రీలు మోహినీదేవిఁ జూచి
విస్మయానందచిత్తలై విశ్వమునను
జూచితిమె యిట్టి యింతిని సుదతులార
యనుచు లజ్జించి యిట్లనుకొనిరి మఱియు. 65

శా. ఈకాంతామణి నద్భుతం బెసఁగఁగా నీరాజు పుట్టించినాఁ
డేకాలంబున నైన నిట్టి మహిమం బెందేని గన్గొంటిమే
లోకాతీతుఁడు గాని యీపురుషుఁ డీలోకంబునఁ నుండువాఁ
డే కాడు మనుష్యుఁ డంచు మన మిట్లీపుర్షుని న్వేడ్కతోన్.

వ. వచ్చిచూచి మోహించుట ధర్మంబుగాదు గావున. 67

సీ. మఱి కొంద అప్పుడు మానినీమణులార
యీతండు తపసిగ నెంచఁదగదు
శ్రీగురుం డనవలెఁ జెలులార లేకున్న
యొకయింతి సృజియింప నోపనగునె
చెనకితి మూరక సిగ్గుపాట్లయ్యె నిం
కేమియు లేదుపో యిచట మనకు
ననుచుఁ జింతింపఁగ నాపుష్పబాణుండు
తలఁచె నిమ్మెయి నాదుతండ్రిఁ జూడఁ
తే. దపము సేయుచు నుండఁగఁ గపటపుష్ప
బాణమును బట్టి యెందుకు వచ్చితేను
తండ్రి యేమి తలంచునో తపముమాని
యంచు గడుభీతి నొందుచు నరిగె నంత. 68

మ. దిగులుం బొందుచు నేమి దోఁచ కపు డాదేవాదిదేవు న్మహా
జగదీశుం గని భక్తిమీఱఁగ నమస్కారంబులం జేసి మె

ల్లఁగ మాటాడుచు విస్మయం పడుచు శ్రీ లక్ష్మీశ్వరం బాసి
యా, మృగనేత్రల్ సని నాకనాయకుని సామీప్యంబునం
జేరఁగన్. 69

క. వారిం గని పురుహూతుఁడు
నారీమణులార ధరను నరపతితపముల్
వారించితిరి గదా యన
నారంభాస్త్రీలు ఖేద మందుచు నపుడున్. 70

సీ. పలికి రిట్లని నీవు పంపింపఁగాఁ బోయి
నరపతి యనుచు నానావిధములఁ
దలకొని నృత్తగీతము లెంతఁ జేసిన
మాదిక్కుఁ జూడక మహిమ మెఱయఁ
దనచెంత విశ్వమోహినిని బుట్టించినాఁ
డాకాంత కన్న మే మందఱమును
దక్కువై నందునఁ దగ్గి వచ్చితి మిట్లు
చిరతరతపము చేసెడు ఘనుండు
తే. మనుజుఁ డనియుంటి మతఁడు రమావిభుండు
గనుక చలియింప కున్నాఁడు కాముఁ డతని
కదరి చనినాఁడు తత్తపం బతిశయించి
యున్న దిది నిక్క మోపురుహూత యనిన. 71

ఆ. విని సురేశ్వరుండు విస్మయస్వాంతుఁడై
చక్రి తపముసేయు సరవి మఱచి
యేను జేసి తిప్పు డిటువంటి యపచార
మనుచు హరికి మ్రొక్కి వినుతిచేసె. 72

సీ. దనుజారి యచ్చట తనమాయచేఁ బుట్టి
నట్టిశక్తిం జూచి యచలుఁ డగుచుఁ
బలికె నిట్లని నీవు ప్రజలచే నిందందుఁ
బూజలందుచు నుండు పొమ్మటంచుఁ
దా దాని పంపించి తదనంతరంబున
జిష్ణుండు నేరక చేసినట్టి
పనికిఁ గోపింపక తనయుని జనకుండు
గాచినకైవడి బ్రోచె నంత
తే. శాంతమానసుఁడై హేమజలజమునన
పూర్వరీతిని మఱల సంపూర్ణదృష్టి
నిల్పి చలియింప కత్యంతనిష్ఠ మెఱయఁ
దపము సేయుచు నుండె నాదానవారి. 73

తే. అచటఁ బద్మావతీదేవి హరిని బాసి
నది మొదల్ నిద్రలేక యాహారమైన
లేక యాచక్రధరునిపై నాసతనరి
విరహతాపజ్వరంబుచే వేఁగుచుండి. 74

క. ఇరువదిరెండేం డ్లాయెను
హరి యిచటికి రాకమానె ననుకొని చింతం
బొరలుచు మఱచుచుఁ దెలివిఁ
దొరకొని యొకనాఁడు వకుళతో నిట్లనియెన్. 75

మ. వకుళా వెన్నుఁడు నన్ను శేషగిరిపై వర్తింప నేమించినాఁ
డకలంకంబుగ మాటలాడి చని రాఁ డయ్యె న్మహాచింతచే
నొకనాఁ డొక్కయుగంబుగాఁ గడపలే నోయమ్మ నాప్రాణనా
యకుఁ డాలక్ష్మినిగూడి యెందరిగినాఁ డంచు న్విచారించుదున్.

ఆ. నిలిచి యున్న చోట నిలువ సహింపదు
మఱచియుండు మనిన మఱపురాదు
కనులఁ గట్టినట్లుగాఁ దోఁచుచున్నాఁడు
మాటలాడఁ డిపుడు మౌనివలెను. 77

సీ. కనిపించుచున్నాఁడు కలలోన నిత్యంబు
తపసివేషము దాల్చి దగ్గఱగను
ధ్యానయోగంబును బూనిన ట్లున్నాఁడు
జోడులే కొక్కఁ డున్నాఁడు చూడఁ
గమల యాస్వామికిఁ గన్పట్టెనో లేదొ
నా కనుమానమైనది యిదేమొ
నాకిట్టి కలవచ్చె నీకారణం బింత
కేమని తలఁతు నాయీశుఁ డెఱుఁగు
తే. ననుచుఁ గన్నీరు నింప నయ్యబ్జముఖిని
జూచి పరితాపపడుచుఁ దా లేచి వకుళ
మాలికాదేవి యాదేవి మస్తకంబు
నివిరి కన్నీరు దుడుచుచు నెనరు మెఱయ. 78

తే. పల్కె నిట్లని తల్లి యీపామరంబు
విడువు భయమేమి శ్రీమహావిష్ణునకును
గడగి మునిరీతిఁ గలలోనఁ గానుపించు
ననుచుఁ జింతింప కిది శుభం బలరునమ్మ. 79

క. అమ్మా సంతోషస్వాం
తమ్మును దనరారుచుండు తద్దయు నే ఖే
దమ్మును బూనకు లక్ష్మిని
నెమ్మదిఁ దోడ్కొనుచు నిటకు నేఁజీ హరి వచ్చున్. 80

సీ. అని వకుళాదేవి యచట పద్మావతి
నాదరింపుచునుండె నంత లక్ష్మి
కపిలాశ్రమంబులోఁ గన్పట్టెఁ బద్మావ
తీదేవి చింతఁ డాఁ దెలిసి చక్రి
తలఁచి నాకై మేటితపము సేయఁగనేల
యాకాంత కొండపై నడలనేల
యని చింతసేయుచు నందుండు కపిలము
నీశ్వరు నీక్షించి యిట్టు లనియె
తే. మాని పద్మావతిం బెండ్లి మాధవుండు
చేసుకొని దాని విడనాడి చెలఁగి నన్నుఁ
గూర్చి తప మొనరించుచుఁ గొంకుమాని
యుండు వాఁడేమి సేయుదు యోగివర్య. 81

వ. అనిన విని యమ్మునీశ్వరుం డిట్లనియె. 82

క. హరియురమున వసియించక
సిరి నీ వపు డలుగ నేల చిత్రముగద! యా
సరవిం జెప్పుము విని నీ
కరయఁగ నంతయును జెప్పె దంబుజనయనా. 83

క. అని కపిలుం డపు డడుగఁగ
విని శ్రీసతి యిట్టులనియె వెన్నుని యురమం
దొనరఁగ నే నుండఁగ భృగు
ముని హరియురమందుఁ దన్నె మూఢాత్ముండై. 84

క. పరుఁడగు పుర్షునిపాదం
బరుదుగఁ దాఁకిన యురంబునందుండిన నా

తిరమగు పాతివ్రత్యము
కరముగఁ జెడునంచు వప్పుగా నేగి తొగిన్. 85

చ. అన విని మౌని యిట్లనియె నాభృగుఁ డెవ్వఁడు నీసుతుండు
మున్, గనినకుమారుఁ డన్యుఁ డనఁగాఁ దగ దెట్టులటన్న
వాఁడు నీ, మనుమఁడు పుత్త్రతుల్యుఁ డనుమానము నుంచకు
మాత్మలో మఱేఁ, దనుజవిరోధి యీసరణి దాఁచక చెప్పె
నొ లేదొ మానినీ. 86

చ. అనవుడు లక్ష్మి యిట్లనియె నంబుజనాభుఁడు నాకు మున్ను చె
ప్పినవిధ మీవు చెప్పితివి భేదము లేదిఁక నించుకేని యం
చనఁగ మునీంద్రుఁ డిట్లనియె నాతనిబాసి ప్రియంబు మాని నీ
వనువుగ వచ్చుటేల యపు డాకరవీరపురంబు చేరఁగన్. 87

క. అని కపిలుఁడు వల్కఁగ విని
వనజాలయ చింతనొంది వారక యపుడా
ఘనయోగీంద్రుని గనుఁగొని
వినయంబును మెఱయ ననియె విధి దూఱు చొగిన్. 88

క. ఆవిప్రుం డతిగర్వము
తో విష్ణుని దన్నినట్టి దుఃఖముచే నా
శ్రీవక్షము నెడఁబాసితిఁ
బోవలె నని తలఁచి తపుడు పుణ్యాంబునిధీ. 89

ఉ. నావుడు నవ్వుకొంచు మునినాయకుఁ డిట్లనియెం గ్రమంబుగా
నీవిభుఁ డొప్పినట్టిపని నీమది కొప్పక యుండవచ్చునే
నీవు పతివ్రతామణివి నీమదిఁ దోఁచనిధర్మ మున్నదే
శ్రీవనితాలలామ హరిచిత్త మెఱుంగక యిట్లొనర్తువే. 90

సీ. సిరి నీవు తపములు చేసి యాశ్రీస్వామి
యురమందు వసియించి యుండి భృగుని
యందు నేరం బిడి యలిగి వోవుట నీకుఁ
దగునె భృగుండేమి తప్పుచేసె
మూఁడుమూర్తులగుణములు పరీక్షించుట
కైమును లంపఁగ నజుని జేరి
యతనిరజోగుణం బట పరీక్షించి శం
కరునితమోగుణం బరసి యంత
తే. హరిమహాసత్వగుణము బ్రహ్మాదులకును
దెలియఁజేసెడికొఱకుఁ దా నెలమి భక్తి
నుంచికొని తన్నినాఁడు గర్వించి తన్నె
ననుచుఁ బల్కకు మునిభావ మరయకుండ. 91

సీ. స్వల్పదోషములకు జలజజుండును రుద్రుఁ
డలిగిన యాదోష మతిశయముగఁ
దాఁజేసి చక్రి యందఱచేత మెప్పింప
వలె నంచుఁ దన్నినవాఁడ గాని
కోపంబు మదినుంచుకొని తన్నలేదు గా
వున వెన్నుఁ డాపని కనుమతించి
యతని గొప్పగ నెంచి యంపించె నాహరి
యందు నాభృగుమునియందుఁ దప్పు
తే. లుంచి హరి నెడఁబాసి వోవుటను నీద
తప్పు గొప్పదిగాన నింతటివిరోధ
మీవు చేయంగరాదు శ్రీదేవుఁ డచట
నిలువ కప్పుడ వేంకటాచలము చేరి. 92

తే. అచటఁ గొన్నాళ్లు కష్టంబు లనుభవించి
నట్లు నటియించి పిదప నయ్యబ్జముఖిని
ప్రేమమీఱఁగ నీక్షించి పెండ్లియాడె
నతని కెందున్నఁ గొదువలే దంబుజాక్షి. 93

క. హరి కరుణామృతసింధుఁడు
సరవిగ నిను బిలువవచ్చు సంతసముగ నీ
వరుగుము తడయక యాకరి
వరదుని వంచించి యిటకు వచ్చుట తగునే. 94

చ. పరమపతివ్రతామణివి భర్తకుఁ జిక్కులు వెట్టి యిమ్మెయిఁ
ధరణిని వేడ్కబాలకులు డాఁగురుమూతల నాడురీతిగాఁ
దిరుగుచు నుండుచందము పతివ్రత కొప్పునె యెందునైన నీ
వరయనినీతులుం గలవె హా యిదియేమి విచిత్రమంగనా. 95

సీ. వనితా ద్వివింశతివత్సరంబులనుండి
తలజడ లట్టిగఁ దపసి యగుచు
నాహారనిద్రాసుఖాసక్తులను మాని
నీకొఱకై సర్వలోకకర్త
మనుజుఁడై నీనామమంత్రజపంబును
జేయుచున్నాఁడు సుస్థిరముగాను
నీవు మంత్రాధీనవై విష్ణుదేవుని
జేరఁగాఁ దగు నిది సిద్ధ మెలమి
తే. నింక నీవేడ డాఁగెద విపుడ లేచి
యంబుజాక్షుఁడు నాటియున్నట్టి పద్మ
నాళపథమున నరిగి నీనాయకుండు
దృష్టినిడినట్టి కమలాన శ్రీకరముగ. 96

ఆ. నిలిచి యచట నుండు నీరజాసనముఖ్యు
లటకు వత్తు రప్పు డందఱెఱుఁగ
వనిత నీవు చక్రి వక్షస్థ్సలమునందుఁ
జేరియుండు భూప్రసిద్ధముగను. 97

క. అని కపిలుం డాప్తముగా
వినిపించిన విమలతరవివేకోక్తుల కా
వనధిజ సంతోషించుచు
మన మలరఁగ నిట్టులనియె మౌనీంద్రునితోన్. 98

సీ. నీవుచెప్పినమీఁద నావలనం దప్పు
గలదని తోఁచె నిక్కంబుగాను
నేనేమి సేయుదు నానాఁటికిం గాల
గతు లీవిరోధంబు గలుగఁజేసె
నటుగాన నాస్వామి కమితచింతను గల్గఁ
జేసితి నికమీఁద సిగ్గులేక
నేను వక్షమునందు నిలువఁబోయినఁ జక్రి
నవ్వఁడే భృగునెంచి నయముగదుర

తే. కాన సంకోచ మైనది కాయ మిచట
నుంచి నే నర్థకళతోడ నురుతపంబు
చేసి పతి కపచారంబు జేసినట్టి
పాపమును నీగవలయు నోపావనాత్మ. 99

క. ఈదేహముతో నపకృతి
నాదేవుని కాచరించినందున నిపుడే
యీదేహము హరియెదపై
నాదరముగ నిల్పనొల్లనయ్య మహాత్మా. 100

ఉ. కావున నవ్యదేహమును గైకొని వెన్నుఁడు పూజసేయురా
జీవములోన నుండి హరి చేరి యురస్థ్సలమందు నిల్చెదర
నీవిధి సమ్మతించుము మునిప్రవరా యని సన్నుతింప న
ద్దేవిముఖంబు దివ్యతరదృష్టిని జూచి మనంబులోపలన్. 101

సీ. తలఁచె నీరీతిగఁ దాపసశ్రేష్ఠుండు
తెలుప దేహంబు ప్రత్యేకపూజ
లందు కారణముండు ననికొంచు నిట్లనె
దేవి యిందుండుము దిరము తపము
చేయుచునుండును చెలఁగి పద్మసరోవ
రప్రాంతమునకు నిర్ణయముగాను
జని పాంచరాత్రపూజల నందుఁ గొనుచుండు
మందుపై నీచిత్తమందుఁ దలఁచి

తే. నట్లనే చేయుమని లక్ష్మి కానతిచ్చి
మఱల నిట్లనియెను లోకమాత నీవు
హరికి నిత్యానపాయని వగుచుఁ జక్రి
యెన్ని యవతారముల నెత్తుచున్న నీవు. 102

క. అన్ని శరీరను లమరం
జెన్నుగ ధరియించి విభుని జెలఁగుచుఁ గీర్తిం
గన్నట్టి నీప్రభావము
మున్నెఱుఁగుదు నేను విశ్వమోహిని ధరపై. 103

క. నీవెత్తిన దేహంబులు
నావెన్నుం డెత్తినట్టి యవతారము లిం
కా వేయుతలల శేషుని
కావనజజ శంకరులకు నలవె గణింపన్. 104

క. మీరాదిమదంపతు లై
భూరిజగత్త్రయము నిట్లు పుట్టించినవా
రారయ నిపు డెడఁబాయను
గారణ మున్నందువలనఁ గార్యము గల్గెన్. 105

క. వేంకటగిరిపై మీ రిపు
డంకితముగ నుండవలసినందున నాఁ డా
శంక మనంబునఁ బొడమెను
బంకజముఖి నీకు భేదభావము గలదే. 106

క. నిను నేఁ దప్పులు పట్టితి
నని కోపము సేయవలవ దాప్తుఁడ నై నా
మనమునఁ దోఁచిన యర్థము
వినుపించితిఁ గూర్మి చేత విమలేందుముఖీ. 107

ఆ. అనఁగ లక్ష్మి యిట్టు లనియె నోమునినాథ
నీవు చెప్పినందుచే విరోధ
మడఁగె నిటకు వచ్చినప్పటి నాభావ
మిపుడు విన్నవింతు నెట్టు లనిన. 108

క. అల పద్మావతి చక్రిని
గలసి మెలంగుచును వేడ్కగా నుండఁగ నా
జలజాక్షునివక్షముపై
నెలమిని నే నిల్చియుందు నెట్లన్న నొగిన్. 109

తే. తలఁచి హరి నిన్నుఁ గరుణతోఁ బిలువవచ్చు
నపుడు వంచించి వచ్చి నీయాశ్రమంబు
నందుఁ జేరితి ననఁగ సంయమివరుండు
చిఱునగవు నవ్వి లక్ష్మి నీక్షించి పలికె. 110

తే. వినుము విష్ణుండు కృష్ణుఁడై వేలసంఖ్య
లైన కాంతల చేఁబట్టి యందఱకును
నన్నిరూపములై గూడునపుడు నీవు
శౌరి నెడఁబాసి యుంటివి చంద్రవదన. 111

క. మాయాశ్రమము పవిత్రము
చేయుట కిటు వచ్చితివి విశేషం బయ్యెన్
నీయాత్మేశ్వరు నిఁక నెడఁ
బాయక శేషాచలంబు పై నుండు సిరీ. 112

క. అని యివ్విధమునఁ జెప్పఁగ
విని సిరి యాకపిలగురుని వీడ్కొని వేడ్కం
దనయోగమహామహిమం
బును బెంచుచు లేచి లోకపూజ్యతకొఱకై. 113

సీ. పూర్వాంగమునకుఁ దపోనిష్ఠఁ బుట్టించి
యందుంచి దివ్యదేహంబు దాను
బ్రత్యేకముగఁ దాల్చి పద్మనాళంబునఁ
జొచ్చి యాదారిని వచ్చివచ్చి
పైన వెల్గుచునుండు పద్మకర్ణికయందుఁ
జేరి సుఖాసనాసీన యగుచుఁ
గ్రొక్కాఱు మెఱపులు గుమిగూడి విగ్రహం
బై నిల్చినట్టు లయ్యబ్జమందు
తే. శ్రీరమాదేవి యున్న నీక్షించి విష్ణు
దేవుఁ డానందజలధిలోఁ దేలి సిరిని
జూడ నాలేమ హరిమోముఁ జూచి సిగ్గు
చేతఁ బల్కక తలవాంచి చింతనొంది. 114

సీ. తనమదిలోఁ దాన ఆ.
నాకతంబున నిందు శేషవిదారి
తపసియై ఘనజటాధారియై తాఁసరి
హారియై భోగంబు లన్ని విడఁ
యీరీతిగానుండు వైరాగ్యవిగ్రహం
బిటుచూడ వలసె నింకేమి సేతు
ననుచుఁ జింతింపఁగ నాలక్ష్మిభావంబు
భావించి విలసితాభరణములను
తే. గనకచేలము శంఖచక్రములఁ దాల్చి
నీలమేఘనిభాంగుఁడై నిల్చియున్న
హరిని శ్రీదేవి చాల మోహమునఁ జూచు
చుండఁగాఁ జక్రి తలవాంచి యూరకుండె. 115

చ. సిరి తను జూచుచున్నపుడు శీర్షము నేలకు వంచి లజ్జతో
నరమరఁ జేయుచున్న పతి నంబుధికన్యక చూచి సిగ్గునన్
మఱల శిరంబు వంచి యనుమానమునం దను జూడకుండఁగా
హరి కమలాలయాననము నప్పుడు మోహముమీఱఁ జూడఁ
గన్. 116

క. కందర్పుఁడు మదిని భయం
బొందక సిరి నెదకుఁ బిలువకున్నాఁడని గో
విందుని మదిలోఁ జొరఁబడి
సందడి సేయుచును బుష్పశరముల నేసెన్. 117

సీ. అప్పు డాగోవిందుఁ డళికియు నళుకక
ధీరుఁడై శ్రీరమాదేవి తొలుతఁ

దనుఁజూచి మాటాడినను దాను మాటాడ
వలె నంచు శిరమును వాంచి యుండె
హరి పిల్చినపుడు మాటాడె నంచును లక్ష్మి
కమలంబుపై నిల్చి కదల కుండె
బ్రహ్మరుద్రాదు లాభావము ల్భావించి
తమవాహనము లెక్కి తరలివచ్చి
తే. రమ్యతరమైన పద్మసరస్సుచెంతఁ
జేరి శుభవాద్యములను ఘోషింపఁజేసి
పుష్పవర్షము గురియించి పొగడి వారి
కిరువురకు భక్తితో మ్రొక్కి యిట్టు లనిరి. 118

దండకము.—శ్రీమత్పరంధామ జీవాంచితస్తోమ శ్రీమానినీలోల శృంగారసల్లీల కందర్పలావణ్య కంజోద్భవాగణ్య సాద్గుణ్య సంపన్న సంరక్షితాపన్న సత్యవ్రతాచార సాధువ్రజోద్ధార సారాంబుదశ్యామ సంపూర్ణ సత్కామ వేదాంత సంచార విశ్వంభరాధార శ్రీ వేంకటాద్రీశ సచ్చిత్ప్రకాశా పరాకాశలోకేశ వాగీశ గౌరీశ నాకేశ వంద్యాంఘ్రిపద్మద్వయా నిత్య సత్యాద్వయా సద్దయాసాంద్ర యోగీంద్ర హృత్పద్మభృంగా శుభాంగా సుచారిత్ర మిత్రాబ్జనేత్రా ధరిత్రీకళత్రా మహోల్లాస భక్తప్రియా శ్రీనివాసా మముఁ సత్కృపం జూడుమో తంద్రి తద్గొండవాసా నృసింహా సదా శ్రీనమస్తే నమస్తే నమస్తే నమః. 119

వ. అని మ్రొక్కుచు వినుతించి యిట్లనిరి. 120

సీ. క్షీరసాగరజాత చిత్తజాతునిమాత
ప్రథితగుణోపేత భాగ్యదాత

అమృతాంశుసోదరి యార్తిదోషవిదారి
నవ్యసుందరి సదానందలహరి
భక్తసజ్జనపాల పాపవనానల
విహితాళవాల సద్వినయశీల
కనక పద్మాలయ కవివర్యగణగేయ
విబుధనికాయ సద్విజయనిలయ
తే. లక్ష్మి నీస్వామి వక్షస్స్థలంబునందుఁ
జేరి శేషాద్రిపై భూప్రసిద్ధముగను
వెలసి మామీఁద సత్కృప నిలుపవలయు
ననుచుఁ బ్రార్థించి వారిట్టు లనిరి మఱల. 121
సీ. పరఁగఁ గార్తికశుద్ధపంచమీ భృగువార
ముత్తరాషాఢసంయుతదినంబు
చక్రివక్షమునందు సంతసంబునఁ జేర
వలె మైత్రతారగ వఱలునాఁడు
తడవేల నంచు విధాత శంకరులును
విన్నవింపంగ నావిజయలక్ష్మి
పలుకకుండినఁ జూచి బ్రహ్మదేవుఁడు భృగు
సంయమీంద్రుని కనుసైగఁ జేసె
తే. నపుడు భృగుముని సిరిపాలి కరిగి మ్రొక్కి
మాతృదేవత నాతప్పు మఱచి యిప్పు
డైన నే నీకుఁ బుత్త్రుండనంచు నెంచి
హరియురంబునఁ జేరు మాయమ్మ యనుచు. 122
క. బహువిధముల వినుతింపఁగ
సహజజ్ఞానమున నధికసంతసమున శ్రీ

మహిళామణి భృగుమౌనిని
విహితంబుగ నాదరించి వేడ్కం గనియెన్. 123

క. ముని నీదృఢతరభక్తికి
ననుపమ ధైర్యముకు మెచ్చి తల సత్వగుణుం
డనఁదగు నాదేవునిపై
ననుమానము నొంది దూర మరిగితి నయ్యా. 124

సీ. నా రజోగుణమున కారీతి కాఁగల
గతి జతగూడిన కారణమునఁ
బ్రాణేశు నెడఁబాసి పరదేశమున నుండు
టొక్కటి విభునిచే నుగ్రతపము
చేయించు టొక్కటి సిద్ధించె నందుచేఁ
గాల మెంతటివారు గడుపలేరు
నీతప్పుగా దది నాతప్పుగా దది
కపటనాటకసూత్రకరధరుండు
తే. నైన యాచక్రికార్యంబు లన్ని తలఁప
నతనిపను లన్ని చూడఁగ నతనికెఱుక
యనుచు భృగుమునితోనని యను ముదమున
మహితుఁడౌహరిపాదపద్మములయంద. 125

వ. దృష్టి నిల్పి భక్తి తుఱంగలింపఁ జేయుచునుండ. 126

క. పుత్తడిబొమ్మవిధమ్మున
నత్తన్వి సువర్ణపద్మమం దుండి విభుం
డెత్తి యురంబున నిడుకొను
నిత్తఱి నని తలఁచి కదల కిందిర యుండెన్. 127

చ. వనజజ శంభులిద్దఱును వార్ధితనూభవమోము చూచి త
న్మనమున నుండునట్టి యనుమానము తాముగ్రహించి పద్మలో
చనునకు మ్రొక్కి యిట్లనిరి సాగరకన్యక నెత్తి వక్షమం
దానరఁగ నుంచుకొమ్ముహరి యోజగదీశ యటంచుఁబల్కఁగన్.

చ. విని హరి నవ్వి యిట్లనియె వింతగఁ జూచుచు నుండనేల న
వ్వనధిజ కెల్లకాలము నివాసముగాఁ దగినట్టి నాయురం
బున నికనైన నిల్వుమని పొందుగఁ జెప్పుడు మీర లిప్పు డ
న్నను విధి రుద్రులిద్దఱు మనంబున సంశయ మొంది తాల్మితోన్.

తే. పలికి రిట్లని దేవి నీప్రాణవిభుని
వక్షమునఁ జేరి యుండఁగ వలయు నిపుడు
మంచిలగ్నంబు గనుక నెమ్మదిగఁ జేరు
మనఁగ నంభోధికన్య ప్రియంబు మెఱసి. 130

సీ. ఘల్లుఘల్లని కాళ్లగజ్జె లందెలు మ్రోయ
మొలనూలు గజ్జె లిమ్ముగను మెఱయఁ
జెలువారు పసిఁడియంచులనొప్పు తెల్లని
చీర నద్దపుఁగాంతి చెన్నుమీఱ
రహిని చందురుకావి రవికెను బంగరు
గిండ్లి భంగిగను బాలిండ్లు తనరఁ
జారుకొప్పునఁ బూలసరులుసొంపును జూప
ముంగురుల్ నుదుటను మురువుఁదెల్పఁ

తే. గర్ణ కంఠాభరణ కరకంకణములు
వరశిరోభూషణంబులు సురుచు లెసఁగ
మందహాసంబు సేయుచు మహితవినయ
ధన మొసంగుచుఁ జూచుచుఁ దనువు మెఱయ. 131

సీ. భాసుర నాసికాభరణంబుతోఁ గూడి
బింబాధరముకాంతి పిక్కటిల్లఁ
దీరగు కస్తూరితిలకంబుతోఁ గూడి
నిటలతటద్యుతుల్ నివ్వటిల్ల
నెలవంక బొమలును నేత్రాంజనము సరి
గా సొగసై నీలకళల నీనఁ
బరిమళగంధలేపనముతో నెనసి స
త్కుసుమసౌరభము దిక్కులను నెఱయ
తే. హంసగతి నొప్పు నుదధిదుగ్ధాబ్ధినుండి
వెడలి మునువచ్చి హరిచేరు విధముగాను
రమ్యతరమైన పద్మసరస్సు వెడలి
శ్రీరమాసతి పతిచెంతఁ జేరి నిలచి. 132

క. మును తనకు నివాసంబై
తనరెడు హరి యురమునందుఁ దనకరములఁ జం
దన మలఁది మోహముం దగ
మనమున భక్తియు నెసంగ మాన్యత మెఱయన్. 133

సీ. తులసీదళంబులు దూర్వాంకురంబులు
మల్లెపూవులును జేమంతిపూలు
మొల్లలుతోఁ గడు మోదంబు దనరు పూ
దండ యొక్కటిఁ గట్టి తనివిఁ దీరఁ
గరములతో నెత్తి కంకణంబులు మ్రోయ
హరికంఠమం దుంచి యచట నిలిచి
యున్న లక్ష్మిం జూచి మన్ననఁజేసి తా
హస్తంబునంబట్టి యల యురమునఁ

తే. జక్రధరుఁ డుంచుకొనియె నాసమయమునను
వారిశిరములపైఁ బుష్పవర్షములను
దొడరి గురియించి దేవదుందుభులు మొరయఁ
జేసి హరిచెంత జిష్ణుఁడు చేరి మ్రొక్కె. 134

సీ. ఆడిరి రంభాదు లంబరంబున నిల్చి
పాడిరి గంధర్వపతులు సతులు
తుంబురు నారదాదులు వీణమీటి గా
నములు చేసిరి కడు నయము మెఱసి
కశ్యపాది మునీంద్రఘనులు వేదాంతర
సూక్తులఁ బొగడిరి భక్తవరులు
మఱి గొనియాడిరి మాన్యతగాం గిరి
జా సరస్వతు లొగి భాసురముగ

తే. మంగళారతు లిచ్చిరి మంగళమని
శంకరుండును బ్రహ్మయు సదమలాత్మ
లగుచు నేసలు చల్లిరి యమరవరులు
కీర్తిఁ బ్రకటించు చెలమి మ్రొక్కిరి దొడంగి. 135

వ. అప్పుడు విష్ణుం డానందసుధాంబుధి నోలలాడుచు నిజరథంబు నెక్కి శ్రీకాంతతో శ్రీవేంకటాచలారోహణంబు సేయుచుండె, నాసమయంబున బ్రహ్మేంద్రాదు లా లక్ష్మి యుదయించిన పద్మసరస్సునం దీకార్తిక శుద్ధపంచమిదినంబున జనులు స్నానంబు చేసిరేని వారలకు లక్ష్మీకటాక్షంబు గల్గు నని తత్తీర్థంబునం దాము మునింగి యాస్వామి వెనువెంట నరిగిరి. శ్రీస్వామి వరాహస్వామియనుమతంబున విష్వక్సేనాది పరమ భాగవతు లలంకరించియున్న నిజనివాసము చేరెనప్పుడు

పద్మావతి సకలభూషణాంబరాలంకృత యై తదానందనిల
యంబునం బ్రవేశించి హరికి సిరికి నమస్కరించె, నంతఁ బద్మా
లయ పద్మావతిని దీవించి చెంత నుంచుకొని వకుళను విశ్వా
సంబుఁ జూపి యిచ్ఛామాత్రంబున సకలపదార్థంబుల నాకర్షించి
బ్రహ్మాదులకు విందు చేయించి సువస్త్రభూషణాదుల నొసంగి
సంతుష్టులంజేసి మునులను గౌరవింప, నందఱు తమ నివాసం
బుల కరిగిరి, వెన్నడి వేంకటేశ్వరుండు లక్ష్మీ పద్మావతుల
తోడం గూడి సుఖంబుండి యొక్కనాఁడు వినోదంబుగ లక్ష్మిం
జూచి యిట్లనియె. 136

తే. శ్రీరమాదేవి నీవు వచ్చినకతమున
నాకు సంతోషమయ్యె నానాఁడు ధనదు
చేతఁ దీసిన ఋణము దీర్చెడునుపాయ
మేమి నాకిప్పు డెఱిఁగించు మిందువదన. 137

క. అనుచు వినోదంబుగ నా
వనజాక్షుం డడుగ నపుడు వనజాలయ యి
ట్లనె ఋణము సేయునప్పుడు
నను నడిగితివే యటంచు నగి మఱి పలికెన్. 138

మ. అనఘా పెండ్లికి నేను వచ్చినపు డిం దర్థంబు లేదంచుఁ జె
ప్పినఁ దప్పే మఱి చెప్పిన న్ధనము నేఁ బ్రేమారఁగా నిమ్మనే
నను నీ వప్పుడు తేరఁజేసి ధనదు న్నా పెండ్లి కీ వర్థ మి
మ్మని యాచించి ఋణంబు సేయుపని కేమందుఁ జగన్నాయకా.

క. అపు డఱమఱఁ జేయఁగఁ గద
కపటాత్ముఁడ ననుచుఁ దెలిసి కరవీరపురం

బుపశమముం జేరితి నొగిఁ
జపలతఁ బాతాళమునకుఁ జనుట మహాత్మా. 140

ఉ. నావుడు వెన్నుఁ డిట్లనియె నన్నెడఁ బాసినజాలిచేత నే
నీ వతిచింత నొందఁగను నెమ్మి ధనంబును గూర్చి పెండ్లికిం
గావలెనంచు నిన్నడిగి కైకొనలేదు కడంగి యోరమా
దేవి మఱద్ది తప్పనుచుఁ దేరగఁ జూడకు మింకఁ బల్కఁగన్

శా. ఆమాటల్ విని లక్ష్మి యిట్లనియె నాఁ డారీతి నయ్యెం గదా
యామీఁదం దడవైన వడ్డి బహువై యాపత్తురాదేమి నీ
కీ మర్యాదను నిల్పనుండిన ధనం బీవేళ నే నిచ్చెదన్
స్వామీ వానిబుణంబు దీర్చు మనినన్ సంతోషసంయుక్తుఁడై.

సీ. హరి యిట్టు లనె నీమహామహిమంబు నే
నెఱుఁగనె మును క్రొత్త యేమి తలఁప
నిపుడు కుబేరుని కీవర్థ మీనేల
నానాఁటి వడ్డి నిర్ణయముగాను
గ్రమముగ నిచ్చుచుఁ గలియుగాంతంబునం
దంతయుఁ దీర్చి విశ్రాంతి నొంది
వైకుంఠపురిఁ జేరవచ్చునంతకు శేష
శైలమందుండి భూజనుల నెల్లఁ

తే. బాలనముచేసి వారిపాపముల నింకఁ
బరిహరింపుచు రక్షింప వలయు నెలమిఁ
గాన నయ్యప్పు తలఁప శీఘ్రంబ యీయ
వలద దెట్లన్న విను ప్రేమ వఱల నిపుడు. 143

సీ. కలియుగంబునఁ బాపకర్మంబు లొనరించు
ప్రజకు రోగాది తాపత్రయములు

కల్గఁగ వెఱచి తత్కాలంబుగా నన్నుఁ
జేరొ్కంచు కడు మొరల్ వెట్టునపుడు
వారియాపదలు నివారించి బ్రోవక
నే నూరకుండుట నీతిగాదు
గనుక యానరుల దుష్కర్మము ల్వారి ద్ర
వ్యంబుపై నాకర్షణంబు చేసి
**తే.** వచ్చు నాపదలను దీర్చి వారిధనము
నేను గొండకుఁ దెప్పించి నిస్పృహుండ
నగుచుఁ దత్పాపరూప మైనట్టిధనము
మూఢజనులకు నిప్పింతు మొనసి వింటె. 144

**తే.** ఎలమిఁ బుణ్యాత్ము లైనవా రిచ్చినట్టి
ధనమునం గొంతఁ గైకొని ధనదునకును
గొంత వడ్డికిఁ జెల్లించి వింతలీల
లెసఁగఁ జేయుట మేలంచుఁ బొసఁగఁ బల్కి. 145

సీ. మఱల నిట్లనె నో రమాదేవి ద్రవ్యంబు
నెల్లవారికిని నీ విచ్చుచుండు
మా ద్రవ్య మిచటికి నాకర్షణముచేసి
సుజన దుర్జనుల కిచ్చుచుఁ గ్రమంబు
గాఁ బ్రభుత్వము నిందుఁ గడపుచు నీకలి
కాలంబు మానంబులీల నడుప
వలయుఁ గావున ధనపతికి న ప్పిప్పుడ
తీర్చఁ గూడదని నేఁ దిరముగాను
తే. వ్రాసియిచ్చితిఁ గడువిడి పత్రమలర
దాని నిప్పుడఁ జెఱుపంగఁ దలఁపనేల

మఱియు మొదలీయనేల నెమ్మదిగ నుండగ
విని రమాదేవి హరిఁ జూచి వెలయఁ బల్కె. 146

క. దేవా మీచిత్తమునం
దీవిధమునఁ దలఁచి యుండి యీఋణ మింక నే
నేవిధమునఁ దీరుతు నని
యావేళ వినోదలీల నడిగిన దేవా. 147

క. అనుచు రమాపతి యడుగఁగ
విని హరి యిట్లనియె నీవు విత్తము ప్రజకుఁ
ఘనముగ నిచ్చిన నది నా
కొనియెద నని నిన్ను వేఁడుకొంటిని లక్ష్మీ. 148

వ. అనిన విని లక్ష్మీదేవి యిట్లనియె 149

క. మన మలరఁగ నే ద్రవ్యం
బనఘా నీకిత్తుఁ దీర్చుమా ఋణమనినన్
వినక పరస్పరముగ భూ
జనులకు నే నియ్య ననెడి సరణిం జెపుమా. 150

సీ. అన విని మఱల నిట్లనియె నో ప్రాణేశ
కలియందు నరులెప్డు గఠినహృదయు
లగుచు దానములు నేయరు గాన జన్మజ
న్మాంతరంబులను జంద్రాంశ నొంది
వెళియింతు రటువంటి నరులకు ధనము నీ
వీయు మటన్న నే నీయలేను
వరద నీకెంత ద్రవ్యంబైన నిచ్చెద
నీవె వారల కిమ్ము నెనరు మించి

తే. యనఁగ హరి యిట్టు లనియె మోక్షార్థులైన
వారలకు ముక్తి కోరికల్ కోరి పుణ్య
కర్మములు సేయువారి కాకర్మఫలము
లిచ్చి రక్షించు నదియ నాకిష్ట మతివ. 151

సీ. కలుములచెలి నీవు గావునఁ గలుము లి
చ్చెడుపని నీవంతు చెలఁగి వారి
మెండు రూకల నాక్రమించి యాపదల ని
వారించి సంతానవరము లొసఁగి
సంతసించుటకు నా వంతని పల్కఁగ
హరిని వీక్షించి యి ట్లనియె లక్ష్మి
మనుజులు దానధర్మపరోపకారముల్
చేయరు వారికి సిరుల నొసఁగు

తే. టెల్ల వా రది దెచ్చి నీ కిచ్చుటెల్ల
ధనము గల్గఁగనే దంభ దర్పలోభ
ములను బెంచుదు రా ద్రవ్యమును నిజముగ
నీకు నొగిఁ దెచ్చి యిత్తురే నీరజాక్ష. 152

వ. అనిన విని హరి శ్రీలక్ష్మింజూచి నీవు చెప్పినయట్లు కలియుగము నందుఁ బుట్టిన నరులట్లు లోభు లగుటకు సందియంబు లేదు నిక్కంబగు నందొక్కయుక్తి గల దది యెట్లంటివేని జనులు పాపంబులు సేయుదురు. దాన రోగాది బాధల ననుభవింతురు. అట్టి కాలంబున నన్నుఁ దలంతుర్లు. అపు డవ్వారి స్వప్నంబులం బ్రత్యక్షంబై వారి కలిమికొలఁదిగ ముడుపులు గట్టించి తద్విత్తంబునకు నధికంబుగ వడ్డి పెచ్చు పెఱుగనిచ్చి ప్రతివత్సరంబున వారిని దండించి యీ వేంకటాద్రికిఁ

దోడ్కొని వచ్చి వారుదెచ్చిన ధనంబు నీక్షించి పుణ్యపాప విత్తంబుల నేర్పరించి సుజన దుర్జనులకుఁ బంచిపెట్టించి నాకు సంతర్పణంబు సేయుండని యాచించి వారిచేత నన్నదానంబులం జేయింపుచు నందున వారి ద్రవ్యాన్నదానంబులు చేసినవా రగుచుండురు గావున వా రొసర్చిన స్వల్పదానంబైన నధికంబుగ నెంచి నీవు వారికి ధనధాన్యంబు లిచ్చుచుండవలయు, నేను వారికి నయభయంబులం జూపి తద్ద్రవ్యాన్నంబు లిచ్చుటకిఁ దెప్పించి వారిచేత దానంబులుచేయింపుచుండవలయు నీ వేంకటాద్రియందుఁ జేసిన దానంబులకు నధికఫలంబుల నిచ్చు నందు నేనీ యుక్తి పన్నితి నీయుక్తి చేయకుండినఁ గలిపురుషుండు సకలధర్మంబులం జెఱచి ప్రజల ననేకవిధంబుల బాధించి నరకంబులం ద్రోయించుం గావున మదంశసంభవులైన జీవుల కలికాలంబులం దీప్రకారంబు రక్షించుకొఱకు నే నీ యద్రియందు నిలిచితి నీవును నాకుఁ దోడ్పడి మదర్పణంబులు సేయుటకై ప్రజలకు భాగ్యంబుల నిచ్చుచుండుమని నిన్నుఁ బ్రార్థించితి నీ విప్పుడ కుబేరుని యప్పు దీర్చితివేని నే నిందు నిరుద్యోగంబుగ నుండవలయు నట్లూరకుండుట ధర్మంబుగాదు గావున నీవిపు డిట్టి యుద్యోగంబు నాకొసంగుమనిన విని నవ్వి లక్ష్మీదేవి యిట్లనియె. 153

సీ. ధీన్యాత్మ నీతోడ దబ్బ రాడఁగరాదు
చెప్పెద నిప్పుడ సిద్ధముగను
మహియందు దానధర్మపరోపకారము
జ్జేసి నీ కర్పణ చేయుచున్న

వారికి ధనధాన్యవరసంపదల నిత్తు
నందున లోభపాపాత్ము లైన
నరులధనంబులు నానాఁట నశియింపఁ
జేయుదు నది వృద్ధి చేయ ననుచు

తే. హరికి సమ్మతముగఁ జెప్పి నరులకెల్ల
సంపదల నిచ్చుచుండె నాసమయముునను
సకలజనములు వేంకటాచలము చేర
వచ్చి ధనరాసు లాస్వామి కిచ్చి మ్రొక్కి. 154

వ. అదియునుంగాక శ్రీనివాసార్పితంబుగ ననేకబ్రహ్మాదులకు సకల దానంబులు చేసి యిహపర సౌఖ్యంబు లనుభవింపు చుండి రా శ్రీనివాసుండు సకలజనుల నెలమి రక్షించుచుండె నని దేవదర్శనుండు చెప్పిన విని సంతసించి క్రమ్మఱ దేవలుం డిట్లనియె. 155

సీ. ఘనదేవదర్శనముని శుకాశ్రమమందుఁ
దపనీయచేలుండు తపముసేయు
నప్పు డాయోగీంద్రుఁ డందుండెనో లేదొ
యనిన దేవలున కిట్లనియె నతఁడు
విను విప్ర హరి తపం బొనరింప కట మున్నె
బ్రహ్మపదానందభరితుఁ డగుచు
శుకయోగిచంద్రుఁడు సూర్యమండలమునఁ
జొరఁబడి పో చూచి సూర్యుఁడతని

తే. నిల్పి యిట్లని పల్కె నోనిర్మలాత్మ
నీకు గురుఁడైనవ్యాసుఁ డీలోకమునను

నిన్ను వెదకుచునుండఁగ నీవు నింగి
కెగిరిపోవుట పాడిగా వెట్టులనిన. 156

క. నీవాశ్రమధర్మములను
బోవిడిచి మహావిరక్తిఁ బొందుట తగునే
దేవర్షిపితృఋణంబులఁ
బావనమతి వగుచు దీర్చి పై కరుగు మయా. 157

సీ. ఆదియం దమరంగ వేదముల్ చదివితి
వందుచే ఋషిఋణం బపుడ తీఱె
సతి నింకఁ జేఁబట్టి సవనముల్ గావించి
ధీరుఁడవై దీర్చు దేవఋణము
పుణ్యాత్ము లగునట్టిపుత్రకులను గాంచి
పెంచి క్రక్కున దీర్చు పితృఋణంబు
కొంకక ఋణవిముక్తుండవై జ్ఞానివై
మహి విరక్తుండ వై మఱల నిటకు
తే. వచ్చి నామండలము దాఁటి హెచ్చి పైకిఁ
క్రమముగాఁ బోయి మీఁదిలోకములు గడచి
పరమపదమును జెందుమో పరమమౌని
యనినఁ జిఱునవ్వు నవ్వి యిట్లనియె శుకుఁడు. 158

వ. నీ వాదిత్యుండవు త్రిమూర్త్యాత్మకుండవు కర్మసాక్షివి జగచ్చ
క్షుండవు భాస్కరుండవు నీచిత్తంబునకుఁ దెలియనియర్థంబు
లే వైన నాఘనంబునం దోఁచినయర్థంబు విన్నవించెద నెట్ల
నిన మాతృగర్భంబు సొచ్చి దేహధారినై భూమియందు
నుదయించిన దినంబు మొదలుకొని యుదయాస్తమయ
వ్యాజంబునఁ బురుషాయువును గాలంబు వంచించి కొంపోవు

చుండును గావున జలబుద్బుదంబున నిత్యంబుగాని దేహంబు నందుండి చతురాశ్రమంబుల నడపి దేవఋషి పితౄణం బులం దీర్చి జ్ఞానవైరాగ్యంబు లభ్యసింపవలయు నంటిరి వేదోక్త కర్మ మర్యాద యగుం గావున నాచరింపందగు నైనను దేహం బనిత్యం బైనందున ముముక్షుం డైనవాఁడు కర్మారణ్యంబునం బ్రవేశింపఁ డనిన శుకుం జూచి సూర్యుఁ డిట్లనియె. 159

శా. ఆదిన్ విశ్వము వృద్ధిసేయుటకుఁ బద్మాక్షుండు గల్పింపఁగా
వేదోక్తాశ్రమ ధర్మకర్మతతి భూవిఖ్యాతమై యుండఁగాఁ
గాదంచు న్విడనాడి నీ వెగిరిపోఁగా వచ్చునే యంచు న
య్యాదిత్యుండువచింపఁగాశుకుఁడు నెయ్యంబొప్పగానిట్లనెన్.

సీ. వనజాప్త విను సర్వవర్ణాశ్రమాచార
ధర్మంబులును మోక్షధర్మములును
మాతండ్రి బోధింప నాతత్వవిజ్ఞాన
మాత్మయం దుదయించె నపుడ గురుని
గాంచి యిట్లంటి నిక్కంబుగఁ బ్రథమాశ్ర
మమున నాత్మవివేక మమరఁ గలిగి
నట్టివాఁ డావలి యాశ్రమధర్మముల్
విడువఁగ వచ్చునో విడువరాదో

తే. తేటగా నిశ్చయము నాకుఁ దెలుపుఁ డంచు
నేను బ్రార్థింపఁగాఁ జూచి నెనరుచేతఁ
జెప్పఁజాలక మిథిలేశుఁ జేరి యడుగు
మనఁగ నేఁబోయి జనకు నట్లడుగ నతఁడు. 161

సీ. నను జూచి పలికె నో మునివర విజ్ఞాన
మబ్బుటకై చతురాశ్రమములు
నడిపింపఁగావలె నాటిన జన్మజ
న్మాంతరవాసన నంటినట్టి
సదమలవిజ్ఞాన ముదయించినప్పు డా
శ్రమధర్మకర్మముల్ సల్ప కపుడ
పట్టైన స్వస్వరూప పరస్వరూపముల్
దెలిసి వర్ణాశ్రమాతీతుఁ డగుట
తే. విహితధర్మం బటంచును వీఁకఁ జెప్పె
నది మొద ల్గాఢవైరాగ్యమందుఁ బొంది
నట్టినన్ను గృహస్థుఁడ వగుమటంచు
నింతగా నిందు మీరానతీయఁ దగునె. 162

చ. అని శుకయోగి వల్క విని యంబుజమిత్రుఁడు నవ్వి యిట్ల
నెన్, జనకుఁడు జ్ఞానకర్మముల సల్పుచు సర్వసమత్వ మొంది
భూ, మిని బరిపాలనం బెపుడు మెచ్చఁగఁ జేయుచు నుండి
బిడ్డలన్, గనినటువంటివాఁడు నిను గాఢవిరక్తిని బొందఁ
జెప్పెనే. 163

సీ. హరియందుఁ బద్మజుం డజునియందు వసిష్ఠుఁ
డామునినాథునియందు శక్తి
శక్తియందుఁ బరాశరుఁ డాఘనునియందు
వ్యాసుఁ డావ్యాసునియందు నీవు
పుట్టి విరక్తిని బొంది యూరకపోక
పుణ్యాత్ముఁ డైనట్టి పుత్త్రు నొకని

గాంచి ధరిత్రిపై నెంచవచ్చిన నిన్నుఁ
బోనిత్తు నందాక పోవఁగూడ

తే. దంచు సూర్యుండు వల్కఁగ నాశుకుండు
సమ్మతించుచు నిజతనుచ్ఛాయ నొక్క
పుణ్యపురుషునిగాఁజేసి బుద్ధి నిచ్చె
నప్పు డాపురుషుండు మహాత్ముఁ డనుచు. 164

చ. శుకునకుఁ బద్మమిత్రునకు సుస్థిరుఁడై ప్రణమిల్లి భక్తితో
ముకుళితహస్తుఁడై నిలిచి ముందరనుండఁగఁ జూచి సూర్యుఁ
డా, శుకముని యోగసిద్ధి కతిచోద్యము నొందుచు సంతసించి
తా, నకుటిలచిత్తుఁడై జనితుఁ డైనకుమారుని చూచి యిట్ల
నెన్. 165

క. మాయగ శుకమునిదేహ
చ్ఛాయను బుర్షుండ వగుచు జనియించిన నీ
వీయవనీస్థలి నరుఁడుగ
ఛాయాశుకుఁ డనెడుపేరఁ జరియించు మయా. 166

క. అని సూర్యుఁ డానతిచ్చిన
విని ఛాయాశుకుఁడు చాల వినయము మీఱన్
వినుతించి యవల నాశుకుఁ
గనుఁగొని యిట్లనియెఁ జాల గౌరవ మొప్పన్. 167

క. జనకా నన్ను సృజించిన
పనియే మిపు డానతిచ్చి పంపుఁ డటంచున్
వినయంబున మ్రొక్కినఁ గనుఁ
గొని ఛాయాశుకున కాశుకుం డి ట్లనియెన్. 168

సీ. పుణ్యాత్మ నీవింక భూలోకమున కేగి
శ్రీవేంకటాద్రి దక్షిణముగాను
ముఖ్యమైన సువర్ణముఖరికి నుత్తర
తటమున నెల్లు సిద్ధస్థలమున
మహిమ నొప్పు మదాశ్రమంబున నీవుండు
మదిగాక శ్రీగంగ కరిగి మాకుఁ
దండ్రియైనట్టి వేదవ్యాసముని నన్నుఁ
జేరఁ గన్న నపు డతిప్రేమ మీర

తే. నీవు నారీతిగా నందు నిలిచి పలికి
చెలఁగి వారికి శుశ్రూష చేసి వారి
యనుమతిం బెండ్లియాడి నందనులఁ గాంచి
కులము నభివృద్ధిసేయుము గొప్ప తనరి. 169

తే. ఇపుడు ముందుగ శ్రీకాశి కేగి యచట
నచలభక్తిని బాదరాయణుని గొన్ని
వత్సరంబులు గొలిచి యవ్వల మదాశ్ర
మస్థలంబునఁ జేరు కుమార యనుచు. 170

సీ. వానికి నియమించి వసుధకుఁ బంపించి
పంకజాప్తుని గాంచి పల్కె నిట్లు
మార్తాండ నీకృపామహిమచే సుతుఁ డుద
యించె నన్నింకఁ బోనిమ్ము మనిన
నగి సూర్యు డిట్లనె నాస్వరూపంబగు
జీవతత్వం బెద్ది చెప్పు మనిన
శుకుఁ డిట్టు లనె జగజ్జ్యోతిస్వరూప నీ
చిన్మాత్రసత్తె నేఁ జెప్పఁగలనె

తే. నాకుఁ దోఁచినయంత నిర్ణయముగాను
మద్గురునిసత్కటాక్షసన్మహిమచేత
విన్నవించెద మదిని భావించి యంచుఁ
బద్మబాంధవునకు మ్రొక్కి పలికె గరిమ. 171

వ. నారాయణపరబ్రహ్మంబను చిద్బిందువువలనఁ బ్రణవస్వరూపంబైన శబ్దంబు పుట్టె నాశబ్దంబువలన బయలైన నభంబునందు స్పర్శవలన వాయువు పుట్టె నవ్వాయువు గగనసంబంధముచేత నుష్ణరూపంబగు తేజంబుగలిగె నం దగ్ని జనించె నయ్యగ్ని యధికంబై ప్రకాశించి తనయందు వ్యాపింపఁగ నాబిందువు రసాత్మకంబగు సారమును మహాజలముగ సృజించి తేజోరూపంబగు నప్పరమాత్మ తా నామహాజలమునందు నిలిచె నది యె హిరణ్యమయంబగు తేజంబై కొంతకాలంబునకు నారికేళవృక్షంబులు ఫలంబులు నొందుచందంబున ననేకకోటి బ్రహ్మాండంబులలో నొక్కొక్క బీజము వృక్షఫలంబులం దనేక బీజరూపంబై నిల్చినట్టుగ మూలకారణంబైన హిరణ్మయ తేజస్సు సూర్యరూపంబై స్థావరజంగమాత్మకంబైన జగత్తును దనరసాంశమువలన జీవనమై పోషింపుచును, తేజాంశమువలన హరింపుచును వటబీజము భూజలసంబంధముచేత వృక్షాకృతియై వృక్షములో రసరూపమై నిలిచినట్లు హిరణ్మయ తేజస్సు సప్తద్వీప సప్తసాగర సప్తకులాచలాధారంబైన బ్రహ్మాండంబుగఁ బరిణమించి సూర్యరూపంబై నిలిచియున్న యది. ఆ స్వరూపంబు సకల భూతంబులయందును రసరూపమైన జీవంబగు నారసమునంద తైలవర్తియందు జ్వాల వెల్గినట్లు తెలివి వెలుఁగుచుండు నాతెలివియ తన్ను ను జెవుల వినిన

శబ్దంబులను జర్మంబువలనం దెలియు స్పర్శంబులను గన్నులవ
లనం జూచు రూపంబులను జిహ్వచేత గ్రహించిన రుచులను
ఘ్రాణంబువలన నాఘ్రాణించిన గంధంబులను గర్మేంద్రియ విష
యంబులైన వచనదానగమన విసర్జనానందంబులను మనోబుద్ధి
చిత్తాహంకార విషయంబులైన సంశయ నిశ్చయ విచారకర్తృ
త్వంబులను దెలియు నెఱుకయ చిన్మాత్రంబైన స్వస్వరూపం
బగు నింకం బరస్వరూపం బెద్దియనిన వ్యష్టిసమష్టిరూపంబు
లైన పిండాండ బ్రహ్మాండంబులయందు నేకరూపంబై వ్యష్టి
సమష్టిరూపంబులయందు మేఘమండలమందలి జలము వర్షిం
చిన భూమియందుం గల వాపీకూప తటాకాదులయందు నిలచి
న చందంబున నీశ్వరచైతన్యంబను మేఘజలంబు జరాయుజాం
డజోద్భిజస్వేదజంబు లను జతుర్విధభూతములయందు నిల్చి
యుండుననిన భాస్కరుం డిట్లనియె. 172

తే. ఆ హిరణ్మయతేజ మీ యఖిలభూత
వితతులందున నెట్లు ప్రవేశ మగును
మఱల స్వస్థానమున నేక్రమమునం జేరు
నానవఱిం దెల్పు బాదరాయణకుమార. 173

వ. అనిన శుకుం డిట్లనియె. 174

సీ. కమలజాండమును బ్రకాశింపం జేయుచు
రమణీయ విశ్వకారణము నైన
మహిత హిరణ్మయమండలం బధికతే
జోరసాత్మకమై విశుద్ధ మయ్యె
నందు రసాంశ మాయమృతాంశరూపమా
నది కాలవశమున ననిల మగుచుం

దా. మేఘ మగుచుఁ జంద్రరసాత్మకంబైన
జలముచేఁ బూర్ణమై చల్లనగుచు
తే. వర్షధారలు నిండింప వసుధయందు
సస్యములు వృద్ధిఁబొందు సస్యములయందు
సారతరమైన ఘనజీవసత్త్వ నిలిచి
ధాన్యమై మర్త్యతతుల కోదనము నగును. 175

వ. మఱియు దృఢరూపమై పశువుల కన్నం బగు వివిధఫల రూపంబుల నొంది విహంగాది జంతువుల కన్నంబగు వాయు రూపంబై సర్పాదుల కన్నంబగు నయ్యన్నంబు తత్తద్భూతంబులయందుండు జఠరాగ్నివలనం బచనంబై పాలలోఁ ఘృతంబు పైకిఁ దేలినవిధంబున బిందురూపమై పురుషులయందు నిలిచి స్త్రీగర్భంబులం జొచ్చి పిండరూపంబగు తత్పిండంబుల యందు జరాయుసంబంధమువలన మాతృధాతృ సంబంధము వలన పాణ్ణాసంబులు వచ్చి దానియందుఁ బ్రకాశించుకరణిఁ జైతన్యంబు దీపించుఁ దదనంతరంబు గాలకర్మపరిపూరితంబైనతఱి నుదయించు, మఱియు నవ్వర్షజలంబే వృక్షాదుల యందు రసాత్మకంబై జీవనంబగు నీ యుత్పత్తిప్రకారం బింక లయప్రకారం బెట్లనిన, వాత పిత్త శ్లేష్మాది రోగంబులవలన భూతంబులు లోఁబడినప్పుడు పల్లముల నిలచిన వర్షజలంబుల సూర్యకిరణంబులు పీల్చుకరణిఁ గాలస్వరూపమగు సూర్యుఁడు సర్వభూతంబుల యందలి జీవరసంబుం బీల్చి పోవునప్పుడా రసస్వరూపంబు సూర్యకిరణంబులందు మిళితమై వాయుమండలంబున నేకమై గగనమార్గంబునఁ జంద్ర మండలంబునం జొచ్చి చంద్రుఁడు సూర్యునియం దేకీభవించి

నప్పుడు సూర్యునియందుఁ జెందునని మద్గురుం డుపదేశించె
ననిన విని సూర్యుం డి ట్లనియె. 176

తే. దేవ రాక్షసముఖుల సుస్థితిలయముల
వరుసగాఁ జెప్పు మనఁగ నవ్యాసుసుతుఁడు
జలజబాంధవు నీక్షించి సంతసించి
మఱల నిట్లని పల్కె నెమ్మనముగాను. 177

వ. దేవా వటబీజంబునకు భూసంబంధం బొక్కటి యైనఁ గాని వ్రీహిపరిణామంబు షాణ్మాసంబులను వటపరిణామంబు సహస్ర సంవత్సర పర్యంతంబు గల దాప్రకారంబు బ్రహ్మాది దేవశరీర ములకును మనుష్యశరీరంబులకును గాలభేదం బున్నయది, ఆహిరణ్మయ తేజస్సత్త్వాంశం బధికంబుగాఁగ నిలావృత ఖండాది దేశంబులయందు దేవజాతులు తృప్తిరై దీర్ఘా యుష్మంతులై వర్తింతురు. సామాన్యదేవజాతులకు సుర్మా వధియు నింద్రాదులకు మన్వంతరావధియు బ్రహ్మాదులకు బ్రహ్మాండప్రళయావధియుఁ గల్గియుండు నంతటికి నాధారమై సచ్చిదానంద నిత్యపరిపూర్ణుండై వాఙ్మానసాతీతుం డైననారా యణుండు ప్రకాశించుఁ దత్ప్రకాశంబు నీవ నిశ్చయించి యుందువని మఱియు సకల వేదాంతసార నిశ్చితార్థానుభవ క్రమంబు విన్నవింప విని సూర్యుండు శుకుం జూచి యిట్లనియె.

సీ. ఓ మహామౌనీంద్ర నీమనోదార్ఢ్యంబు
యోగసిద్ధియుఁ దెలియుటకుఁ జాల
నాక్షేపములుచేసి యడిగితి నన్నిటి
కన్నియుత్తరము లి వనుభవముగఁ

జెప్పితి వందుచేఁ జిత్తంబు రంజిల్లె
మహితాత్మ నీవు నామండలంబు
లోఁ జొచ్చి వెడలి పై లోకంబులను దాఁటి
పట్టిపైనుండెడు పరమపదము
తే. నందుఁ బొందు మటంచు నయ్యబ్జసఖుఁడు
చాల మన్నింపఁగా శుకసంయమీంద్రుఁ
డచలితానందరసమగ్నుఁ డగుచు లేచి
దినకరునిమండలంబు భేదించి వెడలి. 179

వ. తదనంతరంబున నూర్ధ్వమండలంబుల నూర్ధ్వలోకంబుల నతిక్రమించి శుకుండు నిర్వాణపదంబు నొందె నంత ఛాయా శుకుండు కాశి చేరి వేదవ్యాసులకు వివిధశుశ్రూషాదులు చేయుచుండి కొన్నియుగంబుల కాకృష్ణద్వైపాయనుని యనుమతంబున శుకాశ్రమస్థలంబునందుఁ జేరి వివాహంబు చేసికొని సంతానంబు వడసె నని దేవదర్శనుండు చెప్పిన విని దేవలుండు విని యిట్లనియె. 180

తే. శ్రీరమాదేవి పూర్వశరీరకలిత
యై తపము కపిలాశ్రమమందుఁ జేయు
చుండె నంటివి మఱల నీయుర్విమీఁదఁ
జేరినటువంటికథ నాకుఁ జెప్పుమయ్య. 181

మ. అని యాదేవలమౌని తా నడుగఁగా నాదిత్యయోగీంద్రుఁ డి
ట్లనె నాదేవి సుశీలయై హృదయమం దాచక్రి నర్చింపుచుఁ
మనె మాస్వామిపదారవిందములపై మగ్నంబు గావించుచుఁ
దనదేహస్మరణంబు లేక జగముల్ దైత్యారిరూపంబుగన్.

క. భావించుచుఁ గొన్నేండ్లా
శ్రీవనితామణి తపంబు సేయఁగ నపు డీ
శ్రీవేంకటగిరినిలయుం
డా వెలఁదిని మెచ్చి తలఁచె నపు డీరీతిన్ 183

సీ. తనుఁగూర్చి తొలుతన తప మాచరించితి
నని నన్నుఁ గూర్చి యయ్యాదిలక్ష్మి
పాతాళమందె తపం బాచరించుచు
నను జిక్కఁబట్టియున్నది ధరిత్రి
పైకి వచ్చుట కేయుపాయంబు గావింతు
నని వీరలక్ష్మిహృదబ్జమందు
వెలిగెడితనరూపములను నచ్చుట్ల ఁటరో
ధాన మొందింపఁగ ధ్యాననిష్ఠఁ

తే. జలన మొందఁగ నప్పు డాశ్చర్య మొంది
కన్నుఁగవ విప్పి చూచి పంకరుహనాభు
నచటఁ గానక చింతించి యప్పుడు లేచి
కపిలమునిపాలి కరిగి శ్రీకాంత నిలిచె. 184

క. అప్పు డాలక్ష్మిని గనుఁగొని
కపిలమునీంద్రుండు మిగులఁ గరుణం బలికెం
జపలత్వరహిత మగునీ
తప మమలంబై ఫలించెఁ దామరసాక్షీ. 185

క. శ్రీక నీ విందుండక నని
ప్రకటితశేషాద్రి దిగువఁ బద్మసరసునం
దకుటిలమతివై చేరుము
శుకమునిసుతుఁడందు నిన్నుఁ జూచి ముదమునన్. 186

సీ. ఘనపాంచరాత్ర ప్రకారంబుగా నిన్నుఁ
బూజించు నచటికే పొమ్మటంచుఁ
బలికి పంపింపఁగఁ బాతాళమందున్న
శేషుండు లక్ష్మి నీక్షించి మ్రొక్కి
బహురత్నవిలసితాభరణాంబరంబులు
చందన సుమదామచయము లొసఁగి
రమణీయమగు దివ్యరథములోఁ దగు సహ
స్రారహేమాబ్జంబునందు వెలుఁగు
తే. కర్ణికాపీఠమున నుంచి గజచతుష్ట
యంబుతో వీడుకొల్ప నయ్యాదిలక్ష్మి
సంతసింపుచు మధ్యాహ్నసమయమునకు
ధరణి భేదించుకొనుచు మోదమున వచ్చి. 187

తే. మహిమతో నూటయెనిమిదిమంది సేవ
కాజనంబులు గొల్వఁగ ఘనత మెఱయ
శేషపర్వతమునకు దక్షిణముగాను
గలుగు స్వర్ణముఖరికిఁ దద్భాగమందు. 188

సీ. ఘనతరంగయుతంబు గంగోపమానంబు
నలినకైరవకోకనదయుతంబు
భాసురమకరందపానమత్తమిళింద
పటలవిహారంబు పావనంబు
మత్స్యకచ్ఛపభేకమకరకుళీరక
వ్రాతనివాసంబు శీతలాంబు
పూర్ణమలఘునోపానావృతంబును
స్వాదుగంధాఢ్యమై జగతి మీఱు

తే. రమ్యమైయున్న పద్మసరస్సునడుమ
వెలయు నావీరలక్ష్మి తా వెడలి రాఁగఁ
బారిజాతము లాలక్ష్మిపైన నించి
చెలఁగి జయజయశబ్దముల్ చేసి సురలు. 189

చ. పొగడుచు నుండఁగా జలధిపుత్త్రికదివ్యశరీరకాంతు లీ
జగతిని నిండి దిక్కులను సాంద్రముగాఁ బ్రసరించి పిమ్మటన్
గగనము నావరింప నదిఁ గాంచి ఫణీంద్రగిరీశ్వరుండు దా
ఖగపతి నెక్కి యచ్చటికి గ్రక్కున వచ్చెఁ బ్రమోదచిత్తుఁడై

క. అప్పుడు బ్రహ్మ శివాదులు
తప్పక యచ్చటికిఁ బోయి తమవాక్యతతుల్
గొప్పగ మొరయం జేయుచు
నుప్పొంగుచు లక్ష్మి లోచనోత్సవ మెసఁగన్ 191

సీ. చూచుచుఁ గార్తికశుద్ధపంచమి యుత్త
రాషాఢ భృగువార మమరఁ గూడ
యున్ననాఁ డరుదుగ వ్యూహమహాలక్ష్మి
హరికి ము న్బ్రత్యక్షమయ్యె నట్టి
విమలదినమునంద వీరలక్ష్మి ప్రసన్న
మయ్యె నందఱకు మహాదినంబు
ముఖ్యం బనుచు బ్రహ్మముఖ్యు లాలోచించి
ఫణిగిరీంద్రుని జూచి పలికి రిట్లు

తే. దేవ యీపుణ్యమైనట్టి తీర్థమందు
వెలయఁగా వ్యూహలక్ష్మియు వీరలక్ష్మి
వెడలివచ్చిరి గనుక నీవిమలతోయ
మవనిపైఁ బద్మతీర్థాఖ్యఁ నమరెఁ బొగడ. 192

వ. కావున న త్తీర్థంబున స్నానమాచరించిరేని సౌభాగ్యసంపన్ను
లగుదురని నిర్ణయించి యందఱు స్నానంబుచేసి యప్పద్మ
తీర్థంబున నాగ్నేయభాగంబున దివ్యాలయంబు విశ్వకర్మచే
నిర్మితంబు గావించి యావీరలక్ష్మిని బ్రార్థించి తోడ్కొనివచ్చి
సకల లోకోత్సవంబులతో నాలయంబునందుంచి ఛాయా
శుకునిచేతఁ బాంచరాత్రోక్తంబుగ సకలోపచారపూజలు
చేయించి రందుఁ జక్రి తనకంఠముననున్న పుష్పహారంబు
నవ్వీరలక్ష్మీకంఠంబునం దుంచి శుకాశ్రమంబు నగ్రహారంబు
గావించి ఛాయాశుకున కొప్పగించి బ్రహ్మాదులకు విందు
సేయించి వస్త్రతాంబూలంబు లిప్పించి సెలవిచ్చి వారి నంపించి
వీరలక్ష్మితో నిట్లనియె. 193

సీ. పద్మాలయా నీదు ప్రథమశరీరంబు
కనుఁగొంటి కన్నుల కరువుదీఱె
నీవ్యూహలక్ష్మితో నెనసి వేంకటశైల
మందుండ వచ్చు నీ వచటి కిపుడు
రమ్మన నారమారమణి చక్రికి మ్రొక్కి
పటుభక్తి దీపింపఁ బలికె నిట్లు
నాప్రాణనాయక నాకొఱకై నీవు
తపముచేసిన మహాస్థలము గనుక
తే. శ్రీకరంబైన దీ శుకక్షేత్రమంద
నిలిచెదను నాహృదయములో నీవు నిలిచి
వ్యూహలక్ష్మి నురంబుపై నుంచుకొనుము
నన్నిచట నుంచి రక్షించు నలిననాభ. 194

క. నాకిది యిష్టంబైనది
నీ కనుమానంబు వలదు నీఘనకరుణే
యీకాయమునం దుంచుచు
నాకనకాచలము సేరు మంబుజనయనా. 195

తే. నేను రాలేదనుచు మది నీవు కొదువ
నుంచవల దింక నేనె శ్రీవ్యూహలక్ష్మి
రూపమును దాల్చి వచ్చి నీరొమ్ముమీఁదఁ
గుదురుగా నిల్చి తీక నీకుఁ గొదువ యేల? 196

క. కరుణను బద్మావతి సం
దరమర లేకుండ యేలు మహిగిరిపైకిం
బరమజనుల రావించుచు
వరముల నొసఁగుచుఁ జెలంగు వనజదళాక్షా. 197

సీ. శుభకర కార్తికశుద్ధపంచమి వచ్చు
నప్పుడు నీవుప్పహార మొకటి
ప్రియమైనవస్త్రంబు ప్రేమతోఁ బంపించు
చుండుము నేను మహోత్సవముల
నంగీకరించి నాయాత్మలో వెలుఁగునీ
కన్నియు నర్పించి యచలమతిని
నిన్నుఁ జూచుచు నిందె నే నుండెదను మీరు
శేషాద్రిమీఁద వసించి యుండుఁ
తే. డంచుఁ బాదంబులకు మ్రొక్కినపుడు చక్రి
వీరలక్ష్మిని వీడ్కొని వేంకటాద్రి
చెంత నావ్యూహలక్ష్మితో స్నేహ మెసఁగఁ
గలసి క్రీడించుచుండె నుత్కంఠ మెఱయ. 198

చ. అప్పుడు శుకాగ్రహారవరమందు శుకుం డతిభక్తి మీఱఁగా
నెప్పుడు మహోత్సవక్రమము లిందిర కిచ్చుట నాచరింపఁగా
నపరిమితంబుగాఁ గలుము లందఱ కిచ్చుచుఁ బూజలందుచున్
విపులసుఖస్థితిన్ నిలిచి వీరరమామణి యుండె నచ్చటన్. 199

సీ. అంతకుముందుగ నాదిశుకుం డందుఁ
జేరినప్పుడ భూప్రసిద్ధముగను
బలరామకృష్ణుల భక్తిమై భావించి
యందుంచి పూజించి యతఁడు చనిన
వెనుక ఛాయాశుకుం డనెడు విప్రుఁడు పాంచ
రాత్రోక్తముగ రమారమణి నచట
నర్చింపఁ బరకాంత యగులక్ష్మి హరిచెంతఁ
జేరియుండక యిందుఁ జేరినపుడు
తే. నే నిచట నిల్చియుండుట నీతిగాదు
తిన్నఁగా లేచి యిప్పుడ తీర్థయాత్ర
చనుదు నని సీరి లేచె నాసమయమునను
బట్టి కృష్ణుఁడు గూర్చుండఁబెట్టె నతని. 200

క. అప్పుడు కృష్ణునిఁ గని బలుఁ
డప్పా కూర్చుండఁబెట్ట నర్హం బగునే
గొప్పైన పరసతి వేడ్కఁగ
నిప్పుడు దా నిందు నిలిచె నింపుఁ దలిర్పన్. 201

సీ. కావున నేను వేంకటగిరిపై కేగి
యందొక తీర్థంబు నాశ్రయించి
యుండెద ననఁగ నన్నొంటిగ నిందుంచి
యోయన్న పోనేల యుండు మిచట

ననినఁ గృష్ణుని జూచి హలపాణి పల్కె నీ
వును రమ్ము నావెంట ననఁగఁ గృష్ణ
దేవుఁ డిట్లనె రమాదేవి నిందొంటిగ
నుంచి నే వచ్చుట కుచిత మగునె

తే. యంచుఁ గృష్ణుండు పల్కఁగ హలధరుండు
పరఁగ నిట్లనెఁ గరవీరపురము జేరి
యొంటిగా నీమహాలక్ష్మి యుండినపుడు
నీవు తోడుగ నుంటివే నిర్మలాత్మ. 202

చ. అని హలపాణి పల్క నపు డల్లన నవ్వుచుఁ గృష్ణదేవుఁ డి
ట్లనె సిరి దవ్వుగా నిలచినప్పటిరీతిఁ దలంప నేల యిం
దొనరఁగఁ జేరి యున్న దిపు డొంటిగ నిచ్చట నుంచి నేను బో
యిన జను లైన నవ్వరె యహీంద్రగిరీశ్వరుఁడైన మెచ్చునే.

తే. మనకు భయమేమి యిచట రమాలలామ
విభవములు చూచుచుందము వేడ్క నిలచి
యనిన బలభద్రుఁ డామాట విని భయమును
జెంది శ్రీకృష్ణదేవు నీక్షించి పల్కె. 204

సీ. భృగుమునీంద్రుని పూర్వమగుడు నేయుచుఁ బర
పురుషుఁ డంచును మదిఁ బెరికియుంచి
హరిఁ బాసి కరవీరపురిఁ జేరి పాతాళ
మున కేగి విభుని చేతనె తపంబు
చేయించి తపము దాఁ జేసి యీస్థలమందుఁ
జేరి యిచ్చట నిల్చె వీరలక్ష్మి
యనఁగాఁ బ్రసిద్ధమై హరివలెనే చతు
ర్భుజములతో మహాస్ఫురణ మెఱయ

తే. నిలిచినదిగాక నేనిందు నిలువ వెఱతు
ననిన దరహాసితాస్యుఁడై యన్నమోము
గాంచి కృష్ణుండు పల్కె నోకామపాల
చూడ సిరియందుఁ గొదువలెంచుటనుదగునె? 205

సీ. వైకుంఠపురమందు వరమృదుతల్పమై
యున్నతాకృతిని నీ వుండినపుడు
హరిఁగూడి నీమీఁద నానందముగనుండు
నంతియకాని ని న్నన్యుఁడంచుఁ
దలఁచునె లక్ష్మి సీతాదేవి యైనప్పు
డిలను లక్ష్మణుఁడవై యెల్లయెడలఁ
జరియించునపుడైనఁ బరుఁడంచు నీమీఁద
నరమర నుంచెనె యనిన సీరి
తే. నవ్వి యిట్లని పల్కె నానాఁడు సీత
యన్నమాటలు మఱపు రాకున్నవిపుడు
సిరి రజోగుణమును దలంచినభయంబు
నామదిని బుట్టుచుండునో నందతనయ. 206

క. అని తాలాంకుఁడు పల్కఁగ
విని కృష్ణుం డిట్టులనియె విశ్రవసునిపు
త్త్రుని రామునిచేఁ జంపిం
పను బని గలుగంగ నట్ల పలికెఁ గదన్నా. 207

క. ఆమాటలు మఱువక యిపు
డీమాడ్కిని లక్ష్మి తప్పు లెన్నుచు మదిలోఁ
బ్రేమయు నుంచక యరుగఁగ
నీమహితాశ్రమము విడువ నేమిటి కనఘా. 208

తే. మించి సిరిమీఁద నిటుతప్పు లెంచ కిపుడు
శాంతమును బొందు మీశుకాశ్రమతలంబు
విడిచి పోవల దనుచు వివేకసరణి
నన్నతోఁ గృష్ణుఁ డేకాంత మాడుచుండె. 209

సీ. ఛాయాశుకుఁడు తనజనకుఁ డర్చించిన
రామకృష్ణుల రమారమణి నచట
నర్చించుచుండఁగ నపుడు గన్యామాస
మందు బ్రహ్మోత్సవం బప్రియందు
జరుపఁగా నటకేగి ఛాయాశుకుఁడు వీర
లక్ష్మి సేవకులైన లలితమతులు
మొనసి తా నొకమాట యెనుబడిమందిని
హరియాజ్ఞఁ బడసి వాహకులఁ జేసి
తే. శుకపురము చేరి రామకృష్ణులను వీర
లక్ష్మి నర్చించుచుండె నుల్లాస మెసఁగ
నచట హరి నిల్పినటువంటి యబ్జసఖుని
జేరి వైఖానసులపూజ నేయుదురని. 210

వ. ఇవ్విధంబున దేవదర్శనుండు దేవలునకుఁ జెప్పెనని సూతుం
జూచి శౌనకాదు లిట్లనిరి. 211

సీ. ఓ సూత యాశ్రీనివాసుని శేషాద్రి
యం దెవ్వరెవరు ము న్నర్చనములు
చేసి రాచందముల్ చెప్పఁగవలె నంచు
నాశౌనకాదు లి ట్లడుగునపుడు
విని సూతుఁ డిట్లనె మునినాథులార మీ
రతిశయ ప్రశ్న న న్నడిగినారు

చెప్ప శక్యంబుగా దిప్పు డావ్యాసగు
రుండు నాజిహ్వాయం దుండి దయను
తే. బరఁగఁ బలికించినట్లు నేఁ బలుకవలయు
ననుచు వ్యాసుని ధ్యానించి యచలుఁడగుచు
శౌనకాది మునీశ్వరసంఘమునను
జూచి సంతోషచిత్తుఁడై సూతుఁ డనియె. 212

సీ. వేంకటాచలమందు విధిరుద్రముఖులకు
హరి తాను బ్రత్యక్ష మైనయపుడు
కమలాసనుండు వైఖానససూత్రక్ర
మంబుగఁ దా నర్చనంబు చేసి
మొనసి కన్యామాసమున్న రథోత్సవము గా
వించె నాపిమ్మట విఖనసుండు
నర్చించె నమ్మునియాజ్ఞచేత మరీచి
యర్చించె నటుమీఁద నత్రి పూజ
తే. చేసెఁ గశ్యపుఁ డవల నర్చించె భృగుము
నీశుఁ డావల నర్చించె నెల్లమునులు
పూజచేసిరి యావలఁ బొసఁగ యతు
లంత స్వాయంభువను మను నవలఁ జేసె. 213

సీ. సమయంబునను సంధి సంవత్సరములతో
మొనయు ముప్పదికోటు లెనుబదియును
నాలుగులక్షల నలువదియెనిమిది
వేలయింటికి బ్రహ్మ విశ్వసృష్టిఁ
దాఁ జేయ నూహించి ధ్యానకాలముకోటి
యవి డెబ్బదియు లక్షలనుచుఁ బలుకు

నవి నలువదినాల్గు వే లబ్దములే గాక
నిల్చినయేండ్లు గణింప నరవిఁ
తే. గుదిరి యిర్వదితొమ్మిదికోట్లపదియు
మూఁడులక్షలు నదిగాక మొనసి పైన
నెనుబదియు నాలుగగు వేల నెన్నఁగూర్చి
భాగములఁ జేసిమూడఁ జొప్పడు నెసంగె. 214

తే. ఇన్ని ముప్పదికోటులు నెనుబదియును
నాల్గులక్షలు నదిగాక నలువదెనిమి
దైనవేలేండ్లకును బాగు నరసి కూర్ప
నందు బహుధాన్యవత్సరం బాదిగాగ. 215

వ. అలువదియెనిమిది చతుర్యుగంబులయింటి కప్పటి కీశ్వర నామాబ్దంబువఱకుఁ జతుర్యుగ మొక్కింటికి సంవత్సరాలు నలువదిమూఁడులక్ష లిరువది వేల లెక్కను మహాయుగంబులు మున్ను చెప్పిన క్రమంబుగ నలువదెనిమిదింటికి సంవత్సరము లిరువది తొమ్మిదికోట్లు ముప్పదియేండ్ల లక్షలఱువదివేలును వైఖానససూత్రక్రమముగ విఖనసబ్రహ్మకు శిష్యుఁడైన పుల్ల మహామునికి శిష్యులైన యతులు లర్చించి రందు. 216

సీ. నయమగు బహుధాన్యనామసంవత్సరం
బాదిగ వైఖానసాగమోక్త
పద్ధతిఁ విఖనసబ్రహ్మసంతతివార
లటకోటి నలువదియాఱులక్ష
లెనుబదియును మఱి యెనిమిది వేలేండ్లు
చిరభక్తులై పూజ చేసి రవల

మహిని స్వాయంభువమనుకాల మిన్నియేం
డ్లయ్యె నీక్రమముగ నబ్దసంఖ్య
తే. తనర స్వారోచిషుండు నుత్తముఁడు తామ
సుండు రైవతుఁడును జాక్షుషుండునన్గడు
పంచమనువులకాల మేర్పఱచి సంధి
యబ్దములతోడ నెక్కింప నవనియందు. 217

తే. నయముగా నూటయేఁబదినాల్గుకోటు
లిరువదియు రెండులక్షలు నిదియుఁ గాక
యొక్కనలువదివేలయేం డ్లోజ యాయె
నవల వైవస్వతాఖ్య మన్వంతరమున. 218

క. ఆవిధముగ నేక్షితిపై
నా వేంకటశైలభర్త కానందముగా
నా వైఖానసు లిపుడును
సేవించుచు నర్చనములు సేయుదు రెలమిన్. 219

సీ. జగతిపై దివ్యవత్సరములు నాల్గువే
లాకృతయుగమునం దమరి నడచు
నదిగాక తత్సంధి యగు నెనిమిదినూర్ల
మొనసి త్రేతాయుగమునకు మూఁడు
వేలగు తత్సంధి వివరింప నాఱునూ
ఱాద్వాపరంబున కనువు నెంచ
నొకరెండువేలయేం డ్లొప్పుఁగఁ దత్సంధి
యబ్దముల్ నన్నూఱు నవలవచ్చు
తే. కలియుగానికి వేయేండ్లు గాఁగ దాని
సంధిసంవత్సరంబు లెంచంగ ద్విశత

మగు చతుర్యుగకాలంబు లపనియందు
సార్వకాలంబు నీరీతి జరుగుచుండు. 220

తే. భూమిపై నాల్గుయుగములు పుట్టి పుట్టి
వేయుమాఱులు పోయిన విధికి నొక్క
దినమగుఁ గా రాత్రి యట్లగుఁ దెలియ సరవి
ననుచు గుఱుతొందు సూతుండు వినఁగ నుడివి. 221

వ. మఱియుఁ జతుర్యుగసహస్రంబులు గడచునంతకు బ్రహ్మసృష్టిం జేయుచుండు నది గడచిన తుద నిద్రఁ జెందినపుడు లోకంబు లడంగు నతండు మేల్కాంచినప్పు డన్నియుం బుట్టుచుండు నిట్టి బ్రహ్మదినంబునం జతుర్దశమనువు లివ్వసుంధరఁ బాలింపు చుందు రట్టిమనుకాలం బెట్టిదనిన స్వాయంభువాది మనువుల కొక్కరొక్కరికి దివ్యయుగంబులు డెబ్బది యొకమాఱు చనిన నది యొక మనుకాలంబని చెప్ప నొప్పు నొక్కొక్క దేవేంద్రుఁడు దేవతలు సప్తఋషులు రాజులు హరియంశంబులను ధరించి యుదయించి లోకంబులు పాలింతురు నారాయణుండు దేవతిర్యఙ్మనుష్యరూపంబులు ధరించి సర్వంబును దాన సమర్థించి రక్షింపుచుండు శ్రీవేంకటేశ్వరుండు మూఁడు యుగంబులు మునియక్షాదులచేతఁ బూజింపఁబడుచుండి ప్రతి కలియుగంబునందు మనుష్యపూజ లంగీకరించి భక్తుల రక్షించుచుండు నని చెప్పి వెండియు నిట్లనియె. 222

సీ. మునివరులార మీ రనఘులు సర్వజ్ఞు
లగుచు నుండియు నన్ను నడుగగాను
భ ౨౩ో త్రవ్యాసభట్టారకులదయ
విశదంబుగను పదివేలసంఖ్య

సమరు బ్రహ్మపురాణమందు ద్వాదశసహ
స్రములచే బ్రహ్మాండ మమర నొకటి
సరవి నెన్నఁగఁ బంచశతసంఖ్య నమరుచు
వఱలగ బ్రహ్మకైవర్తనంబు

తే. వెలయు నిరువదినాలుగువేల సంఖ్య
నమరు విష్ణుపురాణంబు నదియుఁగాక
దశసహస్రకసంఖ్యతోఁ దనరి ధరను
నాణెమగు వామనునిపురాణంబు మఱియు. 223

సీ. అదిగాక యేఁబదియైదువేలగుసంఖ్య
నెనయుఁ బద్మపురాణ మెనిమిదియును
బదివేలునగుసంఖ్య నొదవు భాగవతంబు
వెలయఁగఁ బదిరెండువేలసంఖ్య
నొనరు మత్స్యపురాణమును బదియేడువే
లైన కూర్మపురాణ మదియుఁగాక
నయముగ నిరువదినాల్గువేలగులెక్క
యమరు వరాహమహాపురాణ

తే. మిరువదియు నొక్కవేలునై వరుసగాను
రచితమైనట్టి గరుడపురాణ మొకటి
పంచవింశతి సాహస్ర మెంచ నార
దునిపురాణంబు నదిగాక ఘనతమీర. 224

తే. కుతలమందున నొకపదకొండువేల
నొదవు లింగపురాణంబు నదియుఁ గాక
యరయ నిరువదిరెండువే లైదనర్చు
శివపురాణంబు నొక్కండు చెలువు మీరు. 225

తే. ఎనుబదియు నొక్క వేలసంఖ్యను ఘనముగ
రచితమౌ స్కాందమనెడు పురాణ మొకటి
వింశతిసహస్రసంఖ్యతో వివిధకర్మ
రాజితాగ్నేయనామపురాణ మొండు. 226

సీ. లయఁగ నిరువదివేలగుసంఖ్యతోఁ
దనరు మార్కండేయమునిపురాణ
మదిగాక యిరువది యగువేలసంఖ్యను
సారమై తగు భవిష్యత్పురాణ
మెన్న నెనిమిది పదునెనిమిది యగుపురా
ణంబులు మీకు నిర్ణయముగాను
జెప్పితి నిదిగాక శ్రీవరాహపురాణ
మున భవిష్యోత్తరమునను మఱియు

తే. రమ్యతరమగు పద్మపురాణమునను
వింతలగుచుఁ బ్రకాశించు వేంకటాద్రి
పతిచరితములు గొన్ని యేర్పఱచి మీకుఁ
జెప్పితిని నేను మోక్షంబుఁ జెందుకొఱకు. 227

క. అని యాసూతుఁడు పలుకఁగ
విని శౌనకముఖ్యమునులు విశ్వాసముతోఁ
గనుఁగొని యతని ముదంబున
వినుతింపుచు నిట్టు లనిరి వేడుకమీఱన్. 228

చ. సురుచిరభక్తియుక్తులను సూనృతవాక్యము లాత్మనిష్ఠయుం
బరమవివేకశీలములు పావనమోక్షవిచారధర్మముల్
కరుణయుశాంతముక్ మొదలుగాఁగలసద్గుణముల్ దృఢంబుగా
నఱిమురి నిల్పె నీహృదయమం దతిధన్యుఁడవై తివిద్ధరన్. 229

మ. నీవాచక్రిగుణంబులం దలఁపుచుఁ నిర్వాణబోధస్థితిఁ
భావంబందు గ్రహించి మాకొనరఁ జెప్పంజాల యోగ్యుండవై
నావీరీతిని కొంకులేక యిచటఁ నానాపురాణార్థముల్
ధీవిజ్ఞానుఁడవై వచించితివి సందేహంబులం దీర్చుచున్. 230

ఉ. కావున నీవు ధన్యుఁడవు కంజదళాక్షుఁడు నీహృదబ్జమం
దే వసియించి యుండి గణుతింపఁగ దివ్యతరోక్తులం గృపఁ
బ్రోవఁగ నీ కసాధ్యములు పుట్టవటంచు మునీంద్రు లందఱిం
దావిమలాత్మసూతుసుగుణావళి నెన్నుచు నాదరంబునన్

చ. పలుకఁగ సూతుఁ డిట్లనియెఁ బద్మదళాక్షుఁడు బాదరాయ
ణుం,డల శుకయోగిపుంగవుఁడు నార్యులునైతగు మీర లం
దఱుఁ, విలసితమైన మీకరుణ వేడ్కఁగ నాయెడనుంచి
యుండఁగాఁ, జెలు వలరంగఁ దోఁచినవి చెప్పితినంచు వచించి
నమ్రుఁ డై. 232

క. మునులను సన్నుతిచేయఁగ
విన వారలు మెచ్చి యతని వినయానందం
బున కలరుచుఁ గ్రమ్మఱ ని
ట్లని రింకొక ఘనరహస్య మడిగెద మనఘా. 233

ఆ. విను మనేకమర్త్యవితతులలో మోక్ష
కాము లైనవారు కాయములను
విడచి యెచటనెచట విమలులై పొందుదు
రావిధంబు దెల్పు మయ్య సూత. 234

క. అన విని సూతుం డప్పుడు
తనగురుని మనంబునందుఁ దలఁచి యచలుఁడై

కనుగవ మోడ్చుచు నాః
స్ఫుని ధ్యానముచేసి యోగి నస్ఖానతబుద్ధిన్. 235

సీ. సూతుఁ డిట్లనియె నో సూరిజనములార
వివిధశ్రుతిస్మృతుల్ వినినమీఁదు
నఖిలంబు దెలియు నాయందు సత్కృపనుంచి
యతిరహస్యప్రశ్న యడిగినపుడు
చెప్ప లే దననేల చెప్పెదఁ దప్పొప్పు
లంగీకరించి నెయ్యమున వినుఁడు
పాపకర్ములువోయి బహునారకములందుఁ
బడి పుట్టుచుందురు ప్రజ్ఞలేక
తే. పుణ్యకర్ములు వోయి తత్పుణ్యఫలము
లనుభవించినతుద భూమియందు వ్రాలి
క్రమ్మఱం బుట్టుచుందురు కామముఖ్య
శత్రువుల గెల్చి గురుకటాక్షమును బొంది
నట్టివారు జనింప రీయవనిమీఁద. 236

సీ. అట్టివా రెవరన్న నాచార్యభక్తులై
పరమవిరక్తులై పటువివేక
కలితులై శాంతులై గర్వవిదూరులై
హేయకామాదులఁ బాయఁద్రోచి
గురుతరకల్యాణగుణులై యచంచల
చిత్తులై విజ్ఞానసిద్ధు లగుచు
హెచ్చక తగ్గక యేకాంతనిష్ఠులై
నారాయణధ్యాన పూరితాత్ము

తే. లైనఘను లంగముల విడి యఖిలలోక
ముల నపుడ దాఁటి మండలములను గడచి
వరుస మహదాదులైన యావరణములను
గడచి మూలప్రధానముం గడచి మఱియు. 237

వ. సహస్రశీర్షుం డగు విరాట్పురుషు నతిక్రమించి యమృతవాహిని యననొప్పు విరజానదియందుఁ గ్రుంకులిడి లింగదేహంబులను విడిచి యప్రాకృతదివ్యదేహధరులై శతసహస్ర దివ్యావరణావృతంబై యనేక కోటిసూర్య చంద్రప్రకాశమై యొప్పుచున్న పరమపదమందుఁ బ్రకాశింపుచున్న నారాయణ పరబ్రహ్మ సాన్నిధ్యంబునం బొందుదురు. మఱియు భక్తిజ్ఞాన వైరాగ్యంబుల నభ్యసించుచు నధ్యాత్మవిద్యానుభవులగు నాత్మవేత్తలు స్వరూప విలక్షణంబు లేక నిరాకార ప్రకాశమైన కైవల్యపదమందుఁ బొందుదురు విజ్ఞానంబ పరబ్రహ్మంబని యనుభవసిద్ధులగు జ్ఞానవేత్త లమృత సముద్రంబును విరజయుం బొందుదురు. సహస్రశీర్షుండైన విరాట్పురుషుండ, పరబ్రహ్మంబని నిశ్చయించి తద్ధ్యానారూఢులగు వారా విరాట్పురుషుని శీర్షోపరిప్రదేశంబునందుఁ జేరుదురు. వీరంద ఱును బునరావృత్తి రహితులై యుందురు. మఱియు నవ్విరాట్పురుషుని భ్రూమధ్యాధగప్రదేశంబునందుఁ ద్రిగుణ మిశ్రంబై యున్న మూలప్రకృతిని పరతత్త్వంబని తదనుష్ఠాన మంత్రసిద్ధులైనవారు దుర్గధామంబు నొందుదురు. తత్ప్రకృతిజన్యంబులైన మహదాది సప్తావరణంబులను బరతత్త్వంబుగఁ జూచువార లయ్యావరణంబులందుఁ బొందుదురు. వాసుదేవ ద్వాదశాక్షరీ నారాయణాష్టాక్షరీ నారసింహ గోపాలాది

మహామంత్రసిద్ధులును సదా నారాయణస్మరణ నేమరక చేయువారును, వాసుదే సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధ వ్యూహంబులందుఁ బొందుదురు. విష్ణుం డొక్కఁడ మహాద్భూతంబని మఱి యనేకభూతంబులు పృథగ్భూతంబులని విష్ణుండ సాత్త్వికబ్రహ్మంబని నిశ్చయించి విష్ణుషడక్షరీ మహామంత్ర సిద్ధులైన విష్ణుపరాయణులు శ్రీవైకుంఠము సేరుదురు. సద్వ్రతనిష్ఠ జ్ఞానభక్తి వైరాగ్య సంపన్నులు కారణవైకుంఠంబులందుఁ బొందుదురు. వీరందఱును వటపత్రశయనుని నాభికమలములందుఁ బ్రళయకాలంబులందుఁ జొచ్చి వెడలుచుందురు బ్రహ్మ పరతత్త్వమని బ్రహ్మగాయత్రీ మహామంత్రసిద్ధు లగువారు బ్రహ్మలోకమందును దపస్సిద్ధు లగువారు తపోలోకంబున కెగఁబోయినప్పుడు జనలోకవాసులు మహర్లోకమునందుఁ జేరుదురు. యజ్ఞాది సత్కర్మనిరతులు సువర్లోకంబునందును దానధర్మ పరోపకారులు భువర్లోకంబునందు నుందురు. సూర్యమంత్రోపాసనా సిద్ధులగువారు సూర్యలోకంబునందును, జంద్రమంత్రోపాసకులు చంద్రలోకంబును జేరుదురు. తత్తత్పుణ్యంబులు క్షీణించినప్పుడు భూలోకంబునం గ్రమ్మఱ నుదయించి జపహోతు కర్మంబులు సేయుచుందురు. అనిన విని శౌనకాదు లిట్లనిరి. 238

సీ. వెలయఁ గర్మము లెన్నివిధములై జీవుల
కేయేశరీరంబు లిచ్చుచుండుఁ
బుణ్యాతిశయమును బుణ్యమధ్యమమును
బుణ్యసామాన్యంబు భూరిపాప

మును మధ్యపాపంబు మొనసినసామాన్య
పాపంబు నరుల కేఫలము లిచ్చు
మిశ్రకర్మాధిక్య మిధ్యశ్రమము మిశ్ర
సామాన్య మేగతుల్ జనుల కొసఁగుఁ
తే. గామ్యకర్మంబులును గతకాలకర్మ
ఫలము లేమార్గములఁ జూపుఁ బ్రజలకనిన
విని మనంబున భావించి మునివరులను
జూచి గురుని దలంచి యాసూతుఁడనియె. 239

వ. కర్మలుచేతనే జీవులకు జన్మంబులు గల్గుచుండు నట్టికర్మంబు లెన్ని విధంబు లనినఁ బుణ్యపాపమిశ్రకర్మంబులను మూఁడు విధంబులు తత్కర్మఫలానుభవం బెట్లనినఁ బుణ్యకర్ములు దేవాది శరీరంబులందును, పాపకర్ములు తిర్యగాది శరీరంబుల యందును, బణ్యపాపమిశ్రకర్ములు మనుష్యాదిశరీరంబులయం దును బొందుదురు. మఱియుఁ బుణ్యాతిశయులును హిరణ్య గర్భరూపంబునందును, బుణ్యమధ్యము లింద్రాదిశరీరంబులం గును, సామాన్యపుణ్యులు యక్షరక్షః ప్రముఖ తామస దేహంబులం బొందుదురు. మఱియు నుత్కృష్టపాపంబులు చేసినవారు జనతాపకరంబులైన కంటకవృశ్చికవనమక్షికాది క్రూరజంతువు లగుదురు. పాపమధ్యములు కదళీ నారికేళాది వృక్షంబు లగుదురు. సామాన్యపాపులు గోగజాదు లగుదు రు. సామాన్య మిశ్రకర్ములు వర్ణాశ్రమ ధర్మార్థ కామ్యకర్ము లై యుదయింతురు. అత్యుత్కర్ష పుణ్యపాప మిశ్రకర్ము లీశ్వరార్పిత సత్కర్మ లాచరించి యందువలనఁ జిత్తశుద్ధియు నందువలన సాధనచతుష్టయసంపత్తి గల్గి యందువలన సద్గురు

భక్తి గల్గి వారికిఁ జతుర్విధశుశ్రూషలు చేసి మెప్పించి వారికిఁ గరుణకుఁ బాత్రులై వేదాంత సిద్ధాంత రహస్యోపదేశంబు వడసి శ్రవణమనననిదిధ్యాసనపూర్వకంబుగ సంపూర్ణమయు జ్ఞానమవలంబించి యజ్ఞానకారణావరణ విక్షేపశక్తులను గెలిచి శబ్దానువిద్ధ దృశ్యానువిద్ధ సవికల్ప నిర్వికల్పసమాధుల నభ్యసించి జ్ఞానజ్ఞాతృజ్ఞేయంబు లనెడు త్రిపుటినిదాఁటి సచ్చిదానంద నిత్యపరిపూర్ణబ్రహ్మంబునందుఁ బొంది జీవన్ముక్తు లగుదురు. కామ్యకర్మాచరణులగువారు సుఖదుఃఖకారణంబు లగు స్వర్గనరకంబులయందుఁ బొంది క్రమ్మరం బుట్టిగిట్టు చుందురని చెప్పిన విని శౌనకాదు లిట్లనిరి. 240

క. చటులోగ్రప్రళయంబున
నటమటమై యున్నయప్పు డంభోరాశిన్
వటపత్రమునం దా హరి
యెటువలె వర్తింపుచుండు నెఱిఁగింపుమయా. 241

తే. అనిన విని సూతుఁడనియె లయాబ్ధియందు
మహిమమీఱఁగ నంగుష్ఠమాత్రదేహుఁ
డై నిజాంగుష్ఠమాస్యమం దమరనుంచి
లీల వటపత్రమునఁ బవ్వళించునపుడు. 242

సీ. పటుతరంగాహతిన్ వటపత్ర మటునిటు
లుయ్యెలవలె నూఁగుచుండఁగాను
జిరుఁజిర నెగరెడు సీకరమాలిక
లుయ్యేలఁజేరన ట్లొప్పఁగాను
ఫేనంబు చుట్టుగప్పి విశాలమయ్యది
యుయ్యెలతెఱవలె నుండఁగాను

ధ్రువమండలంబడ్డ దూలంబుకై వడి
నుయ్యేలచేర్లతో నొలయఁగాను
తే. పరమపదకాంతు లుప్పొంగి పద్మరాగ
ముఖ్యమణిజాలములరీతి ముద్దుగుల్క
చెండ్లవలెఁ జూడ్కి కెదురుగఁ జెలఁగ దానిఁ
జూచుచును బాలుఁడాత్మలోఁ జొక్కుచుండ. 243

ఆ. బాలకుండు దానిఁ బట్ట నుద్యుక్తుఁడై
మురిసి మురిసి కరము మొనసి సాఁచి
పట్టికొనుదుననుచు నట్టిట్టు జుణుఁగుచు
నుబ్బి బాల్యలీల నొప్పుచుండు. 244

క. ఘనపద్మజాండకోటులఁ
దనసూక్ష్మోదరమునందు డాఁచి యెలమితోఁ
దనరాశిమీఁదఁ దేలుచు
నొనరఁగ డోలోత్సవంబు నొంది సుఖించున్. 245

క. వనజనిభాకారుండై
వననిధిలోఁ దేలుచున్న వటపత్రముపైఁ
దనుదాన చూచి చొక్కుచు
నెనపుగ నానందయోగనిద్రం జెందున్. 246

వ. ఇవ్విధంబున యోగనిద్రం జెందియుండి పెద్దకాలంబునకుఁ
గ్రమ్మఱ మేల్కాంచి నిజగర్భగత ప్రపంచంబును వెడలి పూర్వ
ప్రకారంబున నిర్మించునపుడు ముక్తజీవులుగ దక్క దక్కిన
కర్మజీవులు యథాప్రకారంబుగఁ బుట్టి గిట్టుచుందురని చెప్పి
వెండియు సూతుం డిట్లనియె. 247

సీ. పుట్టి గిట్టుచునున్న భూలోకవాసుల
రక్షించుటకు రమారమణితోడ
వేంకటాచలమందు విఖ్యాతిగానుండి
నరులచే గోవిందనామభజన
మొనరఁ జేయింపుచు ఘనపాపములనైన
క్షీణింపఁజేయుచు సిరుల నిచ్చి
పాలింపుచున్నట్టి ఫణిగిరీశ్వరున కా
వ్యూహామహాలక్ష్మి కుర్విమీఁద
తే. వెలయు నావీరలక్ష్మిదా విమలహృదయ
యగుచు నలమేలుమంగాఖ్య నవనియందు
నమరెఁ బద్మావతికి వేంకటాద్రికిలను
వెలయు శుభమంగళము మహావిభవముగను. 248

తే. అప్పు డామును లెల్లఁ దథాస్తటంచుఁ
బలికి శ్రీవేంకటేశ్వరు భక్తికథలు
సూతుఁ డెఱిగింప వినుచు మెచ్చుచును వార
లంద అందుండి రానంద మతిశయింప. 249

క. ధరణీశ్రీనీళాధిప
కరుణారసపూరితాత్మ కామితఫలదా
వర వేంకటగిరినాయక
తఱికుండన్నృసింహసుచరితా జగదీశా. 250

మాలిని. సులలితమణిభూషా సూరిచిత్తాబ్జపూషా
కలుషజలధిశోషా కంజగర్భాండవేషా
కలిపురుషజదోషాక్రాంతజీవాళిపోషా
విలసితమృదుభాషా వేదవిద్యాప్రఘోషా. 251

గద్యము. ఇది శ్రీతఱికుండ లక్ష్మీనృసింహ కరుణాకటాక్ష కలిత విచిత్ర వసిష్ఠగోత్ర పవిత్ర కృష్ణయామాత్య తనూభవ వేంకమాంబా ప్రణీతం బైన శ్రీవీరలక్ష్మీవిలాసంబును, వేంకటేశ్వర మాహాత్మ్యంబునందు లక్ష్మికొఱకు హరి కొల్లాపురంబునఁ దపంబు సేయుటయు, శుకాశ్రమంబునఁ దపంబు సేయుమని చక్రి కశరీరవాణి బోధించుటయును, శ్రీస్వామి పద్మసరోవరతీరంబునం జేరి దివాకర ప్రతిష్ఠ చేసి లక్ష్మింగూర్చి తపంబు సేయుటయుఁ, దత్తపోవిఘ్నంబు సేయుటకు నింద్రానుమతంబున రంభాదులు వచ్చి హరిని జలింపఁజేయనేరక యోడి సనుటయు, హరిందలంచి పద్మావతి చింతనొందుటయు, లక్ష్మీకపిల మునిసంవాదంబును, వ్యూహలక్ష్మి హరికిఁ బ్రసన్నం బగుటయు, రమాసహితుఁడై బ్రహ్మాదులతోఁ జక్రి శేషాద్రి చేరుటయు, లక్ష్మీనారాయణులు వినోదంబుగ సంభాషించుటయు, శుకమార్తాండసంవాదంబును, ఛాయాశుకోత్పత్తియు, వీరలక్ష్మి శుకాశ్రమంబు చేరియుండుటయు, బలకృష్ణసంవాదంబును, శ్రీనివాసుని బ్రహ్మాదులర్చించిన కాలక్రమంబును, కాలనిర్ణయంబును, అష్టాదశపురాణవిభజనయుఁ, బుణ్యజీవులు వొందుసద్గతిక్రమంబును ననుకథలుగల శ్రీవేంకటాచలమాహాత్మ్యంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము.

శ్రీవేంకటాచలమాహాత్మ్యము

సంపూర్ణము.

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1937.

# ఆంధ్రగ్రంథములు.

## పద్యకావ్యములు.

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | ప్రతి 1-కి | రూ. | అ. |
| అచ్చ తెనుఁగురామాయణము, తిమ్మకవిప్రణీతము, శుద్ధప్రతి | | 1 | 4 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 10 |
| అనంతునిఛందము, (ఛందోదర్పణము) | ... | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్యప్రణీతము | | 0 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 14 |
| అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతములోనిది) | ... | 0 | 4 |
| అప్పకవీయము, శ్రీగిడుగు రామమూర్తిపంతులుగారి విమర్శతో | | 2 | 8 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలుకాగితముమీఁద చక్కఁగ మరల ముద్రించినారము | ... | 4 | 0 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది | ... | 5 | 8 |
| డిటో అత్యుత్తమప్రతి, 2 సంపుటములు | ... | 7 | 8 |
| డిటో 3 సంపుటములు | ... | 8 | 4 |
| శ్రీమదాంధ్రభారతము, పద్యకావ్యము:— అనేకవ్రాతప్రతుల సహాయమున చిరకాలమునుండి సంపూర్ణపరిశ్రమతోఁ బరిష్కరింపఁబడినది. మేలుకాగితములపై స్ఫుటముగ అచ్చొత్తించి మంచికాలికోబైండు చేయఁబడియున్నది. | | | |
| 7 సంపుటముల ప్రతి | ... | 14 | 0 |
| 3 సంపుటముల ప్రతి | ... | 13 | 0 |
| ఆది, సభాపర్వములుగల సంపుటము | ... | 2 | 0 |
| ఆరణ్యపర్వము ,, | ... | 2 | 0 |
| విరాటోద్యోగపర్వములు ,, | ... | 2 | 0 |
| భీష్మద్రోణపర్వములు ,, | ... | 2 | 0 |

| | | ప్రతి 1కి. రూ. | అ. |
|---|---|---|---|
| కర్ణ శల్య సౌప్తిక స్త్రీపర్వములు | ... | 2 | 0 |
| శాంతిపర్వము | ... | 2 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములుగల సంపుటము | ... | 2 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 5 | 8 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వముగల సంపుటము | ... | 3 | 12 |
| శాంతిసప్తకము | ... | 3 | 12 |
| ఆదిపర్వముమాత్రము, పెద్దచ్చు, చిన్నసైజు | ... | 1 | 8 |
| ఆనందరంగరాట్ఛందము, కాలికోబైండు | ... | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము, విపులమైన పీఠికతో | ... | 0 | 4 |
| ఆంధ్రభాషార్ణవము | ... | 0 | 12 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు—టీకానుక్రమణికాసహితము | | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 0 |
| ఆంధ్ర నామసంగ్రహము, మూలము | ... | 0 | 2 |
| డిటో టీకానుక్రమణికాసహితము | ... | 0 | 6 |
| ఆంధ్రదశరూపకము | ... | 0 | 8 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 0 | 8 |
| ఆంధ్రశబ్దచింతామణి, సటీక | ... | 0 | 8 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము, గిల్టుబైండు | | 2 | 0 |
| డిటో పాతప్రతి, రఫ్ కాగితములు | ... | 0 | 12 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము | ... | 1 | 8 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవివిరచితము | ... | 0 | 6 |
| కవికర్ణరసాయనము (మాంధాతృచరిత్ర) | ... | 1 | 8 |
| కళాపూర్ణోదయము, దళసరి కాగితములు | ... | 2 | 4 |
| కాశీఖండము, చక్కనికూర్పు | ... | 1 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతములోనిది) | ... | 0 | 4 |
| డిటో గట్టుప్రభు | ... | 0 | 6 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటికృతము | ... | 0 | 8 |
| గజేంద్రమోక్షము, (భాగవతములోనిది) సటీక | ... | 0 | 6 |
| గయోపాఖ్యానము, రామనామాత్యప్రణీతము | ... | 0 | 8 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు, శ్రీమద్రామాయణము నకు సరియైనతర్జుమా, కథనము మిక్కిలిసొంపు, పీఠిక అతివిపులము | | 7 | 8 |
| చంద్రరేఖావిలాపము, కూచిమంచి జగ్గకవి | ... | 0 | 14 |
| చిత్రభారతము, చరికొండ ధర్మనకృతము | ... | 1 | 4 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము | ... | 1 | 2 |
| ఛందోదర్పణము, (అనంతునిఛందము) | ... | 0 | 14 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము | ... | 1 | 0 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 6 |
| దశకుమారచరిత్రము, కేతనకవికృతము | ... | 1 | 2 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 12 |
| దశావతారచరిత్ర, చక్కనికూర్పు | ... | 2 | 0 |
| ధ్రువోపాఖ్యానము, సటీక, (భాగవతములోనిది) | ... | 0 | 8 |
| నరసభూపాలీయము, అట్టబైండు | ... | 0 | 10 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు | ... | 1 | 0 |
| నలోపాఖ్యానము, (ఆంధ్రభారతములోనిది) | ... | 0 | 6 |
| నలచరిత్ర, ద్విపద, చక్రపురి రాఘవాచార్యప్రణీతము, కాలికో | | 0 | 14 |
| నిర్వచనోత్తరరామాయణము, తిక్కనామాత్యప్రణీతము | ... | 1 | 0 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 6 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము | ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము | ... | 0 | 4 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 8 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రగ్గడ, క్రొత్తకూర్పు | ... | 1 | 0 |
| ప్రభావతీప్రద్యుమ్నము, పింగళిసూరన | ... | 0 | 10 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 14 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| పంచతంత్రము నారాయణకవికృతము | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 2 |
| డిటో వేంకటనాథరాజకవివరకృతము | ... | 1 | 4 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 10 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు, క్రొత్తకూర్పు | ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 12 |
| బసవపురాణము, పిడుపర్తి సోమనాథప్రణీతము | ... | 2 | 4 |
| బ్రహ్మోత్తరఖండము, శ్రీధరమల్లె వేంకటరామకవి | ... | 1 | 0 |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు | ... | 4 | 0 |
| భోజరాజీయము, అనంతామాత్యకృతము | ... | 1 | 2 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారివ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీద స్ఫుటమైనఅక్షరములతో చక్కఁగ ముద్రితము | ... | 2 | 0 |
| మార్కండేయపురాణము, మారనకృతము | ... | 1 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 2 | 2 |
| మొల్లరామాయణము, ఆతుకూరి మొల్ల | ... | 0 | 10 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 14 |
| యయాతిచరిత్రము, పొన్నిగంటి తెలగనార్యప్రణీతము | ... | 0 | 12 |
| రసికజనమనోభిరామము, కూచిమంచి తిమ్మకవి | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 0 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కని క్రొత్తకూర్పు | ... | 2 | 8 |
| రంగరాయచరిత్రము, దిట్టకవి నారాయణకవిప్రణీతము | ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 12 |
| రాఘవపాండవీయము, సటీక, ద్వ్యర్థిప్రబంధరాజము | ... | 2 | 0 |
| రాజశేఖరవిలాసము, కూచిమంచి తిమ్మకవి | ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 12 |
| రామరాజీయము, (నరపతివిజయము) వెంకయ్యప్రణీతము | ... | 0 | 12 |

| | | | |
|---|---|---|---|
| రుక్మిణీకల్యాణము, టీకాతాత్పర్యసహితము, చక్కనిప్రతి (భాగవతములోనిది) | ... | 0 | 6 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 8 |
| రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి, కూచిమంచి తిమ్మకవి | ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 12 |
| రుక్మాంగదచరిత్ర (ఏకాదశీమాహాత్మ్యము,) ప్రౌఢకవి మల్లన | | 0 | 10 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 14 |
| లంకావిజయము, (రావణదమ్మీయము) పిండిప్రోలు లక్ష్మణకవికృతము, టీకాతాత్పర్యసహితము | ... | 1 | 4 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 8 |
| వసుచరిత్ర, సటీక, రామరాజభూషణప్రణీతము, అనేకనూతనాంశములుగల చక్కనిక్రొత్తకూర్పు | ... | 4 | 0 |
| వసిష్ఠజనకసంవాదము, యామిజాల శేషయ్యకవి | ... | 0 | |
| వాసిష్ఠరామాయణము, ద్విపద, తరిగొండ వెంకమ్మ | ... | 1 | 4 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిప్రణీతము | ... | 1 | 4 |
| విష్ణుపురాణము, వెన్నెలకంటి సూరనార్యప్రణీతము, లఘుటిప్పణీసహితము, క్రొత్తకూర్పు | ... | 2 | 8 |
| వివేకసింధువు, కొండనార్యప్రణీతము | ... | 0 | 12 |
| విజయవిలాసము, చేమకూర వేంకటకవికృతము | ... | 0 | 8 |
| విదురనీతి, టీకాతాత్పర్యసహితము, (ఆంధ్రభారతములోనిది) | | 0 | 5 |
| వీరభద్రవిజయము, బమ్మెర పోతరాజకృతము | ... | 0 | 12 |
| వేంకటేశాంధ్రము | ... | 0 | 6 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు | ... | 0 | 6 |
| డిటో బ్రౌనుదొరగారి ఇంగ్లీషుతర్జుమాతో | ... | 1 | 4 |
| డిటో 2728 పద్యములు కాలికోబైండు | ... | 1 | 12 |
| వైశ్యపురాణము, శ్రీగురుభాస్కరాచార్యకృతము | ... | 1 | 4 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 2 |

| | ప్రతి 1-కి రూ | అ |
|---|---|---|
| శతకంఠరామాయణము, క్రొత్తకూర్పు, మర్దనకవికృతము ... | 0 | 10 |
| శశిరేఖాపరిణయము, అప్పప్పకవికృతము ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు ... | 1 | 2 |
| శివలీలావిలాసము, కూచిమంచి తిమ్మకవిప్రణీతము ... | 0 | 6 |
| శృంగారనైషధము, శ్రీనాథకవి, క్రొత్తకూర్పు ... | 1 | 0 |
| కాలికోబైండు ... | 1 | 6 |
| శేషధర్మము, తామరపల్లి తమ్మయ్య ... | 0 | 12 |
| సమీరకుమారవిజయము (నూతనముద్రితము) ... | 1 | 4 |
| ప [illegible]ంధము, సాధారణప్రతి (భాగవతము) ... | 0 | 4 |
| సటీక, చిన్నసైజు ... | 1 | 0 |
| సహస్రకంఠరామాయణము, రామావఝ్ఝల కొండయ్యకవి ... | 0 | 12 |
| సారంగధరచరిత్రము, చేమకూర వేంకటకవికృతము ... | 0 | 8 |
| స[illegible]వందోపాఖ్యానము, శ్రీశివరామకవి విరచితము ... | 1 | 0 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక, అనేక నూతనాంశములు చేర్చి చిన్నసైజున ముద్రించినారము, టీక వివరణము మిక్కిలి విపులము. ఈవఱకు ప్రకటితమైన ప్రతులకన్న బాగుగనున్నది, సాధారణప్రతి ... | 2 | 0 |
| డిటో మేలుకాగితములు, గిల్టుపేరు, కాలికోబైండు | 3 | 8 |
| సులక్షణసారము, సటీక ... | 0 | 8 |
| హరవిలాసము, శ్రీనాథకవి ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు ... | 1 | 2 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, రామరాజభూషణ ప్రణీతము, సటీక, విపులమైన పీఠిక విమర్శనలతోనున్నది ... | 2 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము ... | 0 | 12 |
| హరివంశము, క్రొత్తకూర్పు, ఎఱ్ఱాప్రెగడ ... | 3 | 0 |
| ,, మేలుకాగితములు ... | 4 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

| | | |
|---|---|---|
| శతకంఠరామాయణము, క్రొత్తకూర్పు, మర్దనకవికృతము ... | 0 | 10 |
| శశిరేఖాపరిణయము, అప్పప్పకవికృతము ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు ... | 1 | 2 |
| శివలీలావిలాసము, కూచిమంచి తిమ్మకవి ప్రణీతము ... | 0 | 6 |
| శృంగారనైషధము, శ్రీనాథకవి, క్రొత్తకూర్పు ... | 1 | 0 |
| ,, కాలికోబైండు ... | 1 | 6 |
| శేషధర్మము, తామరపల్లి తమ్మయ్య ... | 0 | 12 |
| సమీరకుమారవిజయము (నూతనముద్రితము) ... | 1 | 4 |
| సప్తమస్కంధము, సాధారణప్రతి (భాగవతము) ... | 0 | 4 |
| సటీక, చిన్నసైజు ... | 1 | 0 |
| సహస్రకంఠరామాయణము, రామావజ్ఝల కొండయ్యకవి ... | 0 | 12 |
| సారంగధరచరిత్రము, చేమకూర వేంకటకవికృతము ... | 0 | 8 |
| స్కాందోపాఖ్యానము, శ్రీశివరామకవి విరచితము ... | 1 | 0 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక, అనేక నూతనాంశములు చేర్చి చిన్నసైజున ముద్రించినారము, టీక వివరణము మిక్కిలి విపులము. ఈవఱకు ప్రకటితమైన ప్రతులకన్న బాగుగనున్నవి, సాధారణప్రతి ... | 2 | 0 |
| డిటో మేలుకాగితములు, గిల్టుపేరు, కాలికోబైండు | 3 | 8 |
| సులక్షణసారము, సటీక ... | 0 | 8 |
| హరవిలాసము, శ్రీనాథకవి ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు ... | 1 | 2 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, రామరాజభూషణ ప్రణీతము, సటీక, విపులమైన పీఠిక విమర్శనలతోనున్నది ... | 2 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవి ప్రణీతము ... | 0 | 12 |
| హరివంశము, క్రొత్తకూర్పు, ఎఱ్ఱాప్రెగడ ... | 3 | 0 |
| ,, మేలుకాగితములు ... | 4 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.